# బాలవ్యాకరణసూక్తులు

(బాలవ్యాకరణోద్ద్యోతసంజీవనీవిషయానుశీలనము)

ప్రథమభాగము

## సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

# బాలవ్యాకరణసూక్తులు

— ప్రథమ భాగము



ప్రతులు : 1000

ప్రచురణ : మార్చి 1988

ప్రకాశకురాలు : అంబడిపూడి లక్ష్మీదేవి

మూల్యము : రూ. 58/-

**డాక్టర్ అంబడిపూడి నాగభూషణం**
డాక్టర్ కె.వి.కె. సంస్కృత కళాశాల,
3/3, అరండల్ పేట,
గుంటూరు-2.

ముద్రణ :
గౌతమి ప్రింటర్స్
రైలుపేట, గుంటూరు-1.

మూఁడుభాగముల 'బాలవ్యాకరణసూక్తులు'
ముద్రణకు తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదు వారిచే
రూ॥ 5,000/-లు ఆర్థిక సహాయ మందింపఁబడినది.

# నాంది



జననీజనకు లాదిలక్ష్మీప్రసాదులకుఁ బాదాభివందనములు. అక్షరలక్షభిక్ష వెట్టి యాదరముతో నన్నివిషయములఁ బ్రోత్సహించుచున్న మాగురువర్యులు, పూజ్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మంగారికి సదా కృతజ్ఞుఁడను.

ఇం దుద్ధరింపఁబడిన, ఉద్ధరింపఁబడకయు నాధారము లైనయాయాగ్రంథములకర్తలకును, ప్రథమరచనముగా నాదరమునకుఁ బాత్ర మైనయీగ్రంథమిన్నాళ్లకేని మూడుభాగములుగా ముద్రించుటకుఁ బూనుకొనఁజేయ నయిదువేలరూపాయిలయార్థికసహాయ మందించినతెలుఁగువిశ్వవిద్యాలయమునకును, ప్రూపులు దిద్దుట, కొన్నిసందేహములు తీర్చుట మొద లైనవానింట సహకరించినగురువులు గురుతుల్యులు, శ్రీ బి.యస్.జి. వరప్రసాద్, శ్రీ జి. సుబ్రహ్మణ్యశర్మప్రభృతు లగు డా॥కె.వి.కె.సంస్కృతకళాశాలాధ్యాపకులకును గృతజ్ఞుఁడను.

ముద్రణముపనిలో మనసునం దేవిసుగు విరామ మని తలఁపక తమపనిగాఁ దిరిగినమావిద్యార్థిమిత్రులు చిరంజీవులు పాలగుళ్లశ్రీనివాసరెడ్డి, వత్యం రఘురాముడు, ఆర్.ఉత్తమరెడ్డి, మిత్రులు శ్రీ కొండూరిసుబ్బరామయ్య ప్రభృతులందఱకృషి మఱువరానిది.

ముద్రణమున నాకు చాలవఱకు శ్రమ తగ్గించి శ్రద్ధతో నందముగా ముద్రించిన గౌతమిప్రింటర్స్, మేనేజింగ్ పార్టనర్ గువిసెట్టి నందశేఖర్‌గారి సస్నేహముగా నభినందించుచున్నాఁడను.

— అంబడిపూడి నాగభూషణం



సోదరుడు : అంబడిపూడి రామకృష్ణమూర్తి     మఱదలు : యజ్ఞరాజేశ్వరి

అగ్రజుండన యైన నవసరం బైనచో
    నాదుకోఁ దలఁచెడు నాదరంబు
నను మాట పడనీక ఘనతరక్షేమమ్ము
    మనసారఁ గను నభిమానగరిమ
ఏయంశమున నైన నిసుమంతఁ గల నే నొ
    కట విరోధింపనిగౌరవంబు
ఏపరిస్థితులయం దేని ధైర్యమ్ముగాఁ
    దోడ నిల్చెడునట్టిదొడ్డగుణము

నెసఁగు ననుఁగుఁదమ్ముఁడు రామకృష్ణమూర్తి
సంతతానుకూల తదీయజాయ సుగుణ
గేయ యజ్ఞరాజేశ్వరి యీయకొనఁగ
నలరు నీగ్రంథ మాత్మీయతాంకితముగ.

# ప్రస్తావన



ఆధునికాంధ్రవ్యాకరణవాఙ్మయమునకు బ్రహ్మశ్రీ వజ్ఝలచినసీతారామస్వామిశాస్త్రి గారు చేసినసేవ యనన్యసామాన్యము. వైయాకరణపారిజాతము, ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము, మున్నగుసద్గ్రంథరచనముతో నహోబలునిపిదప నాంధ్రవ్యాకరణవిమర్శనమునఁ బ్రాతస్స్మరణీయ మైనకృషి చేసి తద్విషయాభిమానులకు సాక్షాద్గురువులో గురుతుల్యులో యై వారిస్మరణము లేక యాంధ్రవ్యాకరణజ్ఞాన మసంభవ మనుస్థితికిఁ దెచ్చి పూజనీయు లైరి. చింతామణివికృతివివేకములపై వారిపరిశ్రమము బహుముఖముగా విస్తరించి సందర్భానుగుణముగా బాలవ్యాకరణముపైని నడచినది. తెలుఁగునకు వ్యాకరణ మన్నఁ జింతామణీవికృతివివేకములును బాలవ్యాకరణమును మాత్రమె యనునభిప్రాయమును వారు దమగ్రంథములచే స్థిరపఱచిరి.

ఆవరుసలో 'బాలవ్యాకరణోద్ద్యోతము'ను రచించినవీరు తదుపక్రమణమునకు మూలమైనహేతువుల నిట్లు పేర్కొనిరి.

'ఆంధ్రగ్రాంథికభాషాజిజ్ఞాసువుల కిపుడు బాలవ్యాకరణ మత్యంతోపకారక మైయున్నది. కాని దీనియందును దీనివివరణ మనఁదగుత్రిలింగలక్షణశేషమునందును గొన్నియపసిద్ధాంతములు లక్షణవిరోధములు -- విద్యార్థులనెమ్మనములందు నాటుకొనుట మిక్కిలిప్రమాదకరము. కాన నందలియపసిద్ధాంతములను లక్షణవిరోధములను దొలఁగించి బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములందుఁ బేర్కొనఁబడనిలక్షణవిశేషములను జెప్పి మిగిలినబాలవ్యాకరణవిషయములను విప్పి రచించుట విద్యార్థులకత్యంతోపకారక మగు నని తలంచి యీబాలవ్యాకరణోద్ద్యోతమును రచించితిని.

మఱియునాంధ్రభాషలో సగభాగము నాక్రమించి యున్నసంస్కృతభాష నభ్యసించుట విద్యార్థుల కత్యావశ్యకము గాన నాంధ్రోపయోగిసంస్కృతభాషాలక్షణములు సంక్షేపముగ నైనఁ దెలియుటకై యిందు సంస్కృతసమాసవిషయములును, సంస్కృతసమాససంధులును జేర్పఁబడినవి--

పయికారణములచే నీగ్రంథ మాంధ్రవిద్యార్థుల కవశ్యపఠనీయ మైయున్నది. (ఉద్ద్యోతవిజ్ఞప్తి)

ఇందు రెండవయంశమున వివాదమె లేదు. దానిని గూర్చినచర్చయు ననవసరము గావునఁ బరిహరింపఁదగును.

'చింతామణివికృతివివేకములపై నతివేల మగుగౌరవమును, బాలవ్యాకరణముపైఁ దగినగౌరవములేమి, కవిప్రయోగములవిషయమై విలక్షణ మగుసిద్ధాంతము మున్నగుకారణములచే శ్రీశాస్త్రిగారివలన నాంధ్రభాషకుఁ జేకూరవలసినంతప్రయోజనము చేకూరలే దని తోఁచుచున్నది.

లక్షణగ్రంథము లగుబాలప్రౌఢవ్యాకరణములం దపసిద్ధాంతము లుండుటట్లుంచి 'లక్షణవిరోధములు' గల వనుట విశేషము. లక్షణగ్రంథములందు లక్షణవిరోధ మన నేతీరుగ నుండును? అంతర్విషయముల ననుసరించి చింతామణివికృతివివేకములకు భిన్నముగాఁ జెప్పినబాలప్రౌఢలక్షణములు లక్షణవిరుద్ధము లని వీరు తలఁచినట్లు చెప్పవచ్చును. వీరు చేసినలక్షణములనుబట్టి చూచినను చిం.,వి.వి.లకు భిన్నముగా నుండుట యున్న దనుకారణముచే లక్షణవిరుద్ధములుగాఁ దిరస్కరింపవలె ననుట సంగతముగా లేదు. 'లక్షణవిరుద్ధ'లక్షణమును బ్రస్తావింపకుంట మేలు. పూర్వవ్యాకరణములకు బద్ధులై యట్లే చెప్పవలయుచో ననంతరవ్యాకరణముల రచనము ప్రయోజనము సమగ్రముగా సిద్ధింపనేర దనుట నిర్వివాదము. కవిప్రయోగానుగుణముగాఁ బూర్వలక్షణభిన్నముగాఁ జెప్పుట యుచితమె. కాన నట్టియెడల లక్ష్యవైరుధ్య మున్నఁ బ్రస్తావింపఁదగుఁ గాని 'లక్షణవైరుధ్యము' గల దనుట యుచితముగాఁ దోఁపదు.

వీ రిచటఁ బ్రౌఢవ్యాకరణమును గూడఁ బ్రస్తావించి యందలియపసిద్ధాంతాదులను గూడఁ దొలఁగించుచు నుద్ద్యోతము రచించినట్లు పేర్కొనిరి. కాని యందలి విషయములు వీ రుద్ద్యోతమునఁ బరామర్శించినట్లు గానరాదు. ఉద్ద్యోతరచనలోఁ బ్రౌఢవ్యాకరణమునకుఁ బ్రాముఖ్య మీయలే దని గ్రంథాంతర్విషయములే కాక, 'బాలవ్యాకరణోద్ద్యోత' మనునీగ్రంథనామము సైతము నిరూపించుచున్నది. త్రిలింగలక్షణశేషలక్షణములు ప్రస్తావింపఁబడినచోట్లఁ గూడఁ బెక్కింట నవి వివరణమునే కానవచ్చును. సూత్రస్థానమున నున్న వత్యల్పములు. సూత్రస్థానమున బాలవ్యాకరణ మొక్కటియ దాదాపెల్లయెడలఁ బ్రధానముగా వీరు గ్రహించుట గుర్తింపవచ్చును.

ప్రౌఢవ్యాకరణమందలివిషయములే యిందుఁ బెక్కు విధింపఁబడలేదు. బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములయందుఁ జేర్కొనఁబడనిలక్షణవిశేషములను 'జేర్చి' (చెప్పితి మను టెట్లు?) మిగిలినబాలవ్యాకరణవిషయములు నిల్పి'యనుటచేతనె ప్రౌఢలక్షణములు గ్రహించునుద్దేశ్యమె వీరికి లే దనవలసియున్నది. అట్టియెడఁ బ్రౌఢ.

మొదటియంశము ముఖ్యమైనది. అపసిద్ధాంతములు విద్యార్థులనెమ్మనముల నాటుకొనుట మిక్కిలి ప్రమాద మనుట యెంతయు సమంజసము. ఆప్రమాదమును గుర్తించి యెవ్వరైన నెంతమైనఁ దమకొలఁదిదాని నివారించుప్రయత్నము తప్పక చేయవలసియున్న దనుటతో నభిప్రాయభేద ముండఁ బని లేదు.

ఆప్రయత్నముఫల మీగ్రంథము.

బాలప్రౌఢవ్యాకరణములం దట నట నరుదుగనో తఱుచుగనో యపసిద్ధాంతము లున్న వనుట విన్పించుచునే యున్నది. కాని యపసిద్ధాంతములు గలవు గదా యని యందుఁ జెప్పఁబడినయన్నింట విరుద్ధబుద్ధితో నాలోచించినఁ గొంతయన్యాయము జరుగక తప్ప దని యుద్ద్యోతమునుబట్టి గుర్తింపవచ్చును.

ఇట నొకమాట యప్రస్తుతము గాదు. గ్రంథకర్తపైఁ దగినంతగౌరవము లేకున్నపుడు తద్గ్రంథమును బరామర్శించుటలో సరిగా న్యాయము జరుగు నని చెప్పఁ జాలము. అట్లని మితిమీఱినగౌరవమువలనను నన్యాయము జరుగు ననుటలో సందేహము లేదు. చింతామణివికృతివివేకములు నన్నయాథర్వణులకృతములుగా వారిపై నధికగౌరవము కల్గియుండుటవలన వజ్ఝలవారు కొన్నియెడల సూరిలక్షణము నామోదింపలేకపోయిరి. కాని తదనుగుణముగాఁ గవిప్రయోగములను గూడ నియమింపఁ జాలుటవలనను గొంతయనర్థము వాటిల్లినది. ఇంక వజ్ఝలవారివ్యాఖ్యానపద్ధతినిబట్టి చూచిన వీరికి సూరిపై నంతగౌరవము లే దనక తప్పదు. ఇట్లనుట గొందఱకు బాధ గల్గవచ్చును. సంజీవనిలో నుచితము లున్న వని చెప్పినసూరిలక్షణములు సైత ముద్ద్యోతములోఁ బ్రమాదములుగాఁ దిరస్కరించుట యందుమూలముననే [illegible] యగును. ఇట్టివానికి గ్రంథమున సాక్ష్యములు గలవు. కాని వానిఁ బ్రస్తావించుట లేదు.

అట్లే కవిప్రయోగములవిషయమునను వజ్ఝలవారిసిద్ధాంత మామోదయోగ్యము గాదు. తమయభిప్రాయమునకు విరుద్ధమైనయెడలఁ గవిప్రయోగములను దిద్దివేయుటయో కాక దిద్దఁ దగు నని యుపదేశించుటయు విశేషము. మహాకవులు సామాన్యకవులు నను వివక్షయు విశేషము.

'చింతామణివికృతివివేకములపై నతివేల మగుగౌరవమును, బాలవ్యాకరణము పైఁ దగినగౌరవములేమి, కవిప్రయోగములవిషయమై విలక్షణ మగుసిద్ధాంతము నున్నగుకారణములచే శ్రీశాస్త్రిగారివలన నాంధ్రభాషకుఁ జేకూరవలసినంతప్రయోజనము చేకూరలే దని తోఁచుచున్నది.

లక్షణగ్రంథము లగుబాలప్రౌఢవ్యాకరణములం దవసిద్ధాంతము లుండుటట్లుంచి 'లక్షణవిరోధములు' గల వనుట విశేషము. లక్షణగ్రంథములందు లక్షణవిరోధ మన నేతీరుగ నుండును? అంతర్విషయముల ననుసరించి చింతామణివికృతివివేకములకు భిన్నముగాఁ జెప్పినబాలప్రౌఢలక్షణములు లక్షణవిరుద్ధము లని వీరు తలఁచినట్లు చెప్పవచ్చును. వీరు చేసినలక్షణములనుబట్టి చూచినను చిం.,వి.వి.లకు భిన్నముగా నుండుట యున్న దనుకారణముచే లక్షణవిరుద్ధముగాఁ దిరస్కరింపవలె ననుట సంగతముగా లేదు. 'లక్షణవిరుద్ధ'లక్షణమును బ్రస్తావింపకుంట మేలు. పూర్వవ్యాకరణములకు బద్ధులై యట్లే చెప్పవలయుచో ననంతరవ్యాకరణముల రచనకు బ్రయోజనము సమగ్రముగా సిద్ధింపనేర దనుట నిర్వివాదము. కవిప్రయోగానుగుణముగాఁ బూర్వలక్షణభిన్నముగాఁ జెప్పుట యుచితమె. కాన నట్టియెడల లక్ష్యవైరుధ్య మున్నఁ బ్రస్తావింపఁదగుఁ గాని 'లక్షణవైరుధ్యము' గల దను టుచితముగాఁ దోఁచదు.

వీ రిచటఁ బ్రౌఢవ్యాకరణమును గూడఁ బ్రస్తావించి యందలియవసిద్ధాంతములను గూడఁ దొలఁగించుచు నుద్ద్యోతము రచించినట్లు పేర్కొనిరి. కాని యందలి విషయములు వీ రుద్ద్యోతమునఁ బరామర్శించినట్లు గానరాదు. ఉద్ద్యోతరచనలోఁ బ్రౌఢవ్యాకరణమునకుఁ బ్రాముఖ్య మీయలే దని గ్రంథాంతర్విషయములే కాక, 'బాలవ్యాకరణోద్ద్యోత' మనునీగ్రంథనామము సైతము నిరూపించుచున్నది. త్రిలింగలక్షణశేషలక్షణములుప్రస్తావింపఁబడినచోట్లఁ గూడఁ బెక్కింట నవి వివరణమునకే కానవచ్చును. సూత్రస్థానమున నున్న వత్యల్పములు. సూత్రస్థానమున బాలవ్యాకరణ మొక్కటియె దాదా పెల్లయెడలఁ బ్రధానముగా వీరు గ్రహించుట గుర్తింపవచ్చును.

ప్రౌఢవ్యాకరణమందలివిషయములే యిందుఁ బెక్కు విధింపఁబడలేదు. బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములయందుఁ బేర్కొనఁబడనిలక్షణవిశేషములను జేర్చి' (చెప్పితి మను టెట్లు?) మిగిలినబాలవ్యాకరణవిషయములు నిల్పి' యనుటచేతనె ప్రౌఢలక్షణములు గ్రహించునుద్దేశ్యమె వీరికి లే దనవలసియున్నది. అట్టియెడఁ బ్రౌఢ.

విధానము లం దుండియె గ్రహింపవలె నేమో. దీనింబట్టియె యపసిద్ధాంతములు ద్రోలఁగింపుట మొదలగువీరిప్రయత్న మంతయుఁ గేవలము బాలవ్యాకరణము నుద్దేశించియె జరిగిన దని చెప్పవలె. సందర్భానుసారముగఁ గొండొకచో నితర విషయములు వివరణమునఁ జేరినను ప్రధానదృష్టి బాల.పైనే.

అయిన నీయుద్ద్యోతము బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానము గాక యాంధ్ర భాష కొకస్వతంత్రలక్షణగ్రంథముగా రచింపఁబడి దన్నమాట. కాని 'బాలవ్యాకర ణోద్ద్యోత' మను పేరు బాలవ్యాకరణమునే ప్రకాశింపఁజేయుచున్నది. 'ఆంధ్రభాషా జిజ్ఞాసువులకు బాలవ్యాకరణ మత్యంతోపకారక మైయుండుటను' గుర్తించినవా రగుటంజేసి తాము స్వతంత్రగ్రంథమునె వ్రాయఁదలఁచినను బాల.విషయములను గ్రహింపక తప్పమిఁ గృతజ్ఞతతో 'బాలవ్యాకరణ'నామమును వీడలే దని యెన్నఁదగును. 'మిగిలినబాలవ్యాకరణవిషయములను విల్పి' యీగ్రంథమును రచించిరి కదా.

దీనింబట్టి యీయుద్ద్యోతమును బాలవ్యాకరణమునకు వ్యాఖ్యగా వ్రాయుట వీరిలక్ష్యము గా దని గుర్తింపఁదగును. అట్లే యగుచో బాలవ్యాకరణవిషయములం దపసిద్ధాంతము లున్న వానింగూర్చి వివరించి యెట్లు చెప్పిన నుచితముగా నుండునో సూచించుట వ్యాఖ్యానమునందుఁ జేయవలయును. కాని వీరు సూరిసూత్రములందే మార్పులు చేసిరి. అట్టియెడలఁ జెక్కుంట నుద్ద్యోతమునందలిసూత్రములలో బాల. లక్షణము గుర్తుపట్టుటకు వీలు లేనంతగా మారినది. ఇట్టిసవరణాదులవలన సూరిలక్షణము 'దురుక్త' మయినట్లు భావించుట కవకాశ మేర్పడుచున్నది. 'తొలిపలుకు'లో శ్రీదేవులపల్లి రామానుజరావుగారు శ్రీశాస్త్రిగారు చెప్పినట్లు బాలప్రౌఢవ్యాకరణముల లోని దురుక్తములను సవరించుట అనుక్తములను చేర్చుట యనువ్రాఁత కదియె మూలము. సంస్కృతలక్షణము తప్ప నాంధ్రలక్షణ మనుక్తము చేర్చిన యుద్ద్యోతమున మిక్కిలి తక్కువ. అయ్యు ననుక్తములవిషయమున వివాద ముండదు. ప్రౌఢ. విషయప్రస్తావనము నిందుఁ దక్కువె. విధానస్థలములం దింకను నరుదు. కాఁగా నీగ్రంథమునందలిలక్షణభాగమునందలిమార్పులచే బాలవ్యాకరణము చాలవఱకు దురుక్త మనునభిప్రాయమును గల్గించు ననుటలో సందేహము లేదు. దీని ననుసరించి బాలవ్యాకరణమున దురుక్తము లవవలసినపెక్కులక్షణము లట్లు గాక సూక్తములె యైయుండుట — దురుక్తిస్థాపనపూర్వక మైనయుద్ద్యోతమును బరామర్శించి "బాల వ్యాకరణసూక్తులు" గుర్తింపఁబడుట యవసరమె.

అట్టియెడల 1.సూరిసూత్రము మార్పు చేసినచోట నది యవసరమా? 2.వీరు చేసినమార్పువలనఁ బ్రయోజనము గలదా? అనునవి ముఖ్యముగాఁ జూడవలె.ప్రయోజనము లేనపుడు 'మిగిలినబాలవ్యాకరణవిషయము' లట్ల సూరి చెప్పినది యథాతథముగ గ్రహించు టుచిత మని నిర్ణయింపవచ్చును. ఇఁక వీరినవరణములందే యవసిద్ధాంతము లున్నపుడు దానిని దిరస్కరించుట యెట్లు నవసరమె. వీరు స్వతంత్ర వ్యాకరణమునే రచింపఁదలఁచినను 'బాలవ్యాకరణము' ననుసరించి,యుండుటచేతను దమగ్రంథముపేరిలోను 'బాలవ్యాకరణ'మును బరిగ్రహించుటచేతను నాఢ్యైయెడల నీగ్రంథమునను సూరిలక్షణ మప్లేయుండవలె నని సిద్ధయించుట యుచితమె.

బాలవ్యాకరణమునకు 'సంజీవని' యనుపేర నాంధ్రవ్యాకరణసంహితా సర్వస్వమున వీ రొకవ్యాఖ్య చేసిరి. (కావునను నుద్యోత మనుపేర నిం కొకవ్యాఖ్య వ్రాయవలె నని వీరు తలఁచియుండకపోవచ్చును.)అందలిసిద్ధాంతముల ననుసరించియె యుద్యోతమునను బెక్కులక్షణములనవరణములు చేయఁబడినవి. కావున'సంజీవని' విషయములు నిందు బరిశీలించు టవసరము గాన స్వీకృతము.

ఇట నీగ్రంథము పరిశీలనమునకు 'ఆంధ్రప్రదేశ్‌సాహిత్యఅకాడమీ' ముద్రించినప్రతి ఆధారము.

అకాడమీప్రతిలో నాయాలక్షణములకు ముం దందలివిషయమును సూచించు శీర్షికలు చేర్పఁబడినవి. ఇట్టియెడఁ బ్రథమముద్రణమున వరులవారియితరగ్రంథము లందువలె నారంభమున విషయసూచికయందలియంశములే గ్రంథమున నాయా చోట్లఁ బుటలకుఁ బైని దత్తద్విషయమును సూచించుచు సంగ్రహముగా నిల్పుట గాన వచ్చును.ద్వితీయముద్రణమున నయ్యవిశీర్షికలుగా నుంచుటలో సౌకర్య మధిక మైన దనుట వాస్తవమె.వరులవారికీవానిని శీర్షికలుగా నిల్పునభిప్రాయ ముండకపోవచ్చు. ఉన్నఁ గొంత జాగరూకత వహించెడివా రేమో. అయినను సూచికలసూత్రసంఖ్య ననుసరించినెౌ ద్వితీయముద్రణమున నవి శీర్షికలుగా- వరులవా రుంచినసూచికలే నిల్పుటచే నందలియౌచిత్యమునుగూర్చియుఁ బరామర్శించుట సూత్రార్థపరామర్శన ముతో నవసరమె యగును.

ఆంధ్రవ్యాకరణమునకుసంబంధించి పెక్కువిషయములను దెలుపుచు విమర్శలోఁ బయనింపవలసిన త్రోవను జూపుచు మార్గదర్శకులై సబ్రహ్మశ్రీ వఝలచినసీతారామ స్వామిశాస్త్రిగారిపై వితరభావమును శంకింపదగ దని విన్నవించుచు విషయవివేచనమునైనాదరము మాత్రమే యాఁబాలవ్యాకరణశాస్త్రులకు మూలమనుటకు సహృదయ హృదయములె ప్రమాణముగా మనవి చేసికొనుచున్నాఁడను.

అంచనకున్ బోవిడి నీరసనీరము.

కానుగ క్షీరంబు గొనుట సహజము కాదే. - చిన్నయసూరి.

విధేయుఁడు

అంబడిపూడి నాగభూషణం.

# బాలవ్యాకరణసహాయకులు

## ప్రథమభాగము

### విషయసూచిక

*పుట 66లో 'అర్చులు అనురీతి వానియందు దంత్యతనుగూర్చి పూర్వలాక్షణికోక్తి గుర్తింపవలసియున్న' దనుకొంటిమి. అయ్యది యిట్లు గుర్తింపఁదగును. "ఋర్ధంతోష్ఠ్య-ఉతాలవ్యాచ్-వైకృతకార్యే తాలవ్యాజ్వ్యరహితశ్చవర్గో దంత్యోచ్చార స్స్యాత్ హిమరుచి-హిమరుచులా (సావర్ణ్యాత్ శకారస్యాపీతి కేచిత్-రాశి-రాసుల్లు) వైఁ.వం.అ.52 సూత్రవృత్తులు పుట.40.

*ఆ.సంజ్ఞా 19-బాల.ప్రకీ.24.

*ఉ.37—బాల.ప్రక్రి.22

*క్రుంకంబో మొదట జాయిపడ (విరా.2 312) చూడుండు పుట.257.

# ముఖ్యసంకేతవివరణము

| | | |
|---|---|---|
| అప్ప. | — | అప్పకవీయము, అప్పకవి |
| అహో. | — | అహోబలుఁడు |
| ఆం.శ.శా. | — | ఆంధ్రశబ్దానుశాసనము-చిన్నయసూరి |
| ఉ. | — | బాలవ్యాకరణోద్ద్యోతము<br>వజ్ఝలచినసీతారామస్వామిశాస్త్రి |
| కవిశి. | — | కవిశిరోభూషణము-అహోబలుఁడు |
| చిం. | — | ఆంధ్రశబ్దచింతామణి |
| త్రి.శే. | — | త్రిలింగలక్షణశేషము<br>(ఈగ్రంథకర్తపి హెచ్.డి.సిద్ధాంత వ్యాసము) |
| ద్రు. | — | ద్రుతస్వరూపాన్వేషణము |
| ద్రుత. | — | ద్రుతప్రకృతికావలోకనము |
| ద్రు.కా. | — | ద్రుతకార్యానుశీలనము |
| ప్రౌఢ. | — | ప్రౌఢవ్యాకరణము-బహుజనపల్లి సీతారామాచార్యులు |
| బాల.(బా.) | — | బాలవ్యాకరణము-చిన్నయసూరి |
| బా.స. | — | బాలసరస్వతీయము-బాలసరస్వతి |
| బా.సూ. | — | బాలవ్యాకరణసూత్రలు |
| వి.వి. | — | వికృతివివేకము |
| వై.చం. | — | వైకృతచంద్రికా-మంచెళ్ల వాసుదేవకవి |
| వై.దీ. | — | వైకృతదీపిక-బహుజనపల్లి సీతారామాచార్యులు |
| వై.పా. | — | వైయాకరణపారిజాతము<br>వజ్ఝలచినసీతారామస్వామిశాస్త్రి |
| వ్యా.సం.స. | — | ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము<br>వజ్ఝలచినసీతారామస్వామిశాస్త్రి |
| సం. | — | సంజీవని(బాల.వ్యాఖ్య.వ్యా.సం.స.) |

ఇతరము లాయవి యట నట (బా.సూ. ద్వితీయ-మొ॥) గ్రహింపఁదగు.

# బాలవ్యాకరణసూక్తులు

## ప్రథమ భాగము

## సంజ్ఞాపరిచ్ఛేదము

### సంస్కృతము - వర్ణములు :

సంస్కృతమునకు వర్ణము లేఁబది యనుసూరిలక్షణమును వజ్ఝలవారు 'కావ్య సంస్కృతభాషకు వర్ణము లేఁబది' యని యేర్పఱచిరి. ఆపిదప వివరణమున వైదికసంస్కృతభాషకు వర్ణము లఱువదినాలు గని పేర్కొనుటచే సూరి సామాన్యముగా సంస్కృతభాష కనుట యుచితము గా దనునభిప్రాయము దోఁచుచున్నది. అందుకే కావ్యసంస్కృతభాష కనియుందురు. సూరియభిప్రాయమేమి ?

బాలవ్యాకరణం బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్ అని సూరి యాంధ్రభాషకు లక్షణ మేర్పఱతు నని చెప్పెను. ఆంధ్రమునకు లక్షణము చెప్పఁబూనుచు సంస్కృతప్రాకృతవర్ణములనుగూర్చి చెప్పనేల ? చిం. సయితము ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః అని యాద్యప్రకృతి యైనసంస్కృతమునకు వర్ణము లేఁబది యన్నది. ఆంధ్రవ్యాకరణమున ముందుగా సంస్కృతవర్ణముల ప్రస్తావన యేల ? నేఁ డాంగ్లమునకు లక్షణము చెప్పుచో నాంధ్రవర్ణములను పేర్కొన్న నది యెంత సహజముగా నుండును ?

ఈప్రస్తావననుబట్టి సంస్కృతవర్ణనిరూపణమున కాంధ్రలక్షణముతో సంబంధము గల దని గుర్తింపఁదగు. దీనింగూర్చి బా. సౌ. పే. 'సంస్కృత పదములకు సామాన్యముగాఁ దెలుఁగునం బ్రవేశము కలిగింజేసియు విశేషించి సంస్కృతము తెలుఁగునకుఁ బోషక మవునుంజేసియు సూరి మొట్టమొదట సంస్కృత వర్ణసమామ్నాయమును నిరూపించె (?) నన్నది. ఇది యథార్థముగా నిట్లు గ్రహింపఁదగును.

భాషను బ్రకృతిప్రత్యయాదిగా విభాగించి చూపుట వ్యాకరణలక్షణము. భాష వాక్యసముదాయమె కదా. భాష వాక్యములుగా విభక్తము గాఁగా వాక్యము పద

ములుగను పదము ప్రకృతిప్రత్యయములుగను నిట్లు విభాగించుచుఁ బోఁగాఁ దుదికి విభాజ్యము గాక మిగులునది వర్ణము. స్థూలముగా నిర్ణయించుచో వర్ణసముదాయము పదమును, పదసముదాయము వాక్యమును, వాక్యసముదాయము భాషగను నేర్పడు ననవచ్చు. ఇట్లే భాష నైనను విభజించుటలో వర్ణము మూలపదార్థముగా మిగులును. భాషకు మూల మిట్లు వర్ణము. కావుననే భాషాలక్షణము చెప్పఁబూనుచో దానికి మూల మగువర్ణములను బేర్కొనుట జరిగినది.

ఇట్లు చూడఁగా నాంధ్ర భాషయం దున్నపదములలో నగమునకుఁ బైఁగా సంస్కృతమునుండి యేర్పడినవే. ఆసంస్కృతమునుండి సమములుగా నేర్పడినపదము లెం దధికము. భవములును గలవు గదా. కాఁగా వానికి మూలమైనవర్ణములనుగూర్చి యెఱుంగుటకు నవి దేనినుండి వచ్చినవో యాసంస్కృతభాషయందలివర్ణములను బేర్కొనుట సుప్రసక్త మగుచున్నది. సంస్కృతసమ(భవ) ప్రాధాన్యము ననుసరించి సంస్కృతవర్ణములంగూర్చి ముందుగాఁ బ్రస్తావించుటయు సముచిత మగుచున్నది. తదనుగుణముగనే పిదపఁ బ్రాకృతవర్ణములనుగూర్చి పేర్కొనుట యుచితమె. ఇట్లు పరిశీలింపఁగా నొకభాషలోనికిఁ దత్సమాదులుగాఁ జేరునితరభాష లోకవ్యవహారమునం దున్నదే కావలయు ననుట సహజమె. అవఁగా లౌకికసంస్కృతమునుండియే తత్సమతద్భవము లేర్పడు ననుట యుక్తియుక్తము. తెలుఁగునం దున్నసంస్కృతసమముల ననుసరించి వర్ణములు చెప్పవలసియున్నది గావున నాసంస్కృతభాష లౌకికసంస్కృతమె యనుట నిర్వివాదము. వైదికసంస్కృతమునుండియే కాక శౌనాదుల మాత్రమె కనిపించువానినుండియుఁ దత్సమాదు లేర్పడుటకు వీలే లేదు. (విజమునకుఁ గావ్యములం దున్నవియు నెల్లఁ దత్సమాదులుగా వచ్చు ననఁగలమా?) కాఁగా లాక్షణికప్రణాళిక ననుసరించియే సంస్కృత మనుదాని కిట లోకవ్యవహారమం దున్నసంస్కృత మనియ యర్థ మగుచున్నది. ఆయ్యది కావ్యప్రయుక్త మగు భాష. కావ్యసంస్కృతభాష యన్న వజ్ఝలవారికూర్పు సూరిలక్షణమునకు వ్యాఖ్యానప్రాయముగా గుర్తింపఁదగియున్నది. వ్యా.సం.స. (22, 23) లో వీ రట్లు వివరించిరి గూడ. కాఁగా వివరణమునందుఁ జూపఁదగునంశమును సూత్రమునఁ జేర్చిరే తప్ప సూరిలక్షణమున దురుక్తి లేదు.

## అచ్చులు – హల్లులు :

సంస్కృతమున నేఁబదివర్ణములను వేర్కొని సూరి అకారాదు లచ్చులు కకారాదులు హల్లు లని వివరించెను. వీ రట్లు గాక వ్యాఖ్యాతృపద్ధతిలో అచ్చులను వేర్కొని 'యివి యచ్చు' లనియు హల్లులను జూపి యివి హల్లు (ఉ.1) లనియుఁ జెప్పిరి. ఇట్టిమార్గమువలన వీరు మొదటిమూఁడుసూత్రములయొద్దను బ్రత్యేకముగ నిట్లు వివరింపవలసినవా రైరి. సూరి కకారాదులు హల్లు లనుటవలన కకారమునకుఁ బూర్వమువఱ కున్నయకారాదు లచ్చు లని స్పష్టము. విసర్గము వఱ కచ్చు లన్న నచ్చతెనుఁగున విసర్గము లేమి నటఁ బ్రత్యేకముగాఁ జెప్పవలసివచ్చు. అట్లుల్వి ఖాగ మీలాగునసె మీఁద నెఱుఁగుటకు వీలుగాఁ జెప్పుట సూరివివరణమున లాఘవము.

సూరి కకారాదులు హల్లు లనుటచేఁ దత్పూర్వమువఱకు నవఁగా విసర్గము (అచ్చతెలుఁగున నఱసున్న) వఱకు నున్నవర్ణము లచ్చులే యవుచున్నవి. కాఁగా ననుస్వారవిసర్గములను సూరి యచ్చులుగనె పరిగణించె ననుట స్పష్టము. వీరు ఔ వఱకుఁ జూపి యివి యచ్చు లని చెప్పి పిదప 'ం, ః (2) ఉభయములు' (ఉ.1) అనిరి. ఈ 'ం, ః' అని చూపినవర్ణముల నె ట్లుచ్చరింపవలయునో యర్థము గాదు. ఇవి స్వయముగా నుచ్చరించుటకు వీలు లేనివి కావుననే సూరి అం, అః అనురీతిగా అకారమును బూర్వమునందు నిల్పెను. వర్ణమాలవారును దరువాత క ఖ ఇత్యాదిగా హల్లులను జూపిరి. వీనియందలి యకార మేల? క్, ఖ్ అనురీతిగా నున్నవే హల్లు లయినను వానియుచ్చారణము క్లిష్టము గావున సౌకర్యమునకే కదా యకారమును జేర్చిరి. ం, ః అనుచో వీవర్ణములకు మాత్ర మ ట్లుచ్చారణసౌకర్యమునకై ముం దకారము నేల చేర్పలేదు. వీ హల్లులయుచ్చారణము క్లిష్టముగ నైనను సంభవ మేమో కాని యనుస్వారవిసర్గలయుచ్చారణ మసంభవమె యనవచ్చును. ం, ః, అని చూపుటలో అనుస్వారము విసర్గ యని పేర్కొనవలయు నని యెంచిరా? కాని యనుస్వారము, విసర్గ యన్నవి వానికి సంజ్ఞలే కాని యుచ్చారణధ్వని కాదు. కకారమునకుఁ బరుష మన్నది సంజ్ఞయే కాని దానియుచ్చారణధ్వని కాదు గదా. వర్ణమాలలోఁ జూపువానిని సంజ్ఞతోఁ గాక వానిధ్వనితోనె నిర్దేశించుట యుచితము.

మొత్తముపై సూరి అం, అః అని ముం దకారము చేర్చిచూపుటలో దురుక్తి లే దని గ్రహింపవచ్చును. దానిని వీరు మార్చిచూపుటయె యుచితముగా లేదు.

సూరి వీని నచ్చులుగాఁ బేర్కొనఁగా వీ రుభయములుగాఁ జెప్పిరి. వీ రింతకు ముం దచ్చులు మాత్రమె పేర్కొన్నను బైని జెప్పఁబోవుహల్సంజ్ఞను గూడ గ్రహించి యిట నుభయశబ్దముచే నచ్చులను హల్లులు నగు నని చెప్పుకొనవలెను. హల్లులు గూడఁ బేర్కొన్నపిదపనె వీనియుభయత్వమును బ్రస్తావించిన బాగుండెడి దనిపించును.

“ఆదుల పదాఱు స్వరములు కాదికములు, ముప్పదియు నాల్గు వ్యంజనంబు లనఁదనరు, బిందువు విసర్జనీయంబు వెలయు వ్యంజనములు నన నాద్యభాషఁ దన్నగేశ” యని పద్య.లో నాద్యభాషయం దివి వ్యంజనములు నైనట్లు సూరి పేర్కొనె. తెలుఁగున నిట్లని చెప్పలేదు. బా.ల.లోఁ గూడ వీని నచ్చులలో మాత్రమే చూపె. దీనిఁగూర్చి బా. సా. పే. వీనిని సంస్కృతవ్యాకర్తలు ప్రక్రియాప్రయోజనమునకై యచ్చులలోను హల్లులలోను జేర్చి రనియుఁ దెలుఁగున నట్టిప్రయోజనము లేమి సహజోచ్చారణము ననుసరించి యచ్చులలోనె (సూ) చేర్చినట్లు స్పష్టము చేసె. మాహేశ్వరసూత్రములం దనుస్వారవిసర్గములప్రసక్తి లేదు. వానికిఁ బ్రయోజనము వర్ణనిరూపణము గాదు గావ నది యట్టిద కావచ్చును. కాని దానిం బట్టి యవి యచ్చు లని కాని హల్లు లని కాని నిశ్చయింపరాదు. అహో. 'యద్యప్యనుస్వారవిసర్గజిహ్వామూలీయోపధ్మానీయయమానా మకారోపరి శర్షు చ పాఠస్యోపసంఖ్యాన మితి కాత్యాయనవ్యవహారా దనుస్వారవిసర్గయో ర్హల్త్వ మప్యస్తి తథాపి వర్ణపరిగణనదశాయాం తయో రచ్త్వే నైవ ప్రామాణికై ర్వ్యవహారః కృతః' (కవిశి. 162) ఇత్యాదిగఁ బేర్కొనెను సూరి యట్లు యచ్చులు గనె చెప్పెను.

వజ్ఝలవారు వ్యా. సం. ప.లో 'అనుస్వారవిసర్గముల నుభయములు నమఖయములు నందు రని చెప్పియుఁ దిదవ, హల్లుమీఁదవలె వీనిపై స్వరము నిల్చుటచేత స్వరధర్మ మనియు హల్లువలెనె యచ్చులసాహాయ్యము లేక పలుకఁబడకుంట వ్యంజనధర్మ మనియు నిట్లివి యుభయము లనియుఁ జెప్పిరి. (24) దీని కనుగుణముగనె ఉ. లో. నివి యుభయము లని నిర్ణయించి రన్నమాట. సూరి

యచ్చులుగా మాత్రమె చెప్పుట నంగీకరింపక వ్యంజనత్వమును జోడించుటవలన నీశాస్త్రమున విశేషముగ సాధింపఁబడినప్రయోజన మేమియో వజ్ఝలవారు స్పష్టము చేసినఁ జక్కఁగా నుండెడిది. అట్లు గానపుడు మూరియుక్తిలో దుష్టత యెట్లు ?

ఱ కారము :

పిదపఁ బేర్కొనఁబడినహల్లులలోఁ జివరిదిగా వీరు ఱవర్ణమును జూపిరి. (ఱ అని) యిట శకటరేఫ యుండుట ముద్రణప్రమాదము కానగును. సూరి చూపిన వర్ణములలో 'ళ'కారమును దొలఁగించి దీనితో వీరు 50 సంఖ్యను బూరించిరి. అద్యంయాః పఞ్చాశ త్తనుచిం,లక్షణమున కనుగుణముగా నేఁబది నిరూపించి రనిపించు. సమగ్రలక్షణము చెప్పఁబూనినను వీరు చిం, వి. వి.లప్రభావమునకుఁ దఱుచుగ లో నగుట గానవచ్చును.

"ఇది (ళ) యాకాలములోని యాంధ్రకర్ణాటకసాధారణలిపితో 'ఱ' అని లిఖింపఁబడియున్నది. దీనిని భట్టారకుఁడు సంస్కృతవర్ణసమామ్నాయపుఁబంచాశ ద్వర్ణములలో నిర్దేశించియుండును. కాలక్రమమున నిది తెలుఁగున నంతరించి ద్రావిడమూర్ధన్యళకారమువంటిధ్వని కలదిగఁ గొన్నింటియందును (వ్యా. సం. స. 26) అని మొదలుగఁ బేర్కొనిరి.

నన్నయ యేఁబదివర్ణము లనెను గాని యవి యేవో పేర్కొనలేదు. కావున వర్ణ మున్న దని నన్నయ యభిప్రాయపడె నని వీరు నిస్సంశయ ముగాఁ జెప్పఁగలిగిరి.

సంస్కృతవర్ణసమామ్నాయమున సూరి చూపినళకారము ఈళవహేళనాది గత మనియుఁ, బ్రాచీనకాలమునందుఁ గన్పించు ఱవర్ణమె యిట్లయిన దనియు వ్యా.సం.స.లోఁ బేర్కొనిరి. (26) అనఁగా సూరి ళకారమును సంస్కృతవర్ణ మాలలోఁ జూపుట దుష్టము గా దనియె వీరు వ్యా.సం.స.లోఁ దలఁచి రనవచ్చు. ఇటఱవర్ణము నేల చూపిరి ?

కాక నన్నయనాఁటికి ఱవర్ణ ముండఁగా దానిని బంచాశద్వర్ణములలో నన్నయ పరిగణించె ననియు నయ్యది చిన్నయనాఁటికి నశించి ళవర్ణమ్మాగా మిగు లుటచే సూరి ళకారమునె పరిగణించె ననియుఁ జెప్పవలెనా ? అయినఁ ళకారము నన్నయమతమున కల దని వ్యా. సం. స. లో స్పష్టము చేసినజాడ లేదు.

తెలుఁగునందు శకటరేఫమును తీర్చుటమగూర్చి వీ రి ట్లనిరి. ఱకారము

నన్నయనాఁటికే తెలుఁగున నశించినది. కావననే దానిని నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలే(కి) రనిరి. మఱి సంస్కృతవర్ణమాలలో నెట్లు చేర్చెను? నన్నయనాఁటికిఁ దెలుఁగున నశించినయీవర్ణము సంస్కృతమున నిల్చియున్నదా? తెలుఁగున నన్నయనాఁటికె యీవర్ణము నశించిన దన్న వీరె యీయభిప్రాయమును వే ఱొకచోఁ దిరస్కరించిరి. "11 శతాబ్దముపూర్వమువఱకె తెనుఁగుదేశపు శాసనములలో ఱ కల దన్న కె. వి. లక్ష్మణరావుగారిని విమర్శించుచు "వీరు సరిగఁ బరిశోధింపక యీరీతిని వ్రాసిరే కాని 11వశతాబ్దమునకుఁ బిమ్మట శాసనములలో నయిత మీ యక్షర మగపడుచున్నది. రేబ్లిగుంట కాకతివారి వఱిమిను వఱుమట క్రీ. శ. 1134 (ప్రై. పా. 184) అనిరి. పైవాక్యము దీనికి విరుద్ధముగా నున్న దనుట స్పష్టము.

ఈవిమర్శనముబట్టి నన్నయనాఁటికిఁ దెనుఁగున ఱవర్ణ మున్న దందురా? సంస్కృతముతోపాటు తెలుఁగునను వీవర్ణమునే చూపవలయును. శకటరేఫము వేల పరిగణించిరి?

మొత్తముమీఁద వీపై రుద్ధముచే నెట్లు నిశ్చయింపరా దన్నను సంస్కృత వర్ణమాలలో ఱవర్ణమును జూపినఁ దెలుఁగునను నదియే చూపవలె. తెలుఁగున నశించి సంస్కృతమున నిల్చియుండుట యసంభవము గావునఁ దెలుఁగున శకట రేఫము చూపుచో సంస్కృతమున శకారమున చూపవలె నన్నయమతమునను.

కారమె శకార మైనను ఱకారము నిల్చియున్న కావ్యసంస్కృతభాష యందలిప్రబలాధారములు చూపవలయును గదా. అట్టియెడల నదృశ్య మయిన ఱకారమును వర్ణమాలలోఁ జేర్చుటయును నదియే శకార మయినను శకారమును వర్ణమాలనుండి తొలఁగించుటయును సంగతములు గానేరవు.

ఱకారమును జేర్చితిమి గదా యింక శకారో మేల యనుకొని రేమో. కాని నన్నయనాఁటికి కావ్యసంస్కృతభాషలో ఱకారమే యున్న దందుము. చిన్నయనాఁటి కేని నది శకార మైనది గదా. వీరు ఉ. రచించునాఁటికి నంతె కదా. ఉ.లో నన్నయనాఁటిలిపి నుద్ధరింప నేల? ఇది చిం.వ్యాఖ్యానము కాదు గదా. ఇట్టిచోట్లనుబట్టియె వీ రెంతగా సమగ్ర మగువ్యాకరణము వ్రాయఁదలఁచినను బా. ప్రభావమునకు లోనవుచుండి రని గుర్తింపవలసె. చిం. మతమును గూడ వర్ణించినచే సమగ్రత కలుగు నన్న వర్ణమాలలో శకారమునె చూపి

నన్నయనాఁటి కిది ఴకారముగ సంస్కృతమున మాత్రము నిల్చియున్న దని వివరించుట యుచితము.

ఇంతకును ప్రాచీనకాలమున ననఁగా 11వశతాబ్దినాఁటికి సంస్కృతమున ఴకారము కావ్యసంస్కృతభాషలో నిల్చియున్న దని యంగీకరించినను జింతామణిని మహాభారతకర్త యగునన్నయయే వ్రాసె నని విశ్వసింపఁబడునపుడే చిం. మతమున నీ వర్ణము సంస్కృతమునఁ గలదనవచ్చు. అదియుఁ దత్కర్త వర్ణములను జూపలేదు గావున నెట్లును మాటాడలేము గనుక.

శేషనేక చానుప్రవిశత్తి యను చిం.లక్షణము ననుసరించి తెలుఁగున లేని యీవర్ణము సంస్కృతసమములద్వారానఁ జేరవలె. అట్టిశబ్దమును వీరు చూపలేదు, తెలుఁగున శకటరేఫమును జూపిరి గాని ఴవర్ణమును జూపలేదు గదా.

ప్రస్తుతవివరణమునుబట్టి యీశనాదులలో ళకారమె నేఁడు గల దని వీరు స్పష్టము చేసిన ట్లయినది. దానిని సంస్కృతవర్ణములలో నిర్దేశింపమిఁ దెలుఁగున నిపు డిది యె ట్లుండవలె? సంస్కృతమున ఈఴన మనియే యున్నను దెలుఁగున నున్నళకార మట వ్రాసికొనవలెనా?

ళకారము గల దని చెప్పియు నేఁటిస్థితి కనుగుణముగా దానిని వర్ణమాలలోఁ జేర్పకుండు టేల? కూఁతురిని ఇత్యాదులు నన్నయనాఁటఁ గల వనియే వీరు ఉ.లో సాధించిరా?

అనంతు డేఁబది సంస్కృతవర్ణములలో క్షకారమును జేర్చాని ళకారమును దొలఁగించుటనుగూర్చి వీరు 'అనంతామాత్యుఁ డాగమశాస్త్రము ననుసరించి క్షకారమును జేర్చినను ళకారమును వీడుట వింత. ఆగమశాస్త్రములో ళకారము పైతము చేర్పఁబడినది. కావుననే యం దేకపంచాశద్వర్ణము లంగీకరింపఁబడె (వ్యా.సం. వ. 25) ననిరి. ఈవిమర్శనము ననుసరించి మఱి వీరు ళకారమును వీడుట యెంతవఱకు సమంజసము?

ఇట వీరియభిప్రాయమునం దిం కొకవైరుధ్యము పొడఁగట్టుచున్నది. అనులిపి ప్రాచీనాంధ్రశాసనములందుఁ గలదు. ఈఴనము-ఈలనము (స్తుతి) హేఴనము-హేలనము పరిహాసము మన్నగుశబ్దములలోని దీ ఴకారమె. దానిని ల(ళ)కారముగను డకారముగను బల్కుట యర్వాచీన (ఉ.2) మనిరి అనునది

కడలుగా మాఱిన దని చెప్పిరి. వ్యా. సం. స.లో నిట్లు పేర్కొనిరి. (26) కాని పిరే వేతాకచో 'దకారముయొక్క ప్రథమపరిణామము కార మనియుఁ దదనంతర పరిణామము ళకార మనియు విశద మగుచున్నది. ఈ రీతినె వైదికసంస్కృత మున మొదటిపాఠమున అగ్నిమీడే అనురీతిని డకార ముండెడి దనియుఁ దర్వాతి పాఠమున అగ్నిమీళే అనురీతిని ళకార మేర్పడిన దనియు నూహింపనగును. (వై. పా. 185) ద్రావిడభాషలో నైతము ఱకారము దకారమునుండియే వెలయు చున్నది. (వ్యా. సం. స. 27) ఇది పైఉ. వివరణమునకుఁ గేవలము విరుద్ధము. ఈమాటలనుబట్టి డకారమే యాద్యవస్థయం దుండఁగా నదియే ఱకార మై ళకార మైనది. అట్టియెడల మధ్యలో వచ్చి మాసిపోయిన ఱకారమును వర్ణమాలలోఁ జేర్చుట యసంగతము గదా. మొదటి దైనడకారము వర్ణమాలలోఁ గలదు. కావుఁ జివరకు మిగిలినళకారమునె గ్రహించు టుచితము. ఇట్లయిన సూరివివరణ ముచితమె యగు నని కాఁబోలును, ఉ.లో ఱకారమె ప్రాచీన మని దానినుండియె ళకార మేర్పడిన దని దానినె వర్ణమాలలోఁ జేర్చిరి.

"ప్రాచీనకాలమున నిట్టిళకారముచోట (ఈళనాదిశబ్దములందు) 'ఱ' అను వర్ణముండెడిది—ఇయ్యది తమిళమున నేఁటికిని నిల్చియున్నది" (వ్యా.సం.స.28) అనువీరిమాటలనుబట్టి ఱవర్ణము సంస్కృతీయమె యనియు నది ద్రావిడభాషల లోనికిఁ జేరి తమిళమున మాత్రము నేఁటికిని నిల్చియున్న దనియు నభిప్రాయ మగుచున్నది. ఉ.లో ఱకారము సంస్కృతమందును ద్రావిడభాషలందును గల (2) దనిరి

'ఱ' వర్ణము సంస్కృతీయమె యని నిర్ణయించుటకుఁ దగినప్రమాణము లేదు.

మొత్తముమీద 'ఱ'కారమును సంస్కృతవర్ణమాలలోఁ జేర్చుట సరి కాదు. చింతామణిని నన్నయయే వ్రాసె నన్నను, నన్నయనాఁటికి సంస్కృతమునఁ గావ్యభాషయందు 'ఱ'వర్ణము నిల్చియున్న దనియె చెప్పుకొన్నను నీ గ్రంథము చింతామణికి వ్యాఖ్యానము గాదు గావున బాలప్రౌఢవ్యాకరణములకంటె విశేష లక్షణములు చెప్పఁబూనిన "బాలవ్యాకరణోద్ద్యోతము"న సంస్కృతవర్ణమాలయందు 'ఱ'కారము చూపుట యసంగత మనియె నిశ్చయించి చెప్పవచ్చును.

అయిన నన్నయనాఁటికి సంస్కృతమున ళకారమె లేదా? "శిక్షాప్రాతిశాఖ్యాదులకాలమునాఁటికి లేనట్టియుఁ దర్వాతిసంస్కృతమున నవతరించినట్టియు ముకుళగోళగరళాదిశబ్దగత మగునలఘులకారధ్వని మఱి యొక్కటి నన్నయనాఁటికె వెలసియుండెను. (వ్యా.సం.స.27)

తెలుఁగునఁ దఱ తనుచో ళకారము వర్ణాంతరమె. కాని సంస్కృతమున ముకుళశబ్దమున ళకార మలఘువే. ఏల? 'అలఘుయరలవలను వర్ణాంతరములుగాఁ బరిగణించుట జరుగదు. కావున సంస్కృతమున వర్ణసమామ్నాయమునఁ బేర్కొన్నది వర్ణాంతరమే కాని యలఘువు గాదు. ఇంక వర్ణసమామ్నాయగతళకార భిన్న మగునలఘులకారము నెద్దాని నేని విధి లఘవోలఘవశ్చేతిశాస్త్యాదికారికచేఁ జింతామణికర్త యుద్దేశించె నని యంగీకరింపకతీఱ (వ్యా.సం.స.27) దనిరి. సంస్కృతమున నలఘులకార మొకటుండవలయును గావున నది ముకుళాదిగతము కావలసి వచ్చినది.

ముకుళాదిగతళకార మలఘువే యనుటకు నాధారములేదని యిట్లు చెప్పవలసి వచ్చినది. "లకారమునకు ద్వైవిధ్యము సంస్కృతవ్యాకరణములలోఁ జెప్పఁబడ లేదు (27) గ.వా. వోర్లఘుప్రయత్నతరశ్శాకటాయనస్య యనుదాని ననుసరించి యవలకు మాత్రమే లఘ్వలఘుభేదము సంస్కృతమునఁ జెప్పఁబడియె. సంస్కృతమున లఘుత్వము లకారమునకుఁ జెప్పఁబడకుండ ముకుళాదిగత మలఘు వన నెట్లు?

లకారద్వైవిధ్యము సంస్కృతవ్యాకరణములందుఁ జెప్పఁబడకపోవుట చేతనె యహో. లస్య ద్వైవిధ్యమ్ లోకే ఇతి వాల్మీకియసూత్రే స్ఫుట మ్మని ప్రాకృతవ్యాకరణస్పష్టముగా సాధించెను.

ముకుళాదిగతళకారమునలఘుత్వమునుగూర్చి "లకారద్వైవిధ్యముగురించి సంస్కృతవ్యాకరణము పేర్కొనలేదు. కాని ఋగ్వేదప్రాతిశాఖ్యలో 'జిహ్వా

గ్రాన్తాభ్యాంచ వచనం లకారే. పార్శ్వదన్తాభ్యాం జిహ్వాగ్రేణవక్తవ్యః లకారః యదా జిహ్వాయాః అగ్రాన్తాభ్యాముచ్యతే తదా స దోషో భవతి. పూర్వోక్తే చాతిస్పర్శ నిర్ఘరా- త్రయోదోషా లకారస్య భవన్తి. రేఫలకారోచ్చారణము- (వై.పా.181) మొదలుగా వివరించి యీషత్స్పర్శ గలలకారము లఘువు కాఁగా అతిస్పర్శ నిర్ఘరధ్వనులమూలఁబట్టి ళకార మలఘువు గాఁదగు నని వీ రనుమానించిరి. కాని యిది యలఘు వని నిర్ణయింప నాధార మేమి? వర్ణసమామ్నాయమందలి లకారమును లఘువుగా లాక్షణికులు పేర్కొనిరా? అన లఘునంజ్ఞ సంస్కృతవ్యాకరణము లం దవయుక్తము గాలేదు. ఈ విషయమున అం.భా.వ.ము విమర్శించుచు 'లఘువు లని కొన్నిఁటిని జెప్పునప్పు డలఘువు లని వేఱ చెప్పవలయునా? (వ్యా.సం.స.28) యనిరి. అయ్యది యవలవిషయమునకే కుదురును. కాని లకారము లఘు వని పేర్కొనకుండఁగా ళకార మలఘు వనుట యెట్లు? లఘూచ్చారణమునకుఁ జెప్పిన లక్షణము లకారమం దెట్లుఁ గుదురును?

(హేడన-హేలన-హేలన) డకారస్థానిక మగుటచే హేళనాదిశబ్దగతళకారము నలఘుదంత్యలకార మనరాదు. ఇంక దంత్యలకారస్థానిక మగుటచేత దంత్యమె యై యలఘూచ్చారణమాత్రవిశేషము గలముకుళాదిశబ్దగతళకారము నలఘుదంత్య లకార మనుట యుక్త (వ్యా.సం.స 29) మని యొకభేదమును జూపిరి. కాని తరువాతి దగు ఉ.లో హేలనము హేళనము మున్నగు శబ్దములలోనిది ళకారమే. దానిని లకారముగాను డకారముగాను బెక్కుట యర్వాచీన (2) మనుటచే నది డకారస్థానికము గాదు గానఁ బ్రత్యేకవర్ణమై వర్ణమాలలోఁ బరిగణింపఁదగిన దనుట యింకను దెలియమె. కాని ముకుళాదులందలివిశేష మగునలఘూచ్చారణలక్షణము నిరూపింపవలయు. యవలలయలఘూచ్చారణముకంటె నిది భిన్నము. కాఁగా నిదియు నలఘువె యని సామాన్యముగాఁ జెప్పు టెట్లు సమన్వయించును. ఇ ట్లీళలు పృథగ్వర్ణములె యనఁదగియున్నవి.

డకారము మూర్ధన్య మగుటచే దాని కగుళకార మలఘువు గా దన్నవీరు తెలుఁగునను నట్లు సమన్వయించుటకుఁ గాఁబోలు 'దంత్యరేఫలకారస్థానిక మగు వెఱలుపాఱుబయున్నగుశబ్దములలోని సాధ్యళకారమలఘుంకారమనియుఁగంతోక్తముగఁ జెప్పె నని (వా.సం.స.27) సూరివివరణము నుద్ధరించిరి. కాని సూరి యిటఁ

ద్రాళు అనియుఁ జూపెఁ గదా. అది మూర్ధన్యడకార స్థానికము గదా. అలఘు వవుట వీరివివరణమునకు విరుద్ధము. హేళనాదులందువలె విడియు వర్ణసమామ్నాయగత మగువర్ణాంతరమె యనవలె. అది సూరిమతమునకు విరుద్ధము. ఈవైరుధ్యమును దొలఁగించుటకుఁ గాఁబోలు చిం. కొలఁదిన త్రాడ్లు అనురీతిరూపములే ప్రసిద్ధము లయి (త్రాళ్లు అని యప్రసిద్ధముగాఁ గల వన్నమాట.) యుండఁగా నాపిదప తా్రిళ్లు అని యేర్పడిన దనుచు "త్రాళ్లు మున్నగుశబ్దములందలిళకారము డకార స్థానిక మైనను నది ఏళ్లు పాళ్లు మున్నగుచోటులందువలెనె బహువచనలకారనిమిత్తకమై దానితో నేకరూపత నందిన దై (వైకృతానాం ఆకి భవే ల్లడయో రేకరూపతా) వెలసిన దగుటంజేసి తత్సమానన్యాయమున నలఘులకారముగ సూరిచేఁ బేర్కొనఁబడె (వ్యా.సం.స.27) ననిరి. దీనివలన హేళనాదిశబ్దగతళకారము డకారస్థానిక మవుటచే నలఘువు కాకుండుట సమర్థింపఁబడిన ట్లయినది. కాని సూరి పేర్కొనుటకు దీనితో సంబంధము లేదు. వీరు త్రాళ్ళు అని బహువచన లకారమును నైత మలఘువుగాఁ జూపిరి. కాని సూరి బహువచనలకారమున కలఘుత్వమును చెప్పలేదు.

లడయో రేకరూపతా యన్నది వి.వి. కాని సూరి కాదు. సూరి యిట్లు చెప్పియున్నచో నాతఁడు బహువచనలకారమున కలఘుత్వము చెప్పలేదు గావున డకారము లఘులకారమై త్రాళ్లు అనియే యవును. వ్యవహారమునుబట్టి యలఘువు చేయఁబూనుట సూరిమార్గము కాదు. సూరి డకారలకారములస్థానమున నలఘు లకారము నుపదేశించెను. ఇటఁ జిం., వి. వి. ల మతముకంటె సూరిమతము విలక్షణమగుట గమనార్హము. చిం., వి. వి. లు ఏళుఌ పాళుఌ అని సాధింప లేదనియు వీరు నిర్ణయించిరి. బాల. చిం మతములను గలుపుటచే నీవివరణమునఁ గొంత వైరుధ్య మేర్పడినది.

ఏళ్లు పాళ్లు అనుచో దంత్యరేఫస్థానిక మగుట ళకార మలఘువు గావచ్చును. కాని త్రాళ్లు అనుచో నగుటకుఁ గారణము సామ్యమమాత్రమే యగునా? అట్టి యెడల బహువచనపరకతలో నగుళకార మలఘు వనఁదగుఁ గాని దంత్యరేఫస్థానిక మగుట నలఘు వని చెప్పుట యసమగ్రము గదా. ఇదే విధముగా ముకుళ-ముకుళ ఘునుచో లకారమునకు ళకారము వచ్చి యయ్యది యలఘువు గాఁగా హేతన-

పేళవ- అని డకారమున కై వళకారమును ముకుళాదిశబ్దసామ్యముచే నలఘువే యేల కాదు? మూర్ధన్యము గానఁ గా దన్న బహువచనపరకతయం దగుట యను సామ్య మున్నను త్రాడులు త్రాళ్లు అనుచోటిడకారస్థానికళకార మలఘు వగు టెట్లు? త్రాళ్ల అనురూప మంగీకరించి యట డకారస్థానిక మగుళకారము నలఘువుగాఁ జెప్పిన వచ్చె పేళనాదులందును త్రాళ్ల అనుదానికి పాళ్ల అనుదానితో సామ్య ముండ పేళన ఇత్యాదులందానికి ముకుళాదిస్థలములతో వైషమ్య మే మున్నది?

సంస్కృతమునందలిదంత్యలకారమునుండిజనించినగోళగరళాదులలోని ళకారసామ్యమునఁ దెల్గునందును దంత్యరేఫంకాంజన్యమగు గోరులు- గోళ్ళు-వీరులు వీళ్ళు, పాలులు-పాళ్ళు మున్నగుబహువచనళకారమున కలఘుత్వము నంగీకరించుట యుక్త మవఁదగును (వ్యాసంస 132) గోళగరళాదిసామ్యముచే గోళ్ల ఇత్యాదుల ళకార మలఘు వైనది. గోళ్ల ఇత్యాదుల సామ్యముచే త్రాళ్ల ఇత్యాదుల డకారస్థానిక మగుళకార మలఘు వైనది. అట్టియెడల గోళ గోళ్ల-తాళ్ల వలె గోళ- తళవ- అను వానికి సామ్య మూహించుట యసంగతమా? బహువచనపరకతయం దాదేశ మగుట యట సామ్యము కాఁగా, గోళ, పేళవ, అని లకారమునకువలె డకారమున కాదేశ ముగా వచ్చుట యిచ్చటిసామ్యము. స్థాని భిన్న మగుట వైషమ్య మన్న నట్టిది గోళ్ల త్రాళ్ల అనుచోఁ గూడఁ గలదు గదా.

ఇట వివాదములకుఁ గారణము సంస్కృతమున ళకారమునకు నలఘుత్వము చెప్పఁబడకుండుటయే యని గుర్తింపఁదగును.

ఏది యే మైనను సంస్కృతమం దలఘుళకారమును నిరూపించుట కేప్రమాణము లేదు. ఉన్న ళకారము (తెల్గునందలి తళుకు, బెళుకు ఇత్యాదులందువలె) ప్రత్యేకవర్ణమె కాని యలఘు వనరాదు. కావుననే యహోబలుఁడు సంస్కృతమున ళకార మును వర్ణాంతరముగనె గుర్తించెను. నచైవం ళకారస్యావర్ణాన్తరత్వమ్. తస్య మాహేశ్వరసూత్రేష్వ శేఽపి అడయోర్లళయోశ్చైకత్వమితి శాబ్దికశిఖావతంసైరు క్తత్వా త్తని మొదలుగా సంస్కృతమున ళకారము వర్ణాంతరమే యనెను. లళల కభే దము చెప్పుటనుబట్టి ళకారము గల దని యది వర్ణాంతర మని యహోబలుఁడు చెప్పుట స్పష్టము. లకారస్థానిక మగుళకార మలఘువుగా పరులవారు చెప్పఁగా నహోబలుఁడు అట్లే చోట్ల (పటేత్యాదులవలె) లళలయభేదమును నచటిళవర్ణము వర్ణాంతర మనియుఁ జెప్పెను. సంస్కృతమున లకారమున కిద్వైవిధ్యము లే దనియె యహోబలు మతము స్పష్టమే.

ఇట నహో. యుద్ధరించిన రలయోర్లడయోస్తద్వల్లళయోశ్శసయోరపి అను మున్నగుదానివి జూచియే వయ్యలవారును వయిరీతిని గోళగరళవ్యాళాదికతివయ శబ్దములలో మాత్రమే యలఘుళకారోచ్చారణ మాంధ్రదేశాన వాడుకలో నున్నది. భోజరాజు దవి (ఈ శ్లోకము) చెప్పఁబడి యుండుటంజేసి పదనాల్గవశతాబ్ది నాఁటికే యిది సంస్కృతమున యాథమై వెలసియున్నది (వై. హ. 182) యనిరి. ళాభేదస్థలమే ళలంఘ్వలఘుస్థలముగా వయ్యలవారు స్పష్టము చేసిన ట్లయినది. అహో. ఈచోటి ళకారమునుబట్టియె సంస్కృతమున నావర్ణము గలదని యది వర్ణాంతరమని పేర్కొనుట స్పష్టమె.

ముకుళాదిశబ్దగత ళ మలఘువని బా.క ప్రభృతు లెవ్వరును జెప్పలేదు. సూరి బహుత్వమున రలడల కాదేశ మైనళకారమె యలఘు వనెను. వర్ఘులవా రన్న ఆంధ్రమున గోళగరళవ్యాళాదిశబ్దముల కొన్నిటిలో మాత్రమె యలఘుళకారము వినఁబడుచున్నది (వ్యా. సం. న 151) యనిరి. ఇది లకారమున కైన దన్నను బహుత్వమున నైనది గామింజేసి యలఘు వనుటకు సూత్రలక్షణము ననుసరించి లేదు.

ఈ శబ్దగరళాదిశబ్దగతళకార మభిన్న మనియు నదియే వర్ణమాలలోఁ జేరి గణింపఁబడు ననియుఁ జెప్పవహో. యభిప్రాయమె యుచితము. తెలుఁగునందె యీ భేదము వర్ణాంతరళకారము లఘుళకారము అన్నది ప్రయోజనవంతము గాకుండఁగా సంస్కృతమునను వట్లు గల్పించుట యేలొకొ తెలియదు. సంస్కృతమున యువలకు లఘూచ్చారణము విహితము కాఁగా లకారము దుష్టోచ్చారణముచేళకార మైన దని వీరివివరణమునుబట్టి తెలియవచ్చు. అట్టియెడల నీళకలను లఘ్వలఘువు లనఁ జెప్ప దొడ్డునా ?

తళుకు-పెళలు అనుచో ళకారోచ్చారణమున వర్ణాంతరము, వలఘువు వని నిరూపించు విశేషభేదము గలదా? ఇంతను లకారము లఘువు వలఘు వని విభజింపక ళకారమునే లఘ్వలఘువులనఁ జెప్పి తళుకు ఇత్యాదు లందలిది యలఘు వనియుఁ దాళుడు ఇత్యాదిగా బహుత్వమున రలడల కాదేశ మైనళకారమె లఘు వనియుఁ జెప్పుట యేవి గొంత యుచిత మేమో యనిపించు. లఘ్వలఘుభేదకల్పనము ళకారాంతంపు ళ (తళుకు) ళ (పెళలు) లయందుఁ జూపుటయె యొప్పుఁగదా, ద్వైధా వ్యవస్థాపింపదగు యనుటచే సూరి ళకలకు బేర్కొని తళ, పెళలు అనుకరణభేదమును గల్పించె ననవచ్చును. లఘ్వలఘుభేదకల్పనమె తెలుఁగున నవసరమా?

వర్ణసమామ్నాయమున నలఘువులను జేర్చుట లేదు గాన వర్ణసమామ్నాయమందలి ళకారమునకు భిన్నమైనదే యలఘుళకార మనియు నది ముకుళాదిగతము గానదే యనియు వజ్ఝలవారు చెప్పిరి. కాని వర్ణమాలయం దలఘువులు చేర్పలే దనుట సరికాదు. వర్ణసమామ్నాయమందు నున అంగీకరింపఁగా వానికె లఘూచ్చారణము విశేషముగా విహితము. తెలుఁగున నైనను వర్ణమాలయందలి దాగమ యకారమనియు, శబ్దగత మగు యకారము వర్ణమాలలోఁ జేర్పఁబడలే దనియుఁ జెప్పఁదగునా ? సంస్కృతమునకు భిన్నముగాఁ దెలుఁగులాక్షణికులు చెప్పిన ర, ల అనువానియందే యట్టిలక్షణము (లఘువులు వర్ణమాలలోఁ జేర్పఁబడి యలఘువులు చేర్పకుంట) కల్పించుచున్నది. లఘ్వలఘుభేదము ళలయందే యున్న ళకారమలఘువే వర్ణమాల నుంట గుర్తింపనగు.)

కాని యహో.మతమునఁ గొంత విశేషము గుర్తింపవలసియున్నది. అప్పకవి ననుసరించి యహో కూడఁ దెలుఁగునఁ దఱచు మున్న గుళ్ళబ్దములందు సహజముగా నున్న ళకారమును, (త్రాళ్లు ఇత్యాదులందలిదియు నభిన్నముగా) నలఘువుగాఁ జేర్కొనెను. అదే విధముగా ఊళనగరళాదిగతము నొక్కటియె. తెలుఁగున ళకార మెల్లయెడల నలఘువే కాఁగా సంస్కృతమున మాత్రము ళకార మలఘువేల కాదు ? అలఘువే. అయిన వర్ణమాలలో ళలు రెండు నేల చేర ? ఉర లవయోర్హాళత్ తు పూర్వోక్తౌ అనుచోఁ దెలుఁగున వర్ణమాలయందుఁ జెప్పిన ళకారము నలఘువును గూడ లఘు వర్ణంలకారముతోఁ జెప్పెను. కావున సంస్కృతమున నట్టి ళకారముతో పాటున్న యలఘు వగు ళకారమును వర్ణమాలలో వర్ణాంతరముగఁ జేర్చుట జరిగినది. కాఁగా నహో. స్పష్టముగాఁ జెప్పకున్నను సంస్కృతమున ళకారము నలఘు వని కల్పించినను వర్ణమాలలోఁ జెప్పుట యాతనిమతమున కనుకూలము. అందుచేతనే యహో. 'గురురేఫస్యాపి వర్ణమధ్యే పరిగణనదశాయాం షట్త్రింశదిహాస్యే ఇత్యప్పకవిపుస్తకపాఠోఽపి సాధురేవ (కవిశ.203) యనెను. తస్య రేఫభేదత్వే నావర్ణాంతరత్వదశాయా మయంపాఠః అని షట్త్రింశత్త్వమును సమర్థింపఁజూచి ద్విధాచెప్పుటలో తప్పుకొనుటయె కన్పట్టును. కాని లఘ్వలఘుభేదమును బ్రస్తావింపక శకటరేఫమును వర్ణాంతరముగాఁ బరిగణించుటయె యుచిత మని తోఁచు.

యవలతోపాటు లకారముద్వైవిధ్యముసైతము సంస్కృతవ్యాకరణమునుండియె గ్రహింపఁదగు నని తలంచినచో సర్వవిభక్తిస్సంస్కృతతుల్యాః యన్నట్లుగా నన్యములు సంస్కృతవ్యాకరణస్పృష్టము లనియె చిం. చెప్పియుండెడి దనిపించును. కావునఁ జిం. సంస్కృతమున నలఘులకార మున్న దని చెప్పె ననుటకు వీలు లేదు. కాని గరళాదులలో ళకార మలఘు వనుటకు నన్యే యనుసీసూత్రముచే నలఘు వుండదనిలు దని చెప్పుట యొప్పదు. అన్యవ్యాకరణ స్పృష్టాః అనుచో నన్యశబ్దమునకు సంస్కృత వ్యాకరణ మనియె యర్థము చేసినపుడే చిం. ఇది సమ్మతించె ననవలె. కాని సంస్కృత మని స్పష్టము చేయక (సంస్కృతముననే యవలద్వైవిధ్యము గుర్తించినఁ బ్రాకృతవ్యాకరణముప్రసక్తి యనవసరము గదా.) యన్య మనుటచేతనె తెలుఁగునకు భిన్నము లయి తెనుఁగుతో సంబంధము గలిగి పూర్వప్రసక్తము లయి యున్న సంస్కృతప్రాకృతవ్యాకరణములు రెంటిని గ్రహింపవచ్చు. బా.స. ప్రభృతు లెల్లరు నట్లు చెప్పి లకారద్వైవిధ్యము ప్రాకృతవ్యాకరణమునుండి ప్రస్తావించిరి. వీరింతకు ముందట్లే చేసిరి. (వ్యా.సం.స.27) కాని పిదప ప్రాకృతవ్యాకరణము ననుసరించి ముకుళాదులలోని ళకార మలఘువు. ప్రాకృతసంసర్గముచేతనె సంస్కృతమున ముకుళాదిశబ్దగతళకారమున కలఘూచ్చారణ విశేషము గల్గె ననియు నట్టిప్రాకృతళకారమును వలెనె యీసంస్కృతళకారమును సైత మలఘులకారముగఁ జింతామణికర్త తలంచె ననియు నల్లె సూరి వచించె ననియుఁ (వ్యా. సం. స. 28) పేర్కొనిరి. సూరి సంస్కృతప్రాకృతములజోలికి పోలేదు. చిం. అన్యవ్యాకరణస్పృష్టము లనుచుండఁగాఁ బ్రాకృతభాషాసంసర్గముచే ముకుళాదుల సంస్కృతమున ళకార మున్నదని యది యలఘువని యేవ్యాకరణము సంస్కృతమునస్పష్టము చేసినదో వివరింపలేదా ? అట్టియెడల ముకుళాదులందు ముకుల అనుతీరుగ నుండుటయె చిం. సమ్మత మనుచే నొప్పను.

అలఘుళకారమును వీరు శిక్షాప్రాతిశాఖ్యలనుండి పేర్కొనిరి. కాని చిం. వ్యాకరణస్పృష్ట మనుచుండఁగా లకారములఘుత్వాలఘుత్వములను వ్యాకరణము నుండి గాక వేఱుగాఁ జూపుట లక్షణానుగుణము కాదు గదా. వ్యాకరణేతరస్థలము నుండి యైనను వీరి నిరూపణము సాధారము గాదు. అనఁగా నట్టిదుష్టోచ్చారణము

వలన నది ళకార మనియు నది యలఘు వనియు నెట్లు నిరూపింపఁ బూనినస్థలము నం దేని చెప్పఁబడినదా ?

కావున ఈళనాదిగతమును గంళాదిగతము నగుళకార మొకటియె. అదె వర్ణ మాలలోఁ బరిగణింపఁబడినది. గరళగిరళాదిగా ళలతో నుండవచ్చుఁ గాక. అవి లఘ్వలఘువు లనుట నిరాధారము. యవలకు సంస్కృతవ్యాకరణమున లఘు ప్రయత్నము చెప్పబడినది. లఘుభిన్న మగుటయె యలఘుత్వలక్షణము. ఇంక ళలవిషయమున వర్ణమాలయందు లకారమునకు యవలవలె లఘుప్రయత్న ముద్దేశించిన ళకార మేర్పడునా ? ళకార మలఘువు గదా. కాక లకారమున కలఘు ప్రయత్నమును విశేషముగాఁ జెప్పవలె. అట్టియెడల యవలకంటె ళలలఘుత్వా లఘుత్వములు భిన్నము లగుచున్నవి. యవలకు లఘుత్వము చెప్పఁబడినతీరు ననుస రించిన ళకారమును వర్ణమాలలోఁ జేర్చి దానికి లఘూచ్చారణమును జెప్పవలె లిపి భేద మొందును. యవలలఘుత్వలక్షణము లకారమందు లేకుంట రెండు నగు భేదములు.

ళకారమునకలఘుత్వము ప్రాకృతవ్యాకరణములందుమాత్రము చెప్పఁబడినదా? సంస్కృత ప్రాకృతవ్యాకరణములం దెచ్చటను లకారపులఘ్వలఘుతలు వివరింపఁ బడలేదు. (వ్యా. సం. స. 131) భోజరాజు వాక్యమునుబట్టి సంస్కృతము వను ప్రాకృతవ్యాకరణము ననుసరించి ప్రాకృతమందును లకారమునకును సం స్కృతప్రాకృతములు రెండింట ద్వైవిధ్యముగల (వ్యా.సం.స. 132)దని పేర్కొ నిరి. సంస్కృతప్రాకృతములలో ళకారము గలదనుటకిది యుపయోగింపను. చిం. ళకార మలఘు వని చెప్ప నూరి యిట సంస్కృతప్రాకృతవ్యాకరణముల ప్రసక్తి లేకుండుట యుచితముగా నున్నది. ఏమైనను లకారములఘులఘుత్వము చెప్పవలయుచోఁ బ్రాకృతమున నైనను ళయుగనె చెప్పవలె. సంస్కృతమున ళకార మున్నను నయ్యది సంస్కృతవ్యాకరణమునఁ బ్రసక్తముగా మింటేసి ప్రాకృత వ్యాకరణమున ళకారము ప్రసక్తి గలదు గాన లకారద్వైవిధ్యము ప్రాకృతమునుండి గ్రహింపవలె నని బా. స. ప్రభృతులమత మెన్నవచ్చును. కాఁగా ళకార మెల్ల యెడల నలఘువె. కాన సంస్కృతప్రాకృతవర్ణమాలలలోఁ బరిగణింపఁబడినది

యలఘుళకారమె యనవలె. అట్టియెడలఁ దెలుఁగున నలఘురేఫమును మాత్రమేల పరిగణింపఁ డన్నది ప్రశ్నమె. అట్లని ళకారము ద్వివిధముగాఁ బ్రాకృతమునందేని గుర్తింపనవకాశము లేదే. పరిశీలింపఁగా నీద్వైవిధ్యము సైతము తెలుఁగుననే కల దనియు తళుకు ఇత్యాదుల ళకార మలఘువును, ఏళులు ఇత్యాదుల ళకారము లఘువు నన్నఁ గొంత సరిపడును. లఘ్వలఘువులకు లిపిభేదము లేకుండఁగా, ఏళులు అనుచోటిళకారము తల ఇత్యాదులలకారము నలఘుస్వరూపముగాఁ జెప్పుటకంటె వర్ణాంతర మగుళకారము నలఘుస్వరూపముగాఁ జెప్పు టొప్పు యనుటతో సామ్యము గుదురును. సంస్కృతప్రాకృతములందు నలఘువు వర్ణమాలలోఁ బరిగణింపఁబడిన దన నక్కఱయుండదు. తెలుఁగున నలఘురేఫము వరిగణింపని బా.న.పాఠము సమన్వయించు. రేఫమువిషయము భిన్నమె. లఘ్వలఘురేఫములకు లిపిభేదము స్పష్టమే. (దన్త్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ అనులక్షణమున నలఘురేఫళకారములకు లిపిభేదము చెప్పఁబడినది. దంత్యచజలు పృథగ్వర్ణములుగాఁ బరిగణింపఁబడి యలఘురళ లట్లు గాలేదు.) 'అన్యైన్యవ్యాకరణస్పష్టాః రస్తత్ర గృహ్యతే ద్వివిధః' అనుచిం.లో నెల్లెడల ళకార మలఘువె యనియు, అలఘురేఫము సంస్కృతప్రాకృతములందు లేదు గావున రస్తత్ర గృహ్యతే ద్వివిధ యని చెప్పఁబడిన దనియు నూహింపవచ్చును.

## సంస్కృతము - ళకారము :

అట్టియెడల నిట నొకసందేహమునకుఁ దావు గలదు. లకారము లఘువు, ళకార మలఘు వని ప్రాకృతమునందును జెప్పఁబడలేదు. ప్రాకృతమున ళకారము గలదు గావున లకారద్వైవిధ్యము ప్రాకృతవ్యాకరణమునుండి తెలియవలయును- (వజ్ఝలవారును లకారద్వైవిధ్యము ప్రాకృతసిద్ధ మని (వ్యా.సం.స. 27) అంతకు ముందు పేర్కొనిరి.)అనఁగా సంస్కృతమున ళకారము లే దనియె కదా యర్థము. అట్టియెడల సంస్కృతవర్ణములలో ళకార మెట్లు చూపవచ్చును? ళకారమును దొలఁగించిన 49వర్ణము లేయవునే(అందుకె బా.ఉ.లో ఌకారమును జేర్చి 50సంఖ్య పూరింపఁబడిన దన్నమాట)

'ళ'కార మలఘు వని సామాన్యముగా నిర్ణయించి బాలసరస్వతి, అప్పకవి, అహో.ప్రభృతులు స్పష్టముగాఁ జెప్పియు సంస్కృతమున ళకారమును జూపిరే. సం

స్కృతవర్ణమాలలో ళకార ముండుటనుగూర్చి అహో. విస్తృతముగనె పరిశీలించెను. అట్టియెడల ళకారము సంస్కృతమునను నుండఁగా, అది యలఘువే యగుచుండఁగా లవర్ణముయొక్క ద్వైవిధ్యము ప్రాకృతసిద్ధ మనుట యెట్లు?

ఇట నిట్లు చెప్పవలెనవచ్చును. సంస్కృతమున ళకార మున్నను అయ్యది వ్యాకరణమునం దుక్త మయియుండలేదు. ళకారము వ్యాకరణమునం జెప్పఁబడియుండుట ప్రాకృతమునందే. చిం.లక్షణమున 'అన్యవ్యాకరణస్పృష్టాః' అని చెప్పఁబడియుండుటచేతను సంస్కృతవ్యాకరణమున యవలద్వైవిధ్య ముక్తము గాఁగా ళకారస్థితి వ్యాకరణమునఁ బ్రాకృతమునందు మాత్రమె చెప్పఁబడినది గావున నది ప్రాకృతసిద్ధ మని బాలసరస్వత్యాదులమతము. కాఁగా ళకార మలఘువే. సంస్కృతమునను గలదు కాని యది వ్యాకరణస్పష్ట మయియుండుట ప్రాకృతమునం దని సమన్వయింపఁదగును.

ఇట వజ్ఝలవా రిట్లు పేర్కొనిరి. 'లఘ్వలఘుయవరలను వేఱుగ గణింపవి నన్నయ లకారళకారములకుఁ బృథగ్గణనము చేసె ననుట విశ్వసింపఁదగినది గాదు. సూరి ళకారమును సంస్కృతవర్ణసమామ్నాయమునఁ జేర్చుట సరిగాదు. అయ్యది ద్రావిడమూర్ధన్యళకారము'(శిష్టుల) ఇందు రవర్ణ మచ్చుపొరపాటు గావచ్చును. రేఫద్వైవిధ్యము తెలుఁగున మాత్రమె యని చిం. స్పష్టము చేసియున్నది. ఇది సంస్కృతవర్ణములనుగూర్చి పేర్కొనుసందర్భము గావున రవర్ణప్రసక్తి యటలేదు. అచ్చు పొరపాటు గా కున్న 'ర'వర్ణమును జూపుట యసంగత మని గుర్తింపఁదగును.

ఇంక వర్ణసమామ్నాయమం దున్నళకార మలఘు వనుట విశ్వసింపఁదగినది గా దను టుచితమె. అది సంస్కృతవర్ణసమామ్నాయమున లకారముయొక్క అలఘుస్వరూప మని సూరి తలఁచెనా? వర్ణసమామ్నాయమున ళకారమును జూపినసూరి యది వర్ణాంతరమె కాని యలఘువు కా దని స్పష్టము చేసెను. బహుత్వమున వలదల కాదేశ మైనళకారము సంస్కృతశబ్దముల నున్న నయ్యది యలఘు వగును. (సంస్కృతమున నట్టిస్థితి లేమి సందేహమున కవకాశమె లేదు.) ఇంకను 'వర్ణసమామ్నాయమందలి ళకార'మనుచో సంస్కృతప్రాకృతాంధ్రములం మూఁడింట వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరమె కాని యలఘువు కా దని సూరి స్పష్టముగాఁ జెప్పుచుండఁగా సూరి సంస్కృతవర్ణసమామ్నాయమున నలఘువు

(ళ) పరిగణించినట్లు నయ్యది చింతామణి విరుద్ధ మనియు వజ్ఝలవారు విమర్శించుట సమంజసము కాదు గదా!

వజ్ఝలవారును వ్యా.సం.స.లో ళకారమును సంస్కృతవర్ణమాలలో సాక్షి చ్చింతామణివ్యాఖ్యయందే చూపియున్నారు. ఇంక మనంతుడు ళకారమును వర్ణ సమామ్నాయములోఁ జేర్పకుంటకు వింతపడిరి. (వ్యా.సం.స. 27)

అలఘువు గాక యది వర్ణాంతరమె యయిన "ద్రావిడమూర్ధన్యళకారము కావున సంస్కృతమున (ప్రాకృతమునను) బరిగణింపరా దని చివరివాక్యమున నభిప్రాయము. ఇట్లు ళకారమును దొలఁగించి వీరు 'ఌ'కారమును జేర్చిరి. ళకారము ద్రావిడము గావునఁ బరిగణింపరా దనుటనుబట్టియు వీరు పరిగణించిన ఌకారము ద్రావిడము గాక సంస్కృతమునఁ గావ్యభాష యందును సహజముగా నున్న దని వీరినిశ్చయ మైనట్లు గుర్తింపవలసియున్నది.

అగుఁ గాక. 'ఌ'కారమును గ్రహించి ళకారము విడుచుట యెట్లు? 'ఌ'కారమె చింతామణికర్త యుద్దేశించె నని తెల్పుచునే ఇది ళకారముగ వేదశాఖలలో నుచ్చరింపఁ బడుచున్నట్లు (ద్రావిడ 88) గుర్తించిరి గదా. ళకారమును జెప్పక విడుచు టెట్లు? అది గూడఁ జేర్చిన 51 వర్ణము లగు నని మానియుందు రనవచ్చును.

ఏ ట్లేర్పడినను ళకారము సంస్కృతమున నున్నది. తత్సమములకు మూలమైనలౌకికసంస్కృతమున ళకారము గలదు. దానిని వర్ణమాలలో గ్రహింపక విడుచుటొప్పదు. అనంతాదులయభిప్రాయమును వీరు విమర్శించినతీరునుబట్టియు ళకారమును వర్ణమాలలో గ్రహింపకతప్పదు.

'ఌ'కారమె వర్ణమాలలోఁ బరిగణింపఁబడుటకుఁ దగ దని యిట్లు గుర్తింపవచ్చును.

1) వేదాదులయందుఁ గలది 'దుఃస్పృష్టళకార' మనఁబడినది. 'ఌ'వర్ణమె యనినిశ్చయించుటకుఁ బ్రబల మైనప్రమాణము గుర్తింపరాదు. అట్టియెడల నేకాలమునకైనను సంస్కృతమున 'ఌ'కారము గల దనుట యెట్లంగీకరింపవచ్చును?

2) చిం.మతమున గల దనుటకుఁ జిం. నన్నయకర్తృక మనుట మూలము. చిం. నన్నయకర్తృక మనుటకే ప్రబల మైనవిరోధము లుండుటచే దానిని మూలము చేసికొన్న యీనిర్ణయము నిర్మూల మగుచున్నది.

3) ముందు ప్రాచీనతరకాలమున ళకారమె 'ఌ'కారముగఁ బరిణమించియుండు

నవియుఁ గాలక్రమమున నట్టి 'ఱ'కారము తెళవరిజాప మందున్న దనియుఁ (ద్రావిడ 86) జెప్పఁడనుటబట్టి, నడుమ చేర్పడి నడుమనే యంతరించిన ఱవర్ణమును వర్ణమాలలోఁ బరిగణించుట నిరాధారము.

4) 'కావ్యసంస్కృతభాషకు' వర్ణములు చెప్పనీలక్షణమునొద్ద కావ్యములం దీవర్ణము గల దని నిశ్చయించుటకుఁ దగినయాధారము చూపక కావ్యసంస్కృత మున నీయది గల దని నిర్ణయించు టొప్పదు.

5) ప్రాచీనతమకాలమున నొకవేళ నున్నను చిం.కర్త నన్నయ యైు యది యుద్దేశించినను, నేఁటికాలమున నీవ్యాకరణమున దానిని బరిగణించుట సమంజ సము గాదు.

కావున సంస్కృతవర్ణమాలలో ఱవర్ణము చేర్పరా దనియు శకారము గల దనియు గుర్తింపవలయును.

కాఁగా సూరి సంస్కృతవర్ణసమామ్నాయమునఁ జూపినవర్ణములవిషయ మున నెట్టిదోషమును లే దని గుర్తింపఁదగును.

## ప్రాకృతవర్ణములు :

'ప్రాకృతమునకు వర్ణములు నలువది' యనుసూరిలక్షణమును మహారాష్ట్రి ప్రాకృతమునకు వర్ణములు నలువది యని ఉ. పేర్కొన్నది. ప్రాకృతమున కని సామాన్యముగాఁ జెప్పుట తగ దని దీనియభిప్రాయము గావచ్చును. 'ప్రకృతేష్వ తే దశోనాస్స్యుః' అనుచోఁ జిం.లోను మహారాష్ట్రిప్రాకృతమున కని చెప్పకుండుటచే నై దోషము చిం.లక్షణమునకును గల దన్నమాట.

'మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, యపభ్రంశము ననెడిషడ్విధప్రాకృతములలో నొక టగుమహారాష్ట్రిప్రాకృతము నన్నయభట్టుచే నుద్దేశింపఁబడినది.షడ్విధములలోను మహారాష్ట్రికిఁ బ్రాకృత మనియు సంజ్ఞ గలదు' (వ్యా.సం.న. 34) కాఁగా నదే మార్గములో నిచట సూరిసూత్రమందు నయితము ప్రాకృత మనఁగా ప్రాకృత మనుసంజ్ఞ గలమహారాష్ట్రిప్రాకృత మే గ్రహింపఁబడునని చింతామణ్యనుగుణముగ వ్యాఖ్యానింపఁగా చిం. లక్షణమువలెనె యిదియు నిర్దుష్టమై యగును. అందుకే యిచట వీరు సూత్రమును మార్చి చెప్పరే కాని సూరి కేవలము ప్రాకృత మనుట దుష్టమని చెప్పలేదు. (ఉ.7) వీరివివరణమునుబట్టి సూరిసూత్రము

సముచితమె యనియుఁ దెలియును. కాఁగా 'మహారాష్ట్రి' యని విశేషముగాఁ దెల్పుట స్పష్టతకు మాత్రమె యనియు సూరిలక్షణము నిర్దుష్టమె యనియుఁ జెప్పఁ దగును. కాఁగా 'మహారాష్ట్రి' యనువిశేషణము లే కున్న నష్టము లేదు.

## మహారాష్ట్రియే యగునా ?

కాని ప్రకృతి యనుచోఁ జిం. కర్త మహారాష్ట్రిని మాత్రమే యుద్దేశించెనా ? సూరియు నట్లే భావించెనా? అని సందేహము. వీ రంతకు ముందు 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే' యనుచిం.సూత్రవివరణమున "ద్వితీయప్రకృతి యగుషడ్విధప్రాకృతభాషయుఁ బ్రకృతిమాత (వ్యా.సం.స.10) మని స్పష్టము చేసిరి. ప్రాకృతభాషల ద్వారమున (వ్యా.సం.స.664) అని మొద లగువిధముగా నాఱువిధము లైనప్రాకృతములనుండియుఁ దద్భవము లేర్పడు నని చెప్పిరి. అహోబలుఁడు నాఱువిధము లయినప్రాకృతములనుండియు (తత్సమ, తద్భవ, దేశ్య) 18 విధములుగాఁ దెలుఁగున శబ్దములు గల్గుచున్న వనెను.

అట్టియెడలఁ దెలుఁగున కాఱువిధము లయినప్రాకృతములును మూలముగాఁ జెప్పకతప్పదు. అట్టిచో మహారాష్ట్రిప్రాకృతము నొక్కదానినె యిటఁ బేర్కొన నేల ? దానింగూర్చి వజ్ఝలవారు పరామర్శించియుండలేదు.

### ఙ ఞ లు :

ప్రాకృతమునకు వర్ణము లేవి యనువిషయమునను వీరు సూరితో విభేదించిరి. 'ప్రాకృతమున ఙఞలు గలవు. విసర్గము లేదు. ళకారము గలదు. కాని యలఘువు గాన దానికిఁ బృథగ్గణనము లేదు. కాన సూరి విసర్గళకారముల నుదాహరించుట సరి కాదు. వానిని విడిచి చత్వారింశత్సంఖ్యను బూరించుట యుక్తము' (ఉ.6)మొత్తము మీఁదఁ జత్వారింశత్సంఖ్యను బూరించుట లక్ష్యముగాఁ గాక నిజమునకుఁ బ్రాకృతమున నేయేవర్ణములు గలవో నిరూపించుటను లక్ష్యముగాఁ బెట్టుకొనుట యవసరము సుచితము నని మాత్రమె చెప్పఁదగును. వర్ణము లేయవియో చెప్పనిచిం. వర్ణసంఖ్యను మాత్రము నలువదిగాఁ జెప్పుటనుబట్టి గాఁబోలు వీరు చత్వారింశత్సంఖ్యాపూర్తికి యత్నించిరి.

సూరి పేర్కొనని ఙఞలు ప్రాకృతమునందుఁ జేర్పవలసిన వని వీరి యభిప్రాయము. దానికిఁ బ్రమాణముగాఁ జండవాక్యము లుద్ధరించిరి. 'న ప్లుత ఙఞాః

ప్లుతవర్ణాః ఐకారౌకారఙకారాశ్చ ప్రాకృతే న భవన్తి క్లో. ఐఔస్వతౌ తతః పశ్చాత్ ఋఋౢౡ చతుః స్వరాః అః ఙఞనశషాన్సన్తి ప్రాకృతే నైవ కర్హిచిత్... ఙఞౌ స్వవర్గసంయుతౌ భవత ఏవ-అహఙ్కారః- అహఙ్కారో, అఞ్చితమ్- అఞ్చితం.' (వ్యా.సం.స.౨౭) ఙఞలు స్వవర్గసంయుతము లై యుండుట యనువిశేషమును జెప్పుటకు ముం దీతఁడు 'ప్రాకృతే న భవన్తి' యని సామాన్యముగాఁ జెప్పుట గమనార్హము. తెలుఁగునకు సంబంధించినప్రాకృతమునుగూర్చి ప్రసంగించునపుడు విశేషాంశముల కిటఁ బ్రాధాన్యము లే దని ప్రాకృతభాషాసామాన్యలక్షణమును సూరి యనువదించియుండును.

'ప్రాకృతస్య కతిపయస్యన్యాః' అని సూత్రాంధ్రమునఁ జెప్పినసూరి 'ద్వితీయంబునకు ఋగ్వ్రక్తపుఙఞశషలు త్రికృ— నగు' నని ఆం.శ.శా.లోఁ జెప్పెను. వానినే తొలఁగించి బాల.లో ప్రాకృతవర్ణసమామ్నాయమును సూరి నిర్దేశించెను. 'ఋౠవర్ణౌ హ్రస్వదీర్ఘావైజాద్యావనునాసికౌ శషౌ చ దశ తే న్యూనాః' అను హేమచంద్రవచన మాధారముగా నప్పకవిప్రభృతులవలె సూరియుఁ బ్రాకృతవర్ణమాలలో ఙఞలను దొలఁగించుటయు, విసర్గనకారములను జేర్చుటయు ననుమార్గము ననుసరించెను. 'శషాదసంయుక్తఙఞౌ విన్దైవాన్యే హలో మతాః' అని సంయుక్తము లై ఙఞ లుండుట జెప్పియు షడ్భాషాచంద్రిక 'సిద్ధిస్సంస్కృతశబ్దానాం భవేత్పఞ్చాశదక్షరైః ప్రాకృతానాం తు సిద్ధిస్స్యాత్త్రిశ్చత్వారింశదక్షరైః' అనుట (శే.ప్ర.10) గమనింపవచ్చును.

కాఁగా బ్రాకృతవర్ణసమామ్నాయమును నిర్ణయించుటలో సూరి ప్రాకృతవైయాకరణులు పేర్కొను ప్రస్తావించినసామాన్యలక్షణమును గ్రహించెను. ప్రాకృతవర్ణనిర్ణయమునఁ బ్రాకృతలాక్షణికులలోని వివిధమతములనుగూర్చి పరామర్శించుట హ్రస్వవక్రవక్రతమముల విషయమున సూరివివరణమునఁ గానవచ్చు. ఙఞ లుండుటం జెప్పినవారును వానిని ప్రత్యేకముగఁ బరిగణింపకుండుటలోఁ బ్రాకృతలాక్షణిక మతానుగుణముగనె సూరి వ్యవహరించె ననియు నందు దోసఁగు లే దనియు గ్రహింపఁదగును. కాని సూరి హ్రస్వవక్రవక్రతములఁగూర్చి పలెనె ఙఞలు స్వవర్గసంయుతము లై ప్రాకృతమునఁ గలుగుటను వివరణమునఁ బ్రస్తావించిన నింకను బా గుండెడి దని చెప్పవచ్చును.

### విసర్గము :

సూరి విసర్గ నుదాహరింపరా దనుటకు నీ రిట నాధారము చూపలేదు. కాని సంజీవనిలో నిట్లు పేర్కొనిరి. 'మహారాష్ట్రీప్రాకృతమున విసర్గము గానీ జిహ్వామూలీయోపధ్మానీయములు గానీ లేవు. మహారాష్ట్రిలో నెల్లెడలను సకారము ణకారముగ మాఱిపోవును. స్వవర్గీయసంయోగమున నెల్ల యెడలను ఙఞలు మహారాష్ట్రిలో వెలయుచున్నవి. కాన సూరి వివరించినవర్ణమాలలోనివిసర్గసకారములను దీసివేసి ఙఞలను జేర్చుట చింతామణిహృదయ మనఁదగును.' (వ్యా.సం.స.౪౯) స్పష్టముగాఁ జెప్పకున్నను నిందును జత్వారింశత్సంఖ్యను బూరించుటయే లక్ష్యముగాఁ గన్పట్టుచున్నది. ఇటఁ దప్పనిసరి యేమో.

విసర్గమునుగూర్చి యహో. ప్రాకృతత్వేం విసర్గస్య సాక్షాదభావేఽపి 'షగక' ఇతి సూత్రే తత్స్థానికస్య జిహ్వామూలీయస్య సత్త్వాత్ తస్యాపి విద్యమానతుల్యతేతి ఏతావన్మాత్రాశయేన భాషాశబ్దానుశాసనగ్రన్థే దశస్వరా ఇత్యుక్తమితి తత్తాత్పర్యం విదాం కుర్వన్తు' (కవిశి.202) అని పేర్కొనెను. ఏ మైనను బ్రాకృతభాషయందు విసర్గము గల దని ప్రాకృతలాక్షణికులే చెప్పియుండుట స్పష్టము. బాలసరస్వత్యాదులగు లాక్షణికు లెల్లరు నీమార్గమునే యనుసరించుటయు స్పష్టమె. మహారాష్ట్రియో మఱియొకటియో యేదో యొకప్రాకృతము నుద్దేశించి ప్రాకృతముల నన్నింటిని దృష్టిలో నుంచుకొని ప్రాచుర్యాదులనుబట్టి ప్రాకృతవైయాకరణులు పైరీతిని బ్రాకృతవర్ణములనుగూర్చి పేర్కొనియుందురు. అందలివివాదములను జర్చించి పరిష్కరించుట యిట లక్ష్యముగాదు గావున సూరి ప్రాకృతలాక్షణికులమతములను సమన్వయించుకొని ప్రాకృతవర్ణములను పేర్కొనియుండును.

కావునఁ బ్రాకృతలాక్షణికోక్తి ననుసరించి సూరి విసర్గను వర్ణమాలలో జేర్చుటలో దురుక్తి లే దని చెప్పవచ్చును.

దీని ననుసరించియె 'శ'కారము వర్ణమాలలోఁ బరిగణింపఁబడకుండుటను గుర్తింపవచ్చును.

'చింతామణి యుద్దేశించినది ప్రాకృతభాషాషట్క మన్నచో (ఆం.భా.ఆ.సంజ్ఞా.౪.సూ.ప్రథమముద్రణ.) మాగధిలోనిజిహ్వామూలీయమును శవర్ణమును జేర్పవలయును. ఆపక్షమునఁ జింతామణి చెప్పినచత్వారింశత్సంఖ్య విరోధించును.' (వ్యా.సం.ప.౪౯)

చత్వారింశత్సంఖ్యనే చిం.కర్త ప్రాకృతలాక్షణికమతానుగుణముగనే గ్రహించి యుండె ననుట లెస్స. అసంయుక్తములైన ఙఞలు లేవనుచు ఙఞలు స్వవర్గీయ సంయుక్తములై కల వని సూచించుచునే ప్రాకృతవైయాకరణులు ఙఞలు ప్రాకృతమున లే వని చెప్పుటలో లేనివిరోధము తన్మతము ననువర్ణించినచిం.మతమున నుండునా? చిన్నయసూరిమతమున నుండునా?' 'శషవర్ణనిషేధస్య సంస్కృతీయ విషయత్వేన 'శ్లోకశ్లావితి మాగధ్యాం శవర్ణస్య విద్యమానత్వేఽపి న విరోధః' (కవిశి.202) అనునహోబలపతిసమర్థనము సముచితముగాఁ దోఁపదు. కాని దీనింబట్టి ప్రాకృతలాక్షణికులను దదనుగుణముగాఁ జిం.కర్తయును ప్రాకృతవర్ణనిర్దేశమున షడ్విధప్రాకృతముల నుద్దేశించియుండి రని మాత్రము చెప్పవలసియున్నది. వజ్ఝల వారును నట్లు కొండొకచో వ్యాఖ్య చేయుటను గమనించియుంటిమి. ఇంకఁ బ్రాకృత లాక్షణికులే ప్రాకృతవర్ణనిర్ణయమున సమగ్రదృష్టి కనఁబఱచలే దన నగు నేమో. 'ఋౠవర్జా హ్రస్వదీర్ఘా' మొదలుగాఁ బ్రాకృతమున సంస్కృతముకంటెఁ బదివర్ణములు తక్కువ యన్న హేమచంద్రుఁడును మహారాష్ట్రీప్రాకృతము నొక్కదానినే యుద్దేశించి పేర్కొనెనా? ప్రాకృతమునకు వర్ణములు నలువది యని పేర్కొన్న ప్రాకృతలాక్షణికులును మహారాష్ట్రీప్రాకృతము నొక్కదానినే యుద్దేశించి యట్లు చెప్పి రన్నను నొకవేళఁ జింతామణియు నట్లు మహారాష్ట్రి నొక్కదానినే యుద్దేశించె ననఁదగు నేమో. కాని ప్రాకృతలాక్షణికులు మహారాష్ట్రి నొక్కదానినిగూర్చియె యట్లు చెప్పి రనఁదగునా? మహారాష్ట్రీతరము లగుప్రాకృతములనుండియుఁ దెలుఁగునఁ దత్సమతద్భవము లేర్పడు నని గుర్తించినపుడు, (కవిశి.559, వ్యాసం.సు.664) 'ద్వితీయప్రకృతి యగుషడ్విధప్రాకృతభాషయు తెల్గునకు మొదటి' (వ్యా.సం.సు.10) నని గుర్తించినపు డిట మహారాష్ట్రీప్రాకృతమొక్కటే యుద్దేశించె ననుట యెట్లు?

ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే యన్నచోటవలెనె ప్రకృతేస్తు తే దశోనా యను సూత్రమునను 'ప్రకృతి' యనియే పేర్కొనఁబడినది. ఒకచోటఁ బ్రకృతిశబ్దమునకు షడ్విధప్రాకృత మని యర్థమై రెండవచోట మహారాష్ట్రీప్రాకృత మొక్కటే యర్థ మగు టెట్లు? తెలుఁగునకు షడ్విధప్రాకృతము మూలము కాఁగా షడ్విధప్రాకృతమునుండి తెలుఁగునఁ దత్సమతద్భవము లేర్పడుచుండఁగా మహారాష్ట్రీప్రాకృత మొక్కదానివర్ణములే పేర్కొనుట సంగతమా?

కాఁగా శకారమును బేర్కొనలే దనుకారణమునుబట్టి యిట మహారాష్ట్రీ ప్రాకృతమునకే వర్ణములు నిర్దేశింపఁబడిన వనుట సరి కాదు. విసర్గ నంగీకరించిన

హేమచంద్రునివచనము ననుసరించియుఁ దదనుగుణముగ నున్నచింతామణ్యాదుల వచనములందుఁ బ్రకృతి యన నెల్లయెడల షడ్విధప్రాకృతమె యని గ్రహించు టుచితము.

ఆదేవిధముగాఁ జిన్నయసూరిమతమునను ‘ప్రాకృతమునకు వర్ణము’ లనఁగా షడ్విధప్రాకృతముల నుద్దేశించియే యని చెప్పఁదగును.

## నకారము :

పయిసంజీవనిపంక్తులలో మహారాష్ట్రియందు నకారము లేదు గావున దానిని వర్ణమాలలోఁ జేర్పఁదగ దనిరి. మఱి యుద్ద్యోతమున ‘మహారాష్ట్రీప్రాకృతమునకు’ అని సూత్రించి ‘న’కారమును వర్ణమాలలోఁ జేర్చుట మిక్కిలివింత. మహారాష్ట్రీప్రాకృతమున సంజీవని రచింపఁబడునాఁటికి లేనినకార ముద్ద్యోతము రచించునాఁటికిఁ బ్రవేశించినదా? వ్యా.సం.స. నాఁటికి విసర్గ దొలఁగింపఁగా ‘శ’కారము వర్ణమాలలో నుండవలయు నని తలఁచిరి గావున ఙఞలు చేర్చుటతో నలువదియొక్క వర్ణము లవును. అందుకై నకారమును దొలఁగించిరి. మఱి యుద్ద్యోతమున ‘శ’కారమును వర్ణమాలలోఁ బరిగణింపరా దని తలఁచిరి గావున విసర్గశకారములు తొలఁగి, ఙఞలు చేరఁగా నకారమున్నఁ బ్రాకృతమునకు వర్ణములు ముప్పదితొమ్మిదే యవును. కావున నకారము మహారాష్ట్రియందుఁ జేరి నలువదిసంఖ్యకు లోటు లేకుండఁజేసిన దన్నమాట. ఙఞలు రెండు చేర్పఁగా విసర్గతోపా టేది తొలఁగింపవలె నన్న శకార మవసర మని భావించునప్పుడు మహారాష్ట్రియందు (శకార మున్నది) నకారము లేదు. శకారము దొలఁగింపఁ దలఁచినప్పటికి (శకారము పోయి యట లకారమె యున్నది.) నకారము వచ్చినది. చత్వారింశత్సంఖ్యాపూరణమె ప్రాధాన్యము వహించిన దన్నమాట.

ప్రాచీనలాక్షణికులమతము ననుసరించి నన్నయయుద్దేశమున నకారము ప్రాకృతవర్ణమాలలో లే దనియు నన్నయకుఁ దరువాతి హేమచంద్రాదులు పదాదిని వికల్పముగా నకార ముండవచ్చు నని చెప్పిరి గావునఁ దర్వాతివాఁ డగుసూరి నకారమును వర్ణమాలలోఁ జేర్చుటొప్పు ననియు నభిప్రాయపడి (వ్యా.సం.స.౪౯) నీ యుద్ద్యోతమునఁ దాము ‘న’కారమును జేర్చి రేమో. కాని యిదే పద్ధతిలో సంస్కృత

వర్ణమాలలో 'ఋ'కారమును దొలఁగించి శకారమును జేర్చు టుచితము గాదా యని సందేహము. ఇంతకును జిం.కర్త నన్నయ యైనపుడే చిం.మతమునఁ బ్రాకృత వర్ణములలో సకారము లేకుండవచ్చును. హేమచంద్రాదులకుఁ దరువాతివాఁడు చిం.కర్త యగు నని గుర్తించిన వజ్ఝలవారును జిం.మతమునఁ బ్రాకృతమున సకారము గల దని యంగీకరింతురు. నన్నయమతమున సకారము తొలఁగఁగాఁ బ్రాకృత వర్ణమాలలోఁ దప్పక శకార ముండవలసివచ్చును. (లేనిచో చత్వారింశత్సంఖ్య పూరింపఁబడు టెట్లు?) అందుకే శాఁటోలు శకారమును దొలఁగించినయుద్ద్యోతము నందు నన్నయమతమునుగూర్చి వీరు ప్రస్తావింపలేదు.

చిం. తా నుద్దేశించినప్రాకృతపువర్ణములను బేర్కొనమింజేసి సూరి కెట్టి చిక్కు గల్గెనో (వ్యా.సం.స.౩౯) గాని వజ్ఝలవారికిఁ జిక్కులు తప్పలేదు.

### ళకారము :

మఱి ప్రాకృతమున ళకారము లేదా? ళకారము విషయమునఁ బై నుద్ద్యోతమున వీరు 'ం' అని చూపి అలఘువు గానఁ బృథగ్గణనము లే దనుట వింత. 'ం' అని వీరు చూపినను (ఇది వీరు చూపినప్రాకృతీయవర్ణమాలలోను నున్నది.) సూరి యిటఁ జూపిన 'ళ'కారమునే యుద్దేశించి రనవలయును. "గురురలో చ బిన్దుయుతో" యనుచిం.కారిక ననుసరించి లవర్ణముపైఁ జుక్కతోఁ జూపిరా? ఏకలు అనురీతిగా నలఘువును ళకారముగా వ్రాయుట నేఁడైనను బ్రసిద్ధ మైయుండఁగా దానిని విడిచి నన్నయనాఁటిలిపి (అదియు నవునో కాదో నిశ్చయింపక [illegible] ప్రక్షిప్త మనఁబడుపైకారికనుబట్టి) గ్రహించి యానాఁటివ్రాఁతను నన్నయకుఁ బూర్వపుఁబద్ధతిలోనికి? నుద్ధరించుట యెంతవఱ కుచితమో యర్థము గాకున్నది. బాలసరస్వతికిఁ బూర్వమె యలఘులకారము ళకారముగా వ్రాయఁబడుచున్న దనుట ప్రసిద్ధమె.

ఏమైనను నలఘులకారము(ళ)ను వర్ణమాలలోఁ బరిగణింపరా దను టుచితమె. సూరి ప్రాకృతీయవర్ణమాలలో 'ళ'కారమును జూపియున్నను నది యలఘులకార మని యెంచె ననుట కాధార మేది? 'వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరము గాని యలఘువు గా' దని సూరి స్పష్టముగాఁ జెప్పియే యుండెనే. ఇది వజ్ఝలవారును గుర్తింపకపోలేదు. 'సంస్కృతమునందువలెనే ప్రాకృతమందును

నలఘులకారమునకు వర్ణమాలలోఁ బృథగ్గణనము లేమింజేసి ప్రాకృతవర్ణసమామ్నాయమున సూరిగా రుదాహరించినళకారము హేళనాదిశబ్దగతళకార మనుట యుక్తము.' (వ్యా.సం.స 515) దీనినిబట్టి సూరి వర్ణమాలలోఁ బరిగణించినళకార మలఘువుగా దది వర్ణాంతరము. హేళనాదిశబ్దగతము. కాఁగా పిట వజ్ఝలవారు 'ళ'కారమును వర్ణమాలనుండి తొలఁగించుటకు 'డలఘువు గాన' నని చెప్పుట యసంగతము. వ్యా.సం.స. నాఁటికిఁ బ్రాకృతమున నలఘువు గానిళకారము గల దని గుర్తించిరి కదా. అది యుద్ద్యోతరచననాఁటి కే మయినది? అదియు నలఘువే యయిపోయినదా? దీనినిబట్టి వారు పైని జెప్పినట్లు చత్వారింశత్సంఖ్యను దాటకుండుటకే వర్ణాంతర'ళ'కారమును దొలఁగింపవలసివచ్చిన దనుటయందు పొసఁగు లేదు.

సంజీవనిలో సంస్కృతమునను వర్ణాంతరళకారము నంగీకరించిరి. ఉద్ద్యోతమున సంస్కృతమునందే ళకారమును దొలఁగించితిమి గదా యని ప్రాకృతమునను దొలఁగించియుందురు. కాని సంస్కృతమున 'ఌ'వర్ణమును జేర్చిరి. ప్రాకృతమున నది లేదు. అంతవఱ కుచితమే. కాని సంజీవనినాఁటికిఁ బ్రాకృతమున నున్నళకార ముద్ద్యోతమునాఁటి కెట్లు నశించినదో కారణము తెల్పరైరి. బాలవ్యాకర్తపై గౌరవము తగ్గుటయే యీమార్పునకుఁ గారణ మగు నేమో.

హారితాళమ్, ప్రవాళః, వవాళో అనుచో సంస్కృతప్రాకృతములందు సూరి ళకారమును బ్రదర్శించియున్నాడు. వర్ణమాలలోఁ బరిగణించినళకారముకంటె నిది భిన్న మని చెప్పుటకు సూరి గ్రంథము ననుసరించి యెట్టియాధారమును లేదు. కాఁగా నిది వర్ణమాలలోఁ జూపినళకారమె. అయ్యది వర్ణాంతరమె. (అలఘుళకారము సంస్కృతప్రాకృతముల నున్నట్లు సూరి చెప్పలేదు గూడ.)

ఉద్ద్యోతమునందు వజ్ఝలవారును బైచోట్ల ళకారమునే చూపియున్నారు. (28) ఇది (వర్ణమాలలో లేని) యలఘువుగా భావించియున్నచో హారితాళమ్, ప్రవాళః, వవాలో అనుచోట వీరు ళకారమునే చూపవలసియున్నది. 'దంత్య మగు నలఘులకారమును మూర్ధన్య మగుళకారముగఁ బల్కుటయు దానిలిపితో వ్రాయుటయు సరి గా' (ఉద్ద్యో.4) వని గదా వీరిసిద్ధాంతము. అందుకే గదా తెలుఁగునను వీరు 'త్రాళ్లు' (ఉ.20) అనురీతివింతరూపములను బ్రదర్శించిరి. ప్రాకృతము నందును లోలః-ముకులో (ఉ.6) యని లకారమునే ప్రదర్శించిరి. సంజీవని నాఁటి

కీసిద్ధాంతము లేకుండుటచే లోళః- ముకుళో (వ్యా.సం.స.28) యని 'ళ'కారమునే చూపిరి.



'మహారాష్ట్రిప్రాకృతమున నలఘులకారము కోమళో ముకుళో మున్నగు రీతిని గలదు. సంస్కృతవర్ణమాలలోని ళకారమునకుఁ బ్రాకృతమున స్థితి లే దని ప్రాకృతవ్యాకరణములలో నెందును లేదు.' (వ్యా.సం.స.36) అన్నవీ రుద్ద్యోతమున 'లోళః- పైశాచ్యాం లో లకారస్స్యాత్ ముకులో. మహారాష్ట్రిలో నది లకారమె.' (ఉ.6)యనిరి. ఇవి పరస్పరము విరుద్ధముగా నున్న వనకతీఱదు. 'ముకులో యను రీతిని లకారమె మహారాష్ట్రియం దుండు నని యిటఁ జెప్పిరి. అది యలఘు వని యటఁ జెప్పిరి. మహారాష్ట్రియందు లకారమే కాని ముకుళో యనురీతి నలఘువు లే దనుచున్నవీ రింతకు ముం దీయుద్ద్యోతముననే 'లకారము గలదు గాని యలఘువు గానఁ బృథగ్గణనము లే' (6)దనిరి. ఇఁక లిపివిగూర్చి 'ముకులో' అని యలఘు లకారము గల దనియు నది ముకుళో యనురీతిగా ళకారముగా వ్రాయఁబడ దనియుఁ జెప్పుటయే యుద్దేశించిన నాయంశమును స్పష్టము చేయవలెఁ గాక 'మహారాష్ట్రి'లో నది లకారమె' యన్న నెట్లు?

ఇంతకును హేళనాదులందు హేలనో యని వ్రాసి యలఘువుగా నుచ్చరింప వలయునా యుద్ద్యోతము వెలువడినపిదప. (సంజీవనినాఁటికిమాత్రము హేళనో యని మూర్ధన్యముగనె యుచ్చరింపవచ్చు.)

మొత్తముమీఁదఁ గొంతవఱ కేని సముచితముగా నున్న సంజీవని ననుసరించి ప్రాకృతముననుళకారమును వర్ణమాలలోఁ బరిగణింపవలసినదే యని గ్రహింప వచ్చును.

ఇఁక సూరిమతమునం దన్నచో సంస్కృతప్రాకృతములం దలఘులకార ప్రసక్తి లేదు. హారితాళమ్, పవాళో, మొదలుగా సంస్కృతప్రాకృతములందలి ళకార మొక్కటె. అయ్యది వర్ణాంతరమె. వర్ణమాలలోఁ జూపఁబడినళకారమె యది. సంస్కృతప్రాకృతములలో నలఘులకారము లేదు. ఈయభిప్రాయమె సమంజసము. బాలవ్యాకర్తకంటెఁ దరువాతివా రయిన వీరు ప్రయోజనహీన మగుటయే కాక సరియైనప్రమాణముగూడ లేకుండ సంస్కృతప్రాకృతములం దలఘులకారమును బ్రస్తావించుటయు వర్ణాంతర మగుళకారమును వర్ణమాలలోఁ జేర్పకుండుటయు నసంగతములే.

మొత్తముపై సూరి ప్రాకృతవర్ణమాలలో 'శ'కారమును జేర్చుట సమంజస మని నిశ్చయింపఁదగును.

## వక్రములు-వక్రతమములు :

'కొందఱమతమున హ్రస్వవక్రములును, గొందఱమతమున వక్రతమములును బ్రాకృతమందుఁ గల వని సూరి చేసినవివరణమును పై రీతిఁ దొలఁగించిరి. వక్ర వక్రతమములనుగూర్చి మాత్రము వివరించిరి. కాని సూరివచనములు దురుక్తులు గావు. ఆంధ్రభాషానుశాసనము ఐఔలు ప్రాకృతమున లే వనుటను విమర్శించుచు వీరు 'ఐదౌతౌ చ- కేషాంచిన్మతే భవత ఏవ. కైతవం- కైఅవం. సౌందర్యం- సౌఅరిఅం' (వ్యా.సం.ప.౩౬) అని చండవ్యాకరణానుగుణముగాఁ బ్రాకృతమున ఐఔలు కొందఱమతమున నుంటను నిరూపించిరి. హ్రస్వవక్రములు గల వని త్రివిక్రమ మతానుసారముగా నాంధ్రభాషానుశాసనము నిరూపించినది. (ఆం.భా.అ.౯.పుట) ప్రాకృతమణిదీపకర్త 'అత్ర శాస్త్రే సూత్రానుశిష్టో ఽపి కావ్యేభియుక్తవ్యవహారస్థో హ్రస్వఏఓ సాధురితి సిద్ధ్యతి. తేన నీడం నేడ్డం' (తె.ప్ర.౧) అని ప్రాకృతమున ఎ,ఒ,లయునికిఁ జేకొనెను.

ఇట్లు హ్రస్వవక్రవక్రతమములు గేచిన్మతముగాఁ బ్రాకృతమునం దుండుట యథార్థమే. అయిన నట్టిసూరివచనము లేల తొలఁగించిరో యర్థము గాదు. వర్ణమాలలో వీరును బరిగణింపలేదు గదా. నలువది సంఖ్యనుగూర్చి వర్ణమాలలోఁ బరిగణింప కున్న వివరింపవలసినది. కాకున్నఁ బ్రాకృతవర్ణసంఖ్యను బెంచి సూత్రించినను బాలవ్యాకరణోద్యోతమునఁ దప్పు లేదు.

ఇఁక నీసంజ్ఞలనుగూర్చి వీరు 'ఇట్టిసంజ్ఞలు దీనియాకృతినిబట్టి కల్గియుండు' (ఉ.౯)ననిరి. అట్లని నిశ్చయింపకుండుట బాగే. కాని యితరములలో వీనియంతటి వక్రత గలవర్ణములు లేవా? ఘ, ఝ, మొద లగునవి యింతకంటె వక్రత యధిక ముగనే గల వనక తప్పదే. మఱి వీనినే వక్రవక్రతమము లన నేల?

శబ్దశాస్త్రమున వీనిసంజ్ఞ లాకృతినిబట్టి గాక ధ్వని యనఁగా నుచ్చారణమును బట్టియే యేర్పఱుపఁబడియుండు ననుట యుచితము గావచ్చును. సంజ్ఞలవిషయమున నిట్లర్థసమన్వయ మావశ్యకము గా దనుటయు నుచిత మగుమార్గమే. కాఁగా నాయాసంజ్ఞలయర్థమునుగూర్చి సూరివివరింపకుండు టుచితమె యనఁదగును.

## 'తెనుఁగువర్ణములు' :

'తెనుఁగునకు వర్ణములు ముప్పదియా'అని సూరి చెప్పఁగా వీరు 'అచ్చతెనుఁగునకు వర్ణములు ముప్పదియే' యని సవరించిరి. మొదటిమార్పునుగూర్చి 'తత్సమములు తెనుఁగే గాన అచ్చతెనుఁగున కవి సూత్రింపఁబడె' (ఉ.7)నని వివరించిరి. దీనివలన సూరి 'తెనుఁ' గనుటవలనఁ దత్సమములు సయితము గ్రహింపఁబడి యర్థము గలుగు నని వీరియభిప్రాయ మగుచున్నది. 'షట్త్రింశదత్ర' యనుచోఁ జింతామణియందువీ రచ్చతెనుఁగున కని యర్థము చేసిరి.(వ్యా.సం.స.37) ఆపద్ధతిలో నిట సూరిసూత్రమునఁ దెనుఁ గనఁగా నచ్చతెనుఁ గని యర్థము చేయవచ్చును. ఇంకను 'ఋఋూఌౡ' మొద లగుతరువాతిసూత్రమునుబట్టియు, సంస్కృతప్రాకృతములనుగూర్చి ప్రస్తావించినపూర్వసూత్రములనుబట్టియు ని ట్లర్థము చేయుట కవకాశము గల దనవచ్చును.

కాని యిచ్చట తెనుఁ గనుదాని కచ్చతెనుఁ గని యర్థము చేయఁ గూడ దేమో యని సందేహము. 'తెనుఁ' గనఁగా వజ్ఝలవారు చెప్పినట్లే సంస్కృతసమ (తత్సమ మనఁగాఁ బ్రాకృతసమమును. ప్రాకృతసమ మచ్చతెనుఁగే. కావునఁ దత్సమ మనక, "సంస్కృతసమములు సైతము తెనుఁగే గాన అచ్చతెనుఁగున" కని సూత్రింపఁబడినట్లు పేర్కొన్నఁ జక్కఁగా నుండెడి దనఁదగు.) సహిత మగు నాంధ్రభాష యర్థము. 'సంస్కృత సమంబులం గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు' ననుతరువాతి లక్షణమునుబట్టియు సంస్కృతసమములు తెలుఁగే యగు నని స్పష్టము. 'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దములయం' దనుసూత్ర మీ యర్థమును నిశ్చయపఱచుచున్నది. అట్టియెడలఁ దెనుఁగునకు వర్ణము లేఁబది యై... చెప్పక ముప్పదియా అని యెట్లు చెప్పె నని సందేహము గల్గక తీఱదు. ఋప్రభృతులగు 19వర్ణములు సంస్కృతసమములమూలముననే తెలుఁగునఁ బ్రవేశించుటచేతను నం దే దే నొక్కవర్ణ మున్న నయ్యది సంస్కృతసమ మని గుర్తించుటకు వీలుగా నిట ముప్పదియా అని సూత్రించియుండును. అపు డాపందొమ్మిదిటికంటె వేఱగు ముప్పదియొక్కవర్ణములను సంస్కృతసమములలో నున్నప్పటికిని వాని గ్రహించుటకు వీలుగా (తేఽన్యే హ్యనుప్రవిశన్తి అనుచిం.లక్షణమున 'చ'శబ్దమువలె బాల.(4.సూ)లోఁ జార్థకశబ్దము ప్రయుక్తము గాకున్నను (వీరు నుద్ధృతమునఁ జేర్పలేదు, వివరింపలేదు.)నావర్ణములు తెలుఁగున సంస్కృతసమములలో నుండుటొప్పుచున్నది. కాఁగా నా31వర్ణములను గల- ఆసుర, రాత్రి మొదలగు సంస్కృత

సమశబ్దములందలి వర్ణములనుగూర్చి చెప్పులక్షణ మేది? ముప్పదియా అన్నయీ సూత్రమే. అనఁగా నీసూత్రమందలి తెనుఁగుశబ్దము సంస్కృతసమరహిత మయిన దానినే బోధించుచున్న దని స్పష్టమే కదా.

ఇట వజ్ఝలవా 'రచ్చతెనుఁగున' కని సూత్రించిరి. అచ్చతెనుఁ గనుటచేఁ దత్సమము (సంస్కృతసమము) గ్రహింపఁబడ దని ప్రయోజనము గూడఁ జూపిరి. 'ఋౠఌౡ' మొద లగు 19 సంస్కృతసమము(ఆదుల)లను గూడి తెలుఁగునఁ జేరునని పిదపఁ జెప్పిరి. కాఁగా సంస్కృతమున మిగిలియున్న 31 వర్ణములతోఁ గూడినసంస్కృతసమములను గూర్చినప్రసక్తి యెక్కడ? అవి యచ్చతెనుఁగువర్ణములే కావచ్చును. కాని యచ్చతెనుఁగువర్ణములు వేఱుగ నిరూపించి సంస్కృతసమాదులవలనఁ జేరువానిని వేఱుగా నిరూపింపఁగా 'రాత్రి' మొద లగు సంస్కృతసమములలోని తెలుఁగువర్ణములనుగూర్చి యుద్ద్యోతమున నేలక్షణమును జేర్కొనుటయే లే దనక తప్పదు గదా!

పై 31 వర్ణములే గాదు, అఆఉఊఒఓఔలతోఁ గూడి తాలవ్యము లైనచజలును దెలుఁగున సంస్కృతసమములందే కలవు. చంద్రుఁడు, చౌర్య మిత్యాదిగా నున్నతాలవ్యచకారమును వీరిలక్షణములలో నేయది సంగ్రహించును? అచ్చతెనుఁగున కని చెప్పినచోటఁ దాలవ్యచకారము గలదు కాని ఇఈఎఏలతోఁ గూడినపుడు మాత్రమె గదా యది తాలవ్య మగునది?

అచ్చ(ము) అనువిశేషణమును జేర్చుటవలననే వజ్ఝలవారిలక్షణమున విబ్బందులు గల్గిన వనుట స్పష్టమే. కాఁగా 'తెనుఁగునకు' ననుసూరిలక్షణమె సూత్ర మనియు, సంస్కృతసమరహిత మగునాంధ్రము బోధింపఁబడుటయే సముచితము నవసర మనియు గ్రహింపఁదగును.

తెనుఁగునకు సహజముగా నున్నవర్ణములు ముప్పదియాఱే. అనఁగా సంస్కృతప్రాకృతములతో సంబంధము లేని, యనఁగా దేశ్యాంధ్రమునకు వర్ణములు ముప్పదియాఱే. ఇవియే ప్రాకృతసమతద్భవములయందును నిల్చుచున్నవి. సంస్కృతసమములందును సంస్కృతానుగుణముగా నీయవి నిల్చుచున్నవి.

సంస్కృతసమములనుండి తెలుఁగునఁ గ్రొత్తగాఁ బ్రవేశించువానిని దరువాతి సూత్రము పేర్కొన్నది.

1) ఋౠ మొదలగువర్ణములు గలశబ్దము సంస్కృతసమ మని గుర్తింప వచ్చును.

2) ఈ19వర్ణములలోఁ గొన్ని ప్రాకృతమునను గలవు. అయినను నవి ప్రాకృతసమములం దుండవు. సంస్కృతసమములయందే యుండును. (ఇంకను బ్రాకృతమందలితాలవ్యచజలు ప్రాకృతసమములలో దంత్యము లౌటయు విశేషము.)

3) ఈ19వర్ణాలు సహజ మగునాంధ్రభాషలో లేవు. ఏభాషకైనను సహజ స్వరూపము దేశ్యరూపమె యనుట నిర్వివాదము. ఆదేశ్యములందు 36వర్ణములే యుండును. మిగిలినవి సంస్కృతసమములవలనఁ జేరు ననుటచేఁ బ్రాకృతసమతద్భవములం దా19వర్ణములు తెనుఁగునందలి 36వర్ణములలోనివిగాఁ బరిణమించును.

మొదలగుప్రయోజనవంత మగువర్ణములు సాధించుచు సూరి తెనుఁగునకు వర్ణము లేఁబది యైదని 'అక్షరము లెల్ల నేఁబదే నబ్జనాభ' యని పద్య.(7)లోపలెఁ దేల్చివేయక వేఱు చేసి చెప్పు టర్థవంతముగా నున్న దని నిస్సంశయముగాఁ జెప్పనగును.

ఇంక సూరి వర్ణములు ముప్పదియా అనఁగా వీరు ముప్పది యే డనిరి. 'షట్త్రింశదత్ర' యని బాలసరస్వతీయచింతామణి పేర్కొనఁగా 'సప్తత్రింశదిహ' యని యప్పకవీయచింతామణి చెప్పినది. దానిని వీ రనుసరించిరా.?

ఆముప్పదియేడవవర్ణము శకటరేఫము. 'ఆకాడమీ'ప్రతిలో ఉద్ద్యోతమున శకటరేఫమె యున్నది. కాని పూర్వముద్రణమున నొకచో 'ఱ'వర్ణ మున్నది. ఇం దేది గ్రహింపవలె?

పిదప వా రిట్లు పేర్కొనిరి. 'ఱకారము నన్నయనాఁటికె తెల్గున నశించినది.... కాననె దానిని నన్నయ యాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలేదు. (సంస్కృత వర్ణమాలలోఁ బరిగణించె నని యుద్ద్యోతమున వీరినిర్ణయము.) నన్నయకుఁ బూర్వపుయుద్ధమల్లుని బెజవాడశాసనమున నది లిఖింపఁబడియున్నది. (అఱసిన-ఱస్సిన) ఇట్టియలవాటుననె నన్నయకుఁ దర్వాతివౌందుర్రగ్రామశాసనమందును (ఖఱ్గ-ఖడ్గ) నది లిఖింపఁబడెను. తమిళమందు నేఁటికి నట్టివర్ణముచ్చారణమునఁ గలదు. కాని దాని నచ్చతెల్గున విస్మృతివి.' (ఉ.8) నన్నయమతమునకు భిన్నముగాఁ బేర్కొనఁ బూనుట యిం దొకవిశేషమె. దీనినిబట్టి వీరు 'ఱ'వర్ణమును ముప్పది యేడవదిగాఁ జేర్చిరన్నమాట. ఱవర్ణమునకు శకటరేఫమునకు నడిమియడ్డగీత

లేకుండుటయు నుండుటయు నొకటే భేదము. అట ముద్రణమున శకటరేఫ మున్న చోటుల నెల్ల నచ్చుపొరపాటని గ్రహింతము.

దీనిని దెల్గునఁ బరిగణింపవలెనా? నన్నయకుఁ బూర్వపుశాసనమున నున్నది. అయినను నశించిన దని నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ జేర్పవలేదు. నన్నయకుఁ దర్వాతిశాసనమున నలవాటుచొప్పునఁ జేరినది. దానిని నిన్నమొన్నటివీరు వర్ణమాలలోఁ జేర్చిరి. నన్నయకుఁ దర్వాత దీనివాడుక విస్తరించినదా? అయిన నొకవిశేషము. నన్నయకుఁ బూర్వపుశాసనముల నచ్చాంధ్రశబ్దములలోఁ జూపి నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలే దనిరి. నన్నయకుఁ దర్వాతిశాసనమున (ఖఴ్గ) సంస్కృతసమశబ్దములోఁ జూపి వీ రచ్చాంధ్రవర్ణమాలలో దానిని జేర్చిరి. అధమపక్షము నన్నయకుఁ దర్వాతిశాసనమున నచ్చాంధ్రశబ్దమునం దున్నట్లు చూపినఁ గొంత తేని బాగుండెడి దేమో. నన్నయ నశించిన దని తొలఁగించిన (ట్లు వీరే చెప్పుచురు? వర్ణమును బునరుద్ధరించుటకుఁ బ్రబల మైనప్రమాణము చూపరు. శాసనములం దాతఁ శబ్దశాసనముల కేకైకప్రమాణముగాఁ జెప్పఁగలరా?

తమిళమునం దిది నేఁటికి నుచ్చారణమునఁ గలదు గావున నచ్చతెనుఁగువర్ణమాలలోఁ జేర్చితి మనుట కేవల మసంగతము. తమిళమునం దుచ్చరింపఁబడు టేమి? దానిని దెలుఁగువర్ణమాలలో నిలుపు టేమి? తెలుఁగునం దావర్ణ మున్నదా? లేదు. నన్నయనాఁటికి నశించినది. పోనీ! ఉచ్చారణ మున్నదా? అదియు లేదు. నన్నయనాఁటికె దాని కలఘురేఫోచ్చారణము కల్గెను. దానికే కాక లకారమునకు నలఘూచ్చారణము సంభవించెను.(ఉ.8) మఱి యట్టియెడల నుచ్చారణమునందును లిపియందును నిల్చియున్న యలఘురేఫను బరిగణించు టేని గొంత యుచితముగా నుండును గాని ఴవర్ణమును దెచ్చిపెట్టు టేల? దానికిఁ గవిప్రయోగప్రామాణ్య మున్నదా? ప్రసిద్ధ మని యుపేక్షించుట గాక యుదాహరణములు చూపఁదలఁచిన 'ఴ'వర్ణము గలపద మేది చూపఁగలరు?

కాఁగా వీ రిట వర్ణమాలలో 'ఴ'వర్ణమును బరిగణించుట యసంగత మని తేలినది. అందువలనఁ దెలుఁగునకు వర్ణములు ముప్పదియే యనుట సరి గా దనియు ముప్పదియా ఱనుటయె సమంజస మనియు స్పష్టము. 'లఘుయవలతో పాటుగ అలఘు అళలకు వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయలేదు'. (ఉ.8) కావున శకటరేఫమును

లేకుండుటయు నుండుటయు నొకటే భేదము. అట ముద్రణమున శకటరేఫ మున్న యెడల నెల్ల నచ్చుపొరపా టని గ్రహింతము.

దీనిని దెల్గునఁ బరిగణింపవలెనా? నన్నయకుఁ బూర్వపుశాసనమున నున్నది. అయినను నశించిన దని నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బేర్కొనలేదు. నన్నయకుఁ దర్వాతిశాసనమున నలవాటుదొప్పునఁ జేరినది. దానిని నిన్నమొన్నటివారు వర్ణమాలలోఁ జేర్చిరి. నన్నయకుఁ దర్వాత దీనివాడుక విస్తరించినదా? అయిన నొకవిశేషము. నన్నయకుఁ బూర్వపుశాసనముల నచ్చాంధ్రశబ్దములలోఁ జూపి నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలే దనిరి. నన్నయకుఁ దర్వాతిశాసనమున (ఖడ్గ) సంస్కృతసమశబ్దములోఁ జూపి వీ రచ్చాంధ్రవర్ణమాలలో దానిని జేర్చిరి. అథమపక్షము నన్నయకుఁ దర్వాతిశాసనమున నచ్చాంధ్రశబ్దమునం దున్నట్లు చూపినఁ గొంత లేని బాగుండెడి దేమో. నన్నయ నశించిన దని తొలఁగించిన ట్లు వీరే చెప్పుదురు? వర్ణమును బునరుద్ధరించుటకుఁ బ్రబలమైనప్రమాణము చూపరు. శాసనపువ్రాఁత శబ్దశాసనముల కేకైకప్రమాణముగాఁ జెప్పఁగలరా?

తమిళమునం దిది నేఁటికి నుచ్చారణమునఁ గలదు గావున నచ్చతెనుఁగువర్ణమాలలోఁ జేర్చుట యనుట కేవల మసంగతము. తమిళమునం దుచ్చరింపఁబడు టేమి? దానిని దెలుఁగువర్ణమాలలో నిలుపు టేమి? తెలుఁగునం దావర్ణ మున్నదా? లేదు. నన్నయనాఁటికే నశించినది. పోనీ! ఉచ్చారణ మున్నదా? అదియు లేదు. నన్నయనాఁటికె దాని కలఘురేఫోచ్చారణము కల్గెను. దానికే కాక లకారమునకు నలఘూచ్చారణము సంభవించెను.(ఉ.8) మఱి యట్టియెడల నుచ్చారణమునందును లిపియందును నిల్చియున్నయలఘురేఫను బరిగణించు టేని గొంత యుచితముగా నుండును గాని ఴవర్ణమును దెచ్చిపెట్టు టేల? దానికిఁ గవిప్రయోగప్రామాణ్య మున్నదా? ప్రసిద్ధ మని యుపేక్షించుట గాక యుదాహరణములు చూపఁదలఁచిన 'ఴ'వర్ణము గలపద మేది చూపఁగలరు?

కాఁగా వీ రిట వర్ణమాలలో 'ఴ'వర్ణమును బరిగణించుట యసంగత మని తేలినది. అందువలనఁ దెలుఁగునకు వర్ణములు ముప్పదియే యనుట సరి గా దనియు ముప్పదియా ఱనుటయె సమంజస మనియు స్పష్టము. 'లఘుయవలతోపాటుగ అలఘు ఱళలకు వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయలేదు'. (ఉ.8) కావున శకటరేఫమును

వీరు ముప్పదియేడవదిగా నెంచి రనుటకు వీలు లేదు. అట్లయిన నది యింకను మిక్కిలి యసంగతము. లఘుయవలు అలఘులకారము తెలుఁగుననే కాక సంస్కృత ప్రాకృతములలోను జేర్పవలసివచ్చును.

ఇంక నిట విశేష మింకొకటి. "ఎఒఁచజఝ (ముద్రితప్రతులందలి శకటరేఫ మిచ్చుపొరపాటు) అనునవి (ఱ)ను? తెల్గున మాత్ర ముండును. (సూ.7) అనఁగా సంస్కృతప్రాకృతములందు లేక యివి తెలుఁగున మాత్ర ముండు నన్నమాట. కాని యిందు 'ఝ' వర్ణమును వీరు సంస్కృతమందుఁ జూపిరే. అది సంస్కృతమునం దుండఁగాఁ దెల్గునమాత్రమె యుండు ననుట యసంగతము గదా. శకటరేఫము వర్ణమాలలోనే పరిగణింపలేదు గనుక నిట ఝవర్ణము గాక శకటరేఫము (ముద్రితప్రతులనుబట్టి) గల దని తలఁపరాదు. శకటరేఫమును జూపుట మిక్కిలి యనర్థక మని పైని స్పష్ట మగు.

అచ్చతెనుఁగువర్ణమాలలో వజ్ఝలవారు 'ళ'కారమును జూపిరి. సంజీవని యందు సంస్కృతప్రాకృతములలోను ళకారమును జూపిరి గాని యుద్ద్యోతమున (ఌకారమును జేర్చి) ళకారమును దొలఁగించిరి. కాఁగా ళకారము (సంస్కృత ప్రాకృతములలో లేక) తెలుఁగున మాత్రమె యున్న దన్నమాట. తెలుఁగున మాత్రమె యున్న దని చెప్పినవానియందు వీరు ళకారమును జూపలేదు. అప్పుడు మొత్త మేడు గావలయును.

ఇంక నిట వీరు 'ళ'వర్ణమునే తెల్గున మాత్ర మున్న అలువర్ణములలోఁ జూపఁదలఁచి రనియు ఌవర్ణ ముండుటయే యచ్చుపొరపా టనియుఁ జెప్పవలె నేమో.

అదే వరుసలో నింక నొక్కటి యచ్చుపొరపా టనుకొనవలె. పైని వీరు 'లఘుయవలతోపాటుగ నలఘుళకారమును వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయరే' (సూ.8) దనుచో అలఘు రేఫను శకటరేఫగా నిచ్చుచు నలఘులకారమును ళకారముగాఁ జూపిరి. కాని యంతకు ముందు 'దంత్య మగునలఘులకారమును మూర్ధన్య మగు ళకారముగఁ దల్చుటయు దానిలిపితో వ్రాయుటయు సరి కా' (సూ.4) ననిరి. అందుకే క్రొల్లు ఇత్యాదిగా నలఘుళకారస్థలమున లకారమును వ్రాసి పలికింతురు. ఎంత మొత్తుకున్న నట్లు పలుకుట గాని వ్రాయుట గాని యసంభవ మని తెలిసియో తామె యాప్రమాదమునకు లోనయియో యిట నలఘులకారమును 'ళ'కారముగాఁ జూపి

రందుమా? అది యిప్పుడారసా టనియు 'అలఘుఱల' అని లకారమునే వారు వ్రాసి యుందు రనుకొందమా? అలఘురేఫమును మాత్రము రేఫముపై బిందువుతోనో మఱి యెట్లో కాక నేఁటివలె శకటరేఫముగనే చూపుటనుబట్టి లకారమును గూడ శకా రముగనే చూపి రందుమా?

ఇంకఁ బైని చెల్లిన మాత్ర మున్నవర్ణములలో వీరు హ్రస్వవక్రము(ఎ,ఒ) లను గూడఁ జూపిరి. హ్రస్వవక్రములు సంస్కృతమున లేవు గాని కేచిన్మతముగాఁ బ్రాకృతమునఁ గలవు. అట్టియెడల నివి తెలుఁగున మాత్రమె యున్న వనుట యెంత వఱకు సరిపడును? హ్రస్వవక్రములు ప్రాకృతమునఁ గొందఱమతమునఁ గల వను సూరివివరణమును వీ రుద్ద్యోతమునఁ దొలఁగించుటచేఁ బ్రాకృతమునఁ గూడ ఎ,ఒలు లే వని వీరిసిద్ధాంతమా? ఆసూరివివరణమును దొలఁగించుట సరి గా దని యట గుర్తించియున్నారము గదా. మొత్తము మీఁదఁ దెలుఁగున మాత్రమె యున్న వర్ణములనుగూర్చి చెప్పఁదలఁచినపుడు ప్రాకృతమునఁ గల 'ఎ,ఒ'ల నిందుఁ జేర్ప కుండుటయె యుచిత మని చెప్పవలెను.

### ఱ ళ లు :

వర్ణమాలలో ఱళలచేరికనుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. నేఁటిలక్షణ గ్రంథమున నెట్లు చెప్పవలయును?

యరలవలు నాల్గును లఘ్వలఘుభేదము గల్గియున్నవి. ఈభేద ముచ్చారణ మునఁ గొద్దిగనో గొప్పగనో కల దనియె చెప్పవచ్చు. ఇందు యవలకంటె రలల విషయమున భేదము గలదు. లఘ్వలఘుయవలకు లిపియందు భేదము లేదు. రలలు లఘ్వలఘువులు భిన్నముగా వ్రాయఁబడుట మొదటినుండియుఁ గలదు. వర్ణిలవారు నన్నయకృతములుగాఁ జెప్పిన 'బాలేన్దుపరిధి' మున్నగులక్షణమున 'దన్త్యచజౌ గురు రలౌ చ బిన్దుయుతౌ' యనుచో దంత్యచజలకువలెనె యలఘురలలకును లిపియందు భేదము పేర్కొనఁబడినది. లఘువు లగురలలకు పైని బిందువు (చుక్క) నుంచిన నవి యలఘురల లగును. అయినను దంత్యచజలవలె నలఘురలలకుఁ బృథక్పరిగణ నము జరుగలేదు. అలఘువులకు లిపియందు భేదమును పేర్కొనుటనుబట్టియే యట్లు భేదమును లిపియందుఁ గూడ గుర్తింపవలసినయవసరము గల్గుటనుబట్టియె యవి ప్రత్యేకముగాఁ బరిగణింపఁదగిన వని చెప్పవచ్చును. (అప్పకవ్యాదు లట్లు పరిగ ణించియున్నారు.)

ఇంక వర్ణమాలలో 'యరలవళ'లు కలవు. ఇందు యవలు అలఘువు లగుట స్పష్టము. 'లఘుయం ప్రవదత్తి' మున్నగు విశేషవిధులు వర్ణమాలయందలి యవ అలఘువు లని నిరూపించుచున్నవి. వజ్ఝలవారు నిట 'లఘుయవలతో పాటు అలఘు ళలను జేర్పలే' దనుటలో వర్ణమాలలోని యవ అలఘువులే యని స్పష్టము చేసిరి. ఇవియె కొన్నియెడల నుచ్చారణమునందు లఘుత్వమును బొంది లఘువు లవుచున్నవి. ఇట్టివీనియందలి లఘ్వలఘుభేదము సంస్కృతలక్షణసిద్ధ మయి యున్నది. తద్భిన్నముగాఁ జెప్పఁబడుట 'రల'లవిషయమందే. వీనిలఘ్వలఘుభేదము సంస్కృత(ప్రాకృత)లక్షణసిద్ధము గాదు. తెనుఁగున మాత్రమే కల దనవలయును. ఇంక వర్ణమాలలోఁ బరిగణింపఁబడినరలలు లఘువులే. (అలఘువులు ఱ-ళలు గదా.) లఘ్వలఘుభేదము గల్గిన-'యరలవ' యనువానిలో యవ లలఘువులు వర్ణమాలయం దుండఁగా రలలు లఘువులే యేల యున్నవి? (చూ.బా.వి.వి.49) రేఫమె యలఘూచ్చారణముచే శకటరేఫ మయిన దనుట యెంతవఱకు సక్రమము? లఘురేఫఘటితశబ్దములు నలఘురేఫఘటితశబ్దములును బృథక్ప్రసిద్ధము లై యున్నవి. (ర-ఱ యతిప్రాసవైర మొండు విశేషము.)

కాఁగా శకటరేఫమును లిప్యాదిభేదముల ననుసరించియుఁ బృథగ్వర్ణములుగాఁ జెప్పుటయె యుచిత మేమో.

'ప్రాచీనతమకాలమున ఱకారము టతమధ్యస్థోచ్చారణము గల్గియుండెడిది. కావున కుఱు+ఉసురు కుట్టుసురు మున్నగునెడల టకారస్థితి సంభవించెను. కాని నన్నయనాఁటికి దాని కలఘురేఫోచ్చారణము కల్గెను'. (ఉ.8) కావున ఱకారమును నన్నయ వర్ణమాలలోఁ బరిగణింపలే దని వజ్ఝలవారు పేర్కొనిరి.

టతమధ్యస్థోచ్చారణము గలదిగా వీరు శకటరేఫమునే చూపి రని గుర్తింపవచ్చును. దానికే యలఘురేఫోచ్చారణము పిదపఁ గల్గిన దని చెప్పిరి గదా. నన్నయనాఁటికి ఱకార (శకటరేఫ)మునకు టతమధ్యస్థోచ్చారణము లేదు గావున దానిని వర్ణమాలలోఁ జేర్పలే దన్నమాట. (దీనివలన టతమధ్యస్థోచ్చారణము గలఱకార మొక్కటియు, నలఘురేఫోచ్చారణము గలఱకార మొక్కటియు రెండువర్ణములు లేవు. ఉచ్చారణమే మాఱినది.) దీనివలన శకటరేఫముమొక్క యుత్పత్తిప్రకారమునుబట్టియు నయ్యది పృథగ్వర్ణముగాఁ జెప్పఁదగిన దనవచ్చును. (అయిన దానికి భిన్నమైనయుచ్చారణము లేకుండఁగా గ్రహించు టెట్లనవచ్చును. ఇంకాను స్వరమువలెనె యిదియుఁ బరిగణింపఁదగును.)

ఇంక ళకారము. లఘువు లకారము. అలఘు వైనళకార మొక్కటియు, వర్ణాంతర మగుళకార మొక్కటియుఁ దెలుఁగున రెండు గల వని సూరిప్రభృతుల మతము. కాని తళుకు, వెళుకు మొద లగువానిలోనివర్ణాంతర మగుళకారమునకును, పాళలు, త్రాళలు మొద లగువానిలోనియలఘులకారమునకును నుచ్చారణమున భేద మేమి? సూరి 'వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరము గాని యలఘులకారము గా' దని వివరింపవలసివచ్చుటనుబట్టియే వర్ణాంతరళకారాలఘులకారముల యుచ్చారణ మేక మైయుండుట గ్రహింపవచ్చును.

బా.స. అలఘువునకు 'నీళ్లు' ఉదాహరించెను. కాని యలఘులకారమును గూర్చి సూరివలెఁ జేర్కొనకుండుటనుబట్టి యెల్ల యెడల ళకారము నలఘువుగనె భావించె ననవచ్చును. అప్పకవి 'క్షితిని మూఁడవసరళంబు యతులఁ బ్రాసములను లఘ్వలఘులకారములకు నిలుచు' (అప్ప.3.93) నని ళకార మెల్ల యెడల నలఘు వని స్పష్టముగాఁ బేర్కొనెను. దీని ననుసరించి యహోబలుఁడును 'తళుకుంజూపులు. తళుకుంజెక్కులు పొలఁతి. చెలువ ఇత్యాదౌ లస్య ద్వైవిధ్యమ్' (కవిశి.219) అని స్పష్టము చేసెను. ళకార మలఘు వని సామాన్యముగా నిర్ణయించినవా రగుటం జేసియే 'లోళః' అనుప్రాకృతస్థలమునను ళకార మలఘు వనియే (అప్ప.2.176) వీరు తలఁచిరి. ఈపద్ధతిలో వీరు సంస్కృతమునఁ జూపినళకారము నలఘువుగనె చెప్పవలయును. కాని యట్లు స్పష్టముగాఁ జెప్పినట్లు గానరాదు.

యవరలు ద్వివిధములును, వర్ణమాలయందుఁ బరిగణింపకుండఁగా ళలు మాత్రమె పరిగణింపఁబడుట సరి గా దనియుఁ జిం. యరవలతో లకారమునకును ద్వైవిధ్యమును జెప్పి ళకారమును వర్ణమాలలోఁ బరిగణించుటనుబట్టియు సూరిప్రభృతులు అలఘు'ళ'కారమును, వర్ణాంతరళకారము నని భేదము గల్పించి రేమో యని పించును. కాని యీభేద మొకకాలమున నున్న దని యంగీకరించినను వర్ణాంతరళకారాలఘులకారము లభిన్నము లగుట కొన్నివందల యేండ్లకుఁ బూర్వమె జరిగిన దనవలయును. కాని వీనికి భేదమేకాలమున నేని యున్న దని నిశ్చయించి చెప్పుటకుఁ దగినప్రమాణము వెదుక వలసినదే.

ఒకవేళ వజ్ఝలవారు చూపినట్లు 'ఏళ్లు, పాళ్లు, త్రాళ్లు' అనురీతిగా నలఘువు లకారముగనె ప్రాచీనతమకాలమున నుండెడి దనియే యంగీకరింతము. కాని యప్ప

కవికిఁగూడఁ జాలకాలము ముందే యలఘులకారము 'ళ'కార మైనట్లు వారివ్రాఁత లనుబట్టి స్పష్టమె కదా. అట్టియెడల వీరు 'దంత్య మగునలఘులకారమును మూర్ధన్య మగుళకారముగఁ బల్కుటయు దాని లిపితో వ్రాయుటయు సరి గా' వనుట(పు.4.) యుచితమా? నన్నయ తననాఁటికిఁ దెల్గున నశించినఱకారము (నన్నయతరువాతి శాసనములో నున్న దని చెప్పిరి గూడ) నవ్యాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలే (పు.8) దని వీరు వివరించిరే. మఱి వీ రుద్ద్యోతమున అలఘులకారము 'ళ'కార ముగఁ బల్కుటయు వ్రాయుటయుఁ దప్పందు రేమి? తననాఁటికి నశించిన వర్ణ మును నన్నయ పరిహరింపఁగాఁ దమనాఁటి కింకను బ్రసిద్ధ మైయున్నదనియా వీరు 'ళ'కారమును దొలఁగించి యలఘువుగా లకారమునే యుద్ధరించిరి?

కావున నలఘు'ల'కారము (ఒకనాఁ డున్న దన్నను)అప్పకవికిఁ బూర్వమె తెల్గున నశించినది గావున నచ్చోట నున్నళకారము మూర్ధన్యము భిన్న మని గుర్తించి నప్పుడు (చిం. చెప్పినను) లకారమునకు లఘ్వలఘుభేదమును జెప్పక 'ళ'కారమును బృథగ్వర్ణముగా గ్రహించుటే యుచితము. ఆళకారమె బహుత్వమందు రలడల కాదేశ మగున దని గుర్తింపవలయును. సూరియే యీమార్గము ననుసరించిన బా గుండెడిది. అత్యాధునిక మగునుద్ద్యోతమున నే నట్లంగీకరింపవలసియుండఁగా నం దింకను నున్నదో లేదో నిశ్చయింపరాని 'ల'కారము పేర్కొనఁబడుట సరి గాదు.

మొత్తముమీఁద నేఁడు ళకార మొక్కటే. అదే బహుత్వమున రలడల కాదేశ మగుచున్నది. 'ల'కార మొక్కటె. దానికలఘురూపము లే దని చెప్పుకొనఁదగును.

కాఁగా ళకార మెల్లయెడల నలఘువే యని భావించిన యప్పకవి తెనుఁగున (నలఘు)శకటరేఫమును గూడఁ జేర్చి వర్ణములు ముప్పదియే యనెను.

ముకులము, ముకుళము ననురీతిని సంస్కృతమున ద్వైరూప్య ముండ నగు నేమో. (వేళా-వేలా- వేలా=ఒడ్డు అనునర్థమున దీనికి వేళా యని ళకారముతో రూప ముండదు. ప్రాకృతప్రభావముచే సంస్కృతమున ళకారము చేరిన దేమో.) కాని తెలుఁగున తళుకు-తలుకు, ఊళలు-ఊలలు అనురీతి ద్వైరూప్య ముండదు.

ఇట్లే సాధుశకటరేఫలవిషయమునను. నీరు అనుచో లఘురేఫము బదులుగా నలఘురేఫమును వ్రాసినచో (నీఱు)అర్థమే మాఱును. ఇట్లు ళ,ఱలను ప్రత్యేకవర్ణ ములుగ మాత్రమే యంగీకరింపఁదగు ననియు నయ్యవి లరలయలఘురూపములు గా వనియుఁ జెప్ప నుచిత మేమో. యవల కయినను లఘ్వలఘుభేదము తెలుఁగునఁ జెప్పకున్నఁ గల్గునష్ట మేమో పరిశీలింపవలయును.

అర్ధానుస్వారపూర్ణానుస్వారము లుభయము లని పేర్కొనుట యసంగతము. సంస్కృతవర్ణసందర్భమున నీయంశము స్పష్టము.

## అనాంధ్రవర్ణములు :

'ఋౠఌౡవిసర్గఖఛఠథఫఘఝఢధభఙఞశషలు సంస్కృతసమంబులం గూడి తెలుఁగున వ్యవహరింపఁబడును' (4) అనుసూరిసూత్రమునఁ గొన్నిమార్పులు చేసి 'ఋౠఌౡవిసర్గము ఖఘఛఝఠఢథధఫభఙఞశషలు సంస్కృతసమాన్య దేశ్యాదులం గూడి తెల్గున వ్యవహరింపఁబడును' అని చూపిరి. వీరు 'విసర్గము' అని మువర్ణాంతముగాఁ బేర్కొన్న దానిని సూరి 'విసర్గ' యని సమాసమున సముచితము గనే (విసర్గ యనురూపమును గలదు గదా.) చూపెను.

ఇఁక మిగిలినవర్ణములను సూరి వర్గద్వితీయచతుర్థములు ననునాసికము లూష్మములు (శష) ననుక్రమమునఁ జూపెను. ఇందు సూత్రమునకు శ్రుతిపేయ మగునడక యేర్పడినది. వర్గాక్షరముల క్రమములో మార్చి వజ్ఝలవారు చూపిరి. ఇంది యవసరమా? సూరివచనముల దురుక్తి లేదని మాత్రము చెప్పనగును. ఇంక వీరు వర్గాక్షరముల నా క్రమములోఁ జూపుట నారంభించి ఙఞలు పిదపఁ బేర్కొనుటలో సూరిసూత్రప్రభావము గల దేమో. కాని వీ రనుసరించినమార్గమునుబట్టి 'ఖఘఙఛఝఞఠఢ'- అనురీతిగా ఙఞల నేవర్గముదాని నావర్గమునందుఁ జేర్చి చూపిన నది యొకక్రమములో నున్న ట్లయ్యెడిది.

ఈ19వర్ణములు సంస్కృతసమంబులం గూడి తెలుఁగునఁ జేరు నని సూరి పేర్కొనఁగా వీరు 'అన్యదేశ్యము ననుకరణము' ననువాని నధికముగాఁ జేర్చిరి. ఇవి బాల.లో ననుక్తములు. సూరియే 'తక్కఁ గలయట్టివర్ణము లత్సమానాన్యదేశజ గ్రామ్యశబ్దయుక్తివి దొసంగుఁ గాన నలుదెలుఁ గగుభాష గావచ్చు' నని పద్యాంధ్ర వ్యాకరణమునం దన్యదేశ్యములను బ్రస్తావించెను. (ఈపద్యమునఁ దత్సమాదులతోఁ గూడినవర్ణము లుండు ననియు నది తెలుఁ గనియుఁ జెప్పుట గమనింపఁ దగును.) కాని బాల.లో నన్యదేశ్యములను బ్రస్తావింపలేదు. వజ్ఝలవారు చేర్చు టుచితమె. చిం.లోఁ జెప్పఁబడలే దని శకారమువలె నన్యదేశ్యములను బరిహరింపక పేర్కొను టుచితముగా నున్నది.

కాని యిటఁ జేర్కొన్నవానిలో ఋౠఌౡవిసర్గ ఙఞ యనువర్ణములు కేవలము సంస్కృతసమములందే యుండును. అన్యదేశ్య(అనుకరణ)ములం దుండవు. వీరును సంస్కృతసమములే యుదాహరించిరి. ఆయంశమును వీరు వివరించిన బాగుండెడి దనఁదగు.

'యయాతిచరిత్రమనుచరిత్రాదులలోఁ (ప్రయోగప్రాచుర్యమునుబట్టి గ్రంథము లక్రమమునఁ జెప్పఁబడియుండవు.) నన్యదేశ్య(తురుష్క)శబ్దములు ధారాళముగా వాడఁబడినవి. నేఁటి కాంగ్లేయభాషాపదములును గలవు. కాన నేఁటివ్యాకరణములలో నన్యదేశ్యముల నొకభాగముగా గుర్తించుట యుక్త' (ఉ.శి)మనిరి. దీనివలనఁ దురుష్కాంగ్లేయాదిభాషాపదములను గూడ నిట్లు వీ రంగీకరించి రని స్పష్టము. ఇది యుచితము. 'కాఫీ ఫీజు', మొద లగుశబ్దములందలి ఫకారాదులు ప్రస్తుతసూత్రము పేర్కొనుచున్న ఋౠఌౡ మొద లగువానిలోఁ జేరనివి. సూత్రమునఁ బేర్కొన్న ఋౠఌౡవిసర్గము ఙఞ లన్యదేశ్యములలో నుండవు. ఇంకను నన్యదేశ్యములందు మాస్టరు మొద లగుచోట్లఁ దాలవ్యాకారాదులు గలవు. స్థిరవరకబిందువు నుండును. దీనినిబట్టి చూడఁగా నన్యదేశ్యముల(వలనఁ దెలుఁగునఁ జేరువర్ణముల)ను బ్రస్తుత సూత్రమునఁ జేర్పక ప్రత్యేకముగా సూత్రించుట యొప్పును.

కాని వీరిం కొకతీరున నిట్లందురు. 'అన్యదేశ్యములలోనియనాంధ్రవర్ణములను దొలఁగించి వానిలోఁ దత్సన్నిహితాచ్ఛాంధ్రవర్ణముల నిల్పుట యుక్తము. అట్టిమార్పుచే వర్ణస్ఫూర్తిప్రతిబంధము గల్గుచో నట్టియనాంధ్రవర్ణముల నిల్పుకుండుటయు యుక్తమె'. (ఉ.శి) అన్యదేశ్యములం దనాంధ్రవర్ణముల నెల్ల [illegible] తప్పకుండఁగాఁ గొన్నిమొదల నచ్ఛాంధ్రవర్ణములుగా దిద్దుట యేలకో యర్థము గాదు. ఫీజు-అను దానిని 'పీజు' అన్న నెంత యర్థవంతముగా నుండును? కాపీ (కాఫీ) యన్న నర్థాంతరస్ఫూర్తియు. పీజు, కాపీ తద్భవము (ఆంగ్లభవము) ఫీజు, కాఫీ తత్సమము (ఆంగ్లసమము) ననురీతిని సమన్వయింపవలెనా? అన్యదేశ్యములలో మార్పులు చేయకుండుటయె యుచిత మనఁదగును.

దీనినిబట్టి యన్యదేశ్యములందలి యనాంధ్రవర్ణములను బ్రత్యేకముగా సూత్రించుటయే యుచిత మని స్పష్టము.

ఙఞ-అనుకరణమునందు ననాంధ్రవర్ణము లుండుట నావిషయమును వీరు సూత్రించు టుచితమె. ఈయంశమునకు వీ రిట నుదాహరణములు చూపలేదు. కాని యంతకు

ముందుసూత్రమునొద్ద 'అనుకరణశబ్దములందలియనాంధ్రవర్ణములను దొలఁగింప రాదు. ఉదా. సుభుల్ సుభుల్' (ఉ.శ్రీ) అని వివరించిరి. కాని తొలఁగింపరా దని యటఁ జెప్పుటకంటె ననుకరణమునం దనాంధ్రవర్ణము లుండుట కిట నద్దాని నుదాహరించిన బాగుండెడి దని తోఁచుచున్నది.

ఇట్లె యన్యభాషాపదముల ననుకరించునప్పు డం దనాంధ్రవర్ణము లుండుట వింత గాదు. అన్యభాషావాక్యము లయినను దెనుఁగున ననుకరించునప్పుడు తెలుఁగు లిపిలోనె వ్రాయఁబడును. తుదిహల్లునకు ద్విత్వము మున్నగు ననుకరణసంధికార్యము లీయంశమును నిరూపింపఁజాలుచున్నవి. (ఖ, ఘ మొద లగుననాంధ్రవర్ణములకుఁ దెలుఁగునఁ గలలిపిచిహ్నములును నీయంశమును నిరూపించు ననఁదగును.) కిం భయ మ్మని- అనుచో 'కిం భయమ్' అనునది సంస్కృతవాక్యమె. అయ్యును దెలుఁగు లిపిలో నుండుట గమనింపఁదగును.

ధ్వన్యనుకరణశబ్దములందు సయితము ఋౠఌౡవిసర్గఙఞలు లే వని గ్రహింపవచ్చును. కావున నీయంశమును గూడ నన్యదేశ్యములకువలెనె ప్రత్యేకముగాఁ జేర్కొను టుచిత మని తోఁచుచున్నది.

'అనుకరణాదు' లనుచో వీ రాదిశబ్దమును బ్రయోగించిరి. ఆదిశబ్దముచే నేది గ్రహింపవలయునో వీ రిటఁ బేర్కొనలేదు. అంతకు ముందు సూత్రమునొద్ద 'కవి ప్రయోగములందును సంజ్ఞాదులలో ననాంధ్రవర్ణములు ప్రాసాదులలోఁ బ్రయోగింపఁ బడినవి. అట్టిశబ్దముల ననింద్యగ్రామ్యములుగా నంగీకరింపనగును. ఉక్షా మంతువ-తుక్ఖార-ప్రోష్ఠద్యోత-లోలార్కుంతేవ' (ఉ.శ్రీ) కాఁగా విట నాదిశబ్దముచే సంజ్ఞాదులు గ్రహింపఁబడు నని తలఁచిరా? అట్లని స్పష్టము చేసిన బాగుండెడిది. ఇందు 'ఉక్షా' సంజ్ఞ యైన నన్యదేశ్యముగా గ్రహింపఁదగును. 'లోలార్కుంతేవ' యనుచో ఱకారము గలదు. కాని వీని ననింద్యగ్రామ్యములుగా వీ రిటఁ బేర్కొనియుండుటనుబట్టి యీయనాంధ్రవర్ణత్వము లక్షణబద్ధము చేయనుద్దేశ్యము వీరికి లే దనియె చెప్పఁ దగును. ఎందు కయిన నుపయోగించును లె మ్మని యాదిశబ్దము నీసూత్రమునఁ జేర్చి రేమో. కాని యుపయోగ మేమియో యిప్పటికి స్పష్టము గాకున్నది. వారును జెప్పలేదు. కావున నది ప్రయోజనవంత మని చెప్పుట యెట్లు?

ఏమైనను మొత్తము మీఁద నుభయకృత్యేకోనవింశతివర్ణములు సంస్కృత సమంబులం గూడి మాత్రమే తెలుఁగునఁ జేరుచున్న వనుట స్పష్టము. అన్యదేశ్యాను కరణము(అది)లందు వీనఁ గొన్ని లేవు. కొన్ని యితరములును గలవు. కావున నిచట సూరిసూత్రము వట్టే యుంచి యన్యదేశ్యానుకరణములం దపువర్ణములం గూర్చి ప్రత్యేకముగ లక్షణ మేర్పఱచుకొనుట యుక్తమని నిర్ణయింపఁదగును.

ఇంక సూరి ప్రస్తుతసూత్రోదాహరణములందు 'పఙ్క్తి' యనుదానిం జూపెను. వఝలవా రది తొలఁగించి 'శార్ఙ్గ' మనునది చూపుట సమంజసముగా నున్నది. 'సంస్కృతమున వర్గపంచమాదేశము గలదు గాని యట్టిసంస్కృతశబ్దము తత్సమ మగుచు తెల్గునకు వచ్చునపు డందలివర్గపంచమముతో నిందుసున్న నిల్చును. శఙ్కరః శంకరుఁడు (ఉ.11) (వ్యా.సం.స.10) అనువఝలవారినిర్ణయ మెంతయు యుక్తము. సూరి కంత మని యిటనే చూపెను. కాని యిట నిట్లు చెప్పినవఝలవారు పైని 'శ్రీమన్తమ్, గుణవన్తమ్' అనురీతిప్రాతిపదికలలో వర్గపంచమమే చూపి మకారలోపము చేసినపిదప శ్రీమంత.గుణవంత అని చూపుట విశేషము. సూరి శ్రీమంతమ్, గుణవంతమ్ అని మకారలోపమునకుఁ బూర్వము ప్రాతిపదికనే బిందువుతోఁ జూపియున్నాఁడు.

సూరి పఙ్క్తి యనిచూపుటనుగూర్చి రమణీయము 'సాధారణముగా బిందు లేఖనమే సమంజస మనియు అవసరము కలిగినచో మాత్రము పంచమాక్షరము లిఖింపవచ్చు ననియు' (154) సూరియాశయమును దెల్పినది. అవసర మగు యన నెట్లు? "ఙకారమున కుదాహరణము చూపవలసినయావశ్యకత యుండుటచే" (రమ.154) నయినచో వఝలవారు చూపినట్లు 'శార్ఙ్గము' అనురీతిశ్శబ్దమును జూపుట సముచితము. ఇఁకఁ దెలుఁగున నైనను సంస్కృతవాక్యమున నిట్టిచోట్లఁ బరసవర్ణ మ్మలలుటయే యుచిత మనఁదగును. సూరి పఙ్క్తి, అఙ్గారః ఇత్యాదిగ నట్లే చూపెను. 'నమోఽస్తు సౌందర్యవిజితమన్మథాయ' యని యుప్పకవి సంస్కృతమునఁ బరసవర్ణము వ్రాయకుండుట విశేషమే (రమ.155) కాని, దయావంతం శాన్తం-కాంతున్ (ఉ.రా.2.187) అని యిట్లు సంస్కృతశబ్దమునఁ బరసవర్ణమునకు బదులుగా బిందువు వ్రాయుట గానవచ్చుచున్నది. అట్టివి విశేషస్థలములుగ గుర్తించు టయె లెస్స.

వజ్ఝలవారు 'ప్రస్తుతస్థలమున అఆఉఊఒఓలం గూడినతాలవ్యచజలను గూడఁ బ్రస్తావింపవలసియున్నది. ఇంతకు ముం దచ్చతెనుఁగునకు వర్ణములు ముప్పది యే డని సూత్రించుకొనుటవలనను, నచ్చతెలుఁగున చజలు అఆఉఊఒఓలం గూడిన దంత్యము లగును గావునను నిట్టివి తాలవ్యము లగుట యీసూత్రముచే సంగ్రహింపఁబడమిఁ గదా.

## నామాదిసంజ్ఞలు :

నామము, క్రియ, ప్రాణము, ప్రాణి, బిందువు అనునవి ప్రసిద్ధము లగుటం జేసియుఁ బ్రాతిపదికాదులు సంస్కృతమునఁ బ్రసిద్ధము లగుటంజేసియు (అనఁగా నామాదులు తెలుఁగున మాత్రమె ప్రసిద్ధము లన్నమాట?) వానిని (సూరి) వేర్వేర వచింపలేదు. పరుషసరళస్థిరసంజ్ఞలు మాత్ర మిందు వచింపఁబడె (వ్యా.సం.స.62) నని వీరు పేర్కొనిరి. కాని వక్రవక్రతమసంజ్ఞలనుగూర్చి బా.సంజ్ఞా.2.సూత్రమున వివరణమునందుఁ జేర్కొన్నట్లే సూరి 'నామం బనఁగాఁ బ్రాతిపదిక' మని తత్స. 21సూత్రవివరణమునఁ జేర్కొనెను. కావున నివి ప్రసిద్ధము లనుదృష్టితోఁ జెప్పక విడిచె ననుట యుక్తము గాదు. అట్లయెడలఁ బరుషసరళస్థిరసంజ్ఞలుమాత్రము ప్రసిద్ధములు గావా? వాని నేల చెప్పెను? ధాతు వనునర్థమున 'క్రియ' యని వ్యవహరించుట బాలవ్యాకరణమునందుఁ గానరాదు. క్రియాజన్యవిశేషణములు, ద్వ్యవయవ క్రియ లిత్యాదిగాఁ బ్రౌఢవ్యాకరణమున నట్టివ్యవహారము గలదు. కాఁగా నుద్దేశపూర్వకముగనే సూరి క్రియను సంజ్ఞగాఁ జేర్కొనలే దని గ్రహింపఁదగును. బిందాదులను సూరి వివరింపలేదు. సంస్కృతోక్తము లయినను దదనుగుణముగాఁ గొన్ని సంజ్ఞలను వివరించుట కారకపరిచ్ఛేదమునను నిత్యము, గుణము మొద లగువాని యెడలను గమనింపవచ్చును. వజ్ఝలవారు సూత్రీకరింపకున్నను నామాదులను వివరణమునఁ జెప్పిరి. (ష.11)

## స్థిరములు :

ఈ పరుషసరళస్థిరసంజ్ఞ లన్వర్థము లనుచు వ్యా.సం.స. 'ఉచ్చారణమునుబట్టి పరుషసరళసంజ్ఞ లేర్పడిన' వని చెప్పినది. స్థిరసంజ్ఞ యెట్లు? ప్రక్రియలో ద్రుతము కతనఁ బరుషములు సరళములుగా మాఱినట్లు స్థిరము లించు కేని మార్పు నందకుండుటచే వానిస్థిరసంజ్ఞయు నన్వర్థ (వ్యా.సం స.62) మనిరి. మఱి ద్రుతపరక

పరళములు మార్పు నందుచున్నవా? మఱి యవి యేల స్థిరములు గావు? ఇ ట్లీయర్థ మతివ్యాప్త మగుటను గుర్తించియే కాఁబోలును, 'పరుషసరళములకన్న భిన్నత చూపవలసియుండుటంజేసి వానికి మాత్రమె స్థిరసంజ్ఞ యంగీకరింపఁబడె నని యైనఁ జెప్ప వగు' (వ్యా.సం.స.62) ననిరి. అనఁగాఁ బరుషసరళములకన్న భిన్నము లని సూచిం చుటయే తప్ప స్థిరసంజ్ఞ యన్వర్థము గా దన్నమాట. అభేదము సూచించుటకుఁ బరుషసరళేతరశబ్దము నేదియైనఁ జెప్పవచ్చును గదా. కావున స్థిరసంజ్ఞ యన్వర్థము గా దని చెప్పిన ట్లయినది. దీనినిబట్టియే పరుషసరళసంజ్ఞలు నన్వర్థములుగా నుంచఁ బడినవి గా వనవచ్చును. ఉచ్చారణమునుబట్టియే పరుషసరళసంజ్ఞల నుంచిన స్థిర సంజ్ఞను గూడ నట్లె యుంచుట సక్రమము గదా. (బా.వి.వి.16)

'ఋ' వర్ణ మొక్కఁడ దధికముగా వజ్ఝలవారు వర్ణమాలలోఁ జేర్చుకొని యున్నారు గావున దానిని వీ రిట స్థిరములలోను బరిగణించిరి. దానిని వర్ణమాల యందుఁ జేర్చుటయె యసంగత మని గుర్తించియున్నారము గావున లేనియావర్ణము స్థిరమా యస్థిరమా యన్నసందేహము మన కనవసరము. (ఇట ఆం.సా.ప. ముద్రితప్రతియందు శకటరేఫ మచ్చుపొరపాటు. పూర్వముద్రణమున 'ఋ'వర్ణమె యున్నది. లఘ్వలఘువు లగుద్వివిధయరలవలును స్థిరములె (ఉ.11) యని వీరు వేఱుగా శకటరేఫము స్థిర మగుటను జేర్కొనియే యున్నారు.

ఇట సందర్భ మంతగా లేకున్నను నామము, వర్ణకము (క్రియ) ద్రుతము ననువానిని వీరు వివరించుట విశేషము. సూరి వీని నాయాసందర్భములఁ స్పష్టము చేసెను.

## దంత్యతాలవ్యచజలు - సావర్ణ్యము :

దంత్యములు (సం.9) తాలవ్యములు (సం.8)న.గు చజలను వానిసావర్ణ్య మును (సం.7) గూర్చి చెప్పుసూరిసూత్రములను వివరణములను యథాతథముగనె వీరును స్వీకరించిరి.

దంత్యతాలవ్యచజలకుఁ బరస్పరము గలసావర్ణ్యమునకు నహో. 'అత్ర తాల్వ దన్త్యైశ్చరాద్యాయాం తాలవ్యైశ్చైశ్చ మిథః అన్యోన్యం యతిప్రాసయోస్సవర్ణశ్చ భవే (కవిశ.288) త్తని యతిప్రాసమైత్రి ప్రయోజనముగాఁ జెప్పెను. సంజీవనియందు వరులవారు విశ్లే షేర్కొనిరి. (వ్యా.సం.స.75) ఈయభిప్రాయము సరి గా దని రమణీయాదుల స్పష్టము చేసియున్నవి.

చిం.లోను నాచ్ఛికభాషలో చజలకు దంత్యతాలవ్యతాభేదము చెప్పఁబడి యుండ వానికిఁ బరస్పరము చెప్పఁబడినసవర్ణత సయిత మాచ్ఛికభాషయందే సమన్వయించు టుచితము గదా. తెలుఁగులోనిదంత్యములకు సంస్కృతసమములలోనితాలవ్యములతో యతిప్రాసమైత్రి ప్రయోజనముగా నహో. చెప్పుటయె సరి కాదు. (బా.వి.వి.18) ఇం దనౌచిత్యము లిట్లు గుర్తింపనగును.

1. శబ్దశాస్త్రమునఁ జెప్పఁబడినయంశమునకుఁ బ్రయోజనము ఛందశ్శాస్త్రమునకుఁ జెందినదిగాఁ జెప్పుట యొప్పదు.

2. అట్లే యచ్చతెనుఁగునందలిదంత్యచజలకు సంస్కృతసమమందలితాలవ్యచజలతో మైత్రి గల దందము.

అఆఉఊఒఓఔలతోఁ గూడినవి గదా దంత్యచజలు. వీనికి సంస్కృతమం దున్న ఇఈఎఏలతోఁ గూడినతాలవ్యచజలతో యతి చెల్లునా? లేదు. ఎందుకు? స్వర మైత్రి లేదు గనుక. అనఁగా యతి కుదురుటకు స్వరమైత్రి కారణము. అందువలననే అచ్చతెనుఁగునందలితాలవ్యచజలతోఁ గూడ దంత్యచజలకు యతి లేదు.

అస లింత యైన దంత్యచజలకు మాత్ర మన్నింటికిఁ బరస్పరము యతి చెల్లునా? అఆఔలతోఁ గూడినచజలకు ఉఊఒఓలతోఁ గూడినచజలతో యతి చెల్లదు. రెండును దంత్యములే. అనఁగా స్వరమైత్రి లేనపుడు దంత్యతాలవ్యములకుఁ జెప్పిన సవర్ణత యెంతమాత్రమును యతిమైత్రిని సాధింపలేదు.

ఇఁకఁ బ్రాసమైత్రి. నాచెంతను వేలుపుఁ జెలు-వా చనఁ జెల్లునె- అనుచోఁ దెలుఁగునందలిదంత్యములకుఁ దెలుఁగునందలితాలవ్యములతోనే యతి చెల్లినది. ఇట్లె సంస్కృతసమములయెడను జెల్లును. దాని కేమి కారణము. ప్రాసమైత్రియందు స్వరమైత్రి యక్కర లేదు గావున. కాఁగాఁ బ్రాసమైత్రి తెలుఁగుదంత్యచజలకు సంస్కృతసమమందలితాలవ్యచజలతోనే యని నిర్ణయింపరాదు.

స్వరమైత్రి యవసరము గానిప్రాసయందు సవర్ణతలేకున్నను తెలుఁగునందలి దంత్యతాలవ్యములు గూడును. స్వరమైత్రి యవసర మైనయతియందు సవర్ణత యున్నను దంత్యచజలె పరస్పర మన్నియును, సంస్కృతసమమందలితాలవ్య చజలతోను గూడవు. కావున సవర్ణతకు నహోబలుఁడు పేర్కొన్నట్లు యతిప్రాస మైత్రి ప్రయోజనము గా దని గ్రహింపవచ్చును.

అయిన స్వరమైత్రి తదభావములు భిన్నవిషయములు లగుటయు నసలు వ్యంజనములకుఁ బరస్పరము మైత్రి యుండుట యన్నదీసవర్ణతవలన సిద్ధించు ననవచ్చునా? వర్గజయతుల ననుసరించి యేవర్గమువర్ణముల కావర్గమునందు (అనునాసికమును విడచి) యతి చెల్లును. దంత్యతాలవ్యచజ లేకవర్గములోనివి కావా? 'అర్ధస్పృష్టాల వ్యశ్చర్వక్రస్పృశ' త్రనుచో దంత్యశ్చ, తాలవ్యశ్చ అని దంత్యచవర్గ మొకటియుఁ దాలవ్యచవర్గ మొకటియు నని దంత్యతాలవ్యములు వేర్వేరువర్గములకుఁ జెందినవిగా వ్యాఖ్యానింపఁబడినవి. అట్టియెడల నొకవర్గములోనివర్ణములకు వేఱొక వర్గములోనివర్ణములతో యతి లేదా ప్రాస విశేషమె. కావున (అయ్యది ఛందశ్శాస్త్రములం దుక్తము గాలేదు గావునను.) సీసవర్ణతకుఁ బ్రయోజన మది యుచితమె యనవచ్చును.

కాని యతిప్రాసలు ప్రయోజనముగా నుద్దేశించిన యహో. పయిరీతిగనె భావించెనా? అట్లు దంత్యతాలవ్యచజలు భిన్నవర్గీయములుగాఁ దలఁచ లే దనియే చెప్పవలెను. అట్లే తలఁచిన దంత్యములకుఁ దాలవ్యములతో యతిప్రాసలయందు మైత్రి గుదురదని సంస్కృతాంధ్రసాధారణముగనె చెప్పును గదా. కాని తెలుఁగునందలిదంత్యములకు సంస్కృతమునందలితాలవ్యములతో నేని యర్థము చేయునా? అందువలననే 'కగచజయుగటడణ' మన్నగుసూత్రమునొద్ద 'చయుగం జయుగం చేత్యుభయత్ర యుగశబ్దాన్వయః' (కవి.210) అని పేర్కొనెను. దీనిచే (కగ) చచజజ- యని దంత్యతాలవ్యచజ లేకేవర్గమునందలి వని స్పష్టము. కగ, టడణ, మొద లగునితరముల క్రమమునుబట్టి చయుగ మొకవర్గము జయుగ మొకవర్గము నని చెప్పను. ఇవి భిన్నవర్గము లని భావించినచో యుగశబ్దమును ప్రత్యేకముగా నన్వయింపక చజ, యనువానిజంట, చజ, చజ, అని యర్థము చేసియుండును గదా.

ఏ మైనను దంత్యతాలవ్యచజలు వేర్వేఱు వర్గలకుఁ జెందిన వనుట యప్రసిద్ధము. అనవసరము గూడ. పంచవర్గము లనియె (అప్ప.254) వ్యవహారము.

చిలుక, చుక్క యనుచోట్ల నున్నచకార మొక్కటే. ఇకారముతోఁ గూడినపుడు తాలవ్యమును 'ఉ'కారముతోఁ గూడినపుడు దంత్యము నైనది. ఇట్లె దంత్యతాలవ్యము లగుజకారమును గుర్తింపవచ్చును. ఇది వ్యంజన మొక్కటె కావుననే ఛందశ్శాస్త్రకారులును దంత్యతాలవ్యచజలయతిప్రాసమైత్రినిగూర్చి ప్రత్యేకముగఁ బ్రస్తావింపలేదు.

అయినఁ బైవి జేరుచున్నయప్పుడుబట్టియె దంత్యతాలవ్యభేదము గల్గుచున్నదనియు, వ్యంజనము సమానమె యనియు సిద్ధించుచో వీనిని బ్రత్యేకవర్ణములుగా నిర్దేశించు టేల? యని ప్రశ్నము. ఈ శ్లోకఁ జైనను బైవి జేరుస్వరము ననుసరించి యుచ్చారణమునం దులికరణభేదమునుబట్టి పృథగ్వర్ణములుగాఁ జెప్పఁబడినట్లు సంజీవని స్పష్టము చేసినది. (వ్యా.సం.స.76) పీఠికావ్యాఖ్యాత పేర్కొన్నట్లు చజలు రెండు మాత్రమె పరిగణింపఁదగు ననుట నంగీకరించినపక్షమున శకటరేఫమును జేర్చుకొని తెలుఁగునకు వర్ణములు ముప్పదియైదుగా నేర్పఱచుటనుగూర్చి పరిశీలింప వలసియున్నది.

కాఁగా సావర్ణ్యమునకు యతిప్రాసమైత్రి ప్రయోజనము గాదు. సంజీవని యందు యతిప్రాసలను బ్రయోజనముగా నెంచియు నది యసంగతము గావున నాస్త్యేతమునం దాయతిప్రాసవిషయము ప్రస్తావింపకుండుట యుచితముగా నున్నది.

'కచటతపలు పరుషము' లనుచోఁ దాలవ్యచకారముచే దంత్యచకారము గ్రహింపఁబడి యది పరుష మగుటయు, గజడదబలు సరళంబు లనుచోఁ దాలవ్యజకారముచే దంత్యజకారము గ్రహింపఁబడి యది సరళ మగుటయు నీసవర్ణతకుఁ బ్రయోజనములు. రమణీయాదు లిట్లు నిరూపించు టుచితము. (బా.వి.వి.20) సూరి వివరణమునకుఁ బ్రయోజనాంతరమును గలదు. అప్పుడు చనియె, అప్పుడు సనియె, తోఁచెను చుక్కలు, తోఁచెను జుక్క లనువానిని రమ. చూపినది. కాని యిట్టిది వానికిఁ గలపరుషసరళసంజ్ఞచేతనే సిద్ధించినప్రయోజన (రమ.166) మనుట విచార్యము. తోఁచెను+చుక్క లనుచో దంత్యచకారము పరుష మవుటచే దానికి దంత్య మగుజకారము సరళము వచ్చుట సక్రమమే. కాని గసడదవాదేశసందర్భమున నెట్లు? పరుషములకు గసడదవ లవు ననఁగా యథాసంఖ్యముగా కచటతపలకు గసడదవలు గావలెను. దంత్యచకారము పరుషమె. కాఁగా కచచటతపాక్షరము లాఱును బరుషము లయిన నాదేశములుగాఁ జెప్పిన గసడదవ లయిదే యవుటచే యథాసంఖ్యముగాఁ జేయుట కవకాశ మేది? ఇంకను దంత్యచకారమునకుఁ బరుషసంజ్ఞ సిద్ధించు టొక్కటే ప్రయోజన మయిన నాసూత్రమునందే యాఱిటిని నిర్దేశించియుండెడి ననుట యుక్తమే. పరుషము లాఱనియే యభిప్రాయపడుచో నిల (అప్పుడు సనియె) దంత్యచకారమునకు సాదేశము కుదురదు. కాఁగా నీగసడదవాదేశవిధానస్థలము నందలిపరుషశబ్దముచేఁ గచటతపలు గ్రహింపఁబడఁగా నందలితాలవ్యచకారము

దంత్యచకారమునకు గ్రాహకము గావునఁ దాలవ్యచకారమున కిట విధింపఁబడిన యాదేశకార్యము దంత్యచకారమునకు సిద్ధించును. అపుడు+చవిచె=అప్పుడుసవిచె. అనఁగాఁ దాలవ్యములకు విధింపఁబడినకార్యము లెల్ల (నాయయివిధానస్థలములందుఁ దాలవ్యముచే గ్రహింపఁబడుచు) దంత్యములకు సిద్ధించు నన్నమాట. తాలవ్యజకారమునకుఁ బ్రత్యేకముగా విధింపఁబడినకార్యము మృగ్యము. కావున దానికి సరళసంజ్ఞ సిద్ధించుట యొక్కఁటియ ప్రయోజనము గానోపు. కాని చకారమున కట్లు గాదు. కావుననే బహుశః సూరి పద్యాంధ్రమున నాఙాఞ పరుషసరళములుగాఁ జెప్పియు బాల.లో నట్లు పేర్కొనలేదు. పద్యాంధ్రమునఁ గానరాని సవర్ణతావిధానము సూత్రాంధ్రమునఁ గలదు. తౌ సవర్ణౌ-(దన్త్యతాలవ్యౌ సవర్ణౌ) దానినే బాల.లోఁ జెప్పి యీరీతిగా ననేకస్థలములఁ బ్రయోజనము గల్గునట్లు వివరించె ననవచ్చును.

ఐదంతచజలు :

సూరి ఐదంతము లయినచజలు సహేతరశబ్దములందు లే వని చెప్పగా వీరు 'ఉండరాదు' (ఉ.12) అని పేర్కొనిరి. చైవులసాకిరి చాయమగఁడు, మార్మలయుచైవులకు (వ్యా.సం.స.77) అనుచోఁ గవిప్రయోగములం దున్నది గావున లే దనుట సరి కా దనునుద్దేశ్యముతో నుండరా దని వీరు చెప్పియుందురు. ఈకవుల సామాన్యులైన నసామాన్యులైన చైవు లనురీతి వగ్రాహ్యము లనుటయె యుక్తము. చెయి యనుచో 'ఎయు' అనుదానికి 'ఐ' ఆదేశ మవుటయే ('అయు'కిఁ గదా కావలె.) లక్షణవిరుద్ధము. ఇటఁ జేటికి యయువు అని దిద్దఁదగు ననుట [illegible] దని సంజీవని (వ్యా.సం.స.76) స్పష్టము చేసినది.

గు.ప్ర. చై గాని జై గాని యాదియందుఁ గలపదములు తెలుఁగునందు లే (పుట.6) వని పేర్కొన్నది. దీనివలనఁ బదమధ్యాదులందు చై, జై యనువర్ణము లచ్చతెనుఁగునందు నుండు నని చెప్పవలసివచ్చును. ఆదిమధ్యావసానములం దెచ్చటను నచ్చతెలుఁగుభాషలోనే 'చై జై' యనునక్షరము లుండ వని యే సూరివివరణము నకుఁ దాత్పర్యము. (సంధిస్థలములలో 'అచ్చైనది' యనురీతిగా నుండుటలో విరోధము లేదు. (వ్యా.సం.స.77)'అప్పుడు సంధిస్థలములలో సంధిపూర్వావస్థలోని దంత్య తాలవ్యతలె నిల్చును' (ఉ.12) గావున దంత్య మగును. తాటాకు మొద లగువానిలో వకారోచ్చారణము నిట్టిదే గద.) ఎచటనే నచ్చతెనుఁగున చజ లైకారముతోఁ గూడి యున్న నవి దంత్యము లగునో తాలవ్యము లగునో చెప్పవలదా? అట్టివి భాషలో లే

లేవు గనుక (ఉన్న సంస్కృతములఁ దాలవ్యములే యగుట స్పష్టమే కావునను) ఐకారముతోఁ గూడినచజ లేవగునో చెప్ప నవసరము లేకపోయిన దని సూరి వివరణము నుద్దేశ్యము గుర్తింపఁదగును.

సూరియీవాక్యమువలనను బూర్వోక్త మగునొకయంశము స్పష్ట మగుచున్నది. హల్లులైనచకారజకారము లచ్చతెనుఁగుభాషలో నిందలియచ్చులు పేనితోనైనను గూడియుండ నవును గదా! అందు అఆఉఊఒఓఔలతోఁ గూడినపుడు దంత్యము లగును. ఇఈఎఏలతోఁ గూడినపుడు తాలవ్యము లగును. అచ్చతెలుఁగున నింక మిగిలినయచ్చులు ఐకారమును, ఖండప్రాణానుస్వారములును. వానితోఁ గూడినపుడు చజ లేమగు నన్నది ప్రశ్న యగును. వీనిలో నున్న యర్ధమైనను పూర్ణమైన నేదేని స్వరము ననుసరించియే యుండును గాని హల్లునకుఁ బై నవ్యవహితముగా మిగిలినయచ్చులకువలెఁ జేరదు. చేఁ జేం అనుకీతి నొందదు గదా. చఙ్, చం: ఇట్లనుస్వారమునకుఁ బూర్వ మొకస్వర ముండును గావుననది మె చజలపైనుండుటచే ననుస్వారమునకుఁ బూర్వమునం దున్నయచ్చునుబట్టియే దానికిఁ బూర్వమందున్నచజలు తాలవ్యములో దంత్యములో యగును, చీఁకటి, యనుచో నఱసున్నకుఁ బూర్వమందున్న 'ఈ'కారముచే ముందటిచకారము తాలవ్య మయినది. జంపెన- అనుచో నిండుసున్నకుఁ బూర్వమందున్న 'అ'కారము ననుసరించి ముందటిజకారము దంత్య మైనది. ఇట్లే జింక, చాఁపు మొ॥ కాఁగా చజలపై ననుస్వారము సరాసరిగా నుండదు గావున ననుస్వారముతోఁ గూడినచజ లే మగు (దంత్యతాలవ్యములలోఁ గాని తద్భిన్నముగాఁ గాని) నన్నప్రశ్నకుఁ దావులేదు.

ఇఁకఁ బోఁగా మిగిలినది 'ఐ'కార మొక్కటియె. కావున ఐకారముతోఁ గూడినచజ లచ్చతెనుఁగున నెట్లుచ్చరింపఁబడు నను ప్రశ్నకు సమాధానముగా సూరి 'ఐదంతము లయినచజలు సమేతరశబ్దములందు లే' వని పేర్కొనెను. ఇట్లది దంత్యమా? తాలవ్యమా? వేఱొకటియా? యన్నసందేహ మనవసర మని నిర్ణయించి నట్లయిది.

కాఁగా దంత్యము లయినఁ దాలవ్యము లయిన చజలు వ్యంజనములు సమానములే. పైని జేరుచున్నయచ్చునుబట్టి యొకేచకార మొకప్పుడు దంత్యమును మఱొకప్పుడు తాలవ్యము నగును. ఇట్లె జకారమును.

కాక దంత్యచజలు, తాలవ్యచజలు- అనువానిలో హల్లుభిన్న మైనచో దంత్యచజలు ఇఈఎఏఐలతోను, తాలవ్యచజ లెప్పుడును అఆఉఊఒఓఔలతోను గూడి యుండు నని చెప్పుకోవలసివచ్చును. ఇట్లు ఒకహల్లుమీఁద నాయాయచ్చులు చేరుటయుఁ గొన్ని చేరకుండుటయు ననునిర్ణయ మనుచితముగాఁ గన్పట్టెడు. దీనినిబట్టియె పేటికాదులు చజలు రెండుమాత్రమె వర్ణమాలలోఁ జేర్చినఁ జాలు నని భావించి యుండును. అందును సామంజస్య మసలు లే దనఁదగునా? నిశితముగఁ బరిశోధింప వలసియున్నది.

## సంస్కృతసమములు-దంత్యములు :

సంస్కృతసమంబులం దికారాంతములయినశబ్దములయుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగు (10) ననుసూత్రముచేతను "మఱియు రాజశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి" ననువివరణమునను సూరి సంస్కృతసమములం గొన్నియెడల చజలు దంత్యము లగుటను బేర్కొనెను. వజ్ఝల వారు దీని నుద్ఘాతమునఁ దొలఁగించుచు నిట్లనిరి. "సూరిప్రాఁత కేవలము నగ్రాహ్యము. సంస్కృతసమములందలి దంత్యత యశాస్త్రీయము. నిరాధారము. సంస్కృతవర్ణమాలలోనె దంత్యచజలు లేవు. దంత్యతాలవ్యచజలకు యతిప్రాసమైత్రి యుండుటచేత వానినిబట్టి యీవిషయము నిర్ణయింపరాదు. రాజశబ్దభవ మగు నర్వాచీనరాజశబ్దమునుబట్టి యిట్టియపభ్రష్టోచ్చారణము సూరిభ్రాంతియుఁ గల్గె నని తోఁచెడిని. ఇట్లైనచో రవితేజుఁడు విగతసంకోచుఁడు మున్నగువానియందలి దంత్యము లని యేల సూత్రింపరాదు?" (పు.13) సూరిగారిపైశాస్త్ర మీవిషయమును బేర్కొనుచుండఁగా నిం దశాస్త్రీయత యెట్టిది? చిం. చెప్పలే దని యభిప్రాయము గావలెను. ఉచ్చారణమున దంత్యత యుండఁగా నిరాధార మనుట మాత్ర మెట్లు గుదురును? సంస్కృతవర్ణమాలలో దంత్యచజలు లేవు గావున సంస్కృతసమమందలి చజలును దంత్యము లగుటకు వీలు లేదు. ప్రాకృతవర్ణసమామ్నాయమునను దంత్యచజలు లేవు. కాని జడా-జడ, జమో-జముఁ డనుచోఁ బ్రాకృతసమములందు దంత్యములు గలవే. (వ్యా.సం.ప.36) సంస్కృతమున దంత్యములు లేకుండుటచేతనె తెలుఁగున నుండుట విశేషముగా నిట్లు చెప్పవలసివచ్చినది. తెలుఁగువర్ణసమామ్నాయమునఁ జిం. ప్లుతమును బేర్కొనలేదు. కాని యుదంతసంస్కృతనామముల సంబుద్ధిదుజ్జనకుఁ బ్లుత మగునూకారమును విధించెనే గద (దుజ్జనౌ తున ప్లుతస్యాత్

త్సంబుద్ధావప్యేతాం విదుః') ఈప్లుతమునకు దీర్ఘ మని వీరు విశేషముగా నర్థమును జెప్పిరి. (ఉ.109) వర్ణసమామ్నాయమునఁ బ్లుతము చెప్పలేదు గావున దానికి దీర్ఘ మని యర్థ మఁట (వ్యాసం.న.516) చిం.కర్త కిట్టియుద్దేశ్య మున్న దనఁగలమా? ఆసూత్రమునొద్ద దీనిని బరిశీలింతము. చిం.కర్తృచిన్నయప్రభృతులలక్షణములను బట్టి వర్ణమాలలోఁ బరిగణింపఁబడనిప్లుతమును విశేషముగాఁ జెప్పినట్లె యిచట నుచ్చారణానుసారముగా సంస్కృతసమములందు దంత్యత విశేషముగాఁ జెప్ప టుచితమే.

దంత్యతాలవ్యములయతిప్రాసమైత్రిని గూర్చినప్రసంగమునందలియనౌచిత్యము లింతకుముందు గమనించితిమి. అయినను యతిప్రాసమైత్రినిబట్టి దంత్యము లుండు నని చెప్పరా దనుటలో వయ్యులవారియభిప్రాయ మస్పష్టము.

ఇఁకఁ దద్భవ మగురాజుశబ్దమునందు జకారము దంత్య మగుట సహజమె. కాని తత్సమరాజుశబ్దమునందలిదంత్యత యపభ్రష్టోచ్చారణ మనుట విచార్యము. త్రాళ్లు-పాళ్లు-అనురీతియుచ్చారణ మపభ్రష్ట మనియు, త్రాల్లు. పాల్లు అనురీతిగా నుండవలయు ననియుఁ జెప్పినవయ్యులవా రిట నిట్లు పేర్కొనుటలో వింత లేదు.

వైకృత మగురాజుశబ్దమునందలిదంత్యతచేఁ దత్సమమునందును దంత్యత గల్గె నని సూరి భ్రాంతిపడె నన్నవయ్యులవారివచనములును విశ్వసనీయములు గావు. అప్పకవి పాండురాజు అనుచోఁ దత్సమ మవుటచే నందలిజకారము తాలవ్యమే యని నిర్ణయించుచుఁ గేవలాంధ్రులు దంత్యముగా నుచ్చరించుచున్నా రనియు నది యుచితము గా దనియు స్పష్టము చేసెను. (అప్ప.ద్వి.185) ఈయప్పకవివచనములనుబట్టి యైనను సూరి తనది భ్రాంతియే కాని సత్యము గా దని గుర్తింపలేకపోయెనా? అప్పకవీయము సూరి యెఱుఁగనిది కాదు గదా. అప్పకవి తిరస్కరించినయభిప్రాయమునే సూరి లక్షణబద్ధము చేసె ననఁగా నది భ్రాంతి యని నిర్ణయించు టుచితమా? రాజ్ఞ ఉచ్చైతసే. చేతనార్థే పుంసి విహితస్య రాజన్ శబ్దస్య చేరుత్ స్యాత్ దంత్యత్వం. రాజు, రాజులు. (తె.వ్యా.వి.76) అని వైకృతచంద్రిక పేర్కొనియున్నది. ఇట్లు సూరికిఁ బూర్వము రాజుశబ్దమున జకారదంత్యత లాక్షణికోక్త మయియుండఁగా నయ్యది సూరిభ్రాంతి యనుట యుచితము గాదు. కాఁగా వయ్యులవా రిది బాలవ్యాకరణము నందు మాత్రమె కన్పట్టుచున్న (వ్యా.సం.న.82) దనుట సరి కాదు.

ఇఁక వీనియందు దంత్యత నంగీకరించుటలో విగతసంకోచుఁడు రవితేజుఁడు ఇత్యాదులందు మాత్ర మేల దంత్యత సూత్రింపరా దనుటయు సరి గాదు. వీని

యందును దంత్యత యున్నచో నట్లు సూత్రింపవలసినదే. కాని 'అర్చులు' అనుచో దంత్యత సూత్రించిరి కావున విగతసంకోచుఁ డన్నపుడు దంత్యత సూత్రింపవలె ననుట యెట్లు గుదురును? ఇఁకేమి యనుచో సంధి నంగీకరించిరి గావున చూడైతి (చూడన్+ఐతి) ననుచోఁ గూడ నేల సంధి నంగీకరింపరాదు? అనుట యుక్తి యుక్తమా? ఇంక విగతసంకోచుఁడు, రవితేజుఁ డిత్యాదిస్థలములఁ బాలవ్యర్థ్యేసిపే గాని దంత్యత వినరా దనుట యనుభవసిద్ధమే. క్రొత్తగఁ గలిగినప్పుడు సూత్రింపవచ్చును. అంతే గాని అర్చులు అనుచో దంత్యత సూత్రింపఁబడినది గావున విగతసంకోచుఁ డనుచో (దంత్యత) సూత్రింపవలె నని కాని విగతసంకోచుఁ డనుచో సూత్రింపలేదు గాన నర్చులు అనుచో సూత్రింపరా దని కాని చెప్పుట యనుచితము.

కాఁగాఁ బయి సూరి(సం.10)సూత్రమును దిరస్కరించుట యుక్తము గాదనియు నయ్యది సూక్తమె యనియు నిశ్చయింపఁదగును.

## రాజు-దంత్యత

ఇంకఁ బయిసూరిసూత్రమునకుబదులుగా వీరు వేఱొకసూత్రము నిట్లుంచిరి. "వైకృత మగు 'రాజు' శబ్దపుజకారము దంత్యము. అర్చులు-వాజులు, పాండురాజు భీమరాజు మున్నగువానిజకారము తాలవ్యమె. (13,137)

'సంస్కృతప్రాకృతవర్ణసమామ్నాయములలోనె దంత్యచజలు లే' (పు.12) యనువాక్యమునకుఁ బూర్వమునందే సూత్రసంఖ్య నిచ్చియున్నారు గావున నీవాక్యము సూత్రములోని భాగము గా దనవచ్చును. ఈ వాక్యము వేఱుచేసి చూపిన బాగుండెడిది.

అర్చులు వాజులు- మున్నగురెండవవాక్యమున మొదటి'అర్చులు' అనుశబ్దమున నున్నది చకారము. కాని వీరు 'మున్నగువానిజకారము' అని జకారము నొక్కదానినే పేర్కొనుట ప్రమాదము. 'చజలు తాలవ్యములె' యని చెప్పవలయును. 'జకారము తాలవ్యమె' యనుటనుబట్టి 'అర్చులు' సూత్రమునఁ బ్రమాదపతిత మన్నచో 'వాజులు' అనుచో జకారము తాలవ్యమె కాని 'అర్చులు' అనుచో చకారము మాత్రము సూరి పేర్కొన్నట్లు దంత్యమె యగు నని యర్థ మగును. అది తరువాతి వివరణమునకును, వీరియుద్దేశ్యమునకును విరుద్ధము. కావున చజలు తాలవ్యములే యని చెప్పవలసినచోట 'జకారము తాలవ్యమె' యనుట ప్రమాద మని నిశ్చయింపవచ్చును.

ఇఁకఁ బైది యొకసూత్రముగాఁ జెప్పఁదగినది గాదు. అది వారును గుర్తించి యిట్లనిరి. సంస్కృతచజలు కొన్ని దంత్యములు గల వని సూరిప్రభృతినవ్యులు భ్రాంతిపడి వ్రాయుటచేత నిట్లు సిద్ధసాధనముగా సూత్రింపఁబడెను" (ఉ.13)సూరికిఁ బూర్వులే యిట్లు పేర్కొనుట గుర్తించితిమి. అట్టివా రెల్లరును భ్రాంతిపడియే యుందురు గాక వీ రిట్లు సూత్రింపవలయునా? దంత్యతాలవ్యములను సూత్రించినచోట నీయంశమును వివరణమునఁ జూపినఁ జాలదా? సిద్ధసాధన మని తెలిసియు నేల సూత్రింపవలెనో యర్థము గాదు. రాజా వైకృత మయినపు డుత్త్వసహిత మయి యుండుటచే నయ్యది దంత్య మగుట సిద్ధాంతమె. అర్చులు పాండురాజా ఇత్యాదులు సంస్కృతసమము లవుటచే నందు దంత్యత లేదు గావున నవి తాలవ్యము లగుటయు సిద్ధమె. దానినె చెప్పుచు వజ్ఝలవారియీసూత్రము వారే చెప్పుకొనినట్లు సిద్ధసాధన మయియున్నది. కాఁగా సూత్రముగాఁ జెప్పుటయే యనవసరము.

ఇందును వైకృత మగురాజాశబ్దమునందు దంత్యత సూరి సమ్మత మె కావున నావిషయమున సూరిమతమున దురుక్తి యెన్న వీలు లేదు. ఇంకను వైకృతముగా నీశబ్దము యయాతిచరిత్రమునందుమాత్ర మె గానవచ్చుటయు, నందుకే ప్రౌఢ. కొందఱి మతముగాఁ జెప్పుటయుఁ బ్రసిద్ధమే. పయియప్పకవివచనములనుబట్టి సంస్కృతసమరాజాశబ్దమునందు దంత్యత లోకవ్యవహారమునం దున్న దనియు వై.చం.లక్షణమునుబట్టి లాక్షణికాంగీకృత మయ్యున్న దనియు గుర్తింపవచ్చును. ఇఁక పాండురాజు అనురీతిసంస్కృతసమరాజాశబ్దమున వజ్ఝలవారు నిర్ణయించినతాలవ్యధ్వని యెంతమాత్రమును నేఁడు శిష్టజనవ్యవహారమునను లే దని నిర్ణయింపకతప్పదు. (వ్యా.సం.న.79)

గు.ప్ర. "రాజాశబ్దం బొక్కటి యేకవచనాంతంబును దంత్యయుక్త" (7) మని పేర్కొనఁగా సంజీవని రాజ్ఞీఅనునపుడు వినఁబడు దంత్యత రాజ్ఞులు అనునపుడు వినఁబడదేదా?' (వ్యా.సం.న.79) యని గు.ప్ర.ను విమర్శించిరి. 'ఏకవచనాంతంబును' అని చార్థకనుశబ్దమును బ్రకాశక ప్రయోగించియుండఁగా 'నేకవచనాంతమున మాత్రమే' యని వరులవా రర్థము చేసికొనుట ప్రమాదము. ఆసూత్రమున సూరి యికారాంతముల యుపధాచజలు బహువచనమునందు మాత్రమే దంత్యములగుటను జెప్పఁగా రాజా అనునది మాత్ర మేకవచనాంత మయినపుడు గూడ దంత్యయుక్తమే యని విశేషముగా వివరింపఁబడఁగా గు.ప్రను విమర్శించుట యుచితమా?

కావి. సు.ప్ర 'పాండురాజయశ' మనుచో సంబుద్ధ్యంతము సంయుతము సూరివచనముచే దంత్యయుక్తము గావలయు నని యర్థాంతరమును గల్పించి సమర్థింపఁజూచుట మాత్రము సరికా దని సంజీవన్యాదులు స్పష్టము చేసినవి. కాని వీరు "పాండురాజ అనుసంబోధనములో జ్జకారము దంత్యమె (దంత్య మైనపుడె జ్జ యని వ్రాయఁబడును గావున జ్జకార మెప్పుడును దంత్యమె.)యని యంగీకరించె" (వై.పా.578) ననుటలో సంబోధనలో 'రాజ' యనుచో దంత్యతయె వీరి కిష్ట మేమో యనుసందేహము కల్గును. అట్లు గా దని 'రాజవా' అనుచోటవలె పాండురాజ తాలవ్యముగానె వలుకుట యుక్త '(వై.పా.582) మని పిదవ స్పష్టము చేసిరి.

కాని యుద్ద్యోతమున వీరు పేర్కొన్నయభిప్రాయమునకు భిన్న మగునుద్దేశ్యము వీరే వే రొకచో నిట్లు సూచించిరి. ప్రౌఢవ్యాకర్త ప్రత్యేకప్రయుక్తరాజశబ్ద జకారమునకు దంత్యతను వైకృతత్వమున నిర్వహించినను, సిద్ధసమాసాంతమందలి 'రాజా'లో జకారము దంత్యత యంగీకరింపకతప్ప దనియే 'పాండురాజయశము' అనుచో జకార ముభయ మగు ననురీతి సూత్రించినట్లు చెప్పిరి. (వై.పా.578) దీనిని బట్టి సంస్కృతసమరాజశబ్దములో దంత్యత యంగీకరించిరే కద. అయిన నిది సూత్రక్రమమునకు విరుద్ధముగా నున్నది. ప్రౌఢ. ముందే జకార ముభయ మగు నని తరువాతనె రాజా వైకృత మనెను. పిదప సంజీవనిలో 'జకార ముభయ మనుట లోనియుస్వరసతచేఁ గావలయు రాజా వైకృత మని చెప్పె'(వ్యా.సం.న.82)ననిరి. దీనినిబట్టి సంస్కృతసమరాజశబ్దము దంత్యయుక్తము గా దని చెప్పవలె. ఇయ్యది సూత్రక్రమానుగుణమ యయ్యెను జకారమునకుఁ బిదపఁ జెప్పినయుభయత్వము సాధారణ మగుటయుఁ గేవలము రాజాశబ్దసంబంధి గాకుంటయు గమనార్హము. ఇంకను వయుంవారి- "తత్సమ మగురాజాశబ్దములోనిజకారము దంత్యత యస్వరస" మనునభిప్రాయమె ప్రౌఢవ్యాకర్త కున్నచో నాతఁడును జెప్ప నేల?

ఇంకను దంత్యయుక్త మగురాజాశబ్దము వైకృతమె యని యెంచుచోఁ బ్రౌఢవ్యాకర్త కొందఱందు రన నేల? 'రాజా వైకృతంబు' యన్నఁ జాలదా? కొందఱ మతమున సంస్కృతసమములందు దంత్యచజలు లే వన మఱి కొందఱమతమున నుండుట స్పష్టమె కద. అట్టియపు డది కేవలము నిరాధార మశాస్త్రీయము నగు టెట్లు?

సూరి వ్యావహారికవాసనచే నిందు దంత్యత నంగీకరింపఁగా నిన్నితడఁబాట్లు (ప్రౌఢవ్యాకర్తకు) సంభవించె (వ్యా.సం.న.82) ననిరి. ఎన్ని తడఁబాట్లు? రాజా

వైకృత మనుట వీరికి నిష్టమె. జకార మనుభయ మనుట యొక్కటి. శ్లేషయందు జ(చ) కార మొక్కటియె యొకయర్థమున దంత్యమును వే ఱొక యర్థమునఁ దాలవ్యము నగుట వీరికి సమ్మతమే. (వై.పా.581) ధర్మరాజితరక్షమాపాల- ఇత్యాదులం దీవిధి సార్థకమె. (కల్ప.22) ఇంకఁ దత్సమరాజుశబ్దమున దంత్యత లే దని నిశ్చయించి చెప్పకుండుటయె తడఁబాటో యపమార్గమో యనవలె. (వ్యా.సం.స.80) దీనింగూర్చి వై.పా.లో (578) వివరించినమార్గమె సముచిత మని నిశ్చయింపఁదగును.

తత్సమ'రాజు'లో దంత్యత నంగీకరించుటలో నవరోధము లేదే? అను నంశము పరిశీలనార్హము.

'అర్భులు- రాజు ము న్నగుసంస్కృతసమములందలిచజలు దంత్యము లని చెప్పుటకు నేఁటివ్యవహారమే యాధారము కాని వేఱు ప్రమాణ మగపడదు.' (వ్యా.సం.స.79).

దీనినిబట్టి నేఁటివ్యవహారమున దంత్యత యున్న దని వీరు నొప్పికొనిరి. ఈయంశ ముచ్చారణమునుబట్టి గుర్తింపవలసినది కాని గ్రంథములందు దొరకదు గదా. కావున ధ్వనిని నిర్ణయించుటకు మూల మయినవ్యవహారమునుండి గ్రహించిన నంచుఁ ద ప్పేమి? నేఁటివ్యవహారముననే కాని ప్రాచీనులవ్యవహారమునందు లేదు గావున నంగీకరింపరా దందురా? ప్రాచీను లె ట్లుచ్చరించిరో నేఁ డెట్లు గుర్తింపఁ గలము? అది యట్లుండఁగా వీ రంగీకరించినయన్యదేశ్యాదులు నేఁటివ్యవహారము నందలివి కావా? నేఁడు పయితము శిష్టవ్యవహారమున లేని కాపీ, (కాఫీ) పీజు వంటివి స్వరసములే కాని నేఁటివ్యవహారమునం దున్న యీదంత్యతను నేఁటిలాక్షణి కులు లక్షణబద్ధము చేసిన నది యస్వరస మగునా?

అది య ట్లుండఁగా నీదంత్యోచ్చారణము నేఁటిది గా దనియు నీయది యున్న దని యంగీకరింపకున్నను నన్నయనికిఁ బూర్వమునందే యాంధ్రులవ్యవహార మున నున్న దనియు నన్నయవిషయమునుబట్టి గుర్తించియున్నారము కదా.

'అర్భులు' అనురీతివానియందు దంత్యతను గూర్చినపూర్వలాక్షణికోక్తి గుర్తింపవలసియున్నది. కాని రాజుశబ్దజకారదంత్యత వై.పం.లోఁ బూర్వ యుక్త మయిన యున్నది. "అముక్తమాల్యదాదిమహాకవిప్రయోగములె యాధునికము లని యుపేక్షించినమూరి నేఁటివాడుకలోనియీయపభ్రష్టోచ్చారణమును ప్రమాణీకరించి సూత్రించుట యుక్త మని తోఁచకున్నది. (వ్యా.సం.స.80)

సూరి ఆముక్తమాల్యదాదులప్రయోగముల నుపేక్షించె ననుట సరి కాదు. పీఠీసందర్భమునఁ బేర్కొన్నట్లుగా సూరి యాముక్తమాల్యదాదులను మహాకవిప్రయోగములుగనె యెంచెను. పద్యాదిసూత్రమునొద్ద తిక్కనప్రయోగమును జూచికొనక పోవుటచేతనె పెట్టు నుదాహరింపక "పట్టుశబ్దము నాముక్తమాల్యదలోనిదాని నుదాహరించె" (ఉ.70) నని వీరే చెప్పిరి. ఉపేక్షింపఁదలఁచిన వాఁ డేల యుదాహరించు?

గం గనుకొనె- నెంఁ దిచ్చె ననురూపముల నంగీకరింపలే దనునుద్దేశ్యముతో నీ రిట్లు పేర్కొనియుందురు. 'బహుళగ్రహణముచే స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకు సంధి లే' దనుటచే నివి సాధింపఁబడవనుట నిజమే కాని యట్టివి యాధునికము లని సూరి యుపేక్షించె ననరాదు. చేతుదు కోతు రిత్యాదులవలె నీయవి యసాధువు లని నిర్ణయించెనా? అట 'సాధునికము' లనుటలో సూరియభిప్రాయమును గుర్తించుటలో వయులవారు పొరపడి రేమో.

'సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిఁ బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకుసంధి గానంబడియెడు. గం గనుకొనె నెంఁదిచ్చెను' -అని సూరివచనములు.

అథర్వణుఁడు ప్రాచీనుఁడు. అతఁడు సంస్కృతీయమునకు సంధి యగు నని "కుత్రచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవే" త్తని చెప్పెను. ప్రాచీనుఁడైనయథర్వణుఁడు చెప్పుటచే నంతకు ముందే సంస్కృతీయాకారమునకు సంధి యైన ప్రయోగము లుండవలెను. కాని గానరావు. ఆధునికకృతులందె కాన నవుచున్నవి. ఇట్లనుటలో నథర్వణవచనములను బరామర్శించుటయా? లేక యాధునికము లని యుపేక్షించుటయా? సూరి యుద్దేశ్య మే మని గ్రహింపవలె? ఆధునికకృతులలో నన్నఁ దత్సమములకే కాక 'స్త్రీవాచకములకును' సంధి గానంబడియెడు నని చెప్పి యాముక్తమాల్యదాదులప్రయోగములను జూపుచుండఁగా నని యాధునికము లని యుపేక్షించె ననఁదగునా? నన్నయవ్యాకరణము నన్నయభారతము దాటియావలకు రాఁగూడ దనునాగ్రహము సూరి కెంతమాత్రమును లే దని యాతనిలక్ష్యలక్షణప్రపంచమునుబట్టి నిశ్చయముగాఁ జెప్పవచ్చును. దిక్ప్రదర్శనార్థముగాఁ జెప్ప నారంభించినసూరిగారివ్యాకరణమునన్నయభారతభాగమునందలిభాషయేమాత్రము విడువఁ దగక లక్షణబద్ధ మైన దని చెప్పఁగలమా? భాషాసామాన్యలక్షణము చెప్పఁబూని

నది గావుననే గం గనుకొనె, నెలఁ తిచ్చె ననుకీతివానిని వరు దగువిశిష్టస్థలములంగాఁ బ్రస్తావించి సామాన్యలక్షణమును 'బహుళగ్రహణముచే స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లే' దని నిర్ణయించె నని గ్రహింపఁదగును. ఆధునికము లని యుపేక్షించె ననుట సరి కాదు. జవ్వనిశబ్దమునకు జవాదేశ మని చెప్పి యిచ్చిన 'ఏకాంతమునందు నున్న జవరాండ్ర' ననునది చరిత్ర ప్రయోగ మాధునికము కాదా? లాక్షణికు లెందఱో దూరముగా నుంచినపోతనప్రయోగముల నుద్ధరించినసూరి కొందఱు 'మహాకవుల' నాధునికు లని చిన్నచూపు చూసె ననుట యన్యాయ్యము. (రమ.19)

ఇట నీదంత్యోచ్చారణ మపభ్రష్ట మనుటనుగూర్చి పరామర్శించియుంటిమి. ఇట ని ట్లపభ్రష్ట మన్నవీరు విశాలదృక్పథముతో "ఇట్లు (అర్చులు-వాజులు, రాజు అనుచోట్ల దంత్యతను) చెప్పుటకన్న సంస్కృతచజలాంధ్రలక్షణవిహితస్వరముతోఁ గూడినప్పుడు దంత్యము లగు నని చెప్పు టుచిత" (వై.పా.577)మనిరి. దీని వలన రాజు దంత్యయుక్త మని నిపాతముగాఁ జెప్పుట యనవసర మపుటయే కాక యర్చులు మొద లగువానిలోఁ గూడ దంత్యత సాధింపఁబడుచున్న దనిరి. కాని వీ రుచితముగాఁ జెప్పినమార్గములో నతివ్యాప్తి దోషము గలదు. ఆంధ్రలక్షణవిహిత మగు నుత్వముతోఁ గూడినదే "విగతసంకోచుఁడు రవితేజుఁ" డని వీరువ్యా.సం.స. ప్రభృతులలోఁ జూపినరూపములు. అవి మాత్ర మేల దంత్యము లవరా దనునుద్దేశ్యముతో నిట్లు చెప్పిరా? కాని యిట దంత్యత లేదు.(తె.వ్యా.వి.79)

ఇందలి యొకపై రుధ్యమును వీరిమాటలలోనే యిట్లు గ్రహింపవచ్చును. "హే రాజ! అనుకీతిసంబోధనరూపముల నెవ్వరును రాజు అనుచోటవలె దంత్యముగాఁ బలుకువాడుకయె లేదు. చంద్రా రాజవా నీవు అనుచోటజకారమువలెనె తాలవ్యముగానే పలుకుట రూఢము." (వై.పా.582) దీని వెం తంశములు గమనింపవచ్చును. రాజు అనుచో దంత్యత గలదు. రాజ! రాజవు. అనుచో దంత్యత లేదు. రాజు-రాజ అనుచో సంబోధనమునఁ బదముతుదియుకారమున కయినఅకార మాంధ్రలక్షణవిహిత మగుస్వరము కాదా? రాజు+వు అనుచో 'నియోగమంబులు పరంబు లగునప్పుడుత్వంబున కత్వం బగు' ననుదానిచే నయినయత్వ మాంధ్రలక్షణవిహితస్వరము కాదా? వీనియందలితాలవ్యతను వీరు పేర్కొన్నవయిలక్షణము సాధించుచున్నదా? వీరిలక్ష

జము వీరియభిప్రాయమునకే విరుద్ధమయినయర్థమును దెచ్చిపెట్టుచున్నది.

రాజు + ఆ = రాజా యని సంధి జరిగినస్థలమున నయ్యది దంత్య మగును. రా జెచ్చట ఇత్యాదిస్థలములలో నుకారేతరస్వరముతోఁ గూడినను దంత్యత వినిపింపుటకుఁ గారణము సంధిపూర్వావస్థలోనిదంత్యతయె. (వ్యా.సం.న.77) ఇయ్యది ప్రశ్నాద్యర్థవిశిష్టము. సంబోధనమునందు రాజా యనుచో నత్వము రాజుశబ్దము నుత్వమున కాదిష్ట మవుటచే (వాఁకి దీర్ఘము) సంధి లేదు. కాఁగా దంత్యతాప్రసక్తియు లేదు. ఇట్లే 'రాజవు' అనుచోటఁ గూడ. కాఁగా నుద్దిష్టము లయినరాజా, పాండురాజా అనురీతిస్థలములందు మాత్రమె దంత్యత సిద్ధించుటయు రాజా, రాజవు ఇత్యాదిస్థలముల దాలవ్యతయె యుండుటయు సూరిలక్షణముచే సాధ్య మగుచున్నది.

పెక్కెడల సంస్కృతసమములదంత్యతను గుర్తించినపుడువా రట్టిది యపభ్రష్టమని పేర్కొనుట యుచితము గాదు గదా. ఇంక నిది తాలవ్యముగనె యుచ్చరింపవలయు నని వీరు నిర్ణయింతురు. కాని బ్రాల్లు, పేల్లు, పీజు అనురీతిగా నుచ్చారణమునుగూర్చి వీరు చేసిననియమములవలె నీయదియు నసంభవమె యగును.

"తత్సమతద్భవములం దాకారమునఁ గాని యర్థమునఁ గాని యే భేదమును జూపకుండుట సంప్రదాయవిరుద్ధము కదా" (వ్యా.సం.న.81) యని సంస్కృతపదము దంత్యయుక్తము గారా దనుటకు వే ఱొకహేతువును జూపిరి. కాని పైని బేర్కొన్నట్లు భేదమును జూపవలయు ననుసంప్రదాయ మెచ్చటిదైనను పజ్ఞులవా రుద్ధరించిన బా గుండెడిది.

వీరె యొకచో నిట్లు పేర్కొనిరి. "విభక్తినిమిత్తకము లగుమార్పులు తత్సనిం కేమాత్ర మయినను సంస్కృతశబ్దార్థములందు మార్పు గల్గ నేని యది వైకృతము లనఁబడును గాని తత్సమములుగా నెన్నఁబడుట సంప్రదాయమును గాదు" (వై.పా.681) ఇటఁ గూడ సంప్రదాయమును బ్రస్తావించిరి. జమా యనుప్రాకృతశబ్దమున జకారము తాలవ్యమ యయ్యు (వై.పా.685) జముఁ డనుచోఁ దెలుఁగున దంత్యత కల్గినది. ఇయ్యది ప్రాకృతసమము గావునఁ దత్సమమె. రాజు అనునది మాత్ర మె ట్లైన సంస్కృతసమ మయ్యును దంత్యయుక్తము గారాదు.

సంస్కృతసమములం దెచ్చటను విభక్తినిమిత్తకము గానిమార్పు లేనే లే దని నిర్ణయింపవచ్చునా? గుణవంతమ్ ఇత్యాదులలో సంస్కృతమున వర్గపంచమ ముండుచోటఁ దెలుఁగున సూరి యనుస్వారమును జూపెనే. మార్పు విభక్తినిమిత్త

కము చేయుటకుఁ గాఁబోలును వీరు స్వోత్తమమున గుణవత్త్వము అని ముందుగాఁ బ్రాతిపదికను జూపి పిదప ననుస్వారమును జూపిరి. కాని యనుస్వారమును విభక్తిపరకత్వమున విధించుట మఱచియుందురు. ఋకారాంతంబున కత్వంబు ననుటో సత్త్వరూప మైన వికారముపలెనె. 'మహత్త్వంబున-రాజు నాఁబడు' ననుసూరిలక్షణమున సత్త్వమును దంత్యతయు నిపతింపఁబడినట్లు గ్రహింపఁదగును. అంతమాత్రమున నది తత్సమము గాకుండఁ బోవునా?

కావునఁ దత్సమము(రాజు)న దంత్యయుక్త మన్నచో నయ్యది తత్సమమే కాకుండఁబోవుటప్రమాదము గల్గును. కావున సంస్కృతసమము దంత్యయుక్త మనరా దనుట సంగతము గాదు.

అది యట్లుండఁగాఁ దత్సమవైకృతమానము లోకేతరుగ నెచ్చటను లేదా? కన్య తత్సమమును దద్భవము నగును. అర్థాంతర మున్నను గన్యార్థమున వీయవి శబ్దార్థములందుఁ దుల్యములు గావా? ఇట్టి వెక్కడను లేవనే లేకపోవచ్చును. ప్రత్యేకముగాఁ జేర్కొన్నచోట నట్టియింకొకదానికై వెదుక నేల?

ఇది యట్లుండఁగా నసలు వైకృత మగురాజుశబ్దమును నిర్ణయించు టెట్లు? యయాతిచరిత్రయం దొక్కచో మాత్రమె రాజుశబ్ద మచ్చతెనుఁగుగాఁ బ్రయుక్త మయియుండుటచేతనె ప్రౌఢవ్యాకర్త కొంద ఱందు రని చెప్పెను గాని వైకృత మని నిశ్చయింపలే దని యూహింపవచ్చును. అట్టియెడల వైకృతశబ్ద ప్రభావముచేఁ దత్సమశబ్దమునందు దంత్యత భ్రాంతిమూలకముగాఁ గల్గిన దనుటకంటెఁ దత్సమశబ్దమునందలి దంత్యతచేతనె యది యచ్చతెనుఁగని కొందఱు భ్రాంతి పడి రని తలఁపరాదా? "అచ్చాంధ్రకావ్యములలోఁ బ్రయుక్త మయినరాజుశబ్దము సంస్కృతసమ మగుటచే నందుఁ బ్రయోగింపఁబడుట గ్రామ్య మనియుఁ గవి ప్రయుక్త మగుట నసింద్యగ్రామ్య మనియు"గు.ప్ర., బా.సా.సే.వ్యాఖ్యలు పేర్కొన్నవి. దీనిని పలువురు నిరసించుట సాధారణమె. గు.ప్ర. వీని నన్యదేశ్యముల వలె నసింద్యగ్రామ్యము లనుటను నిరసించుచు వీరు "అన్యదేశ్యములు సంస్కృత సమేతరము లవుటచే నవి యాచ్ఛికములె- వానిప్రయోగము గ్రామ్యమె కా" (వ్యా.సం.స.81) దనిరి. బాల.లో నన్యదేశ్యములు ప్రస్తావింపఁబడలేదు. కావున నట సంస్కృతసమేతర మెల్ల నాచ్ఛికమె యైనది. అన్యదేశ్యములను బ్రస్తావించినచో సూరి యాచ్ఛికముల నిట్లు నిర్వచించెడువాఁడు కాఁడు. అచ్ఛిక మనఁగా నచ్చతెనుఁగు.

అచ్చతెనుఁగునకు వర్ణములు ముప్పదియే యని వీ రుద్ఘాతమునఁ జెప్పిరి. ఋౠ-మొద లగువర్ణములు సంస్కృతసమములతోపా టన్యదేశ్యములనుండియు వచ్చు నవి వీ రీవ్యాకరణమునఁ జెప్పిరి. సంజీవనియందుఁ జెప్పినపైవచనము ననుసరించి యన్యదేశ్యము లచ్చతెనుఁగులు గాఁగా నచ్చతెనుఁగునకు వర్ణములు ముప్పదియే యనుట యసంగతము కాదా? అన్యదేశ్యము లచ్చతెనుఁగు లనుట విచార్యము.

నిజమునకు వైకృతముగా రాజాశబ్దము నంగీకరించుటలో ఇబ్బంది గలదు.

వైకృత మయినవు డందు దంత్యత సామాన్యముగనె సిద్ధించును. అట్టియెడల సంబోధనమునం దత్త్వము వచ్చిన నది దంత్యమె కావలె. ఓరాజ, వలరాజ ఇత్యాదు లందు దంత్యత గలదా? ఇట్లే రాజవు వలరాజవు ఇత్యాదులందును దంత్యత వినిపింపదే. కాఁగా వైకృతముగా రాజాశబ్దము నంగీకరించినను నయ్యది యుత్వవిశిష్ట మయినప్పుడుమాత్రమె దంత్యయుక్త మనవలెను. అయినను రాజా ఇత్యాదులందు దంత్యతను వారింపఁగలయవకాశ మేది? తత్సమశబ్దము నొక్కదానినె యంగీకరించి దంత్యత చెప్పుకొనుట యుచితము గదా. గాజా ఎంతటి సొగసుకత్తియ వనుచోవలె వలరాజా విడువు మనుచో జకార ముచ్చరింపఁబడదు గదా! కాఁగా నొం డొకటో అచ్చతెనుఁగుకావ్యమున రాజాశబ్దప్రయోగము విశేషస్థలముగా (కెంధూళి కెంజడలు, గజానుగతికోలోకోయటంచు నిత్యాదులవలె) గుర్తించుట యుక్త మని తోఁచెడిని. రాకుమారులు, వలరాచవారు ఇత్యాదు లగుసమాసములు వైకృతశబ్దము నంగీకరించి తీరవలసినట్లు నిరూపింపఁజాలవు.

మొత్తముమీఁద 'రాజా' వైకృతముగా నంగీకరించుటలోనె మతభేదముల కవకాశము గలదు. కాని సంస్కృతసమరాజాశబ్దమున దంత్యతను దిరస్కరించుటకు మాత్ర మెట్టి యవరోధమును లే దనియు నది యుచిత మనియు నిర్ణయింపఁ దగును. (చూ. త్రి. శే.)

సూరి అచ్చు-(స్వరము) అనుసంస్కృతసమశబ్దమునదంత్యత నంగీకరింప వలసిన దనుట యుచితమె. (వ్యా.సం.స.79) ఇందు దంత్యత గల దని నేఁటి వైయాకరణులు కొంద ఱనుచున్నట్లు వజ్ఝలవారు పేర్కొనిరి. (వ్యా.సం.స.81) వీరు తాలవ్యముగా నుచ్చరింతురు గాఁబోలును, అచ్చులు, రాజా ఇత్యాదులను దంత్యముగా నుచ్చరించినవారి కిది యసాధ్యము గాకపోవచ్చును. కాని లోకసామాన్యము న ట్లుచ్చరింపుఁ డని యాదేశించినఁ బ్రయోజన ముండు నని తోఁచదు. పదాదియకా

రమువలెఁ గాక యుండలి స్వతంత్రత నంగీకరించుటవలనఁ బ్రక్రియాంశములలో విభ్రమములు లేవు. అట్టి యవకాశ మున్నంతమేర లక్షణబద్ధము చేయుట యవసరము.

## ద్రుతము :

'నకారంబు ద్రుతం' బనుసూరిసూత్రమును వీరు 'పదాంతనువర్ణంబు ద్రుతం' బని సవరించిరి. సూరిలక్షణమునుగూర్చి "నకారంబు ద్రుతంబు- అని సూరి చింతామణి వాసనచే సూచించుట సరి కాదు- ఒక్క నన్నయభారతభాగమందును నన్నయాథర్వణీయగ్రంథమందును మాత్రమె ద్రుతము వ్యంజనరూపముగ వాడఁబడినది- (పు.13) యనిరి. చింతామణి నన్నయకర్తృక మని యెంచుటచేతను (అథర్వణకృత మగు కావ్యము లభింపమిని) చింతామణి యెల్ల నకారమె ద్రుత మని చెప్పిన దని తలఁచుట చేతను నన్నయభారతభాగమున ద్రుతము వ్యంజనరూపముగఁ బ్రయోగింపఁబడిన దని పేర్కొనిరి. ఇది యెల్ల సరి కాదని 'ద్రుతస్వరూపాన్వేషణ' మను గ్రంథమున గమనింపఁదగును.

సూరి నకారంబు ద్రుతం బనుటకుఁ జింతామణివాసన కారణ మనియు నదిసరి కా దనియుఁ జెప్పిరి. వీరు చింతామణివాసననుండి విముక్తులయినందులకు సంతోషింపవలసినదె. సూరిలక్షణమున నకారమును ద్రుతముగాఁ జెప్పుట సరి కా దని సారాంశము. సూరి బాల.కు ముందు రచించినసూత్రాంధ్రమున (చింతామణి వాసనను విడచి) "విభక్త్యాగమవార్ణోన్త్యద్రుతః" అని ద్రుతము నువర్ణ మని స్పష్టముగాఁ గాక 'విభక్త్యాగమావ్యయాత్మక మయిననువర్ణ మని విస్పష్టముగా సూత్రించెను. ప్రత్యయాగమావ్యయాత్మక మయి యుత్వవిశిష్ట మయిననకారము ద్రుత మని ప్రౌఢవ్యాకర్త చెప్పుట కీసూత్రాంధ్రలక్షణము మూల మని చెప్పవచ్చును. అట్లయ్యు 'నో ద్రుతః' అని సూత్రాంధ్రమునందే నకారంబు ద్రుతం బని చెప్పుట గమనార్హము. నకారం బనుటలోనిసూరియభిప్రాయమునుగూర్చి 'ద్రుతస్వరూపాన్వేషణము' న విపులముగఁ బరామర్శింపఁబడినది. అది యందు గమనింపఁదగును.

'నువర్ణంబు ద్రుతం' బనక వజ్ఝలవారు "పదాంత" శబ్దమునుగూడఁ జేర్చిరి. దీనివలనఁ బ్రయోజన మేమి? సూరి పదాంతనకారంబు ద్రుతం బనకుంటలో నష్ట మేమి?

పదాంతమునందున్ననువర్ణ మెల్లయెడల ద్రుత మవునా? జేను పేను ఇత్యాదులఁ బదాంతమందలినువర్ణమునకు ద్రుతత్వము గల్గిన పేఁ దీసెను, చేఁ జూచె ఇత్యాది యగునవరూపములు గల్గును. కాఁగాఁ దరువాతిలక్షణమునుబట్టి ద్రు.ప్ర. లేవో గుర్తించి యివి (ప్రథమాంతములు.) ద్రు.ప్ర.లలోఁ జేరలేదు గావున నివి ద్రుతాంతములు గా వనియుఁ జివరినువర్ణము ద్రుతము గా దనియుఁ జెప్పుకొనవలె. 'పదాంత'విశేషణము లేనిసూరిలక్షణమునమాత్ర మిట్లే కాదా? మఱి యిటఁ 'బదాంత' విశేషణమువలని ప్రయోజన మేమి?

ఇంకఁ గొన్నియెడల పయిలవారియీగ్రంథమునందు విభ్రమములును గల్గును. 'కొన్ని యెడల ద్రుతంబుమీఁద ద్రుతంబు గానంబడియెడి' (సంధి 21) నని వీరుద్ద్యోతమున సూత్రించిరి. ఇచట ద్రుతముమీఁద ద్రుత మన నెట్లు? మొదటిద్రుతశబ్దము నకుఁ బదాంతనువర్ణం బనులక్షణము సరిపడును గొంతవఱకు. అదియును + కాక, అనుచో 'ను' అనుపదమే ద్రుతము. వీరు దీని నన్యథా సమన్వయింతురు. అట నువర్ణ మనునది సమన్వయించుట కష్టము. అది యట్లుండ నీసూత్రముచే విధింపఁ బడినది గూడ ద్రుతమె. అటఁ బదాంతనువర్ణమే వచ్చి చేరు టెట్లు? 'నువర్ణంబు ద్రుతం' బని మాత్రమె చెప్పిననె యీవిధానము సరిపడు ననుట స్పష్టము.

కాఁగాఁ బదాంతశబ్దముచేఁ జేను మొద లగుపదములతుదినువర్ణము ద్రుతము గావలసివచ్చుటలో నతివ్యాప్తిదోషము గల దనవచ్చును. తరువాతిసూత్రమునుబట్టి యది ద్రు.ప్ర. కా దన్నను నీలక్షణమును ననుసరించి యానువర్ణము ద్రుత మగుట కిబ్బంది యేమి? సార్థక మగు'ను'పదమె ద్రుత మయియుండఁగా నటఁ బదాంత[illegible] లక్షణము సరిపడకున్నది.

ఇఁకఁ 'బదాంత'శబ్దముచే నాదిమధ్యములందలినువర్ణమునకు ద్రుతత్వమును వారించుట ప్రయోజన మందుమా? నుదురు, మినుకు- ఇత్యాదులం దున్ననువర్ణము నకు ద్రుతత్వమును వారించుట ప్రయోజన మగు. వీరు ద్రుతముమీఁదిపరుషములకు సరళము లగు' ననురీతిగాఁ జెప్పుటచే ద్రు.ప్ర.లనే కాక యెచ్చట నైనను ద్రుతము మీఁద నాయాకార్యములు గావలయును. అట్టియెడల నిటఁ బదాంతశబ్దము లేకున్నఁ బదమధ్యమునను ద్రుతకార్యము లయి, దురు, (నుదురు) మింగు (మినుకు) అను రీతిగా వవరూపము లేర్పడవలసివచ్చును గావునఁ బదాంతశబ్ద మిటఁ బ్రయోజనవంతము గాఁగలదు. ద్రు.ప్ర.లద్రుతమునకు నాయాకార్యములు విధించినసూరిలక్షణము

పదాంతమునందు నున్నఉవర్ణ మెల్లయెడల ద్రుత మవునా? జేను పేను ఇత్యాదులఁ బదాంతమందలిఉవర్ణమునకు ద్రుతత్వము గల్గిన పేఁ డీసెను, చేఁ జూచె ఇత్యాది యగు నపరూపములు గల్గును. కాఁగాఁ దరువాతిలక్షణమునుబట్టి ద్రు.ప్ర. లేవో గుర్తించి యివి (ప్రథమాంతములు.) ద్రు.ప్ర.లలోఁ జేరలేదు గావున నివి ద్రుతాంతములు గా వనియుఁ జివరిఉవర్ణము ద్రుతము గా దనియుఁ జెప్పుకొనవలె. 'పదాంత'విశేషణము లేనిసూరిలక్షణమునమాత్ర మిట్లే కాదా? మఱి యిటఁ 'బదాంత' విశేషణమువలని ప్రయోజన మేమి?

ఇంకఁ గొన్నియెడల వయిలవారియీగ్రంథమునందు విభ్రమములును గల్గును. 'కొన్నియెడల ద్రుతంబుమీఁద ద్రుతంబు గానంబడియెడి' (సంధి21) నని వీరుద్ద్యోతమున సూత్రించిరి. ఇచట ద్రుతముమీఁద ద్రుత మన నెట్లు? మొదటిద్రుతశబ్దము నకుఁ బదాంతఉవర్ణం బనులక్షణము సరిపడును గొంతవఱకు. అదియును + కాక, అనుచో 'ను' అనుపదమే ద్రుతము. వీరు దీని నన్యథా సమన్వయింతురు. అట నువర్ణ మనునది సమన్వయించుట కష్టము. అది యట్లుండ నీసూత్రముచే విధింపఁ బడినది గూడ ద్రుతమె. అటఁ బదాంతఉవర్ణమే వచ్చి చేరు టెట్లు? 'ఉవర్ణంబు ద్రుతం' బని మాత్రమె చెప్పినచె యీవిధానము సరిపడు ననుట స్పష్టము.

కాఁగాఁ బదాంతశబ్దముచేఁ జేను మొద లగుపదములతుదిఉవర్ణము ద్రుతము గావలసివచ్చుటలో నతివ్యాప్తిదోషము గల దనవచ్చును. తరువాతిసూత్రమునుబట్టి యది ద్రు.ప్ర. కా దన్నను నీలక్షణమును ననుసరించి యాఉవర్ణము ద్రుత మగుట కిబ్బంది యేమి? సార్థక మగు 'ను'పదమె ద్రుత మయియుండఁగా నటఁ బదాంతత్వ లక్షణము సరిపడకున్నది.

ఇఁకఁ 'బదాంత'శబ్దముచే నాదిమధ్యములందలిఉవర్ణమునకు ద్రుతత్వమును వారించుట ప్రయోజన మందుమా? నుదురు, మినుకు- ఇత్యాదులం దున్నఉవర్ణము నకు ద్రుతత్వమును వారించుట ప్రయోజన మగు. వీరు ద్రుతముమీఁదిపరుషములకు సరళము లగు' ననురీతిగాఁ జెప్పుటచే ద్రు.ప్ర.లనే కాక యెచ్చట నైనను ద్రుతము మీఁద నాయాకార్యములు గావలయును. అట్టియెడల నిటఁ బదాంతశబ్దము లేకున్నఁ బదమధ్యమునను ద్రుతకార్యము లయి, దుదు, (నుదురు) మింగు (మినుకు) అను రీతిగా నపరూపము లేర్పడవలసివచ్చును గావునఁ బదాంతశబ్ద మిటఁ బ్రయోజనవం తము గాఁగలదు. ద్రు.ప్ర.లద్రుతమునకు నాయాకార్యములు విధించినసూరిలక్షణము

కాని యీరీతిఁ భ్రాంతి గలుగకుండుటకే కాఁబోలును సూరి యర్థవంతముగా ఎడు ప్రత్యయాంతమునకు 'ప్రసన్ను లయ్యెడున్' అనునది యుదాహరించెను. వీరు 'ప్రసన్నులయ్యెడును' అని చూపిరి. అయ్యెడున్ తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచన మనువీరిపై వివరణమునుబట్టి 'ప్రసన్నులయ్యెడును' అనుచోఁ గ్రియ లాడ్రూప మనియె భావించి రనవలె. కానీ యది పొరపాటు.

ఇందుఁ గర్తృవాచకము "ప్రసన్నులు" అనునది. ఇది బహుత్వమున నున్నది. కావునఁ గ్రియయును బహుత్వమున నుండవలెను. అగు అనుధాతువుపై ప్రథమ పురుషబహువచనము చేరవలయును. ఆశీరర్థమున లాట్టు వచ్చినఁ గర్త ననుసరించి క్రియ బహువచనాంత మై ప్రసన్ను లయ్యెదరు అని కావలె. 'ప్రథమ మువర్ణంబున కెడుగెడినాగమంబులు' (క్రియ.23)వచ్చును గావున అయ్యెడును అన్నది వఝలవారు పైని పేర్కొన్నట్లు ప్రథమపురుషైకవచనాంతము. కర్త బహువచనాంత మైయుండఁగాఁ గ్రియ యేకవచనాంత మగుట యెట్లు? ఇట సర్వములను గూర్చిన ప్రసంగము గావునఁ దిర్యక్కర్తృక మవుటచే బహువచనమున నేకవచన మయినదని (క్రియ.26) సమర్థించుటకు వీలు లేదు. కర్తృవాచక మగు 'ప్రసన్నులు' అనునది మహద్వివక్షచే మహత్కార్యము నందినది. కావునఁ గ్రియయు మహదర్థమున నుండఁగా బహువచనమున నేకవచన మగు నవకాశము లేదు. కానఁ బ్రసన్ను లయ్యెడును అను(నన్నయ) ప్రయోగమునందు 'అయ్యెడును' అనునెడుప్రత్యయాంతము లాడ్రూప మనుటకు వీలు లేదు. కాఁగా నది యాశీరర్థక లాడ్రూపమె. లాట్టుడున్నన కెడుకవర్ణము (క్రియ.28) విధింపఁబడె. కావున ప్రథమపురుషబహువచనమునం దయిన దు వర్ణము స్థానమున 'ఎదు' ప్రత్యయ మై అయ్యెడున్ అనునది బహువచనాంతము గాను నేర్పడును. కాఁగా విధి లాడ్రూపము గామియు, నాశీరర్థకఎడుప్రత్యయాంత మగుటయు గుర్తింపఁగా ప్రౌ.వ్యా.వివరణమున తత్ప్రత్యయముతోపాటు ఎడుప్రత్యయమును గూడఁ బేర్కొని తెలిపినదే యనియు సూరి పేర్కొన్నయద్దానిని వఝలవారు తొలఁగించుట(దానికి ప్రసన్ను లయ్యెడును? అని యుదాహరించుటయు) సరి కాదని స్పష్టము. సూరివివరణమె నిర్దుష్టము.

సూరి ప్రౌ.ప్ర.లలో 'తానునేనుపదంబులును'-చేర్కొనఁగా వీరు దానిని దొలఁగించిరి. దీనిఁగూర్చి "నేనుతానుపదంబులు ద్రుతప్రకృతికములు గావు. వానితుదిని ను ప్రత్యయము ప్రథమైకవచనము గావునఁ గళ '(ఉ.14) లనిరి. (వానితుదిని నువర్ణము ప్రథమైకవచనములే. ఒకవేళఁ గాకున్నను ప్రథమైకవచనాంతము లగుటచే

జేను, పేను ఇత్యాదులవలె నవి కళలు గాకతప్పదు. అయిన నవి కళలు గావ లసివచ్చుటచేతనే కదా సూరి ప్రత్యేకముగా 'తాను,నేనుపదంబులును ద్రుతప్రకృతికంబు' లని చెప్పినది. తానునేనులు కళ లనుటకు 'ఏను విదప' ననుతిక్కనప్రయోగ మాధారము, "అవధారణార్థకముపై గసడదవాదేశము రాదు కాన- ఏన విదప అని దిద్దుట పొరపా (ఉ.15)టనిరి. అసలు దిద్దఁ దలఁచుటయే పొరపాటు. కవిప్రయోగము విలక్షణముగా నున్న నట్టిదానిని విశేషముగా గుర్తించుట యుక్తము. కాని దాని నిష్టలక్షణానుగుణముగా దిద్దివేయుట యుక్తము గాదు గదా. అట్లు లాక్షణికు లెల్లరు తమతమసిద్ధాంతముల కనుగుణముగాఁ గవిప్రయోగములను దిద్దివేసినఁ మఱి కావ్యములస్వరూప మె ట్లుండును? కాఁగా నవధారణార్థకముపై గసడదవాదేశ మొకపక్షమున నిష్టమె యయినను 'ఏను విదప' అనియె కవి ప్రయోగించిన దానిని ఏన విదప అని దిద్దుట యక్రమము.

తానునేనులు ద్రుతప్రకృతికములే (ద్రుత. తానునేనులు కళలా) సూరి తాను నేనులు ద్రు.ప్ర. లనుట యుచితము నవసరమును, వఝలవారు తొలగించుటయే సరి కాదు.

నేనుతానులనుప్రత్యయముయొక్కయుఁ దుదిస్వరము లోపించినపు డామిగిలిన నకారము ద్రుతకార్యముల నందు' (ఉ.16) నని వఝలవారిసిద్ధాంతము. స్వరలోపమై తాన్ నేన్ అని యున్నపు డానకారము ద్రుతము గాకయె ద్రుతకార్యము లందునా? లేక ద్రుత మగునా? ఈస్థితి తాన్ నేన్ అనుచోట్లనే యగునా? లేక పేన్ చేన్ ఇత్యాదులందుఁ గూడనా?

'పదాంతనువర్ణంబు ద్రుతం' బని వీరిలక్షణము. అట్టియెడల దాను నేను అని పదాంతముల నున్ననువర్ణము ద్రుతము గాకుండుట యేమి? నకారంబు ద్రుతం బనుట సరి కా దని నిశ్చయించిన వీరి యిచ్చటియభిప్రాయము ననుసరించి తాన్ నేన్ అనుచోట్ల నకారము మాత్రము ద్రుత మగుట యేమి? నువర్ణము ద్రుత మయినచోఁ దద్వికృత మగునకారము ద్రుతము గాఁగలదు. కాని నువర్ణము ద్రుతము గాకుండ స్వరలోపానంతరము నకారపుఁబొల్లునకు ద్రుతత్వ మెచ్చటనుండి వచ్చినది. వీరి యీపద్ధతి ననుసరించి నువర్ణంబు ద్రుతం బనక నకారంబు ద్రుతం బనుట యవసరమని తెలుచున్నది కదా. అదియునున్ గాక యిత్యాదిస్థలములనుబట్టియు నువర్ణమని

కాక నకారం బని చెప్పుటలో సౌలభ్యము గమనార్హము.

తాను నేనులు ద్రు.ప్ర.లు గాక తాన్,నేన్,లు ద్రు.ప్ర. లైన సూరిపలెఁ దాను నేనులను జేర్చకున్నను వజ్ఝలవారిట్లు తాన్,నేన్‌లు ద్రు.ప్ర. లని చెప్ప నక్కఱ లేదా? ఇవి ద్రు.ప్ర.లు గాక, తుదినకారపుఁబొల్లు ద్రుతమును గాక ద్రుతకార్యము లవుట వింతయే.

మొత్తముమీఁద వజ్ఝలవారియీప్రసంగమును బట్టి తానునేనులు కళ లని నిశ్చయింపరాకున్నను, ద్రుతము నువర్ణ మనుటకంటె 'నకారంబు ద్రుతం' బనుటయె సరిగ నుండు నని మాత్రము నిర్ణయింప వలనుపడుచున్నది.

ఇట సూరి "శతృతుమానంతర్యచేదాద్యర్థకంబు" లని యానంతర్యార్థమున 'డు'వర్ణాంతము ద్రు.ప్ర.లలోఁ జేర్చెను. వీ రది తొలఁగించిరి. దీనింగూర్చి "సూరి కొట్టుడున్- అనునానంతర్యార్థకము నుదాహరించుటయు దానిని సూత్రించుటయు నవి మర్శనకృతములు. డు అనుభావార్థకప్రత్యయమును గలదు. చార్థకశబ్దముతోఁ గూడి భావప్రత్యయ మానంతర్యమును బోధించు '(ఉ.14) ననిరి. భావార్థమున డుప్రత్యయమును వీరును విధించియుండలే దన్నవిషయము గమనింపవలసియున్నది. వివరించుట మే కాని విధించుట లేదు. భావార్థమున టప్రత్యయమె ప్రసిద్ధ మయియుండఁగా నానంతర్యార్థమున డుప్రత్యయమె ప్రసిద్ధ మైయున్నది. చార్థకనుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థము పుట్టు ననుటకంటె ద్రుతాంతముగా డువర్ణమును ప్రత్యేకముగా విధించుట యుక్తము. టవర్ణకముపై నిట్టిస్థితిని ప్రౌఢవ్యాకర్త విశేషముగఁ జేర్కొనెను. అట్టిపద్ధతియె యుచితము. కావునఁ (జింతామణ్యాదులు చెప్పలే దని మానుటకంటెఁ) ప్రయోగప్రసిద్ధి కనుగుణముగ నానంతర్యమున నిద్దాని విధించుటయె యుచితము గాన సూరిమార్గము నిర్దుష్టమె యనఁదగును.

"సూరి భావలక్షణార్థకము నుదాహరింపకుండుట పొరపా" (ఉ.14) టని యెంచి "శతృతుమ్భావలక్షణ చేదాద్యర్థకంబు" లనిరి. భావలక్షణముచే వృత్తం బగుభావలక్షణము గ్రహింపఁబడును. కొట్టినను, తిట్టినను అవి యుదాహరించిరి. ఇందుఁ గొట్టినన్ అనుదానిని సూరియు నిట నుదాహరించియే యున్నాఁడు. భావలక్షణార్థమును సూరి గ్రహింపలే దన నేల? చేదాద్యర్థకంబు లనుచోటి భావలక్షణార్థమును గ్రహింపరాదా? కొట్టినన్ అని యుదాహరించుటలో చేదర్థముతోపాటు వృత్తం బగు భావలక్షణార్థ మిట్లు గ్రహింపవచ్చును గద. భావలక్షణార్థము నుదాహరింపలే దన

నేల? ఇట నుదాహరించిన 'కొట్టిన్' అనునదే తుమర్థమునకును, భావలక్షణార్థమున కును నుదాహృతి కాఁగలదు. తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' ననునొకే సూత్రముచేతనే తుమర్థమునందును, భావలక్షణార్థమునందును నుజీ విధింపఁబడినది. పైని కొట్టినన్ అనునదియు నిట్లే. రెం డర్థములయందు రూపము సమానముగా నగు చుండఁగా రెండింటిని వేఱుగా (వడ్లవారివలె) నేల చూపవలె. ఒకదానిచే సంగ్ర హింపఁబడదా? అది య ట్లుండఁగా భావలక్షణార్థము నిట సూరి యుదాహరింపలే దని మీ రెంచుచున్నారు. అది దోషమా? భాషలోని ద్రు.ప్ర.లన్నియు నిటఁ జూపవలెనా? ఇటఁ జూపనివి ద్రు.ప్ర.లు గాక కళ లగునా? అయిన వలెఁప్రభృతు లనుచోఁ ప్రభృతిశబ్ద మేల? వేదాద్యర్థకంబు లనుచో నాదిశబ్ద మేల? ఇం తేల, వీరే సంజీ వనిలో "ఇచటి ద్రుతప్రకృతికములపట్టిక స్పష్టప్రతిపత్తిమాత్రఫలకము. కావున నిందు భావలక్షణార్థకనుజ్యంతము--- మున్నగునవి యుదాహరింప కున్నను క్షతి లే (వ్యా.సం.ప.87) దని చెప్పిరి గదా. అక్కడఁ దప్పు గానియంశ మీయుద్యోతము నాఁటి కేల పొరపా టయినది? కాఁగా నిట సూరివచనములందు దురుక్తి లేదు.

సూరివలెనె వీరు నిటఁ జేదాద్యర్థకము లనుచో నాదిశబ్దమును బ్రయోగించిరి. సూరివచనమందలియాదిశబ్దముచే భావలక్షణార్థమును గ్రహింతము. వీరు ప్రయోగిం చినయాదిశబ్దముచే నేది గ్రహింపవలె? వీరు భావలక్షణమును బేర్కొనిరి. దానిచేత వృత్తం బగుభావలక్షణము గ్రహింపఁబడదా. ఆదిశబ్ద మున్నది గదా యని యట్లు భావలక్షణ మనుదానిచే గ్రహింపక వృత్తం బగుభావలక్షణము నాదిశబ్దముచే గ్రహింప వలయు నేమో.

"చక్కని చక్కన ము న్నగువానియందలి ని.న.ప్రత్యయములయు, ఏను (అయిదు)ము న్నగుమఱికొన్నిశబ్దములయుఁ దుదిస్వరము లోపించునపు డాముగిలిన నకారము ద్రుతకార్యముల నందు" (ఉ.15) ననిరి. సూరిలక్షణమున నిట్లు చెప్పుట సాహసము. చక్కని అనుచోట ని అనునది ప్రత్యయము గాదు. కర్మధారయమం దందుఁ బూర్వపద మగుగుణవచన మైనవల్లాదిశబ్దముల కగుపిగాగమము. ని-న-ల యందు స్వరలోప మెట్లు. పదాంతంబు లయియస్వయుక్తంబు లయినవులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు (ప్రకీ.16) ననుదానిచే నగు ననిరి. ఆసూత్రము చెప్పునది యుత్వమునకు లోపము. కావున నిట నిత్వమునకు నత్వము నకు లోప మాసూత్రములోనిబహుళపదముచే నన్యకార్యముగా నగు ననవలెను.

ఆయంశమును వీరు పేర్కొన్నటా గుండెడిది. అట్లు స్వరలోపము కాఁగా మిగిలిన నకారమునకు ద్రుతకార్యము లగు ననిరి. అది యెట్లు? 'ద్రుతముమీఁదిపరుషములకు సరళము లగు' ఇత్యాదు లగువీరిలక్షణములు ప్రవర్తింపవలె నన్నను నకారము ద్రుతము కావలయునే ద్రుతము గాకయె ద్రుతకార్యము లగుట యెట్లు? ఇది గూడ బహుళశబ్దమహిమచేతనె అని వారే చెప్పిరి. "—స్వరలోపము గల్గినప్పు డాసూత్రిములో నిబహుళశబ్దమహిమచే ద్రుతకార్యముల నందును.కొన్నిటనామిగిలిననకారము పూర్వావస్థలోనిప్రథమచొప్పునఁ గళయే యగును. (ఉ.15)స్వరలోపము మాత్రి మాసూత్రిముచే సాధారణముగనె యగుచున్నట్లు పేర్కొనిరి. కాన ని,న,లలో స్వరలోపమె బహుళమహిమచే నగునదిగాఁ జెప్పవలె. బహుళమహిమచే స్వరలోపము, బహుళమహిమచేతనె (ద్రుతము గాకయు?) ద్రుతకార్యములా. బహుళశబ్దమునకు మహిమయధికమె యైనను వీనికి ద్రుతత్వమును విధించుకొనుట లాఘవము గదా! ఇంతయుఁ జేసి యిట సాధింపఁబడురూపము లేవి, కమ్మందేనె, చక్కంగ ము న్నగు నత్యల్పములు. ఇట్లే ఏఁబది మొద లగువానిఁగూర్చి ద్రుతస్వరూపాన్వేషణమున గమనింపఁదగు. (పుటలు 216 మొ॥)

ఇంక నిట నింత కొన్నిట నామిగిలిననకారము పూర్వావస్థలోని ప్రథమ చొప్పునఁ గళయే యగు ననుట. ఈప్రథమాత్వము కొన్నిట మాత్రమె యుండు ననఁగా ద్రుతకార్యము లగు నని చెప్పిన మిగిలినకొన్నిట ప్రథమాత్వ ముండదా? ప్రథమాత్వమును దొలఁగింపఁజాలదు గదా! 'కళయె' యగు ననుటలోఁ బూర్వావస్థలోనిప్రథమాత్వము గారణముగాఁ జూపుట యనవసరము. పైఁగాఁ బూర్వావస్థలోనిప్రథమచొప్పున ననఁగా స్వరలోప మైనపిదపఁ బ్రస్తుతావస్థలో వీనియందును బ్రథమాత్వ ముండ దేమో యని సందేహము గల్గును. స్వరలోపముచేఁ బ్రథమాత్వమునకు భంగము వాటిల్లునా? ఇట వీరు 'పూర్వావస్థలోనిప్రథమచొప్పున' నని చెప్పుట యసంగత మని నిశ్చయింపఁదగును.

స్వరము లోపించినను లోపింపకున్నను బ్రథమాంతత్వ మెల్లయెడల నిట నుండకతప్పదు.

ఇఁకఁ 'గళయె' యగు నని చెప్పుటలోఁ బూర్వము ద్రుతకార్యము లగు నని చెప్పినపోటి నవి ద్రు.ప్ర. లగు నని యర్థ మగుచున్నది. ప్రథమాంతతచేఁ గళాత్వము సిద్ధ మైయున్నది. కొన్నింటమాత్రము స్వరలోప మైనపిదప ద్రు.ప్ర.త్వము గల్గుట విశేషము. ఇట్టియెడల వీనిని (తాన్ నేన్ మొ.) ద్రు.ప్ర.లపట్టికలోఁ జేర్చుట

యుచితము గాదా? సూరి తానునేనుల నల్లె ద్రు.ప్ర.లుగాఁ జెప్పుట సంగత మైయున్నది. ద్రుతకార్యములనుబట్టి ప్రథమాత్వము లేకుండఁబోవు నని చెప్పక ప్రథమాంత మైనను ద్రు.ప్ర. లవు ననుట సమంజసము.

ఇంక వఝలవారు ద్రుతకార్యము లగు ననుచు ద్రు.ప్ర. లవు నని సూచించిరి కాని ద్రు.ప్ర. లవు నని స్పష్టముగాఁ జెప్పకపోవుటకుఁ గారణ మేమి? తాను, నేను అనురీతిగాఁ దుదిని స్వర మున్నపుడు కళ లనియు నాస్వరము లోపించిన ద్రు.ప్ర లనియుఁ జెప్పుట యనుచిత మనునభిప్రాయము గానోపును. ఏ మయినను స్వరలోపము లేనిచోఁ గళలును, స్వరలోప మైన ద్రు.ప్రలు నవు ననుట సక్రమము గా దని విశ్వయింపఁదగును.

పిదప "చేసెదనున్- చేసెదను- చేసెద" అని యిటఁ జూపుటలో వఝలవారి యుద్దేశ్య మేమియో స్పష్టము గాదు.దీనియందు వారిచిం.వ్యాఖ్యావాసనాబలమున్నది. ఉత్తమపురుషైకవచన మగునువర్ణముపై 'అన్యే ద్రుతప్రకృతయః' అనుసూత్రముచే ద్రుతము చేరి చేసెదమన్ అనురీతిగా నగు నని వీరు చిం.వి వ్యాఖ్యానించిరి.అట్టిరూపమును వీ రీవ్యాకరణమునఁ జూపు టేల? బాల.ననుసరించి 'చేసెదను' అని మాత్రమే యగును.ఉద్ద్యోతమున వీరు సైత ముత్తమపురుషైకవచనముపై ద్రుతమును విధింపలేదు. వండెదను (ఉ.367) అనియె లాద్రూపము నుదాహరించియున్నారు.ఇం తేల? ఇటనే ఉత్తమపురుషైకవచనాంతద్రు.ప్ర.ను వచ్చెదను అనియె (ఉ.14) చూపుట గమనింపవచ్చును. మఱి యిచ్చట మ ఱొక్కద్రుత మెక్కడిది?

ఇంకను వీ రిట ద్రుతము నువర్ణ మని చెప్పిరి గావున నుత్తమపురుషైకవచన మగునువర్ణముపై ద్రుతము ('ను') చేరిన చేసెదనును, చేసితినిని అని చూపవలయును. ఇట్టివి భాషలో నుండవు. అయిన చేసెదనున్ అని యెట్లు చూపి రట. చేసెదను, చేసెదన్ అని మాత్రమే చూపఁదగును.

పిదప వీరు కందోయి, ఏనిన్ అనువానింగూర్చి వివరించిరి. వఝలవారి 'కందోయి' ప్రక్రియయం దనౌచిత్యములె వెండు.

### కందోయి :

"కన్ను+దోయి అనుచో కన్నుంగవ మ న్నగుచోటులందువలె సామాసిక

నుగాగమము చేసి యందలి 'న్ను' అనుదానికి వికృతాదిసూత్రము చొప్పున లోపము చేయఁగా కనుదోయి అను ద్రుతసహితరూపము నిల్చును. పిదప ద్రుతకార్యములతో కందోయి" (ఉ.16) యగు ననిరి.

కన్నుంగవ ఇత్యాదులలోవలె నుగాగమ మయినచోఁ గన్నుందోయి యగును. వికృతాదిసూత్రముచే న్నులోపము చేయవలె ననిరి. వికృతాదిసూత్రమును వర్తింపఁజేయునెడల 'న్ను'లోప మొక్కటి మాత్రమె యేల చేయవలె. వికృతాదిసూత్రముచేతనే కన్ను+దోయి కందోయి యని యగు నన్న నష్ట మేమి? సూరి కిట్టి యభిప్రాయము లే దనకతప్పదు. ఉన్నచో కన్+దోయి యని యిచటఁ జూపెడి వాఁడే కాదు. అనఁగా 'న్ను'లోపము చేయనుద్దేశ్యము సూరికి లేదు.

సామాసికనుగాగమముచే కనుదోయి యగు ననిరి.

సూరి కన్+దోయి యని పొల్లనకారమును జూపెను. వీరును వర్ణయుక్తకళసూత్రమునొద్దఁ బొల్లనకారమునే చూపిరి. నుగాగ మగు నని వీరివలె సూరియుఁ దలఁచిన వీరివలెనె కనుదోయి యనియే చూపెడువాఁడు గదా! కావున కన్‌దోయి చూపినసూరి సామాసికనుగాగమ మగు నని తలఁపలే దని స్పష్టము. ఇట నకారపుఁ బొల్లే యాగమ మగు ననుటకు వీలు లేదు. (ద్రు.176) కావుననే వరుులవారు నిట నాగమమును 'ను'వర్ణముగానే చూపిరి.

ఈవజ్ఝలవారి వివరణము సూరిమతమునకు భిన్నము. (ద్రు.193) అదియు నుచితముగాఁ దోఁపదు. (ద్రు. శబ్దగతనకారము ద్రుతమా? ద్రుత. ఏవి గళ యగునా?)

తన్వాద్రపభృతులు :

ఆం.బా.అ.కర్త 'తన్ను-నన్ను- నిన్ను- ఇవి కళ లని చెప్పెను. ద్వితీయావిభక్తి చేరనపు డివి కళ లైనప్రకృతు లని తెలియుచున్న' దనుటను విమర్శించుచు వరుులవారు అప్ప.5-22, 24పద్యముల ననుసరించి యివి వైకల్పికద్రుతప్రకృతికము లగుట ప్రస్తావించిరి. (వ్యా.సం.స.107,216) అప్పకవియే రెం డభిప్రాయములఁ బ్రకటించెను.'నిన్ను నెఱుఁగంగ, నన్నేలుకొనుము'అనువానింబట్టి యివి వికల్పంబువలన ద్రుతప్రకృతికము లయినట్లే చెప్పవలసియున్నది. కాని యింతకు ముం దప్పకవియే 'తన్ను, నిన్ను, నన్ను, విన్ను ము న్నామిన్ను చన్ను కన్ను వెన్ను

శబ్దములకు జడ్డ యుండుఁ బోవుఁ జర్చింప నివి ద్రుతప్రకృతికము లెపుడు గావు భక్త సులభ' (అప్ప.6.27) అనెను. దీనింబట్టి యివి యెప్పుడును ద్రు.ప్ర.లు గా వన వలెఁ గదా. ద్రు.ప్ర. లెప్పుడు గా వని యొకసారి వికల్పమువలన ద్రు.ప్ర. లగు నని యొక్కసారి చెప్పుటో నప్పకవివచనములలోనే వైరుధ్యము చోటుచేసికొన్నది. వజ్ఝలవారు విరోధము లే దందురు. "ఇందలి విన్ను ప్రభృతులు ప్రథమాంతము లగుటఁ గళలే. ద్వితీయాంతత్వయందునుఁ బాక్షికముగాఁ గళ లని యాతఁడు తలంచిన తన్ను విన్ను నన్ను అనువానిని దక్కినకళాశబ్దములతో జోడించి చెప్పుటలో విరోధము లే" (వ్యా.సం.స. 107) దనుటలో సంగతి యేమి? విన్ను ప్రభృతులు ప్రథమాంతము లైనవి యెప్పుడును గళలే కదా. తన్ను ప్రభృతులు పాక్షికముగాఁ గళలవు ననఁగా నొకపక్షమున ద్రు.ప్ర.లే. నిత్యకళలను, బాక్షికకళలను గలిపి చెప్పుటలో విరోధమె లేదా? 'ద్రుతప్రకృతులెపుడు గావు' అని చెప్పుచున్నపు డెప్పుడును ద్రు.ప్ర.లు గావివిన్ను ప్రభృతులతో (ముందే) నప్పు డప్పుడు ద్రు.ప్ర. లగుతన్ను ప్రభృతులను జేర్చుట యెట్లు గుదురును?

అయ్యె ఆం.శా.అ. అప్పకవి రెండవయభిప్రాయమును గూడఁ బ్రస్తావించిన బాగుండెడిది. ఆం.శా.అ. కళ లైనప్రకృతు లనుటను వఝలవారు విమర్శించు టుచితముగా నున్నది. (వ్యా.సం.స.216)

దీనింగూర్చి గు.ప్ర.ను విమర్శించుచు 'తన్నును, నన్నును అని పేర్కొను నపు డవి ద్రుతప్రకృతికము లనఁబడును. తన్ను విన్ను నన్ను అని పేర్కొనునపు డవి కళ లనఁబడును. ఇట్టిస్థితిలో విరోధ మే' (వ్యా.సం.స. 107) దనిరి. పయి పద్యమున నప్పకవి యెప్పుడును ద్రు.ప్ర.లుగా ననుటలో విరోధము లే దని వఝల వా రెంచి రన్నమాట. అది యట్టిద యందము.అప్పకవియభిప్రాయము ననుసరించి చూచిన 'తన్ను' నకారము ద్రుతమె.కాని తదంత మగునీశబ్దము మాత్ర మెపుడును క్రిందివకారము లోపించినను ద్రు.ప్ర. గానేరదు. ఇ ట్లనుటుచితమా? తన్ బంచిన విన్జూచి, నన్ బిలిచి యనుకవివ్యవహారము ననుసరించి తన్ ఇత్యాదులు ద్రు.ప్ర.లు గా వను టొప్పునా? 'మహీజాతను గొనివచ్చె' ననురీతి నప్పకవి చూపినస్వత్వరూపముల ననుసరించి తను బంచిన' విను జూచి యనురీతిరూపము లుండనవు. అట్టియెడ నివి యెప్పుడును ద్రు.ప్ర.లు గా వను టెట్లు? ఇక్కడ నప్పకవి చూపినవిన్ను ప్రభృతుల కిట్టిస్థితి లేదు గదా. తన్ బంచిన అనురీతి వాతవిదృష్టి కెక్కలే దేమో.

వజ్ఝలవా రప్పకవిసంధిసిద్ధాంతము చెప్పను ప్రస్తావించి తన్నుప్రభృతులు కళ లనుటను సమర్థింపఁబూనిరి. కాని యదియుఁ గుదురదు. కళాత్వమున సంధి యవుటయు, ద్రు.ప్ర.త్వమున సంధి లేకుండుటయు నప్పకవిసిద్ధాంతము. ఇట నప్పకవి జడ్డ పోయినను గళయె యగు ననెను. కాఁగా తను+అడిగె ననురీతి నున్నను సంధి యైన త నడిగె నని యపరూపములు గావా? విన్నుప్రభృతులకు నిట్లే, చను+అంటి చనంటి అని సంధి యవునా?

ఇక్కడ ద్రు.ప్ర.లను నిరూపించుటయు, నివి నాంతము లయ్యు ద్రు.ప్ర.లు గాకుండుటయు ననునంశములు చెప్పుటయె యప్పకవియుద్దేశ్యము. సంధిప్రస్తావన యింకను దరువాత నెక్కడనో గలదు. దాని ననుసరించి యిట నిట్లు చెప్పె ననుట యొప్పదు.

ఏ మైనను తన్ను విన్ను నన్ను అన్నవి జడ్డ లోపించినప్పటికి నెప్పుడును ద్రు.ప్ర.లు గా ననుట సరి కా దనక తప్పదు. కాన గు.ప్ర. విమర్శించుటలోఁ దప్పు లేదు. స్వరసంధి నుద్దేశించి వఝలవారు సమర్థించినతీరును త నడిగె ననురీతియపరూపములకు మూల మగుచు ససమంజసమె యవుచున్నది.

విన్నుప్రభృతులందువలె తన్ను,నిన్నునన్నులందలితుదినకారమును శబ్దము తోడఁ బుట్టినదే యని యప్పకవి యొకవేళ భావించి యున్న నది యింకను విలక్షణ మనక తప్పదు. సా.త్రి.శ. ననుచేత, ననుకొఱకు, ననువలన ననురీతిరూపముల నుదాహరించుట గానవచ్చుచున్నది. అయ్యుఁ బ్రథమయందు తాను, నేను, నీవు అను రీతి నుండును గాని తన్ను నన్ను విన్ను అని యుండనేరదు. ఒకవేళ (తన్నునుండి తాను సాధింపఁబడినను నిటఁ బ్రకృతి చూపు టెట్లు?) అప్పకవియభిప్రాయ మెట్లును సమన్వయింపఁబడుట లేదు.

నాప్రాతిపదిక ద్వితీయైకవచనమున 'నన్ను' అని యగును.సూరిమతము ననుసరించిన నిందలినువర్ణము ద్వితీయావిభక్తియె. ముందటి'న్ను'వర్ణము విభక్తి కాగమము చేసికొనవలెను. అపుడె నన్ను+అడిగె ననుచో విభక్తియుకారమునకుఁ జెప్పిన సంధి యవుట గుదురును. ఈ'న్ను'వర్ణము చేరకుండుటయుఁ గల దని గుర్తింపవలయును. అపుడు నను, తను విను- అనురీతి నవును. తను+పంచిన- తప్పంచిన అనురీతి నవును. ఈనువర్ణము ద్వితీయైకవచనమె కావున ద్రుతమె. కావునఁ దను, విను నను ద్రు.ప్ర.లే. పైని ద్వితీయావిభక్తిప్రత్యయము లేకుండఁ దన్ను,

నన్ను, నిన్ను అనురీతిగా ద్వ్యర్ణాంత మైయుండదు.కావున నది ద్రు.ప్ర. లేక కళ యనుప్రశ్నకుఁ దావు లేదు.'తన్ను' అనురీతి నన్న నవపాఠమున ద్రుతము లోపించినరూప మగును.ఇ ట్లవి యెప్పుడును ద్రు.ప్ర.లే కాని కళలు గావు. (చూ.ద్రుత.)

## ద్రుతోపజీవులు :

"శబ్దావయవద్రుతము గలవి ద్రుతప్రకృతికములు.అర్థవిశేషబోధక'ను'శబ్దముతోఁ గూడినవి ద్రుతోపజీవిశబ్దములు. ద్రుతప్రకృతు లీవల నుదాహృతము లయ్యె (ఉ.16) వనిరి. ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు నిట్లు భిన్నములుగాఁ జూపినవీ రింతకుముం దుదాహరించినద్రు.ప్ర.లలో ద్రుతోపజీవులను గలుపుట వింత. ద్రు.ప్ర.లలో ఎంతయును. అయ్యును, కొట్టుడును అనువానిం జూపిరి. పిదప నివి ద్రుతోపజీవులగుటను వివరించిరి. మఱి ద్రు.ప్ర.లు గానియీశబ్దములను ద్రుతోపజీవులనవేర్కొనసూరివలె వీరు ద్రు.ప్ర.లలోఁ జేర్కొన నేల? ద్రుతోపజీవు లయ్యును వీనికి ద్రు.ప్ర.సంజ్ఞ యుండునా? పై నుద్ధరించినవాక్యములనుబట్టి చూచిన ఎంతయును మ న్నగుద్రుతోపజీవులనుద్రు.ప్రలలో నీవలనె యుదాహరింపఁబడినసంగతి మఱచి రేమో యనిపించును. ద్రు.ప్ర.లు ద్రుతోపజీవులు రెండును ద్రుతాంతములె యైనను శబ్దావయవద్రుత మున్ననే ద్రు.ప్ర. లవును.చార్థకనుశబ్దాంతములు ద్రుతోపజీవు లనఁగా ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు గా వనియే యర్థ మగుచున్నది గదా.

"ద్రుతోపజీవినశ్శబ్దాః అనునథర్వణవచనము నరయక సూరి ఎంతయున్ అయ్యున్- అనువానిని ద్రుతప్రకృతికములుగా నుదాహరించెను. అవి ద్రుతోపజీవిశబ్దములే కాని ద్రుతప్రకృతికములు గా" (వ్యా.సం.న.89) వనిరి. కాని సూరి నట్లు నిందించినవీరే యిచట నాపనియె చేయుట వింత. ప్రయోజనము లేవిద్రుతోపజీవివిభాగము నంగీకరింపనిసూరి ద్రుతాంతము లయినపదము లెల్ల ద్రు.ప్ర.లుగనె చెప్పియ ట్లుదాహరించుటలో దోసఁగు లేదు. అది సరి కా దవి ద్రుతోపజీవులను వేఱు చేసినవజ్జులవా రట్లు చూపుట దోసఁగే యనక తప్పదు.

అసలు ద్రుతోపజీవిసంజ్ఞను వీరు విధించినజాడ లేదు. ద్రు.ప్ర. ద్రుతోపజీవులు భిన్నములుగా వివరణమునఁ దెల్పుటయే కాని లక్షణమున నావిషయము స్పష్టము చేయలే దేమి? శబ్దావయవద్రుతము గలవి మాత్ర మె ద్రు.ప్ర. లని గుర్తిం

చినవారు వివరణమున నట్లు చెప్పుటకంటె సూత్రముననె యాయంశమును స్పష్టము చేయవలదా? భేదమును బాటింపనిసూరికివలె వీరును ద్రు.ప్ర.సంజ్ఞను విధింపనేల?

"సముచ్చయాద్యర్థకనుశబ్దము ద్రుతము రూప (ఉ.16) మని వీ రిటనే స్పష్టము చేసిరి.అట్టియెడల సూరివలె వీరును "ద్రుతాంతము లయినపదములు ద్రుత ప్రకృతికంబు' లని సూత్రించు టెట్లు? ఎంతయును మొదలగువానిలోఁ జివరనున్న నుశబ్దము ద్రుతమె కావున నీయది ద్రుతాంత మగుపద మవుటంబట్టి ద్రు.ప్ర. అవు చునే యున్నది. మఱి వీరు వివరించినద్రు.ప్ర.లక్షణమును వీరిసూత్రము సాధింపఁ జాలుచున్నదా? కాఁగా వీ రిట వివరణమునఁ జెప్పినయంశమునే సూత్రముగాఁ జెప్ప వలసియున్న దనవలెను.

ద్రుతోపజీవు లనుపేరఁ గొన్నింటిని ద్రు.ప్ర.లకంటె భిన్నముగా నిరూపిం చుట ప్రయోజనహీనమె కాక యనర్థములను గూడఁ గల్గించును. (కావున నిట్లు విభా గించుట తగ దని గ్రహింపఁదగును. (ద్రుత. ద్రుతోపజీవులు) 'వికృతివివేకవాసనా బలముచేతనె' ప్రయోజనహీన మయినయీవిభాగమును వీరుపేర్కొనిరని గుర్తింప వచ్చును. ద్రు.ప్ర.సంజ్ఞతోపాటు ద్రుతోపజీవిసంజ్ఞయును మిగిలినలక్షణమున వీ రుపయోగింపలేదు. ద్రుతోపజీవులవలననే ద్రు.ప్ర. సంజ్ఞను గూడ నుపయోగించు నవకాశము లేకపోయినది. ఏ దేని గార్యము ద్రు.ప్ర.ల కగు నని చెప్పిన నయ్యది ద్రుతోపజీవులకు సిద్ధింపక యనర్థము వాటిల్లును గదా. ద్రుతోపజీవులను గల్పించుట లోనియిం కొకయిబ్బంది పయిసూత్రమున గమనింపవచ్చును.

**కళలు :**

ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు (13)ననుసూరిసూత్రమును వీరు 'ద్రుతప్రకృతికములు గానిశబ్దంబు' లనిరి.ద్రుతప్రకృతిద్రుతప్రకృతికశబ్దములు సమా నార్థకములేగావున వరుఁలవారిమార్పులోఁ బ్రయోజనము గాని సూరిలక్షణమున దురుక్తి కాని లేదు. కాని యీలక్షణమును సూరి ననుసరించి చెప్పుటవలన వ్యాఖ్యలవారిమత మువఁ గొంతయిబ్బంది గల్గుచున్నది. వీరు ద్రు.ప్ర.లకంటె వేఱుగా ద్రుతోపజీవు లను బేర్కొనిరి. ఇట ద్రు.ప్ర.లు కానివి కళ లనుటవలన ద్రు.ప్ర.లకంటె వేరుగా నింతకు ముందు-వీరు నిరూపించినద్రుతోపజీవులు కళలు గావలయును గదా. ఇట్టివి కళ లయిన ద్రుతోపజీవిసంజ్ఞవలనఁ బ్రయోజన మేమి? చాద్యర్థకనుశబ్దముతోఁ

గూడనవు దవి యెట్లును గళలే. కాని ద్రుతరూప మైన 'ను'శబ్దముతోఁ గూడి యున్నను నీలక్షణముచేఁ గళలు గాక తప్పుట లేదు.

ద్రు.ప్ర.లు, (ద్రు.ప్ర.లు గానివి) కళ లవి పదము లెల్ల రెండుగా సూరివలెనె వీరును లక్షణమున విభాగించిరి. నడిమిద్రుతోపజీవులను వీరు సూత్రమునఁ జేర్చ్కొన లేదు. ఇయ్యవి ద్రు.ప్ర.లే యవు నన్నచో శబ్దావయవద్రుతము గలవి ద్రు.ప్ర. లవి నిర్ణ యించుట పొరపాటు. శబ్దావయవద్రుతము గలవానివి, చాద్యర్థక'ను'శబ్దాంత ములను వేఱుగా నిరూపింపఁదలఁచినవు డారెంటికి వేర్వేఱుసంజ్ఞలను బెట్టి రెంటికి సామాన్యముగా ద్రు.ప్ర.సంజ్ఞ నుంచుట యొకమార్గము.

పై మైన వివరణమున నైన ద్రుతోపజీవిప్రసంగము వజ్ఝలవారివ్యాకరణ మున వారంతకుముందు సంజీవనిలో సూరిలక్షణమునఁ బ్రస్తావించినప్రమాదము లతోఁ గూడి యంగీకరింపరా కున్న దనుట నిశ్చయము.

ఇటఁ గళలలో వజ్ఝలవారు తానునేను అనువానిం జేర్చిరి. అవి కళలు గావు. ద్రు.ప్ర.లు. 'వచ్చెదుమ' యన్న దాశీరర్థకముగాఁ జూపిరి. 'దుమ' ప్రత్యయముం గూర్చి యాసందర్భమునఁ జూతము.

పిదప 'విశేషణములు' సన్న యమతమున ద్రుతప్రకృతికములె యైనను సదా విశేష్యముతో సమసించి కళలవలె ద్రుతలోపము నందియుండు (ఉ.17) ననిరి. అనఁగా ద్రుతలోపమువలనఁ గళలవలె నుండు నన్నమాట. ద్రుత మెప్పుడును లోపించునపుడు వీనిని ద్రు.ప్ర. లన నేల? చిం.మతమునను 'ఆద్యానభిదధతికళా' యనుచోటియాద్యశబ్దముచే వీనిని గూడ సంగ్రహింపనవును.

వీరు ధా.వి.లను చేసిన- ము న్నగురీతిగాఁ జూపుట సరి కాదు. ఇవి త్రిసమ ములు గావు (ద్రుత.234) అనుప్రయుక్త మగుతచ్ఛబ్దముతోఁ జేసినవాఁడు, చేసినది యనురీతిగా నుదాహరింపవలె.

కళ యనుసంజ్ఞనుగూర్చి పీ రంతకు ముం దిట్లు చెప్పిరి. కళ యనఁగా హల్లు నకు జీవకళ నొదవించుస్వరము. అట్టిస్వరము తుదిని గలశబ్దములు కళలు- చింతా మణిమతమునఁ బొల్లనకారమే ద్రుత మగుటచేఁ బొల్లనకారాంతములే ద్రు.ప్ర లగు టను గళలు స్వరాంతము లగుటయు సార్థకముగా సిద్ధించు చుండఁగా 'ను' ద్రుత

మన్నసూరిమతమున నీసంజ్ఞ సార్థకము గా '(వ్యా.సం.స.108) దనిరి. నువర్ణమును ద్రుతముగాఁ జెప్పినయీయుద్ద్యోతము ననుసరించి వరుచివారిమతమునను నీసంజ్ఞ సార్థకము గాలేదు. సంజ్ఞలు సార్థకము గావలయు ననరాదు. కాని యట సూరిని విమర్శించుచో సూరి 'ను'ద్రుత మన్నట్లు చెప్పినవా రుద్ద్యోతమున నకారంబు ద్రుతం బనుట చింతామణివాసనచే నిట్లాదిగాఁ జేర్కొనుట వింత గొలుపక మానదు.

ఇఁకఁ బైవి వీరు కల్పించినసార్థక్యమే సమంజసముగా నున్నదా? పైకారణము తోనె తానునేనులు కళలు,తాన్నేన్లు (ద్రు.ప్ర.లు) కళలు గా వనుట యుక్తియుక్తముగాఁ దంఁచి రేమో కాని యిదే పద్ధతిలో వనములు కళ, వనముల్ కళేతర మని చెప్పఁదగునా? కళాశబ్దమునకు నర్థము చెప్పుటలో ననహజత్వమె యున్న దని తోఁచుచున్నది.

కళలపట్టికలో సూరి యుదాహరించిన ఎత్తిలి- ఒత్తిలి యనున వవ్యయములుగా గు.ప్ర. పేర్కొన్నది. (బా.సా.పే.క్త్వార్థకముల నుదాహరింపలే దన్నది) వరుచివా రీయభిప్రాయమును దిరస్కరించి, ఎత్తిలి, ఒత్తిలి క్త్వార్థము లనిరి. షం. కానోపు నని (13) తాటస్థ్యము వహించినది. ఇవి క్త్వార్థకములా యన్నది పరిశీలనార్హము. సూ.ని. ఒత్తిల్లు అనుధాతువును జూపినది. కావున దానిక్త్వార్థకరూపమె ఒత్తిలి అనియు, సూ.ని.ఎత్తిలు చూపకున్నను ఎత్తుధాతువు చూపెను గావున ఎత్తిల్లు ఏర్పడు ననియు వరుచివా (వ్యా.సం.స.110) రందురు.ఇందుఁ గొన్నిసందేహములు. ఒత్తిల్లుధాతువునకు క్త్వార్థమున 'ఒత్తిల్లి' అని కలదా? ఒత్తిలి యని యొక్కలకారము తోడిరూపము మాత్రమె యుండు టేల? ఎత్తిలి విషయమున ఎత్తిల్లు అనునదే క్రొత్తగాఁ గల్పింపవలసియున్నది. ఎత్తిర్లఁడు, ఎత్తిర్లినది గాదు అనువ్యావహారిక రూపములను వీరు ప్రదర్శించిరి. ఇవి ప్రాంతీయములుగా నుండియుండవచ్చు. కాని వీనికిఁ గావ్యప్రయోగము గానరాదు. తగ్గ అన్నది వ్యవహారమునం దున్నను గావ్యప్రయుక్తము గామి నయ్యది గ్రాహ్యము గా దనియుఁ బద్యములలోఁ జేర్పరా దనియుఁ జేర్కొన్నవీ రిట వ్యావహారికరూపము లాధారముగా నిర్ణయించుట విశేషము. అదియు ఎత్తిర్లు అని వ్యవహారమునం దుండ ఎత్తిల్లు అనునదిగాఁ జూపుట మఱొక విశేషము. ఎత్తిలి, ఒత్తిలి అనువానికి మాత్రము కవిప్రయోగములు చూపిరి. క్రియారూపములు వ్యవహారమున మాత్రమె యుండఁగా క్త్వార్థకరూపములు మాత్రమె కావ్యములందుఁ బ్రయుక్త మగుట (భేదమును గమనార్హము) వే ఱొకవిశేషము.

పోనీ! అర్థమునందు సామ్య మున్నదా? ఎత్తిలి, ఒత్తిలి అనువానికి గట్టిగా ననునర్థమును గోశములు చూపుచున్నవి. ఒత్తిల్లు అనుధాతువును జూపినవావి. దానికిఁ బ్రక్కకొఱగు అని యర్థము చూపినది ఎత్తిల్లు? అనుధాతువునకు మూలమని యూహింపఁబడు 'ఎత్తు' ధాతువునకు కలుగు, పుట్టు ఇత్యాదిగా నర్థము లున్నవి. ఇట్టి ధాతువులపై క్త్వార్థమునం దిప్రత్యయము రాఁగా ఎత్తిలి, ఒత్తి (అని మాత్రమె రూపము లవుటయు) అనువానికి కలిగి మొ॥, ప్రక్క కొఱగి యనురీతిగా నర్థము లుండవలయును. కానఁ దద్భిన్నముగా గట్టిగా ననురీతియర్థ మెట్లు లభించినది.(శబ్ద ముతో పాటు) అర్థమునకును సామ్యము లే దనక తప్పదు. ఇంక (శ.ర. ననుసరించి ఒత్తి) ఎత్తి అనుక్త్వార్థకరూపమునకు గట్టిగా ననునర్థము గలదా?

కాఁగా శబ్దమునుబట్టియే కాక యర్థమునుబట్టియు వరులవారిసమన్వయ మిట సరిగా దని గుర్తింపఁదగును.

సూరియుదాహరణక్రమమునుబట్టి చూచినను నివి క్త్వార్థకము లనుట కవకాశము లేదు. సూరి వీనికి ముందే కొట్టక, తిట్టక, యనువ్యతిరేకక్త్వార్థకరూపముల నుదాహరించెను. ఎత్తిలి ఒత్తిలి యనునవి క్త్వార్థకరూపములే యని సూరి తలఁచినచో ముందుగా క్త్వార్థకము లగువీనిని జూపి యాపిదపనే వ్యతిరేకక్త్వార్థకములను జూపుట సక్రమము గావున నట్లు చేసియుండెడివాఁ డనుటలో దోషము లేదు గదా. ఇంక రాఁడు రాదు అనువ్యతిరేకక్రియలక్రమమునుబట్టి ముందుగా వ్యతిరేకక్త్వార్థకముల నుదాహరించె (వ్యా.సం.స.110) ననుటయు సరి కాదు. వచ్చిరి-వచ్చితివి-రాఁడు రాదు అనురీతిగా ముందుగా స్వార్థము నందలివే చూపి యాపిదపనే వ్యతిరేకార్థకములను జూపె నని గమనింపవలయును.

పైఁగా క్త్వార్థకరూపముల నుదాహరింపఁదలఁచుచో వచ్చిరి, రాఁడు అనురీతిగా కొట్టక- తిట్టక- కొట్టి-తిట్టి యనువిధముగా నింతకుముందు వ్యతిరేకక్త్వార్థమునం దేధాతువును గ్రహించెనో యాధాతువుక్త్వార్థకరూపములనే యుదాహరింపఁడా? అతఁ డనుసరించినపద్ధతి యిదే కదా. ఇచట మాత్రము తద్భిన్నముగా నేల చూపెను.

అట్లుగా దన్నను క్త్వార్థకరూపముల నుదాహరించుటకు నప్రసిద్ధము లగు నీయవి తప్ప వేవియు సూరికి దొరకనే లేదా?

కావున సూరి లక్ష్యయోజనక్రమము ననుసరించి చూచినను నివి క్త్వార్థక రూపములుగా సూరి తలఁచె ననుట కాధారము లేదు. ఎత్తిలి, ఒత్తిలి, యనునవి ప్రతిపదోక్తావ్యయములుగా గ్రహించుట యుచితము. బా.సా.పే. పేర్కొన్నట్లు క్త్వార్థకములం విట సూరి చూపలే దనుటయె లెస్స. బా.ప్రౌ.సర్వస్వము క్త్వార్థక క్రియలు- ఎత్తిలి- ఒత్తిలి- (48) యని చూపుట ప్రమాదము.

బిందువులు :

“హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగు” (సం.14) ననుసూరిలక్షణమును వీరు సమగ్రముగా నవరించి యిట్లు పేర్కొనిరి. “హ్రస్వముపైని సిద్ధసాధ్యపూర్ణములు ప్రాయికముగా ఖండములు సైత మగును. అనిర్దిష్టబిందువిధానస్థలములలో హ్రస్వము మీఁదఁ బూర్ణార్ధములు రెండును నగును” (14)సూరిలక్షణము గా దని మార్పులతోఁ జెప్పినవీరిలక్షణ మెంతవఱకు నర్థవంత మో ముందుగాఁ బరిశీలింపఁదగును. ఈవరులవారివచనములు సూత్రమువలెఁ గాక వ్యాఖ్యానమువలెఁ గన్పట్టుటలో విశేషము లేదు. ప్రయోజనవిశేష మున్నదా?

“హ్రస్వముమీఁద” ననుపదము సార్థకము గా దని తరువాతిసూత్రమునొద్ద గమనింతము.

ఇఁక సిద్ధపూర్ణమునకు ఖండము విధించుట యుచితమా? సూరి ఖండము నకుఁ బూర్ణమును విధించుటనుగూర్చి వీ రింతకు ముందు “వ్యాకరణముచే సాధింపఁబడునప్పుడు ‘అదంతున’ మున్నగువానిలో విపూర్ణములును సాధ్యములె యగును గాన నింక సిద్ధపూర్ణ మన్నది గగనారవిందమె యగు’ (వ్యా.సం.స.113) ననిరి. కాని యది యసంగత మని వారివచనములచేతనే యటనే గ్రహింపవచ్చును. బంతి, చేమంతి మొదలుగా సిద్ధపూర్ణములను వారే ప్రదర్శించియున్నారు. ఇట్లు గగనార విందములు ప్రచురప్రసిద్ధి నందినవి. కాని యిట వీరు పూర్ణమునకు ఖండ మగు ననిరి కదా! చారిత్రక మగుసాధుమార్గములో (వ్యా.సం.స.113) నుచ్చారణస్వభావ మును, సహజత్వము (ఉ.17) ననుసరించి వీరు ఖండ మెప్పుడును బూర్ణమునుండి యే యేర్పడవలయును గాని “యుచ్చారణభ్రష్ట మగునరసున్ననుండి నెఱసున్నను సాధించుట యసంగతము (వ్యా.సం.స.113)గా నిర్ణయించిరే. దీనివలన నెప్పటివి ఖండము సిద్ధ మైయుండదే. సిద్ధఖండ మన్నది యిచ్చట యథార్థముగా గగనారవింద

మైనది. (ఉచ్చారణభ్రష్ట మని గుర్తించినవారు బిందుసున్నకు లోపము చెప్పుట యుచితము గాని యరసున్నను దెచ్చిపెట్టు టేల? లేఖనము ననుసరించి తెచ్చినచో నెల్లే నది యంగీకరింపకతప్పునదా?)

కాఁగా వ్యా.సం.స.లో వీరు సూరిమార్గమును దిరస్కరించుటలో నీయుక్తి ననుసరించిన నిట వీరు సిద్ధపూర్ణమునకు ఖండమును విధించుటయే యసంగత మనఁదగు.

హ్రస్వముమీఁద సాధ్యపూర్ణమునకు ఖండబిందు వగు ననుట మిక్కిలి యన వసరము రాముండు, రాముఁడు, చదువంగలండు, చదువఁగలఁడు వచ్చెందండ్రివచ్చెఁ దండ్రి యనురీతిగా సాధ్యపూర్ణమీసూత్రముచే ఖండ మయిన ట్లుదాహరించిరి. అనఁగా జీత్తు బిందుపూర్వం బగు మన్నసూత్రమువలనఁ బూర్ణబిందువు రాఁగా దాని కీసూత్రముచే ఖండబిందు వగు నన్నమాట. కాని వీ రీసూత్రమునకే పిదప ననిర్దిష్ట బిందువిధానస్థలములలో హ్రస్వముపైని బూర్ణార్ధములు రెండును నగు నని చెప్పిరి. ఇక్కడ వీరు చూపినయుదాహృతులలో దేనియెడలను సాధ్యబిందువు పూర్ణ (లేదా ఖండ) మని నిర్దేశింపఁబడలేదు. అనిర్దిష్టబిందువిధానస్థలములఁ బూర్ణబిందువు మాత్రమే యగు నన్న నప్పు డటఁ బూర్ణ మగుటయు నప్పటిపూర్ణమునకు వీరి సూత్రముచే ఖండ మగుటయు సంభవించెడిది. కానీ వీరనిర్దిష్టబిందువిధానస్థలమునఁ బూర్ణార్ధములు రెండును నగు ననిరే. (అస లిదియె సహజసిద్ధము ప్రత్యేకముగఁ జెప్ప నక్కఱ లే దని పైని స్పష్ట మగును.) కావున 'జీత్తు బిందుపూర్వం బగు' మొద లగునాలక్షణములచేతనె పూర్ణార్ధములు రెండును నగును. అచ్చట వీరును "ఇచ్చట డు జ్ఞనుదానియందు ఉకార మిత్తు గావున 'జీత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును. ఉకారము లోపించును దిద్దుఁడు- దిద్దుండు' (పు.103) అనిరి. ఇందు ఖండబిందు వయినరూపమునే ముందుగా నుదాహరించుటయు గమనార్హము. దానింబట్టియు నీస్థలములందుఁ బూర్ణబిందువునకు ఖండబిందు వాదేశముగా వచ్చుప్రసక్తియే లే దని స్పష్టము. ఇక్కడ వీరు చూపినచోట్లనె కాదు. ఈవ్యాకరణమునం దెచ్చటను సాధ్యపూర్ణమునకు ఖండ మాదేశ మగుప్రసక్తియే యుండదు.

ఖండపూర్ణములు రెండును నవుచోట బిందు వని సామాన్యముగా విధింపఁ బడును గావున నటఁ బూర్ణార్ధములు రెండును వేర్వేఱుగా నవుచుండుటచేఁ బూర్ణము

నకు ఖండ మాదేశము చేయ నవసరము లేదు.

పూర్ణబిందువు నిర్దేశింపఁబడినస్థలములలో ఖండము రాదు. వచ్చుచోఁ బూర్ణమును నిర్దేశించుటయే నవసరము గదా. "పు, ంపు, టి, ంటి, ఇంచు అనుస్థలములు ప్రత్యేకవిధానము గలవి గాన నచట ఖండమునకుఁ బ్రసక్తియే లే (ఉ.18) అని వీరె యిచ్చట స్పష్టము చేసిరి.

ఖండముమాత్రమె నిర్దేశింపఁబడుస్థలమునఁ బూర్ణమునకు ఖండబిందు వాదేశమగుట యసంభవము. అగుచో ఖండబిందునిర్దేశము వ్యర్థ మగును.

ఇఁక నిం దొక యనర్థము గమనింపఁదగును. వీ రిచ్చటనె గంపెండు- గంపెఁడు, వాలిండి వాలిఁడి యనున వుదాహరించిరి. ఇటఁ బూర్ణబిందురూప మెట్లు? ఇట వీరును సూరివలె ఎఁడు, ఇఁడిప్రత్యయములను (ఉ.309) విధించిరి. ఇంకను తూమెఁడు, తూమెండు అవియనుదాహరించిరి. విధింపఁబడినదిఖండబిందుయుక్తము గాఁగా దానికిఁ బూర్ణబిందు వె ట్లయినది? పూర్ణబిందుఘటితము లగుగంపెండు వాలిండి, యనురీతిరూపములు వీరిలక్షణముచే నసాధ్యము లై యసాధువు లని నిర్ణయింపవలయును.

మొత్తముమీఁద సాధ్యపూర్ణమునకు ఖండ మగుట యీవ్యాకరణమున నసంభవ మనియు నట్లు చెప్పుట కొండొకచో ననర్థకము ననియు గ్రహింపవచ్చును.

"హ్రస్వాత్ పూర్ణోఽపి భవే' త్తనుచిం.సూత్రమున కహో. చేసిన- సిద్ధస్స్వాద్యక్షాన్నుస్వారః లఘ్వక్షరాత్ పరశ్చేత్ పూర్ణోఽపి భవే' (కవిశి.211) త్తను వివరణము ప్రభావముచే ననఁగాఁ గవిశి. వాసనచే వీ రిట్లు సూత్రించి రనుట దోషము గాదు.

కాఁగా 'నుడితొలిహ్రస్వముమీఁద తేలనిసాధ్యస్థలములు- కెందామర- ముంగొంగు- కంకోయి- (ఉ.18) యనుటయు నసంగతము. ఇట 'ఆదేశసరళములకు ముందున్నద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు' ననుసూత్రమందలిబిందుశబ్దముచేఁ బూర్ణార్ధములు రెండును గ్రాహ్యంబులు"(ఉ.46) గాఁగా అఁటఇఁకమఁడు" సూత్రముచొప్పున నుడితొలిహ్రస్వంబుమీఁద నరసున్న పిల్వదు- కెందామర అవిమాత్రమె యగు' (ఉ.46) ననువీరివచనమునుబట్టియే పూర్ణబిందువునకు నర్ధబిందువు వచ్చుప్రసక్తియే లేదు గదా!

ఇఁక అఁట ముఁడు- శబ్దంబులందుఁ దప్ప మఱెచ్చటను బధము మొదటి హ్రస్వముమీఁదిపూర్ణము ఖండముగాఁ దేల (ఉ.18) దనిరి. అఁటఇఁకముఁడు (సంధి.22 )అనుసూరిసూత్రమునందువీరు 'ఇఁగ' శబ్దమును గూడఁ జేర్చిరి.కాని యిట దానిని బేర్కొనకుండుట గమనార్హము. ముఁడు అనుచోఁ గూడ నున్నది డుజ్ఞె కావున నిటఁ బూర్ణము తేలి ఖండ మగుప్రసక్తి లేదు.

వరులవారియిట్టిపద్ధతివలన నొకచోఁ బ్రక్రియాగౌరవము. ఇచ్చు + డుఙ్' ఇండు అని కాఁగాఁ బ్రస్తుతసూత్రముచేతఁ బూర్ణమునకు ఖండము రావలసియుండఁగా 'ఇఁక ఇఁగ- ఇత్యాది (ఉ.51) సూత్రముచే ఖండము రాదు. ప్రయోజనహీన మగు నీపద్ధతి యనుసరణీయమా?

ఇంక సూత్రమునందలిరెండవవాక్యము కేవల మనవసరము. పూర్ణము లేక ఖండ మని బిందువు ప్రత్యేకముగా నిర్దేశింపఁబడినచోఁ బూర్ణార్ధములు రెండును నగు నని యీవాక్యము చెప్పుచున్నది. ఇది సూత్రమునఁ జెప్పవలసినయంశము గా నేరదు. బిందు వని సామాన్యముగాఁ జెప్పినపుడు ఖండము పూర్ణమే యేమి భాషలో నెన్నివిధము లయినబిందువులు గలవో యన్నియు నాబిందుశబ్దముచే గ్రహింపఁబడక తప్పదు.

'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళము లకు ముందే బిందువు కానంబడుచున్నది'(సం.16) యనుచో ఖండపూర్ణబిందువులు సిద్ధసాధ్యములు గ్రహింపఁబడవా? బిందువిధానస్థలమునమాత్ర మ ట్లేల గ్రహింపఁ బడవు? వ్యాకరణమున బిందువు విధించినస్థలములందు (సిద్ధబిందువునకుఁ బ్రసక్తి లేమి)ఖండపూర్ణములు రెండును (సాధ్యములు) గ్రహింపఁబడుట సహజమే.అట్లు గా దన్న బిందు వని చెప్పుచోఁ బూర్ణమె యని కాని ఖండమె యని కాని గ్రహించు టకే యాధార ముండదు.

'అచ్చికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు'ననుచో వక్రతమములు విధింపఁబడినవి. వక్రతమము లని సామాన్యముగా నిర్దేశింపఁబడిన చోట బిఱాలు రెండును గ్రహింపఁబడు నని సూత్రింపఁబడినదా? అట్లే ఖండబిందువు బిందువే పూర్ణబిందువును బిందువె యయియుండఁగా బిందువు వచ్చు నన్నపుడు ఖండపూర్ణములతో రెండువిధము లయినబిందువు వచ్చుట నేల వేఱుగా సూత్రింపవలెను?

ఇటఁ గలయుం గొకయనౌచిత్యము పయిసూత్రమున గమనింపఁగలము.

వీరు పయిపద్ధతిలో సూరిసూత్రమునను నొకభేదమును గల్పించిరి. 'హ్రస్వముమీఁది ఖండబిందువున (సం.14) కనుప్రస్తుతసూరిలక్షణము 'కేవలము సిద్ధబిందువిషయక మె యనియు 15సూత్రము కేవలము సాధ్యబిందువిషయక మె యనియు సూరియాశయము. (వ్యా.సం.ప.112) దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లే దనుచో 15సూత్రమున నయ్యది సాధ్యబిందువిషయకముగా సూత్రమున స్పష్టముగా వ్యక్తమయినది. కాని యీ14సూత్రమున ఖండబిందువున కని సామాన్యముగాఁ జెప్పఁగా 'సిద్ధఖండమునకె' యని యె ట్లర్థము నియమింతురు. సాధ్యఖండము ఖండబిందువు కాదా? సిద్ధమయిన సాధ్య మయిన ఖండము ఖండమే కదా! కాఁగా 14సూత్రమునందు ఖండబిందువున కనఁగా నయ్యది సిద్ధ మైనఁ గావచ్చును. సాధ్య మైనఁ గావచ్చును. ఖండబిందు వైనచో హ్రస్వము మీఁద నున్నదానికిఁ బూర్ణము రాకతప్పదు.(ఈసూత్రముకడ పగఁటిమి యని యుదాహరించుచో సూరి సాధ్యఖండమునను నీలక్షణముచేఁ బూర్ణ ముగు నని చెప్ప నెంచె నేమో. కాని పగఁటిమి యనుచో నట్టియవసరము గలదా యన్నది సందేహము. ఏ మైనను నది సిద్ధఖండ మనరాకున్నది.)

ఎఁడు, ఇఁడి యనుతద్ధితములలో ఖండానుస్వార మున్నది. ఇయ్యది సాధ్యబిందు వనక తీఱదు గదా. పరులవా రుదాహరించినట్లు తూమెండు, పీఁటిండి యనుతీరుగాఁ బూర్ణబిందువు గావలయు నన్న నీసూత్రముచేత నెయ్యది సంభవము(సూరియు నట్టిది యుదాహరించిన దా గుండెడి దేమో.) కాఁగా 14సూత్రముచే సాధ్యఖండమునకును బూర్ణము వచ్చు నని చెప్పవచ్చును. కావున 'నీసూత్రము సిద్ధఖండములనే పూర్ణములఁ జేయుచున్న (బా.సా.పే.23) దనురీతిఁ వ్రాఁత లుచితములు గా వనియే నిర్ణయింపఁదగును. (ఇక్షై వ్యా.సం.ప.113)

మొత్తముమీఁద బింపు వని ఖండమో పూర్ణమో స్పష్టముగా నిర్దేశింపఁబడనిచోట్ల నొబిందు వెన్ని విధములుగ నున్నదో యన్నివిధము లయినదియు యథాసంభవముగా గ్రహింపవలసినదే. కావున నిచట పరులవారిసూత్రమున రెండవవాక్యము కేవల మనవసర మనియు నాయయిచోట్ల సూరిసూత్రములకు వివరణముగామాత్ర మె చెప్పఁదగు ననియు గ్రహింపవచ్చును.

మొత్తముమీఁద పరులవారియీలక్షణము సమంజసము గా దనుట నిశ్చయము.

సూరిలక్షణముతో భేదింప నేల? సూరి ఖండమునకుఁ బూర్ణమును విధింపఁగా వీరు పూర్ణమునకు ఖండమును విధించుట ప్రధాన మైనభేదము. ఖండమునకుఁ బూర్ణము చెప్పినసూరివచనములలో దురుక్తి యేమి?

"సూరిసూత్ర ముచ్చారణస్వభావవిరుద్ధము. చింతామణివిరుద్ధము. పూర్ణము తేలి ఖండ మగుట సహజ (ఉ.17) మనిరి. ఈయభిప్రాయమె సంజీవనిలో విస్తరింపఁబడినది (వ్యా.సం.స.113) ఉచ్చారణస్వభావమున కనుగుణ మనియె వీరు త్రాళ్లు, అనురీతిరూపములను, అరుపులు, రాజు ఇత్యాదితత్సమములలో చజలకుఁ దాలవ్యతను దేర్కొని రేమో. పూర్ణము తేలి ఖండ మగుట యుచ్చారణస్వభావ మనియుఁ గావున ఖండమునకుఁ బూర్ణము విధించుట స్వభావవిరుద్ధ మనియు నభిప్రాయము. అనఁగాఁ బూర్ణము తేలి ఖండ మగుట సహజ మనుపైవిపేర్కొన్న మూఁడవవాక్యమునభిప్రాయమె మొదటివాక్యమును జెప్పును. ఇది యనుస్వారచరిత్రమునకు విరుద్ధ మని సారాంశము.

అయిన శబ్దశాస్త్రకారుఁడు భాషాచరిత్ర ననుసరించియే లక్షణము చేయవలయునా? ఇందు లక్షణము లన్నియు నట్లే చేయఁబడినవా? ఇటఁ జరిత్ర కనుగుణముగా లక్షణము చేయుటకు? ఇటఁ జరిత్ర ననుసరింపక తప్పకుండుటలో నీయంశమునఁ బ్రత్యేకత యేమి? శబ్దశాస్త్రలక్ష్యముల కనుగుణముగా నవకాశ మున్నచోటులఁ జరిత్ర ననుసంధింపవచ్చును. భాషాలక్షణమును లాఘవముతో సాధ్య మైనంతమేర సమగ్రముగా నొనరించుటలోఁ జరిత్రకు భిన్నముగా శబ్దశాస్త్రకారుఁడు లక్షణము చేయుట దుష్ట మని భాషాచారిత్రకులును బేర్కొనరే. కుట్టుసుదు రూపసాధనము మొదలగు నంశములు స్మరింపఁదగును. మువర్ణకవిధానాదులలో వీ రైనను జరిత్ర ననుసరించిరా? చరిత్ర కనుగుణముగాఁ బూర్ణమునకు ఖండమును విధించినవయులవారిప్రస్తుత లక్షణమున నేర్పడినయిబ్బందులు పైని గమనించియే యుంటిమి గదా!

ఇం తేల? వీరే యింతకుముందు సంజీవనిలో "ఖండచరిత్రానుసారముగాఁ బూర్ణమునకే ఖండము నుపదేశించినచోఁ బూర్ణము తేలిపోవి అపరంజి- చేమంతి- ము న్నగుకతిచిచ్ఛబ్దములలో నిపూర్ణములచోటఁ గలయితము ఖండము పాక్షికముగాఁ గలయనిష్టరూపముల నంగీకరింపవలసివచ్చును. కాన సిద్ధఖండమునకుఁ బూర్ణము నాదేశించుటయే యుక్తమపద్ధతి యనఁదగును గదా (వ్యా.సం.స.114) యనిరి. మఱి యాయుక్తమపద్ధతి యిట దుష్ట మేల యైనది. ఇచట వీరు దమలక్షణమునఁ బ్రాయిక

శబ్దమును ప్రయోగించిరి కావున నద్దానిచే నవరంజితమున్నగువానింటఁ బూర్ణబిందుమాత్రస్థితి సాధ్యమె. (అయ్యు బహూళశబ్దము చేర్చిన బా గుండెడి దేమో. ఇట నప్రవృత్తి.) కాని పైవఝలవారివాక్యములవలన శబ్దశాస్త్రమునఁ జరిత్రానుసరణము తప్పనిసరి గా దని మాత్రము వారియుద్దేశ్యమనియే గ్రహింపనగును. కావునఁ జరిత్ర కనుగుణము గా దనుట మాత్రము సూరిలక్షణము దురుక్త మనుటకుఁ బ్రబల మైన యాధారము గాదు.

కాని యిట నొకయంశము గమనార్హము. ఖండబిందు వున్నయన్నియెడల (దీర్ఘముపై గుర్తింపఁదగిన గొన్నియెడలఁ దప్పఁ) బూర్ణబిందువు గాననగుచుండఁ గాఁ బూర్ణబిందు వున్నయన్నియెడలను ఖండబిందువు లేదు. భాషాస్వరూపమును నిరూపింపఁబూనినలాక్షణికుఁడు సాధ్య మైనంత సమగ్రముగా నుండునట్లుగా -పూర్ణమునకు ఖండము విధించుటలో నికొంతమాత్ర మస్పష్టత యేని లేకుండఁగా ఖండమునకుఁ బూర్ణము విధించుటయే శబ్దశాస్త్రోచితము.

సూరిలక్షణము భాషాస్వరూపనిరూపణములోఁ బ్రయోజనవంత మగుటను వఝలవారు సంజీవనిలో 'ఉత్తమపద్ధతిగా' గుర్తించిరి. అది గమనింతము.

సూరిలక్షణమునఁ బైనుద్ధ్యోతమునవలెనె యసంగతులను వివరించి పిదప "వయియసంగతులను దప్పించుటకయి 14.సూత్రమునకుఁ బ్రయోజనకల్పనము చేయఁబడుచున్నది. (వ్యా.సం.న.114) యనిరి. అసంగతులు వాస్తవముగా నున్నచో నయ్యవి పరిహరింపఁబడు టెట్లు? ప్రయోజనవంతమ యైనచో నసంగతులు కల్పితము లనవలయు. అసలు ప్రయోజనమును వీరు గల్పించుట యేమి? లక్షణమునం దాప్రయోజన ముండుటచేతనే పేర్కొనుచుండిరా? లేనిదానిని గల్పించిన నయ్యది యంగీకార్యమా? ఏ మైనను సూరిలక్షణమునఁ బ్రయోజనము గుర్తించిరి. ఉచ్చారణభ్రష్ట మైనసిద్ధఖండానుస్వారమును దెలియుట సూరిలక్షణమునఁ బ్రయోజనముగాఁ దద్మూలమున ఖండమునకుఁ బూర్ణము చెప్పుటె యుత్తమపద్ధతిగాఁ జెప్పిరి. (వ్యా.సం న.114) మఱి యాప్రయోజనమును వీరిలక్షణము సాధించుచున్నదా? ప్రయోజనవంత మగుమార్గము నేల మార్చుకొనవలయును? సిద్ధఖండానుస్వారమెచ్చట నుండునో తెలుపుట యనుసూరియుద్దేశించినయంశమా? లేక యనుస్వారము చరిత్ర ననుసరించుట యనువఝలవా రుద్దేశించినయంశమా? ఏది శబ్దశాస్త్రమున నుచిత మైనప్రయోజనము? కాఁగాఁ జరిత్రకు భిన్నమె యైనను ఖండమునకుఁ

పూర్ణము విధించినసూరిపద్ధతియె యుక్తమ మని యెల్లప్పుడు నంగీకరింపవలసినదే కద.

ఇట వీరు కల్పించినప్రయోజనము బాగుగనే యున్నది.కాని హ్రస్వముమీఁద సిద్ధఖండానుస్వారజ్ఞాన మనుప్రయోజనమువలన వీ రంతకుముందు పేర్కొన్న యసంగతు లెట్లు తొలఁగినవో స్పష్టము గాదు.

అస లాయసంగతు లేవి? "బాలవ్యాకరణప్రక్రియచొప్పున నెచ్చటను ఖండమునుండి పూర్ణమును 14సూత్రముచే సాధించుకొనవలసినప్రసక్తి లేమింజేసి యిది సాధ్యబిందువిషయకము కానేరదు. మఱియు నిరర్థక మగుచున్నది." (వ్యా.సం.స. 113) సాధ్యబిందువిషయకము గా దనుట సరి గాదు. తూమెండు వాలిండి యనుచో సాధ్యఖండమునకుఁ బూర్ణ మగుట యీసూత్రముచేతనె యని గమనించియుంటిమి గదా! ఇట్టిపూర్ణబిందుప్రయోగములను వరుసలవా రాతద్ధితస్థలమున నుదాహరించిరి. ఇఁడి, ఎఁడు ప్రత్యయములలో ఖండములకుఁ బూర్ణ మెట్లు వచ్చినదో వివరింపలేదు. అది సిద్ధఖండము గాదు గదా. అవుఁ గాక యీసూత్రముచే సాధ్యఖండమునకుఁ బూర్ణము చేయ నవసరము లేకపోవచ్చును. అంతమాత్రమున నీసూత్రము నిరర్థక మగునా? సూరి యీసూత్రమున కుదాహరణములే చూపలేదా? సిద్ధఖండమునకుఁ బూర్ణము చేయుచో నాయెడ నీసూత్రము సార్థకము గాదా?

దీనింగూర్చి "సిద్ధానుస్వారవిషయక మంద మన్న నుచ్చారణభ్రష్ట మగునరసున్నానుండి నెఱసున్నను సాధించుట కేవలము నసంగతమగు" (వ్యా.సం.స.113) ననిరి. ఉచ్చారణభ్రష్ట మగుచోఁ దెనుఁగునకు వర్ణములు ముప్పదియా అనుచో వర్ణమాలలో నఱసున్నను జేర్చుటయె తగదు. అవుఁ గాక. ఖండ ముచ్చారణభ్రష్టమె. పూర్ణమునకు ఖండ మగు నని యుచ్చారణభ్రష్ట మగుఖండమును సాధించుట సుసంగతమును, ఖండమునుండి పూర్ణమును సాధించుటె కేవల మసంగతము నైనదా?

"మఱియు నిట్లు వ్యాకరణముచే సాధింపఁబడినపుడు అడంకువ ము న్నగు వానిలోనిపూర్ణములును సాధ్యములె యగును గాన నింక సిద్ధపూర్ణ మన్నది గగనారవింద మె యగును." (వ్యా.సం.స.113) వీరు చేసినప్రయోజనకల్పమువలన సిద్ధపూర్ణము గగనారవింద మగుట తప్పినదా? అవరంజి ఇత్యాదులు చూపిరి.

ఖట సిద్ధానుస్వార మున్నది. సిద్ధపూర్ణము గగనారవింద మగుట యనునసంగతి సూరి లక్షణమున వసలే లేదు. అంతే కాని యంతకు ముం దుండి వీరు కల్పించినప్రయోజనమువలనఁ దొలఁగలేదు.

"ఇంతియ కాక యనుస్వారచరిత్రమునుబట్టి పూర్ణబిందువు ప్రాచీనతరమైయుండుటచేతను నుచ్చారణసౌలభ్యాపేక్షచే నద్దానివి దేలఁబల్కుటవలన నట నఖ నున్న మేర్పడుటచేతను బూర్ణమునుండి ఖండమును సాధించుట యుక్తము." (వ్యా.సం.స.113) వీరు కల్పించినప్రయోజనమువలనఁ బై యనుస్వారముచరిత్ర తిరుగఁ బడినదా? పైవరిశీలము ననుసరించి ఖండమునకుఁ బూర్ణము విధించుట యుక్తమే యని స్పష్టము.

ఇంక వీరు పైనుద్ధ్యోతమున సూరి ఖండమునకుఁ బూర్ణము చెప్పుట యుచ్చారణస్వభావమునకే కాక చింతామణికిని విరుద్ధ మనిరి. (ఉ.17) (చిం.కి విరుద్ధము గానిచో నుచ్చారణము స్వభావమునకు విరుద్ధ మయినను నవరోధము లే దేమో.) చిం.కి విరుద్ధముగాఁ జెప్పుట దోషమా? "నకారంబు ద్రుతం బని సూరి చింతామణి వానచే సూచించుట సరి గా" (ఉ.13) దని యింతకు ముందే యనిరే. అయ్యది చిం.కనుగుణముగా నుండుట దోష మిది చిం.భిన్నముగా నుండుట దోషము.

అసలు సూరిలక్షణమే చిం.కి విరుద్ధముగా నున్న దని గుర్తింపవలె. పైవివరణమున సీవయులవారిలక్షణముచేఁ దెలుఁగున సిద్ధఖండానుస్వారము లేకుండఁ బోవుట గమనించితిమి గదా. కానీ చిం. "సిద్ధసాధ్యత్వాద్దానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధ' యని సిద్ధమును సాధ్యము నయినయనుస్వారము పూర్ణము నర్ధము నని ద్వివిధము లని చెప్పెను. "సిద్ధపూర్ణము సిద్ధఖండము నని నాల్గువిధములు(వ్యా.సం. స.110) అట్లు చిం. సిద్ధఖండమును జేర్కొనుటనుబట్టి వ్యాకరణసాధ్యము గాని (పూర్ణమున కాదేశ మైనదియు సాధ్యమే- అడంకువ సూరిపక్షమున సాధ్యపూర్ణము గాఁగా అడఁకువ- వయులవారిమతమున సాధ్యఖండము) ఖండబిందు వుండవలె. అది 'వీ రెవటఁ జూపఁగలరు?' ఉచ్చారణస్వభావమున కనుగుణముగ వీరు చేసిన లక్షణము చిం.విరుద్ధ మనుట స్పష్టము. అడఁకువ ఇత్యాదులలో సిద్ధఖండము, చేమంతి ఇత్యాదుల సిద్ధపూర్ణమును బ్రస్తావించినసూరిలక్షణమె చిం.కనుగుణము. కాఁగా ఖండమునకుఁ బూర్ణము విధించుట చిం.కి విరుద్ధము గాదు. విరుద్ధమె యవుఁ గాక, ప్రయోజనమును సాధించుచోఁ జిం.కి భిన్నముగాఁ జెప్పుటయు దోషముగాదు.

అన రేసూరిలక్షణము చిం.కి విరుద్ధ మనుటలో వీరియభిప్రాయ మేమి? ప్రాస్వాత్ పూర్ణోఽపి భవేత్ అనుకారిక కహో. ఖండమునకుఁ బూర్ణము వచ్చునని వ్యాఖ్యానించెను. సిద్ధస్సాధ్యశ్చ ఖండానుస్వారః లఘ్వక్షరాత్ పరశ్చేత్ పూర్ణోఽపి భవేత్. అనుకవిశిరోభూషణవ్యాఖ్య సరి కాదు. ఖండబిందువునుండి పూర్ణమును సాధించుట కెచ్చటను ప్రసక్తి చింతామణిలో లేదు- -రాముఁడు- ప్రాస్వాత్ పరత్వాత్ రాముండు అనియు నవవ్యాఖ్య చేసె (వ్యా.సం.న.111) ననిరి. కావున ఖండమునకుఁ బూర్ణమును విధించుట చిం.విరుద్ధ మని వీరియభిప్రాయము. మఱి వీరి సూత్రము చిం. విరుద్ధము గాదా? అహో. వ్యాఖ్యానమునఁ దెల్పినపద్ధతిలోనె వీరు సూత్రమునఁ జెప్పిరి. రాముండు రాముఁడు అనియు నుదాహరించిరి. ఖండమునకుఁ బూర్ణ మగు నని యహో. చెప్పినయంశమునే తిరుగవేసిరి. ఖండమునకుఁ బూర్ణమును విధించుట చిం.లో లేనిమాట నిజమే యందము. అహో బలువి దవవ్యాఖ్యయే యందము. సూరి యట్లు చెప్పరాదు, కాని మఱి వీరు చెప్పిన పూర్ణమునకు ఖండ మవుటకుఁ జిం.లో నెచ్చట నేని ప్రసక్తి యున్నదా? అట్టియెడల నిది చిం.కి విరుద్ధము గాదా? కాఁగాఁ జిం.తో వైరుద్ధ్యము రెండింట సమానమే. కావున నది కారణముగా సూరిసూత్రమును దిరస్కరించిన వీరిసూత్రము నట్టిదే యవు ననుట స్పష్టము.

చిం.సూత్రమున కహో. చేసిన దవవ్యాఖ్యయా? (వ్యా.సం.న.113) బాలసరస్వతి "లఘ్వక్షరమునకంటెఁ బర మైనఅర్ధబిందువు నెఱసున్నయు అగును. పదఁతి, ముద్దుఁగన్నియ యనుచోటులందలియర్ధానుస్వారములు లఘ్వక్షరపరములు గానఁ బడంతి, ముద్దుంగన్నియ యని పూర్ణములు నగును" (బాల.154) అనెను. అప్పకవియును "జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞలఁ బొసంగు ఖండములు ప్రాస్వలిపులపై నుండె నేని వానిఁ బూర్ణంబులను జేయవచ్చు" (అప్ప-2-28) నని చెప్పెను.అహో. చెప్పినది దీనికి భిన్నము గాదు గదా. (రాముఁడు రాముండు అనుచో అహో.అభిప్రాయము గ్రంథాంతరమునఁ బరిశీలింపఁబడును) ఇట్లు బాలసరస్వత్యాదు లగుచిం. వ్యాఖ్యాతలు చిం.అభిప్రాయము నెట్లు పేర్కొనిరో సూరి యట్లే సూత్రించెను. వరుఅవా రాయర్థమును మార్చుటకు నాధారము గాని ప్రయోజనము గాని లేవు. (నష్టములే కాని) సూరిలక్షణమునకు బాలసరస్వత్యాదులవచనము లాధారములు గాఁగలవు. మఱి వీరిలక్షణమున కాధార మేది? ఇంకను నప్పకవి "కృతులఁబూర్ణములు

ఖండములు సేయఁ బొసఁగ వెందు' (అప్ప.2.28) నని వజ్ఝలవారియిచటిలక్షణము నభిప్రాయమును దిరస్కరించియుండుటయు గమనార్హము.

అహోబలుని దపమార్గ మనియు, సూరి యనిర్దిష్టబిందువిధానముచే ఖండపూర్ణములు రెండును బర్యాయముగ వచ్చునట్లు ప్రక్రియ నడిపె నిత్యాదిగా సూరి పద్ధతిని బ్రశంసించి యట్టిసూరిపద్ధతిని మాపుట యుక్తము గా దని (వ్యా.సం.స. 118) గు.వ్ర.ను విమర్శించినవీ రుద్ద్యోతమున నదే విధముగ సూరి ప్రోక్తమైన ఋజుపద్ధతిని మాపుట యెట్లు సమంజస మగును? (అనిర్దిష్టబిందువిధానస్థల మని సంజీవనిలోనివివరణ ముద్ద్యోతములో సూత్ర మైనది. అందువలననే యది వివరణము వంటిదే గాని విశేషముగా సూత్రమునఁ జెప్పవలసినది గాదని యావాక్యమె తెలుపుకొనుచున్నది.) రాముఁడు రాముండు అని యొకబిందువునుండి వే ఱొకటిని సాధ్యస్థలమున సాధించుట ఋజుపద్ధతి గా దని యెంచినవీరు రాముండు- రాముఁ డని యుదాహరించుచు నొకబిందువునుండి యిం కొకబిందు వగునట్లు చెప్పిరి. కాని దీని నహోబలపతినివలె నపమార్గ మనరాదు.

కాఁగాఁ దమలక్షణము చిం.కి విరుద్ధ మైన నుచ్చారణస్వభావమున కనుగుణ మనియు సూరిలక్షణ మట్లు గా దనియు మాత్రమె చెప్పుకొనఁదగును. అయ్యు శబ్దశాస్త్రప్రయోజనమునుబట్టి సూరిపద్ధతి యుక్తతమము.

కాఁగా వఝలవారు పూర్ణమున కర్థము విధించుట యనుస్వారచరిత్ర కనుగుణము.(ఇది కూడఁ జివరివఱకనుసరింపలేదు వీరు) గావచ్చును గాని శబ్దశాస్త్రమునకు మాత్ర మనర్థమె తెచ్చిన దని గుర్తింపఁదగును.

హ్రస్వముపైఁ బూర్ణార్థములు రెండు నుండవచ్చు ననుతీరుగా బిందువునునికిని వర్ణించునట్లుగా (అడఁకువ, అడంకువ- రెండును సిద్ధములె- అట బిందు వ ట్లుండు నని చెప్పుటయె యుద్దేశ్యము) లక్షణము చేసినఁ గొంత యనర్థము తగ్గెడి దేమో. (వ్యా.సం.స.లో చిం.అభిప్రాయము నిట్లె వీరు భావించినట్లు తోఁచు) కాని పూర్ణమునకు ఖండము నాదేశించినట్లుగాఁ జెప్పుట యనర్థము.

ఏ మైనను నిట సూరి పేర్కొన్నలక్షణము సూక్తి మనియు నయ్యది యథాతథముగ గ్రహించుటయె శబ్దశాస్త్రసంప్రదాయానుగుణ మనియు నిశ్చయింపఁ దగును.

## దీర్ఘముపైఁ బూర్ణము:



'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లే' (సం.15) దనుసూరిలక్షణమును గూడ వఝులవారు సమగ్రముగా మార్చిరి. "దీర్ఘముమీఁద సాధారణముగాఁ బూర్ణము నిల్వదు. అనిర్దిష్టబిందువిధానస్థలములలో దీర్ఘముమీఁద ఖండమునె నిల్పవలయును.

సూరి పైరీతిగా "సూత్రించుట పొరపాటు. దీర్ఘముమీఁద సిద్ధపూర్ణము మాత్రము ప్రచురముగా నిల్చునా?' (ఉ.18) యని యొకదోసఁగు నెన్నిరి. వీ రీవివరణమునఁ "బ్రచురముగా" ననుశబ్ద మేల చేర్చిరి? దీర్ఘముమీఁద నరుసుగా నున్న సిద్ధపూర్ణము నంగీకరించుటకే కదా! వివరణమునందే యిట్టిజాగరూకతతోఁ బేర్కొన్నవీరు సూరిసూత్రమునం దట్లు పేర్కొనలా దనుట సంగతమా? ఇఁకఁ బ్రచురముగాఁ గలదా? సూరిలక్షణముచే సిద్ధపూర్ణము ప్రచురముగాఁ గల దని యర్థ మగుచున్నదా? సాధ్యపూర్ణము లే దనఁగా సిద్ధపూర్ణము గల దని మాత్రమె యర్థము. ప్రచురముగా నుండు ననుటెట్లు? శబ్దమునందు సహజముగా నుండుసిద్ధబిందువును లక్ష్యములనుబట్టి యెఱుఁగవలసినదే. అది ప్రచురమా విరళమా యనుదానికి శాస్త్రముతో నిమిత్త మేమి? సిద్ధపూర్ణము గల దని మాత్రము సూరిలక్షణముచే సిద్ధించును. తెలుఁగున సిద్ధపూర్ణ మసలు లేనిపక్షమున నయ్యది దురుక్తి యవును. కాని యది (యరుదుగానైనను) గల దని వీరే "వేంచేయు, మాందాళి, ప్రేంకణము (ఉ.19) మొదలగునుదాహరణములతో స్పష్టము చేసిరి. (సూరి సిద్ధపూర్ణమును గూడ నిషేధించిన నివే యుదాహరణములు చూపి తెలుఁగున సిద్ధపూర్ణము గలదు గాన నద్దానిని నిషేధించుట యసంగత మని వీరు చెప్పరా? (వీరే కాదు. సూరి యిట్లు చెప్పిన నయ్యది విమర్శింపవలసినదే) కాఁగా సూరి సాధ్యపూర్ణమును మాత్రమె నిషేధించుట యుక్తమె.

పిదప "మఱియు తేంట్లు- పేండ్లు- పూండ్లు విలుకాండ్రు- అండ్రు మున్నగు పెక్కుచోట్ల సాధ్యపూర్ణములు గల(ఉ.18) వనిరి. అన నేమి?" పెక్కుచోట్ల దీర్ఘముపై సాధ్యపూర్ణము నిల్చుచున్నది. కావున దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లే' దని నిషేధింపరాదా? ఇఁక వీరివచనములనుబట్టి చూచిన సిద్ధపూర్ణము ప్రచురముగా లేదు గావున సిద్ధపూర్ణమున్న దని చెప్పరాదు. సాధ్యపూర్ణము గలదు గాన సాధ్యపూర్ణము లే దని చెప్పరాదు. మఱి దీర్ఘముపై సిద్ధపూర్ణము లే దని సూత్రింపవలయు నందురా? లేక వీరివలె సూత్రింపవలెనా?

వీరు మాత్రము ప్రచురముగా లే దని సిద్ధపూర్ణమును నిషేధించిరా? 'దీర్ఘము మీఁద సాధారణముగాఁ బూర్ణము నిల్వ దనిరి. 'సాధారణముగా' ననుటచే నరుదైన సిద్ధపూర్ణ మునకు గుర్తింపు గల్గినది. కాని సాధ్యపూర్ణము పెక్కుచోట్లఁ గల దని గుర్తించినవీరు (అరుదైనసిద్ధపూర్ణమువలె) సాధ్యపూర్ణమును గూడ సాధారణముగా నిల్వ దనుట వీరివివరణమున కనుగుణమా?

ఇంతకు ముందు (ప) ంపు (టి) ంటి, ఇంచు అనునవి ప్రత్యేకవిధానము గలవి గావున నచట ఖండమునకుఁ బ్రసక్తియే లేదని స్వసూత్రమును సమన్వయించినవీరు -ఇచట తేంట్లు మున్నగుచోట్లు ప్రత్యేకవిధానము గలవి గావున నచట సాధ్యపూర్ణము లే దనునిషేధమునకుఁ బ్రసక్తియే లేకుండుట (సాధ్యపూర్ణ ముండుట) యేల గుర్తింపరు?

గుర్తింపకపోలేదు. సంజీవనిలో "ఈ16సూత్రములోని సాధ్యశబ్దము వ్యాకరణసాధ్యమాత్రము లెల్ల వాచకము కాదు. కాన తేంట్లు, ఏండ్లు, ఊండ్లు మున్నగుచోట్లఁ బ్రత్యేకముగాఁ బూర్ణమును వ్యాకరణము సాధించుస్థలములం దీసూత్రము వర్తింపనేరదు. అట్టియెడల విధానసామర్థ్యమున దీర్ఘపూర్వకస్థలములందును సాధ్యపూర్ణము రాఁదగు నని గ్రహింపవలయును" (వ్యా.సం.వ.117) ననిరి.

వ్యాకరణసాధ్యము లన్నింటికీ వాచకము గా దన నేమివానికి వాచక మగును? అన్నింటిని దెలుపకుండుటకు లక్షణమునం దే దే నాధార ముండవలెఁ గదా. అట్టి యాధార మేమియుఁ జూపకయే యన్నింటికి వాచకము గా దని చెప్పిన నెట్లు? సాధ్యపూర్ణ మని సామాన్యముగాఁ జెప్పుటచే సాధ్య మైనపూర్ణబిందు వేసూత్రముచే సాధింపఁబడిన దైనను గ్రహింపఁబడవలసినదే. కొన్నింటినే గ్రహింపవలయు ననుట లక్షణవిరుద్ధము, అట్లయిన- తేంట్లు- ఏండ్లు- ఇత్యాదుల బిందువు విరోధించునా? సమానపదంబునందు (సమా.16) మున్నగులక్షణముచే నచ్చఁ బూర్ణము విశేషముగా విధింపఁబడఁగా దీర్ఘముమీఁద- ననునీసూత్రము వర్తింప దన నెట్లు? వర్తింపనిమాట నిజమే. కాని కొన్నియెడలమాత్రమె వర్తించును గావున నాచోట వర్తింప దనరాదు. ఇట "గోఁట్లు అని కావలసియుండఁగా నిందలియెల్లచో ననుదళమునం జేసి దీర్ఘముమీఁదఁ గూడ సంజ్ఞ16సూత్రమును బాధించి పూర్ణబిందు వయ్యెడిఁ గాన గోంట్లు అనురూప మగు (బా.సా.పే.220) ననువచనములు సమంజసములు. అచ్చటి(సమా.16) ఎల్లచో ననుదళమునకు వఝలవారు పైరీతి

ప్రయోజనమును గుర్తింపలే దేమో. "బహువచనస్థలములం దెల్ల నవ్యభిచరితముగ వర్తిల్లు" ననిరి. కాఁగాఁ బ్రస్తుతసూత్రముచే 'తేఁట్లు' అనుచోఁ బూర్ణము నిషిద్ధము గావలసియే యున్న నందలి 'యెల్లచో' ననుదళ మీ(సం.15) సూత్రమును బాధించుట వలన వర్తింపలేదు. అంతే కాని యిది వర్తించునది కొన్నియెడలఁ గాఁగా నాకొన్ని యెడలలో సమా.15స్థలము లే దనుట యసంగతము.

ఇంతేల వీరే యిటనే "విధానసామర్థ్యముచే దీర్ఘపూర్వకసాధ్య ముండు" ననిరి గదా. వీరీ యాపద్ధతినే యాశ్రయించినను నీసూత్రమందలిసాధ్యశబ్దముచే నెల్లయెడల దీర్ఘముపై సాధ్యపూర్ణము వారింపఁబడుచుండఁగాఁ బ్రత్యేకముగా విధించినచోట్ల మాత్ర మావిధానముసామర్థ్యముచేఁ బూర్ణ ముండు ననియె కదా యర్థము. ఈసూత్రమందలిసాధ్యశబ్ద మెల్లయెడల సాధ్యపూర్ణమును గ్రహింప దన్నచోఁ దేంట్లు ఇత్యాదులలో దీర్ఘముపై సాధ్యపూర్ణ ముండుట కీసూత్ర మవరోధింపనిచో విధానసామర్థ్యము నాశ్రయింప నేల? కాఁగా వయ్యలవారివచనములనుబట్టియే యిచటి సాధ్యశబ్దము 'కొన్నియెడల సాధ్యమునకే' వాచక మగుట సరికా దని స్పష్టము.

వీరు బా.సా.పే. సమన్వయము సమంజసముగా దనలేదు. కాని యది గ్రహింపను లే దని విధానసామర్థ్యము నాశ్రయించుటంబట్టి తెలియుచున్నది. కానీ యిట విధానసామర్థ్యము నాశ్రయించుట కవకాశము గలదా?

సమానపదంబునందు (అచ్చు 16) ననునాసూత్రము దీర్ఘమునయిన మాత్రమే పూర్ణము నుపదేశింపలేదు. అనంట్లు, పనంట్లు ఇత్యాదిగా హ్రస్వముపైని బూర్ణబిందువును నిత్యముగా సాధించుచు నావిధానము సార్థకమై యున్నది. హ్రస్వముమీఁదిఖండమునకును బూర్వసూత్రము విండునున్నను వైకల్పికముగాఁ జెప్పుచుండఁగా నవఁట్లు అనురీతిరూపములను వారించుచు అచ్చు.16విధానము సార్థకమై. తేఁట్లు ఇత్యాదిస్థలములఁ బ్రస్తుతసూత్రము ననుసరించి దీర్ఘముపై సాధ్యపూర్ణము లేదు గావున నా సమా.16సూత్రముచే నిండుసున్న రా దని చెప్పినను నావిధానము వ్యర్థము గానేరదు. అట్టియెడల విధానసామర్థ్యము నాశ్రయించుట యెట్లు? అచ్చు.16సూత్రము కేవలముదీర్ఘముపైని మాత్రమె పూర్ణమును విధించుపక్షమునందే విధానసామర్థ్యమార్గము నాశ్రయించుట యొప్పును, అట్లు గామి వీరు విధానసామర్థ్యముచే తేంట్లు ఇత్యాదిస్థలములఁ బూర్ణము రాఁదగు నని చెప్పుట యసంగతము.

బా.సా.పే. సమన్వయము సమంజసము. "ఉకారాంతగోశబ్దంబుల కంతట-

(తత్స.48) ననుసూత్రమునందలిఅంతటిశబ్దమువలె సమాసపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో' (అచ్చి.16) యనుసూత్రమునం దెల్లచో ననుపదము విశేషప్రయోజనముతోఁ గూర్పఁబడినది. 'ఎల్లచో' ననుటచే నెట నేని (దీర్ఘముపై) నవరోధ మున్నను (దీర్ఘముపై సాధ్యపూర్ణము లే దనుప్రస్తుతలక్షణము) దానిని దొలఁగించి (సం.12సూత్రమును బాధించి) యచ్చటను ఖండమునకుఁ బూర్ణ మగును. 'అంతట ననుటచే స్త్రీలింగప్రథమైకవచనలోపము బాధింపఁబడి పువర్ణక మైనట్లే యిట నెల్లచో ననుటచే సం.16సూత్రనిషేధమును బాధించి దీర్ఘముపైఁ గూడఁ బూర్ణబిందు వగు నని గ్రహించుట సక్రమము. తేంట్లు అనురీతిస్థలముల దీర్ఘముపై సాధ్యపూర్ణము రావలసియుండుటచేతనే సూరి అచ్చి.15సూత్రమున 'నెల్లచో' నను దళ ముంచెను. వీరును దానిని దమలక్షణమున స్వీకరించిరి. ప్రయోజనము నెన్న లేదు.

పోండి, మూండు, వీండు అనురీతిగా దీర్ఘముపై సాధ్యపూర్ణములు ప్రదర్శింతురు. కాని యివి యెంతవఱకుఁ బ్రామాణికములో నిర్ణయింపరాకున్నది. దీర్ఘముపై ఖండము మాత్రమే యుండు నని చిం.సూత్రానుగుణముగాఁ జెప్పినయహో. రచించినప్రబంధములో "కాంతకు మదిఁబుట్టినతల,పోంతలతో వేఁడియూరుపులతో మరు బిబ్బోంతలతో మయిపూఁతల,రోంతలతో (కాళింది.2.35) అనురీతిప్రాసఘటిత పూర్ణము గానవచ్చుచున్నది. తలపోఁత, కోఁత, పూఁత అనుచోట్ల (జీత్త్వముచే) పూర్ణబిందు వగుచో నది సాధ్యపూర్ణము గాక తప్పదు. కాని తలపోఁత లనువిధముగాఁ బై పద్యమున ఖండానుస్వారమె యున్న దేమో. పాఁడిఁ బ్రచ్చఁగ విమ్ము నా తండ్రి కృష్ణ- (అప్ప.3.315) పాఁడి మఱఁగి బ్రతుకువాండ్రిల వ్రేఁతలు(ఛందో.2) ము న్నగులాక్షణికులవచనము లిట్టివే గదా. (ఇయ్యది పూర్ణార్ధబిందుప్రాసవిశేషము. దీనిని ఛందశ్శాస్త్రజ్ఞులు లక్షణబద్ధము చేసినజాడ తెలియలేదు.) కాఁగా పోండి, మూండు ఇత్యాదికుమారసంభవాదిస్థలములలోను పాఁడి మూఁడు అనురీతిగా నట్టి ప్రాసయె ప్రయుక్త మైన దనఁదగును. (అప్ప.పీఠి.పుట.116)

ఇఁక సద్యోతలక్షణమునఁ దేంట్లు ఇత్యాదుల సాధ్యబిందుస్థితిని గూర్చి సాధ్యపూర్ణ ము లే దనునిషేధము తగ దనరాదు. ఒకవేళ నాయుద్దేశముతోనె పై దద్యోతములో సాధారణముగ ననుదళము చేర్చిన నది యనవసరము.

అయాస్థలములలోఁ దమవ్యాకరణమున వీరును 'దీర్ఘపూర్వకపూర్ణము విద్య

(ఉ.113) దని యీతమసూత్రముచే సాధ్యపూర్ణమును వారించికొనిరి. కాని తమ సూత్రమున సాధ్యశబ్దమును తొలఁగించిరి. దీర్ఘముపై సాధ్యపూర్ణము వారింపఁబడ వలసియుండఁగా సాధ్యపూర్ణము లే దని దానిని నిషేధించుటలో దోష మేమి? సిద్ధపూర్ణమును నిషేధింపవలసినయవసరము గాని దాని నుపయోగించునవకాశము గాని తమ వ్యాకరణమున లేని వీరికిఁ గల్గినదా! కావున సిద్ధపూర్ణమును గూడ నిషేధించుటకొఱకే యైన నది యనవసరము గావున నందుకయి సాధ్యశబ్దము తొలఁగింపరాదు. సూరి 'సాధ్యపూర్ణము లే' దనుట యుక్తము. వఝులవా రది తొలఁగించుటలోఁ బ్రయోజనము లేకపోఁగా నస్పష్టతయుఁ గల్గుచున్నది.

వఝులవారిసూత్రమున 'నిల్వదు' అనుమాట విచిత్రము. నిల్వ దనుటవలనఁ బూర్ణమును జేసి పిదప దానిని లోపింపఁజేయవలయునా? సూరి 'లేదు' అనుటచే నాయాచోట్లఁ బూర్ణము చేయుటయే మానవలయును. కాఁగా నిల్వ దని మార్చుటలో వీరియుద్దేశ్య మేమి? ప్రక్రియాగౌరవము మాత్రమె. కాని వీరును బూర్ణము రా దనియె తలఁచి రనవచ్చును. "దీర్ఘముమీఁద నెఱసున్న రాదు.(సంజ్ఞా.16) గావు నసర సున్న రూపము మాత్రమె. ఉదా. పూఁదోఁటలు" (ఉ.64) అనిరి. ఇట్లు నిండుసున్న రా దనియె తలఁచి నిల్వ దని మార్పనవసర మేమి? సూరిలక్షణమున లేని దురుక్తి వీరివచనముల కెక్కినది.

"పూర్ణము నిల్వనిసిద్ధస్థలములు పైఁచు, తోఁచు, అఁకలి, లేఁడు' (ఉ.19) అని వివరించిరి, మన మింతకు ముందు సూత్రమునొద్ద వఝులవారిప్రక్రియలోఁ జెల్లిన సిద్ధఖండము లే దని గుర్తించితిమి. కాని వీరు తమమతమునసె సిద్ధఖండమును జూపుచున్నారు.

కాని పైచోట్ల నున్నఖండము సిద్ధబిందు వె ట్లయినది. పూర్ణము లేలి ఖండమగుటయే సహజ మని (ఖండము పూర్ణ మగుట యుచ్చారణస్వభావవిరుద్ధ మని) తలఁచియున్నారు కావునఁ బైఁ జూపిన వానియందు సాధ్యవస్థలోఁ బూర్ణబిందువే కల దని చెప్పవలెను. పైంచు తోంచు. వీనికి ఖండబిందు వె ట్లయినది? ఇంతకు ముందు సూత్రమున సిద్ధసాధ్యపూర్ణములు ప్రాయికముగా ఖండము పైత మవుటను "హ్రస్వముమీఁద" నని పేర్కొనిరి. పైంచు, అంకలి అనుతీతిగా నిచ్చి నున్న బిందువు సిద్ధమే యైనను దీర్ఘముపై నున్నది గావున నాసూత్రముచే ఖండ మయ్యెడు

నవకాశము లేదు. ఈసూత్రమున నన్న దీర్ఘముపైఁ బూర్ణము నిల్వ దనిరి. కావున నున్నపూర్ణము లోపింపవలయునే కాని ఖండముగా మాఱు టెట్లు? ఏతాము అను చోట మువర్ణకస్థానమునఁ బూర్ణబిందుపూర్వకబువర్ణము రావలసియుండఁగా "దీర్ఘ పూర్వకపూర్ణము నిల్వదు--- ఏతాంబు- ఏతామ్ము అనునవి లే(సూ.113) వనిరి. ఏ తాఁబు అని ఖండము చేయలేదు గదా. అట్లే యిటఁ గూడ సైఁచు అని ఖండము గాదు. (దీర్ఘముపైఁ బూర్ణము నిలువదు గాన ఏతాబు అని బిందువు లేనిరూపము నుండ నట్లే సైచు అః బిందువు లేనిరూప ముండ దేమో యని సందేహము.ఏతాము విషయమున వయులవారివివరణము సరి గా దని యట స్పష్ట మగును.)

కాఁగాఁ బూర్వసూత్రమున 'హ్రస్వముమీఁద' ననుదళ మనర్థకము. (బాల వ్యాకరణవాసనచే నీ లాపదము చేర్చి రనవలయు నేమో.) పూర్ణమునకు ఖండమును సాధారణముగ (హ్రస్వదీర్ఘములపై) విధించినపక్షమునందు దీర్ఘముమీఁదఁ గూడఁ బూర్వసూత్రముచే నగుఖండము దీర్ఘముపై నిత్యముగా నయి సైఁచు అనురీతిగా మాత్రమె యుండుట సిద్ధించెడిది. కావునఁ బూర్వసూత్రమున హ్రస్వముమీఁద నను దళము సైఁచు అనురీతిరూపములను వారించుట కనర్థక మయినది. పోనీ యీసూత్ర మున నయినను (బాలవ్యాకరణవాసనచే) దీర్ఘముపైఁ బూర్ణమును నివారించుటకు బదులుగా 'దీర్ఘముపైఁ బూర్ణము (సాధారణముగా) ఖండ మగు' నని యేని చెప్ప వలయును.

వయులవారు పూర్వసూత్రమునొద్దఁ బ్రస్తావించినయనుస్వారచరిత్రను మఱచి రేమో. ఏ మైనను సైఁచు మొ న్నగువానియందు నున్నఖండబిందు వీయుద్ద్యోతము ననుసరించి యసంభవము గావునఁ బూర్ణబిందువుతో రూపాంతరము లేనిస్థలములం దును ఖండబిందు వుండరాని నట్టివానిని వీరిమతమున సిద్ధఖండము అని నిర్ణ యింప వీలు లేదు. సూరిమతమున నీయవి సిద్ధఖండములే.

కాఁది వీ రివి సిద్ధస్థలము లని రెట్లు? సైఁచు ఇత్యాదులలో ఖండము సిద్ధము గావలయు నన్న నాబిందువు వ్యాకరణముచే సాధింపఁబడినది గా దన్నమాట. అనఁ గా నది శబ్దమున సహజసిద్ధము గావలె. అనఁగా నిచటఁ బూర్ణబిందువునకు ఖండ మగుట లేదు. మఱి యిట ననుస్వారచరిత్ర మే మయినది. హ్రస్వముపైని ఖండము మాత్ర ముచ్చారణస్వభావమునకు ననుస్వారచరిత్రమున కనుగుణముగాఁ బూర్ణమున కాదేశ మయినది కాఁగా దీర్ఘముపయి ఖండము మాత్ర మనుస్వారచరిత్రమున

భిన్నముగా నుచ్చారణస్వభావమునకు భిన్నముగా సహజముగనె యున్నదా? ఖండము నకుఁ బూర్ణమును విధించుటలో ననుస్వారచరిత్రకు భిన్నముగా సూరి యసంగతము గాఁ జెప్పె నన్నవీరు దీర్ఘముపై ఖండమువిషయమున నట్లే చేసిరి కాదా?

కాఁగా వీరు పైఁచు ఇత్యాదుల ఖండము సిద్ధ మందురా? (సూరియనుస్వార చరిత్రమునకు భిన్నముగాఁ జెప్పె ననుట యసంగతము.వీరు నదే పని చేసిరి గావున.) దీర్ఘముపైఁ బూర్ణము సిల్వ దనుట యసంగతము, అనుస్వారచరిత్రకు విరుద్ధము. అనుస్వారచరిత్ర కనుగుణముగాఁ జెప్పఁదలఁతురా. పైఁచు ఇత్యాదుల బిందువు సిద్ధ మనుట యసంగతము. ఏ మయినను సూరిలక్షణమొకక్రమములోఁ బరస్పర వైరుధ్యము లేక గ్రాహ్యమై యున్నది.

సాధ్యబిందువిషయమునను నిట్లే దీర్ఘముమీఁద నిండుసున్న రాదు గాన నర సున్న రూపము మాత్రమె.ఉదా.పూఁబొదలు (సూ.64) ఇటఁ బూర్ణబిందువు రా దని యె యభిప్రాయము స్పష్టము. కాఁగా ఖండము పూర్ణమున కాదేశ మగుట లేదు. వ్యాకరణముచే సాధింపఁబడునీబిందు వుచ్చారణస్వభావము ననుసరించియే పూర్ణము లేయుటచే నేర్పడినది కాదు గదా. కాఁగా దీర్ఘముమీఁదిసాధ్యఖండము గూడ వరుణ వారు ప్రతిపాదించినయనుస్వారచరిత్రకు భిన్నముగా నున్నదే కదా!

అన లెల్ల యెడల నుచ్చారణస్వభావమునే యనుసరించునెడల జేత్వాదుల యెడను బూర్ణబిందువునుమాత్రమె విధించి యాపూర్ణబిందువునకు ఖండమును జెప్పకొనవలె. (దీర్ఘముపై నిత్యముగా, హ్రస్వముపై వికల్పముగా. తేంట్లుఇత్యాదులలో ఖండము లే దనియు, దీర్ఘముపై ఖండము సాధారణముగా నగు ననియు మొదలాగా నిందు లక్షణములు పెక్కు మార్చుకొనవలెను)అది ప్రక్రియాగౌరవ మని యుపేక్షించిరా? అనఁగా శబ్దశాస్త్రప్రయోజనము ననుసరించి యనుస్వారచరిత్రకు భిన్నముగా వీరును జెప్పిరే కదా! కొన్నియెడలఁ జరిత్రకు భిన్నముగాఁ దామె చెప్పినప్పు డితరస్థలము లందుఁ జరిత్రకు విరుద్ధ మని సూరిమార్గమును దిరస్కరింప నేల? మార్గాంతరము నాశ్రయింప నేల? దీనినిబట్టియుఁ జరిత్ర ననుసరించి శబ్దలక్షణము చేయవలయు ననియు నందుచేఁ బూర్ణమునకు ఖండమును గాక ఖండమునకే పూర్ణమును విధింప వలె ననియు వరులవా రింతకు ముందు పేర్కొనుట వ్యక్తమముగా దనియు గుర్తింపవచ్చును గదా.

ఇట్టియెడల "భారతేతరగ్రంథములు కొన్నిటియం దరుదుగ సిద్ధసాధ్యములు

రెండింటను దీర్ఘముమీఁద పూర్ణము తేలక నిల్పుటయుఁ గలదు" (పు.19) వని వీరు వ్రాయుట సరి కాదు. దీర్ఘముపైఁ బూర్ణము(తేలి)ఖండ మవుటకు వీరిలక్షణముచేతను నవకాశము లేనే లేమి నది ఖండ మవుటకే వీలు లేదు. కాఁగా భారతమునందు దీర్ఘముపై ఖండ ముండుటయె వీరిలక్షణమునకు విరుద్ధ మనవలయు.

మొత్తముమీఁద వరుసలవారిసూత్రమున మొదటిసగము వారిప్రణాళికకే విరుద్ధము. కాఁగా సూరిలక్షణము సూక్తము.

ఇఁక నీసూత్రమున నుత్తరార్ధమున వీరు "అనిర్దిష్టబిందువిధానస్థలములలో దీర్ఘముమీఁద ఖండమునే నిల్పవలయు' ననుటయుఁ గేవల మనవసరము. "దీర్ఘము మీఁద సాధారణముగాఁ బూర్ణము నిల్పు" దనుపూర్వభాగముచేతనె ఖండపూర్ణములు రెండును బ్రాప్తించుస్థలములలోఁ బూర్ణము దీర్ఘముపై నివారింపఁబడుటచే ఖండమే వచ్చు ననిస్పష్ట మవుచుండఁగా ఖండమునె నిల్పవలయు నని వేఱ చెప్పవలయునా?

చెప్పుటవలన నష్టమును గలదు. 'అల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును. ముందఱిఉవర్ణంబునకు బిందుపూర్వకడువర్ణంబు నగు' (పు.160)నని వీరు సూత్రించిరి. అలు+రు అని కాఁగా ఉవర్ణమునకు బిం. పూర్వకడువర్ణము రావంయును. ఇటు ఉవర్ణమునకు ముందు దీర్ఘ ముండఁగా, సూత్రమున బిందు వనిర్దిష్టమైయున్నది గావునఁ బ్రస్తుతలక్షణము ననుసరించి ఖండమున నిల్పవలయును. సూత్రమున 'ఖండమునె' యని యవధారణార్థకమును గూడఁ జేర్చిరి. ఖండము చేరి తీఱవలయును. ఇట్లు అఁడురు అనురీతినశ్రుతపూర్వము లగుశబ్దజాల ముత్పతిల్లును. వీరు సాధింపఁదలఁచికొన్న 'అండురు' అనురూప మెట్లగును. సూరి బిందుపూర్వకడకారము (వ్యంజనమాత్రము)నె విధించుటచే నది మీఁదిరేఫముతోఁ గూడుట సంయోగపరకతవలన నీసమానపదమునందుఁ బూర్ణబిందువు మాత్రమె యయ్యి 'యాండ్రు' అనుసాధురూపము గల్గుచున్నది. కాని వీరు సూరిని దిరస్కరించి 'అఁడురు' అనురూపమును సాధింపయత్నించుచునే బాల.వాసనచేఁ గాఁబోలును 'బిందుపూర్వక'- అని బిందువును నిర్దేశింపకుండుటచే నిష్టరూపము లసాధువు లయి యనిష్టరూపములు సాధింపఁబడుచున్నవి.

దీర్ఘముపై బిందువు పూర్ణముగా నిర్దేశింపఁబడినచోట్లఁ బూర్ణమె యగు నవియు సూత్రము నుత్తరభాగమునుద్దేశ్యము. పూర్ణ మని నిర్దేశింప ఖండమునకు బ్రసక్తి యుండకపోవుట విశేషముగాఁ జెప్పవలసినయంశము గాదు.

నిర్దిష్టపూర్ణవిధానస్థలములలో వీరు జేండ్లు- తేంట్లు- విలుకాండ్రు- ఆండ్రు అనియుఁ జూపిరి. (ఉ.19)విలుకాండ్రు అనుచో అచ్చి.7సూత్రమునఁ బూర్ణబిందువునే విధించిరి. కాని 'అండ్రు' అనునది నిర్దిష్టబిందువిధానముగా నెట్లు చూపిరి. ఆ సూత్రమునఁ బూర్ణబిందు వని నిర్దేశింపఁబడలేదు. జేండ్లు, తేంట్లు- అనువానింబట్టి సంయోగపరత్వమున అచ్చి.16సూత్రముచేఁ (బూర్ణబిందువు) నిర్దేశింపఁబడిన దని యభిప్రాయము గావలె. కాని యాసూత్రమున ఖండబిందువునకుఁ బూర్ణబిందువు చెప్పఁబడుటచే నిచట (అఁడు) 'అండ్రు' అని సంయోగపరకత్వముననే పూర్ణమగును కావున సంశ్లేషము లేనప్పుడు అఁడురు అనురీతిగా సంయోగపరకత్వ ముండదు గావున ఖండమునకుఁ బూర్ణము రావీలులేమి అండురు అనురూపము కాదు. అఁడురు అనియే కావలెను. అది యపరూపము.

"వీనిసామ్యమునఁ గావలయుఁ గొన్నిసిద్ధస్థలసంయోగపూర్వపూర్ణములు వెలయుచున్నవి. తీండ్రల్ గల్గిన- తీండ్ర మగు' (ఉ.19) నని వివరించిరి. 'తీండ్ర' అనునదియే సహజసిద్ధ మగుశబ్దముగాను నందున్నపూర్ణ ము సిద్ధముగాను వీరుచెప్పఁ దలఁచిరి.కాని సంయోగపరకము గాకయు దీర్ఘముపై సిద్ధపూర్ణమును వేంచేయుమా॥ చో వి రుదాహరించియే యున్నారు గదా. అట్టియెడల సంయోగపరక మగుదీర్ఘ పూర్వపూర్ణ మును విశేషముగాఁ బ్రస్తావింపవలసినయవసర మేమి? వఝలవారు సంజీవనిలో తీఁడిరించు ము న్నగువానిలోవిఖండములు సమానపదంబునందు- అను సూత్రముచేఁ బూర్ణము లగుచున్నవి గాన నవి సాధ్యపూర్ణములె యనఁదగును' (వ్యా.సం.స.112) నని చెప్పి ఈ'తీండ్రల్ ప్రయోగమును వివరించుచు నిది సిద్ధ పూర్ణము గా దనిరి.కాని సంజీవనియభిప్రాయముకంటె నీయుద్యోతమునభిప్రాయమె యుచిత మేమో యనిపించును.

'తీండ్ర' యనుదానికి తీఁడర అనురీతిరూపములు లేవు. కావున నిచ్చట సంయోగపరకతయందు ఖండము పూర్ణ మయిన దనుట కవకాశము చాలదు, కాఁగా దీనినుండి నామధాతువుగా తీండ్రించు, (తీండ్రిల్లు) అనునవి యేర్పడియుండవచ్చును. తీఁడిరించు అనురూపము విశిష్టముగా నీపక్షమున గమనింపవలయును. తీండ్రించు అనుదానికంటే తీండ్ర విస్పష్టార్థక మైయుండుట గూడఁ బై రీతియాలోచన కవకాశము గల్గినది. ఇది యింకను విశదముగాఁ బరిశీలింపవలసియున్నది.

ఇం కొకవిశేషము. "సంయోగస్థిరపూర్వకత్వమునఁ బూర్ణము లోపించుటయుఁ గలదు. ఉదా. (మాండుచు) మాఁడుచు, మాడ్చు, వేసంగి- వేసఁగి — వేసవి పోండిమి, పోఁడిమి — పోడిమి" (ఉ.19) స్థిరపరకతలో నచ్చతెలుఁగున బిందు వుండదు. (సం.16) గావున వేసవి ఇత్యాదులలో బిందువు లోపించుట కొలక్షణ మాధారము కాఁగలదు. సంయుక్తపరకతలో బిందులోపమె విశేషము. ఈయంశమును వీరు సూత్రించిన బాగుండెడిది. "సర్వత్ర రలసంయోగే సమానపదే, -రలసంయోగే కిమ్? మాఁడుచు మాఁడ్చు"- అనుచో సూరి సూత్రాంధ్రమునఁ బూర్ణము రాకుండుటను జెర్కొనెనుగాని బిందులోపమును జెప్పినజాడ గానరాదు. కాని వీరియీవివరణముచే దీర్ఘముపైఁ బూర్ణబిందువు లోపించుటయె విధింపఁబడిన దని గ్రహించితిమి. కాన మాడ్చు అనురీతిగా సంయుక్తపరకత్వమునబిందువు లోపించుట సూరిలక్షణము నవలె వయులవారిలక్షణమున విశేషము గాదు. ఇంక నైఁచు ఇత్యాదులలో ఖండబిందు వగుటనే వీరు విశేషముగాఁ జెప్పుకొనవలసియున్నది.

'లోపింపుటయుఁ గల' దనుచో వీరు చార్థకసుశబ్దమును బ్రయోగించితి. తేంట్ర తేంట్లు అనురీతిగా సంయుక్తపరకత్వమునఁ బూర్ణబిందు వుండుట నుద్దేశించి యిట్లు చెప్పియుండవలెను. కాని సంయుక్తపరకత్వమున సార్థక మైనను స్థిరపరకస్థలమున నీచార్థకశబ్దము సంగతము గాదు. స్థిరపరకతలోఁ బూర్ణము లేదా ఖండ మచ్చతెలుఁగున నుండుటకు వీలు లేదు. కావున స్థిరపరకతలో బిందులోపము వికల్ప మగుట స్పష్టము చేయనిచోఁ గొన్నియెడల నచ్చతెలుఁగున స్థిరపరకబిందువు గల దని యర్థమగును. అది సరి కాదు.

ఈస్థలమున వీ రుదాహరణములలో (మాండుచు) వేసంగి- అనురీతిగా ముందుగాఁ బూర్ణబిందురూపము లిచ్చుటయుఁ 'బూర్ణబిందువు లోపించు' నని చెప్పుటయు వీ రనుసరించినయనుస్వారచరిత్ర కనుగుణ మైయున్నది. అట్టియెడల మాండుచు- మాడ్చు అని యీక నడుమ మాఁడుచు అని ఖండబిందుఘటితరూపము నెట్లు చూపిరి? అట్టియెడల 'పండ్లు- ము వ్వన్నగుపెన్కుచోట్ల సాధ్యపూర్ణముగల' (ఉ.19) దని చెప్పుటయు నెట్లు? పూర్ణబిందువే మొదటిది కాఁగా తేంటి+లు తేంట్లు అనుచో సిద్ధపూర్ణము లోపింపక నిల్చియున్న దనవలె. తేంట్ర ఇత్యాదులలోవలె నీయది సిద్ధపూర్ణమె. సాధ్యపూర్ణము గాదు. పూర్ణమును విధించుటయే (అచ్చ.15)యసంగతము. తేంటి-తేఁటి-తేని యూపిదప తేఁట్లు అనుచోఁ బూర్ణము చేసిన నదిసాధ్యపూర్ణ

మగును. వీరిప్రక్రియలో దీర్ఘము పైనిబూర్ణమునకు ఖండము వచ్చుప్రసక్తి లేకుండుటయే గాక, పూర్ణమునకు ఖండము చేసి మఱల నాఖండమునకుఁ బూర్ణము చేయుట ప్రక్రియాగౌరవమె కాని ప్రయోజనము లేదు. కొన్నియెడల (తేఁటి)ఖండము మాత్రమె యుండి, కొన్నియెడలఁ (తేంట్లు) బూర్ణము మాత్రమె యున్నచో నాయైచోటుల ఖండము నిత్యముగా నగు ననియుఁ గొన్నియెడలఁ (సమానపదమునందు సంయోగంబు పరం బగునపుడు) బూర్ణము (ఖండము కాక) యట్లే యుండు ననియుఁజెప్పుట లాఘవము గదా.

పోనీ విరుద్ధ మయినను తేంటి-తేఁటి పై- తేంట్లు అనుచో వడ్డులవారిప్రక్రియలోను నివి సాధ్యపూర్ణ మే యందము. అట్లే మూండుచు-మూఁడుచు- మూడ్చు అనియగుచో నెట్లని బూర్ణము ముందుగా ఖండ మై యాఖండము సంయుక్తపరకమైనపుడు లోపించిన దనవలయును. మూఁడుచు- మూడ్చు అనుచో వీరదేక్రమములో నుదాహరించియు నున్నారు గూడ. కాఁగా వివరించునపుడు 'ఖండము లోపించు' ననిగదా చెప్పవలెను. పూర్ణబిందువు లోపించు ననుట యెట్లు? పూర్ణము ఖండ మైన మూఁడుచు అఁయియు, పూర్ణము లోపించిన మూడ్చు అనియు నగు నని యుద్దేశము గావలెను. అట్టియెడల నీవివరణము సరిగనె యుండును. (కాని తేంట్లు అనుచో వీరి ప్రక్రియ సరి గా దని యిదియు నిరూపించును) కాని యిటఁ బూర్ణము లోపించు నన్నవీరు స్థలాంతరమున నీగ్రంథముననే "—మూఁడుచు- మూడ్చు, (ఇట బిందు లోపము) స్థిరపరకత్వరూపాంతరమందును బిందువు లోపించుట గలదు. వేసఁగి-వేసవి, పోఁడిమి-పోడిమి (ఉ.161) యనిరి. ఇటఁ బూర్ణబిందువునే చూపలేదు. కాఁగా నట బిందులోప మనఁగా ఖండబిందువే లోపించిన దనవలె. ఇంకను నట 'తీఁడిరించు- తీండ్రించు అని యుదాహరించుచు ఖండమునకుఁ బూర్ణ మవుట బహువచనపరకములు గానిస్థలములందును గల దని (ఉ.161) స్పష్టము చేసిరి. కావున నిట ఖండమునకె పూర్ణ మయిన దన్నమాట.ఇవియె చూపించి సంజీవనిలో 'తీంఁడ్ర' యనుచో సాధ్యపూర్ణముగాఁ జెప్పిన వీరు పైని దీంఁడ్ర యనుచో నున్నది సిద్ధపూర్ణ మనుట యెట్లు?

బాలవ్యాకరణవాసనచే వీరిగ్రంథమున ననుస్వారచరిత్రకు భిన్నముగాఁ గల్గిన యింకొకవైరుధ్యము నిట్లు గుర్తింపవచ్చును.

అఁటఇఁకమ్మిఁడు మొదలగువానికి నే అయ్యనశబ్దములలోఁ దొలిప్రాస్వముపైఁ

పూర్ణము లేల దని చెప్పుచు 'ఎఁడు, ఇఁడి' యున్నగునవి ప్రత్యయములు. పదములు గావు. గంపెండు, గంపెఁడు. వాలిండి- వాలిఁడి (ఉ.18) యనిరి. మిగిలినవానిలోఁ పూర్ణ బిందువే పూర్వరూప మయిన నవుఁ గాక ఇట్లు వ్యాకరణముచే విధింపఁబడు. ఎఁడు, ఇఁడి ప్రత్యయములలో వీరును (సూరివలె) ఖండబిందువునే చూపిరి. కావున విం దది మొదటిరూప మనక తీఱదు. వీరు హ్రస్వముపైఁ బూర్ణమునకు ఖండ మునె విధించిరి. ఇట ఖండమునకుఁ బూర్ణము వచ్చు టెట్లు? గంపెండు అని యగు టెట్లు? వ్యాకరణమంత యయినను వీ రనుసరించినయనుస్వారచరిత్ర ననుసరించి వీ రీప్రత్యయములను ఎండు, ఇండియని పూర్ణబిందువుతోనె విధింపవలసియున్నది. (అపుడే పూర్ణమునకు ఖండమును విధించుట యిట నుపయోగించును.) గంపెండు అనుకృతిరూపము లప్రసిద్ధము లగుటచే ఖండబిందువునే విధింపవలయు నన్న ననుస్వారచరిత్ర కనుగుణముగా వ్యాకరణమున నాయావిధు లెల్లఁ జెప్పుట గుమర దని గుర్తింపవచ్చును గదా! అట్టియెడల ఖండమునకుఁ బూర్ణము విధించినసూరిలక్షణ మవమార్గమున నున్నట్లు విచారింప నేల?

అది యట్లుండఁగా ఎఁడు, ఇఁడి అని ఖండబిందువుతోఁ బ్రత్యయములను విధించినవీ రిచట ముందుగాఁ బూర్ణబిందువుతోడిరూపమును జూపి యావిదప ఖండముతోడిరూపము నిచ్చుట యీలక్షణమున కనుగుణ మైనను ఎఁడు ఇఁడి విధానస్థలమునుబట్టి నక్రమము గా దనక తీఱదు. ఖండమును జూపిన దానికిఁ బూర్ణము వచ్చుటకుఁ దమలక్షణము ననుసరించి వీలు లేదని ముందుగాఁ బూర్ణము చూపియుందురు. ఎఁడు అనుప్రత్యయము రాఁగా గంపెండు అనురూపము ముందుగా నేర్పడి పిదప గంపెఁ డని యగుట యెట్లు? సూరిప్రణాళికను గొంత మార్చి కొంత యనుసరించుటవలన నద్వైతమున నిట్టివైరుధ్యము లేర్పడిన వనఁదగు.

వసులవారు వాఁడు వీఁడు మొద లగుచోట్ల దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము విలువనిస్థలములుగా వారిసూత్రమునందలి మొదటివాక్యమున కుదాహరణములుగా నిచ్చిరి. కాని యవి యనిర్దిష్టబిందువిధానస్థలము లవుటచే నట ఖండము మాత్రమె యగు ననువీరిసూత్రమునందలిరెండవవాక్యమున కుదాహరణములుగాఁ జూపఁదగినవి. కాని యారెండవవాక్యము మొదటిదానికే వివరణ మనఁ దగియుండుటచే నిట్టి పొరపాటు సంభవించినది.

ఇట వీరు ఖండబిందుస్థితిని దెల్పునుపాయముల నిట్లు పేర్కొనిరి.

"సాధారణముగా హ్రస్వముమీఁదిసిద్ధఖండమును, దానిచో నిల్పుపూర్ణమునుబట్టి తెలిసికొనవచ్చును" (ఉ.20) వీరు సిద్ధఖండమునుగూర్చి పేర్కొనుట వింత. ఖండమునకుఁ బూర్ణము విధించినసూరిమతమున అడఁకువ ఇత్యాదులలోనిది సాధ్యబిందువు కాఁగా నింక సిద్ధపూర్ణ మన్నది గగనారవింద మనిరి (వ్యా.సం.స.113) కదా.అట్లే పూర్ణానుస్వారము పూర్వరూపము గదా యని బిందువున్న కళయున్న విధించిన వజ్ఝులవారిమతము ననుసరించి (అడఁకువ ఇత్యాదులలో నఱసున్న సాధ్యము కాఁగా నింక సిద్ధఖండము గగనారవిందము కాదా? సిద్ధఖండ ముండవలయు నన్న నయ్యది పూర్ణమున కయినది కారాదు.పూర్ణమున కయినది కాక సహజముగా ఖండ ముండుట యనుస్వారచరిత్రకు విరుద్ధము. అనుస్వారచరిత్రకు విరుద్ధముగా వజ్ఝులవారును సిద్ధఖండము గల దందురా? తమలక్షణమునఁ గలిగిన వైరుధ్యమును వీరు గుర్తించినట్లు లేదు. ఇచటనే సిద్ధఖండముచోటఁ బూర్ణము నిల్పఁబడు నని చెప్పుట వారిలక్షణమునకు విరుద్ధము.

సిద్ధఖండమే లేనివీరిమతము ననుసరించి సైఁచు ఇత్యాదులలో బిందు వసాధ్యమగుటచేతఁ గూడ వజ్ఝులవారిప్రణాళిక,యీసూత్రమును గ్రాహ్యములుగావనియుసూరివిధానమే శబ్దశాస్త్రోచితముగాఁ బ్రయోజనవంత మైయున్న దనియు నిర్ణయింపఁదగును. కాఁగా నుద్ద్యోతమునందలివజ్ఝులవారియభిప్రాయమే 'హ్రస్వాత్పూర్ణో ఒపి' యనుచోఁ జిం.లోఁ గల దని తలఁచిన నిష్ప్రయనౌచిత్యములు నందుఁ దప్పవు.బాలసరస్వత్యాదులయభిప్రాయమే యట గ్రాహ్యము.

## బిందుస్థితి :

"సంస్కృతసమేతరము లయినతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది" (సం.19) యనుసూరిలక్షణమును వీరు యథాతథముగనే గ్రహించిరి.

కొన్నివిశేషముల నిట్లు పేర్కొనిరి. "ఈసూత్రపునియమముచేత బిందుపూర్వకత్వమున దకారమునకు లకారాదేశము మున్నగువిధులు వర్తిల్లనేరవు." (ఉ.21) ఇది యసంగత మని అచ్చి.14సూత్రమునొద్ద స్పష్ట మగును.

"పరుషసరళములకు స్థిరవర్ణ మాదేశ మగునపుడు ముందటిబిందువు కొన్ని యెడల లోపించును" (వి.21) స్థిరము పర మైనపుడు ముందఱిబిందువు నిత్యముగానే లోపించును. తెలుఁగున స్థిరపరకబిందు వసలే లేదు గావున 'కొన్నియెడల' లోపించు ననుట సరి కాదు. ఈదళమువలనఁ గొండొకచో స్థిర మాదేశ మయినను ముందఱ బిందువు నిల్చుటయుఁ గల దనునర్థము సిద్ధించును. అది యసంగతము.

ఇంకను వివరణమున స్థిరవర్ణ మాదేశ మగునపు డనుటకంటె స్థిరపరకత సంభవించునపు డని చెప్పిన బా గుండెడి దనవచ్చును. 'నాఁడు+నాఁడు' అనుచో నంతిమాక్షర మగుడువర్ణము లోపించునపుడు బిందువునకు స్థిరపరకత్వము సంభవించును. కాఁగా నట బిందువు లోపించును. ఇట స్థిర మాదేశ మగుప్రసక్తి లేదు గదా. (పూర్వస్వరము లోపించునపుడు ననుస్వారము లోపించును.పొలఁతి-పొల్తి. ఇట్టి వానిఁగూర్చి యీసూత్ర మేమియుఁ జెప్పదు.)

ఈలక్షణమునుబట్టి తెలుఁగున స్థిరమునకు ముందు బిందు వుండరాదు. కాని కంసాలిశబ్దమున నొకచోఁ గానవచ్చు. 'కంసాలజాతివాఁ' డనుభోజరాజీయప్రయోగ మునఁ గమసాలజాతివాఁ డని కవిప్రయుక్తపాఠ మై యుండఁదగు నని (వ్యా.సం. న.119) వఝలవా రనిరి. వీ రూహించినపాఠమునకు నాధార మేదియు లేకుండుటచేఁ గవిప్రయుక్తపాఠ మైయుండు ననిరి. "స్వర్ణకారాభిధఁ బరఁగు బాపసి యగసాలి సొన్నారి కంసాలి యనఁగ" (ఆం.భా.2-284) ననుకోశవాక్యమున నట్లు కవిప్రయుక్తపాఠముగా 'కమసాల'శబ్దము నూహింప వీలు లేదు. అట్లయిన గణభంగ మగు. కావున నిది యాధునికము గాన వ్యావహారికరూప మందుల కెక్కిన దనిరి. కాని యిట్టియెడలఁ గవిప్రయోగమును దిద్దఁజూచుటకంటె నయ్యది విశేషస్థలముగా గుర్తించుట యుచిత మేమో.

"కొన్నిప్రత్యేకవిధానస్థలములందు బిందుపూర్వకస్థిరము గన్పట్టును"(వి.21) "ఈ16సూత్రము సైతము ప్రత్యేకముగఁ జెప్పఁబడినవిశేషవిధులను బాధింపనేరదు. వచ్చెం ధాత్రీపతి (వ్యా సం.న.130) యని యొకవిశేషమును దెల్పిరి. విశేషవిధిచే బాధింపఁబడుట సామాన్యలక్షణమే. 'సంస్కృతసమేతరంబు లయిన తెలుఁగుశబ్ద ములయందు" అని సూత్రమునఁ జెప్పఁబడఁగా 'ధాత్రీపతి'సంస్కృతసమ మగుట గమనార్హము. ఈసూత్ర మట్టిచోటుల బిందువునుగూర్చి చెప్పుచున్నదా? నాఁ(డు)+ నాఁడు అనుకీతిగా నాచ్ఛికశబ్దములవిషయముననె యిది వర్తిల్లు ననఁదగును. కాఁగా

వచ్చెం ధాత్రీపతి యనుచో బిందువు వచ్చుటలో నీ16సూత్రము 'బాధింపఁబడుట'లే దని తోఁచును.

## యకారము-ఋౠఌౡలు :

'యకారంబును ఋౠఌౡలును దెలుఁగుమాటలకు మొదట లేవు'(సం.17) అనుసారిసూత్రమునుగూర్చి వీ రిట్లనిరి. ఈసూత్ర మనావశ్యకము. ప్రక్రియలో నీనియముపయోగము లేదు. పదాదిని ణ-ళ- ము న్నగువానినిషేధము లేనట్లే యీనిషేధము నక్కఱ లేదు. వాడుకలోనియపభ్రంశముల నెల్ల నవరింపలేదు గదా(ఉ.21) యనిరి. వాడుకలోనియపభ్రంశముల నెల్ల నవరింపలేదు గాన నీనవరణ మనవసర మనుట తగదు. భాష మొత్తమునకు లక్షణము చెప్పఁబడలేదు గావున బాలవ్యాకరణమె యక్కఱ లే దన్నయ ట్లుండును. ధ్వన్యనుకరణశబ్దములందు వర్ణవైచిత్రి పెక్కువిధములుగా నుండఁగా వీరు ముగాగమమును మాత్రమె చెప్పిరి. అది యనావశ్యకమె యగునా? అయిన నేల చెప్పిరి?

"వికృత్యాదౌ భవేన్నణః" అని వి.వి. ణకారమును నిషేధించినది.కాని ళకారము నిషేధింపలేదు. అయ్యు ణకారనిషేధ మనవసర మని వీరు చెప్పలేదు.

వీరియీవివరణమునుబట్టియే యీసూత్ర ముచ్చారణములోనియపభ్రంశతను నవరించుట కేర్పడిన దని స్పష్టము. ఇట్టియపభ్రష్టోచ్చారణము ణళలయెడఁ గల దని వీరు చెప్పఁగలరా? అపభ్రష్టముగా నైనను బదాదిని ణళ లుచ్చరింపఁబడుటయే లే కుండఁగా ణళ లుండ వని నవరించుట యేల? అపభ్రంశతను నవరించుటయే యుద్దేశ్యము గావునఁ బదాది నేయేవర్ణము లుండవో నిరూపింపవలసినపని లేదు. అట్టిది యకారము, ఋౠఌౡల యెడఁ గలదు. కావున దానిని మాత్రమె నవరించుట యుచిత మైయున్నది గదా.

పదాదిని ఙఞణళలను గూడ నిషేధించిన ఆం.భా.అ.ను విమర్శించుచు సంజీవనిలో వీరే "పదాదిని యవణలా వ్యవహారాదులలో నెచ్చటనే నుండుట గలదు గానఁ దన్నిషేధమునకుఁ బ్రసక్తి గల్గెను గాని -ఙఞళ అనువాని కెచ్చటను నునికి యప్రసిద్ధము గాన (పదాదియందు) నీనిషేధ మప్రసక్త' (వ్యా.సం.న.180) మనిరి. ఇట్లు విమర్శించినవీరే యీసూత్ర మనావశ్యక మనియు, ణకారముతోపాటు 'ళ'ను గూడ నిషేధింపకపోవుట దోష మన్నట్లుగను నుద్ఘోషితమున వ్రాయుట యనుచితము గదా!

ఇవి వ్యవహారాదులందుఁ గల వనుటలో గ్రంథములకెక్కలే దని వఝల వారియభిప్రాయము. వృషావావోలకు గ్రాంథికస్థితి లే (వ్యా.సం.స.128) దనిరి. కాని గోవృల గణియింప ధాతయు నోవఁ' దనిముద్రితప్రతులందుఁ గాన నవుచున్నను యతిస్థితినిబట్టి ధాతయు వోవఁడు అనురీతిగా వకారమె ప్రయుక్త మయిన దని తలఁప వీ లగుచున్నది. 'అయ్యో నీసుతు గ్రద్ద తన్నుకొని పోయన్' అనువానితో పా టిట్టివి గూడ వారింపఁబడుట ప్రయోజనవంత మై లక్షణము సుప్రసక్త మగుచున్నది.

ఇంక యవలవలె ఱకారమును గూడ వ్యవహారమున నయినను గల దనుట విచార్యము. 'ప్రాకృతపదాదిఱకారస్థితి సూరికి స్ఫురింపమింజేసి కావలయు నధర్వణుఁడు నిషేధించియున్నను బదాదిఱకారనిషేధమును సూరి సూత్రింపఁ డయ్యె' (వ్యా.సం.స.130) ననిరి. ఱకారమువిషయము సూరికి స్ఫురింపలే దనుట విచార్యము. "ఓష్ఠ్యస్వరాంతవకారంబును ఱయశలును బదాదిని లేవు (ఆం.శ.శా) అని సూరి యింతకు ముందె పేర్కొనియె యున్నాఁడు. శ.ల సం.నాఁటికి 'యకారౌష్ఠజస్వరవకారములు పదాదిని లే' వనఁగా శకారమువలెనే ఱకారము నైతము పదాదిని లే దని చెప్పనక్కఱ లే దని సూరి నిశ్చయించె నని స్పష్టము. ఇంకఁ బ్రాకృతపదాదిని ఱకారము గల దన్నయంశము సూరికి స్ఫురింపలే దని వఝలవారియభిప్రాయమేమో. ఱరో- ఱరో- ఱట- ఱతః (వ్యా.సం.స.123) ఇట్లు ప్రాకృతపదాదిని ఱకార ముండుటను బేర్కొనిరి. ప్రాకృతపదాదిని ఱకార ముండుట నేమో, యందుకుఁ దెలుఁగుమాటలకు మొదట నుండ దని నిషేధింపవలసివచ్చుట యేమో యర్థము గాదు. వీని కేమి సంబంధము. ప్రాకృతమునఁ బదమధ్యాంతభాగములం దచ్చు లున్నవి. తెనుఁగున లేవు. ఱకారము నిషేధింపవలసియున్న దనుటనుబట్టి యిట్టి యచ్చులనిషేధము మాత్ర మవసరము గాదా? యవలవిషయమున వ్యవహారమునుండి యేని దెలుఁగుపదములనే ప్రస్తావించుచు ఱకారమునకుఁ బ్రాకృతపదముల నిచ్చుటనుబట్టియే తెలుఁగున ఱకారము శకారమువలెనె వ్యవహారమందును బదాదిని లే దని స్పష్ట మగుచున్నది. తెలుఁగుల నేపదముమొదట నే నపభ్రంశముగా ఱకారము లే దనుట నిర్వివాదము. కాఁగా శకారనిషేధ మె ట్లప్రసక్తమో ఱకారనిషేధము నట్ల యప్రసక్తము. వి.వి. షకారము నిషేధించుటచే నది యవసర మనుటకుఁ బ్రాకృతముతో ముడిపెట్టిన ట్లున్నది. వి.వి.చెప్పిన దెల్లఁ జెప్పుచో సూరి కది యర్థ

మయినట్లును, గానిచో నర్థము గానట్లును నిశ్చయించుట సమంజసము గాదు గదా. బా.సా.పే.కూడ ఙకారమువిషయమున వరులవారివలెఁ దలఁచుట యుక్తేశరి కాదు.



పదాదియకారమును జిం. అంగీకరించినది. పదాదిని యకారము వువూవొవోల యుచ్చారణము నేఁటికిని శిష్టోచ్చారణమునందు సముచితము (అయిష్టము ఇత్యాదిగా సంస్కృతసమములకుఁ గూడ నెక్కినది) విల్చియున్నది. చిం.లో విస్తృతవ్యాఖ్య చేసి పదాదియకారము నంగీకరింపనియప్పకవి చిం.పాఠమే సాధువుగాఁ దోఁచుచున్న దని (కవిశి.232) చెప్పినలాక్షణికుఁ డగునహోబలుఁడే తనకాళిందీకన్యాపరిణయ ప్రబంధమున "యువతి నేవియు వెన్నుని యౌవనాఢ్యు" యని యతిబంధముతోఁ గూర్చెనే. ఇట్లు పండితులవ్యవహారమునను ప్రభావము నూపినయకారము వువూవొవో (గో- వులగణియింపధాతయు వోపఁడు- భాగ.)లవిషయమునే సూరి ప్రస్తావించుట యనవసర మని నిర్ణయింపఁదగునా? అనవసర మని చెప్పఁదగినఙకార మునుగూర్చి వి.వి. పేర్కొన్నను (తానే తనఆం.శ.శా.లో జఞఙలు లే వని చెప్పియు, శ.ఆ.సం.లో వివిధసంయుక్తములనుగూర్చి పేర్కొనియు) బాల.లో నాయంశము ప్రస్తావింపకుండుట గమనార్హము.





సూరి యకారము వువూవొవోలు 'తెలుఁగుమాటలకు' మొదట లే వని సూత్రమునఁ జెప్పెను. 'వోఢృవోఢవ్యశబ్దంబులు దప్ప సంస్కృతసమంబులందుపహితము వువూవొవోవర్ణాదు లగుశబ్దములు లే' వనుసూరివివరణము ననుసరించి సూరిసూత్రమునఁ దెలుఁగుమాట లనఁగా సంస్కృతసమేతరము లగుతెలుఁగుమాటలనియే యర్థము. (సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దములయందు-అనుపూర్వసూత్రము ననుసరించియు) సంస్కృతసమములు దెలుఁగులే. ఈపూర్వసూత్రమునవలె నిట సంస్కృతసమేతరము లనక సామాన్యముగాఁ దెలుఁగు మాట లనుటచే సంస్కృతసమములను గ్రహించిన సంస్కృతసమశబ్దములందుఁ బదాదిని యకారము వువూ(వొ)వోలు లే వనునర్థము సూత్రముచేతనె సిద్ధించును. అట్టిమొదల వువూవోలు లేకుండుటను విశేషముగా వివరించుట వ్యర్థ మగును. ఇంక యముఁడు, యామిని, యుక్తము, యూథము, యోగము, యౌవన మనురీతిగా సంస్కృతసమపదాదియకారము నీలక్షణము విరోధించును. కావున నీనిషేధము సంస్కృతసమములందు వర్తింపఁజేయుట సూరివివరణమునుబట్టియు సూరికి సమ్మతము గాదు. కావునఁ

బూర్వసూత్రమునుండి సంస్కృతసమేతరంబులయిన-అనువదించుటయు నిందు దనువర్తింపఁ జేసికొని యిటఁ దెలుఁగుమాట లనఁగా నాచ్ఛికము లనియే యర్థము చేయవలయును. సంస్కృతసమములందును ఇష్టము ఈదృశము ఏకాంతము ఇత్యాదులలోఁ బదాదిని యకార ముచ్చారణమునం దున్నది. కాని యీయవి సంస్కృతీయము లవుటచే నట యకారము లక్షణవిరుద్ధ మగుట సంస్కృతసిద్ధ మైయుండుటచేఁ దెలుఁగునఁ జెప్ప నక్కఱ లేదు. ఇట్లే ఉదకము- ఓదనము ఇత్యాదులలోను మొదట వువూవోలు విన్పించుచున్నను నది సరి గా దని తెలుఁగులక్షణము నియమింపవలసినయవసరము లేదు. కావుననె సూరి యీయంశమును వివరణమునఁ జూపెనని గ్రహింపవచ్చును. వికృతిపదాదౌ ప్రథమా స్తృతీయానునాసికౌ న స్తః' అను నప్ప.చిం.ప్రభృతు లగు లక్షణములు నీయంశమును స్పష్టము చేయఁజాలుచున్నవి. కాఁగా సంస్కృతసమ ములవిషయమున సంస్కృతలక్షణమె నియామక మైయుండఁగా నచ్చతెనుఁగులవిష యమున నట్టిది లేదు. దేశ్యములు వ్యవహారసిద్ధము లవుటచే వ్యవహారమునుబట్టియె గ్రహింపవలసియుండఁగా నుచ్చారణమునం దున్న యకారము,వువూవొవోలు గ్రహిం పక మాను టెట్లు? కావున నుచ్చారణము నాశ్రయించియున్న దేశ్యశబ్దములవిషయ మున నుచ్చారణములోనివిశేషమును వారించుట లక్షణగ్రంథమున కవసరమె యైయు న్నది. ఇఁకఁ దద్భవాదులును సామ్యము ననుసరించి గ్రహించి వానియందును అనఁగా సంస్కృతసమేతర మగునాంధ్రభాషయం దెల్ల నీవిధి వర్తించును.

ఇఁకఁ బ్రక్రియలో నీనికి నుపయోగము లేదు కావునఁ జెప్ప నక్కఱలే దనుట యుక్తమా? అయిన ద్రుతోపజీవులు,ద్రుతప్రకృతికములు ననుసంజ్ఞలను వీరు దెల్పిరి. కాని దానిని బ్రక్రియయం దెచ్చటను నుపయోగించినట్లు గానరాదు. సంజ్ఞాపరిచ్ఛే దమునఁ జెప్పఁబడువిధుల కెల్లఁ బ్రక్రియలోఁ బ్రయోజన ముండవలయునా? యరసు న్నలఘుత్వాలఘుత్వ లక్షణ మెట్టిది.(చిం. పదాదియకారము నంగీకరించినది గావున నీ సూరి లక్షణము చిం.విరుద్ధము గాన గ్రాహ్యము గా దనకుండుట యుచి తమె.)

కాఁగా సూరి పదాదిని బిశదముగూర్చి ప్రస్తావింపకుండుటయు, యకారమును వువూవొవోలు లే వనుటయు నుచితము నవసర మైనసంగతులే యని గ్రహింప దగును.

అవుఁ గాక. సూరి చెప్పినసూత్ర మనావశ్యకమె యని తొలఁగింతము.మరి

వీరు చెప్పిన దేమి? వీరు సూరిసూత్రమును దొలఁగించి యూరుకొనలేదు. ఇంక "ఎవఁడు- ఏది- అనురీతి గలపదాదియకారము నన్నయసమ్మతము. అయినను పూరు వుండ వోడ మున్నగుశబ్దములందలిపదాదివకారమునువలెనె వ్రాసిన దర్వాతి వైయాకరణు లంగీకరింపలేదు’ (ఉ.21) అని యొకసూత్రము వ్రాసిరి. తర్వాతి వైయాకరణు లంగీకరింపలే దన నేమి? వీ రంగీకరింతురా? లేదా? సూరిని విమర్శించినతీరునుబట్టి వీరు నంగీకరింపలే దనవలె. కావుననె చిం.వలెఁ బదాదియకారమునకు (వువూవొవోలకు) వర్జ్యత్వాకర్తవ్యము విధింపలేదు. కాఁగా సూరివలెఁ జెప్పలేదు. కాని వే ఱొకవిధముగా సూరియభిప్రాయమునె చెప్పిరి. అయిన సూరిలక్షణమున వీరు చూపినదోషము లట్టివీరిలక్షణమున నుండవా? సూరిసూత్ర మనావశ్యకము గాఁగా వీరియదేలక్షణ మావశ్యక మగుట యెట్లు?

ఎట్లును వీరు చెప్పినయంశము సూత్రముగాఁ జెప్పఁదగినది గాదు. సూరిసూత్రమును యథాతథముగా గ్రహించి దానికి వివరణముగా (వీరిసూత్రము) చెప్పుట యొప్పును.

ఇంకను సూరిసూత్రమున నున్నస్పష్టత వీరిలక్షణమునఁ గానరాదు. ‘పూరు వుండ వోడ మున్నగు- అనుచోఁ బదాదిని వకార మెక్కడ లే దనునంశము వీరి సూత్రమున స్పష్ట మగుచున్నదా? వంకర- వాఁగు- వీఁక- వేఁగు మున్నగుచోఁ బదాదిని వకార మున్నది.అది యుండఁదగునో లేదో వరుసవారిసూత్రము నిర్ణయింపఁగలదా? మున్నగు- అనఁగా నేవి గ్రహింపవలెను? సూరిసూత్రము ననుసరించి వువూవొవో యని గ్రహింపవలెను. వువూవొవో లన లెక్కడ నుండ వనియు, (పూరు, వుండ, వోడ తప్ప మిగిలినచో వువూవొవోలు పదాది నుండుటకు వరుసవారిసూత్ర మవకాశము గల్పించుచున్న దన్నను దప్పు గాదు.) నితరస్వరములతోఁ గూడినవకారము పదాది నుండవచ్చు ననియు సూరిసూత్రము చెప్పుచుండ వరుసవారి లక్షణ మట్లు చెప్పఁజాలదు. ‘పూరు వుండ వోడ’ యనువానితోపాటు వీరు వొకఁడు అనుపదియుఁ జేర్చిన బాగుండెడిది. ‘పూరు-వుండ’ అని వీరు చూపిరి తమసూత్రమున. కాని వుండ పూరు అనుతీరుగాఁ జూపిన సక్రమముగా నుండెడి దనిపించును.

ఇంక యకారమువిషయము. చిం. ఎవఁడు యేది అనురీతిగఁ బదాదియకారము నమ్మతించి యుండవచ్చును. అది యిష్టము గానపుడు సూత్రమున (చిం.) నన్నయసమ్మతిని ప్రస్తావింప నేల? ఇది వ్యాఖ్యానమున నుండఁదగినయంశమె కాని సూత్రమున కెక్కఁ బని లేదు.

సూరి యిట నుదాహరింపలేదు గాని యితఁడు- యీ మె అనురీతిగా ఇఈలు సందర్భమునను బదాదియకార ముచ్చారణమునఁ గలదు. (రమ.164) (పదము మొదటి ఇఈ,ఎఏలకు ముందు యకారమును, ఉఊఒఓలకు ముందు వకారమును యియీయెయే, వువూవొవో యనుతీరుగా నుచ్చారణము సం దున్న దని గ్రహింపఁ దగును.) సూరిసూత్ర మద్దానిని నైతము వారింపఁగల్గుచున్నది.సూరిలక్షణమునందలి "తెలుఁగుమాటలకు' అనుదళము పఘులవారిసూత్రమునఁ బ్రవేశింప వీలు లే కుండఁ బోయినది. అంతే గాక సూరి యిటఁ జేసినవివరణమును గూడ పఘులవారు దొలఁ గించిరి. తెలుఁగునఁ బదముమొదట యకార మెచ్చటను లేకుండఁగా నుచ్చరింపఁ బడుఇఈఎఏలకు ముందరఁ గూడ యకార మున్న దండనేర దనునంశము పఘుల వారిలక్షణమున స్పష్టము గాదు. ఏమ్యాదులయిత్తునకు నని చెప్పినట్లుగా 'రాముఁడు మొద లగువానియం దుత్తున కచ్చు పరం బగునప్పుడు సంధి యగు' నన్నంతక్ష ణము సమగ్ర మగునా? కొన్నియెడల నుత్తునకు సంధి రా దనునపార్థమున కవకాశ ము లేదా? అట్లు తెలుఁగునఁ బదము మొదట యకారమును దర్వాతినై యాకరణు లంగీకరించి రేమో యనుసందేహమును మాత్ర మేల కల్పింపవలయును? అనంది గ్ధతయు సూత్రలక్షణము గదా. తెలుఁగుమాట లనుటచే (నుడితొలిహ్రస్వ మనుచో నపదాదిహ్రస్వముపై బండ మవిరుద్ధ మయినట్లు- ఎఁడు) యొక్క- యనునపదము మొదటియకార మవిరుద్ధము.

కాఁగా సూరిసూత్ర మనావశ్యక మనఁదగదు. తప్పకచెప్పఁదగినదే యని గ్రహింపఁదగును.

సూరి యీసూత్రమునుగూర్చి సంజీవనిలో వీరు "సూరిచింతామణిని గ్రహించు టలో నహోబిలపండితీయమునె కేవలముగా ననుసరించుచు వచ్చుటచేత అప్పకవి యభిప్రాయము నంగీకరించినఅహోబిలపతిమతముననుసరించి యప్పకవీయానుగుణ ముగ నిట్లు సూత్రించె' (వ్యా.సం.స.127) ననిరి. సూరి తన కంగీకారయోగ్య మయినదానినె స్వీకరించెనుగాని చిం:వి.వి.ల యనుమతిని గాని, నద్వానికహో.వ్యాఖ్యా పద్ధతిని గాని కేవల మనుసరించె ననరాదు. 'షట్త్రింశదత్ర' యనుసూత్రమువిష యమున నప్ప.చిం.సప్తత్రింశదిహాన్యే' యని చెప్పినది. రేఫస్య ద్వైవిధ్యకథనేన గురురేఫస్య వర్ణమధ్యే పరిగణనదశాయాం సప్తత్రింశదిహాన్యే ఇత్యప్పకవిపుస్తక పాఠోఽపి సాధురేవ' (కవిశి.) యని యహో. సప్తత్రింశత్పాఠమును సాధు వనియె

చెప్పెను. కాని సూరి షట్త్రింశత్స్వరమునె యనుసరించెను. అలఘుళకారము విషయమున సూరి ప్రత్యేక మగుమార్గ మవలంబించెను. ఇట్టివి పెక్కులు. అట్టియెడలఁ గేవలముగా నహోబిలపండితీయమునె సూరి యనుసరించుచు వచ్చె ననుట తగదు. భేదించినతావులు వరుసవారును గుర్తించియు నిట నిట్లాడు టుచితముగా లేదు. అయిన బా.స.చిం.పాఠమునే యంగీకరించువీ రిట నప్పకవిమార్గము గ్రాహ్యము గా దందురు గాక. అట్టిప్రక్రియాగౌరవమును బొలఁగించినసూరి (అప్పకవి)మార్గము గ్రాహ్యముగా గుర్తించుట యవసరము గాదా? "వికృతిపదాదౌ ప్రథమా స్తత్తృతీయా నునాసికో న స్తః' అని యప్పచిం. యణకారములు లే వని పేర్కొనఁగా సూరి యకారమును మాత్రమె చెప్పి ణకారము విషయ మెత్తుకొనకుండుట గమనార్హము. పూర్వలాక్షణికవచనములను యథావసరముగ మాత్రమె యనుసరించెను? గాని కేవల మనుసరించె ననుట తగదు. ఇది యనుసరణ మనుటయు నాలోచింపవలసినదే.

## లఘ్వలఘువులు :

యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు (సం.18) నను సూరిలక్షణమును వీరు యథాతథముగనె గ్రహించిరి. వివరణమునఁ గొన్నిమార్పులు చేసిరి.

"సూరి తద్భవములందు శకటరేఫము లే దనెను. ఒక్కనన్నయ తద్భవము లందు శకటమును ప్రయోగింపలేదు. కాని పెక్కురు మహాకవులు ప్రయోగించిరి" (ఉ.22) తద్భవములం దలఘురేఫము గల దని యహోబిలుఁడును, ప్రౌఢవ్యాకర్త యు స్పష్టము చేసిరి. దీనింగూర్చి షం. (ప్రౌఢ.) 'తద్భవములలో నలఘురేఫము గల దనియే యాయన (సూరి)యభిప్రాయము. నిఘంటువులో కాటియశబ్దముతద్భవ మనియు నరుదుగా శకటరేఫము తద్భవములలోఁ గల దనియు సూరి వ్రాసెను. "క్వచి త్తద్భవేఽపి శకటో దృశ్యతే" తద్భవములలో శకటరేఫ మరుదు గావునఁ దద్భవములలో శకటరేఫము లే దనులాక్షణికమతము నిట సూరి సూచించె నని గ్రహింపనగును' (ప్రౌ.షం.19) అని పేర్కొన్నది.అరుదుగాఁ గల దని గుర్తించి నపుడు లే దని వ్రాయ నేలాకో యర్థము గాదు. ఇయ్యాంతముల కెత్వము విధించిన చోట బాల.లో కాటియశబ్దమును సూరి చూపెను అది తద్భవ మయిన నం దలఘురేఫ

యుంట యీగ్రంథమునందె పూర్వవాక్యమునకు విరుద్ధ మగుట లేదా? ఇది తద్భవము గా దనుకొనెనా? సూత్రాంధ్రములో అక్కజాదిషు- అని సూత్రించి 'జడ' యనుతద్భవశబ్దమున జకారము తాలవ్య మనెను. కాని బాల.లో 'జడ' యని దంత్యయు క్తముగా నిరూపించెను. అట్లే తద్భవముల శకటరేఫవిషయమునను సూరి తన యభిప్రాయమును మార్చుకొనెనా? 'అరు దగుటచే లే దనుమతము నుద్ధరించుట' యనుషం.అభిప్రాయములో నౌచిత్యము స్పష్టము గాకున్నది.ఇన్నిసందేహములకుఁ దావు లేకుండ శకటరేఫము తత్సమములందు లేదని మాత్ర మె చెప్పియున్న బాగుండెడి దని తోఁచుచున్నది. కవిశి.ప్రభృతుల నెఱింగియు నట్లు వ్రాయుటలో సూరి మతము భిన్న మేమో యనిపింప నవకాశము గలదు గదా.

ఇంక నలఘులకారమునుగూర్చి వీరు "ఏళులు, పాళులు- త్రాళులు-అనిసూరి యుదాహరించెను. ఇవి యపశబ్దములు. కవిప్రయోగములలో లే "(వ్యా.సం.స.22) నవిరి. చిం:వి.వి.లయం దిట్టిరూపము లసాధ్యము లగుటంబట్టి యివి యపశబ్దము లని వీరు తలఁచి రేమో యని సందేహము. కవిప్రయోగములలో లే కున్నను చిం: వి.వి.లు సాధించిన నవి సాధుశబ్దములే యగు నని వీరిసిద్ధాంతము.ఇంక నీయవి కవిప్రయోగములలో నున్న వని వీరే యంగీకరించుటయు నిట్టివి సాధుశబ్దములే యవుటయు నాసూత్రము (అచ్చి.13) నొద్ద గమనింతము.ఇంక వీరు "ఏల్లు పాల్లు త్రాల్లు అని చూపిరి. ఇవి యేకవిప్రయోగములం దున్నవో వీరు తెల్పలేదు. ఈరూపము లిట్లున్న వర్ణము గా నని గుర్తించి 'ఏళ్ళు' అనురీతిరూపములను గూడ ఖండలీకరణమునఁ గూర్చి చెప్పిరి. దీనినిబట్టియే యిట్టిరూపములు వ్యవహారమందును లే వని గుర్తింపవచ్చును.సూరియుదాహృతులఁజూపినదోషము వీరియుదాహృతులకే చక్కఁగా సరిపడినది.

అలఘులకారమును 'ఏల్లు' అనురీతిగా లకారముతోఁ జూపిరి. కాఁగా వర్ణమాలయం దున్నళకారముతో దీనికిఁ బోలిక లేదు. రెండింటి నేకరూపముతోఁ జూపినసూరివలెనె వీరును వర్ణమాలలోఁ జూపినది వర్ణాంతరళకార మనిరి.అట్లు వివరింప నవసర మేమి? 'ల'కార మలఘువు. వర్ణమాలయం దున్నది 'ళ'కారము.అవి రెండును బరస్పరము భిన్నము లని చెప్ప నేల? (రెండును ళకారముగనె చూపిన సూరియు వర్ణమాలయందలిది వర్ణాంతరమె యనెను గాన లాక్షణికులమతమున ననౌచిత్యమును బరిహరించుటకై యిట్లు వివరించి రన వీలు లేదు.) రూపమునందే

గాక యుచ్చారణమునందు నివి భిన్నము లని వీరు మొదటనే చెప్పిరి. సమానముగా నుచ్చరించుటచే నుచ్చారణములోనియపభ్రంశతగా గుర్తించి దానిని సవరించిరా? స్పష్టముగాఁ జెప్పరైరి.

నన్నయనాఁటికిఁ బైని చుక్క యుంచిన లఘువే (ల,ర) యలఘు వగును. దంత్యచజలపైవలె నిటఁ గూడ నాచిహ్నము పోయిన దేమో. దంత్యములంగూర్చి ప్రత్యేకముగాఁ బ్రస్తావించునపుడు దంత్యతాచిహ్న ముంచుట ప్రసిద్ధమె. అయ్యు నిట నలఘులకారమునెడ నన్నయనాఁటిపద్ధతిని గూడ వీ రనుసరింపలేదు. దంత్యతాచిహ్నము (చుక్క) వరుసలవారును మార్చి '‿' అనునాకారముతో నిచ్చిరి. అలఘు రేఫమును (సాధురేఫముపైఁ జుక్కయుంచునన్నయనాఁటిపద్ధతి పోయి) శకటరేఫముగా లఘువుకంటె భిన్న మగులిపితోనె చూపిరి. ఈయలఘులకారమునకు మాత్ర మాధునిక మె యన్నను 'ళ'కారరూపము గాని నన్నయనాఁటి పైని చుక్కయుంచుభేదము నేని పాటింపక లఘులకారముగానే చూపుట మిక్కిలివింత. కేతన బాలసరస్వతి (నీళ్ళ)అప్పకవులనాఁటికె వెలసినళకారలేఖనము నంగీకరింపక (నన్నయకుఁగూడఁ బూర్వమో లేక నన్నయనాఁటిపద్ధతిలోఁ బైని చుక్కయుంచిన నయ్యది యచ్చువారి పాటుగా నెల్లెడలఁ బోయినదో కాని) లకారముగనె యలఘువును జూపుట విచిత్రమె కదా.

మొత్తముపై రూపముననే భిన్నముగా నిచ్చిన (యలఘు)లకారమును, 'ళ'కారమును వేర్వేఱువర్ణము లని చెప్పవలసినయవసరము వరుసలవారికి లేదు. ఇంక బాలసరస్వతికిఁ బూర్వమునుండి యలఘువు ళకారముగా లోకవ్యవహారము నందుండి పండితులచేఁ బరిగ్రహింపఁబడఁగా దానిని గ్రహించుటయె యుచితము.

ఇంక వకారమువిషయము. సూరి పాదేశవకారము లఘు వనెను. దీనింగూర్చి వీరు 'ఇది నిరాధార' (ఉ.22) మని త్రోసి పుచ్చిరి. "గసడదవాస్స్వరితి సూత్రేణ వస్య యోవకారస్సోఽత్ర లఘువకారః స చ అతఁడు వలికె నిత్యాదౌ స్మృతః" (కవిశి.219) అని యహోబలుఁడును, "ప్రథమాంతముమీఁదిపకారమున కాదేశముగా వచ్చినవకారము లఘువకారము-ముఖాబ్జమువంచి సిగ్గుపడియెన్" (బా.స.వావిళ్ళ160) అని బా.స.యును నీవిషయమును స్పష్టము చేసియున్నారు. అట్టియెడల సూరివివరణము నిరాధార మనుట యెట్లు? సూరివచనములకు బాలసరస్వత్యాదులవచనము లాధారములు కాఁగా బా.స. అట్లు చెప్పుట నిరాధార మనవలయును. వరుసలవార ట్లన్ని గూడ. (వ్యా.పం.వ.188)

ఇంక సాధారణముగ వీరు నిర్ణయించుమార్గ మేయదియో పరిశీలింతము. "యకార సామ్యమునను సంస్కృతపద్ధతిని (అసావాదిత్యః) స్వరసంహితలో నివకారమును లఘు వనుట యుక్తము.' (ఉ.22) కాఁగా యడాగమమువలె స్వరసంధియం దగు వకారమునె లఘు వనవలె. యడాగమమువలె వడాగమము తెలుఁగువ్యాకరణమున నింతవఱకు లేదు. వయులవారు నీగ్రంథమునందు నైతము విధింపలేదు. కాఁగా స్వరసంహితలో వకారమె లేదు గావున (యకారమువలె) లఘువకారము మన భాషలో లేనేలే దని చెప్పవలసివచ్చును. గదా. కాని వీరు గొన్నియుదాహృతు లిచ్చిరి" గెలుచు+అన్- గెఉ+వ్+అన్= గెలువన్; చిగురు- చివ్+ఉ+రు-చివురు; చతుర్థి-చ+ఉవ్+ఉతి-చవుతి. ఇత్యాదిస్థలములందు సమానపదములలో స్వర సంహితయందు వకారము నిల్చును." (ఉ.22)(వ్యా.సం.స.134) హరి యత్న దిత్యాదులందలియడాగమము గాని అసావాదిత్యఃఅనుసంస్కృతపద్ధతిలోనివకారము గానిసమానపదమునందు నట్టివి కావు.హరియం దనురీతి వరుదగుస్థలములు) కావున నావిషయమున వీరు చూపినలఘువకారస్థలమునకు సామ్యము లేదు. వయులవారి వివ రణమునుబట్టి లఘువకారము సమానపద మందలిస్వరసంహితలో మాత్రమె గల దన్నమాట.

కానీ వీరు చూపినపైచోట్ల వకారము స్వరసంహితయందు వచ్చినదా? గెలుచు +నుజీ- యనుచో ము (జీ)త్తు పర మవుటచే చకారము వకార మయినది. స్వర సంహితయం దయినట్లు వీ రేని లక్షణము చేసిరా? చిగురు- అనుచో స్వరసంహిత యందు వకార మయినదా? వీరు గవలు పరస్పరము మాఱుచుండు నని చెప్పిరే కాని- చకారము మీఁది యికారమును (చ్+ఇ) గకారముమీఁదియుకారమును మిక్కిలి సన్నికర్షతో నుండుటచే నడిమిగకారము వకార మయిన దనురీతి సమన్వయింప వలసినట్లుగా లక్షణము చేసిరా? (చవుతి యనుచో నిట్టి ప్రక్రియయే లేదు.) ఇట చకారము లోపించి యాపిదప స్వరమునకు స్వరపరకత్వము సంభవింపఁగా వకా రము వచ్చి చేరుట యన్నది లేదు.

సంజీవనిలో "గకారచకారములు వకారముగఁ బరిణమించుటకుఁ దగినసం బంధము వానికి లేమింజేసి యట్టియెడల గకారచకారములు లోపించిన సంహితలో వ్యవధాయకముగా నుచ్చారణసౌకర్యార్థము వకారాగమము వచ్చె ననుట శబ్దతత్త్వ శాస్త్రసమ్మతముగా నుండు' (వ్యా.సం.స.134) ననిరి. మఱి వీరుఉ.లో నాపద్ధతి నేం

యనుసరింపలేదు. ఒకవేళ సూరి యట్లు చెప్పిన శబ్దతత్త్వశాస్త్రవేత్తలు సంతసింతు రేమో కాని వైయాకరణు లామోదింపరు. గకారచకారములు లోపింపఁజేయుట, పిదప వకారము నాగమము చేయుట యేల? గకారచకారములకు 'వ'కారము నాదేశించుట లాఘవమును శబ్దశాస్త్రసంప్రదాయానుగుణమును గదా యని విమర్శింపరా? శబ్దతత్త్వశాస్త్రమునుబట్టి వఝలవా రుదాహరించిన పైస్థలములందు వకారము లఘువగు నేమో కాని శబ్దశాస్త్రమునుబట్టిమాత్రము వీరివివరణము ననుసరించియే యది లఘు వని చెప్పుట నిరాధారము.

ఇంకను నిట వీరిలక్షణగ్రంథము ననుసరించియె స్వరసంహిత లేదు (వ్యా. సం.స.లో చెప్పినట్లు గకారచకారములకు లోప మందుఁ జెప్పఁబడలేదు గదా.)కావునఁ బైని వీరు చెప్పినయాధారమునుబట్టియె లఘువకారమును గుర్తింపవలసివచ్చినఁ దెలుఁగులో వకారము లఘు వైనది లే దని నిర్ణయింపక తప్పదు.

యడాగమవిధికిని, అసావాదిత్యః అనుచో సంస్కృతమునందలివకారవిధాన పద్ధతికి గెలువన్, చివురు- మొద లగుచోట్లవకారము విధింపఁబడినదానితో నెంత మాత్రమును సామ్యము లేదు. అట్టియెడల నేసామ్యము నుద్దేశించి బా.స.ప్రభృతుల నిర్ణయమును దిరస్కరించిరో యది వఝలవారినిర్ణయమునను లేకుండుటచే వీరివివరణమును నిరాధారమె యని చెప్పకతప్పదు.

చివురు ఇత్యాదులలో వకారము లఘువుగా నుచ్చరింపఁబడునెడల నదియు లఘువె యగుట చెప్పవలె. నిద్ర వోయె నిత్యాదుల వకార మలఘువుగా నుచ్చరింపు నెడల నది యలఘు వనవలెను. ఉచ్చారణమునుబట్టి లఘువో యలఘువో గుర్తింప వలసియుండఁగా ఇతరములతో సామ్యమునుగూర్చి చింతింప నేల? వకారమునెడల నీపద్ధతి నతికించిరి గాని లకారరేఫలయెడ లఘ్వలఘువులనుగూర్చి యకారముతో సామ్యము నూహింపఁగలిగిరా?

'నిద్ర వోయె' ననుచో వకార మలఘువె యని వఝలవారిపైవివరణమును బట్టి తెలియవచ్చును. కాని యది యుచ్చారణమున కనుగుణముగాఁ దోఁచదు. చివురు ఇత్యాదులలోను లఘుత్వమె కల దనిపించుచున్నది. యకారమువలెఁ జం. వకార లకారములద్వైవిధ్య మెటనో స్పష్టము చేసియుండలేదు. కావుననె బాలసరస్వతాదులు లఘు వన్న పాదేశవకారమును వఝలవా రలఘు వని తలఁచిరి. వఝలవారు

లఘు వన్నచివురుళత్యాదులలోని ళకారమును బా.స.ప్రభృతులు లఘువుగాఁ జెప్ప లేదు.

ఏమైనను యరలవలంఘుత్వాలఘుత్వములు చెప్ప నవసరము లేదేమో యని సందేహము. (బా.స.)అప్ప.ప్రభృతులవలె వర్ణమాలయందళీళకారమె ఏళులు ళత్యాదులందు బహుత్వమున రలడల కాదేశ మైయున్నది. అది లకారముయొక్క అలఘూచ్చారణముతోడిది గా దని విశేషముగా గుర్తింపఁదగును. శకటరేఫము రేఫముయొక్క యలఘురూపము గాక భిన్న మగువర్ణము! సప్తత్రింశదిహ యనదీని తోఁ దెనుఁగునకు వర్ణములు ముప్పదియే డనునప్ప.మతము కొంత బాగుండునేమో (ఇంకను దంత్యచజలను వేఱుగాఁ బరిగణింపక, శకటరేఫమును జేర్చి ళకారమొక్క టిగనె గుర్తించి తెనుఁగునకు వర్ణములు ముప్పదియై దనుటయె లిపిచిహ్నముల ననుసరించి యుచితమా? ఆలోచింపవలెను) ఇందు బాధకాంశములఁగూర్చి నిశితము గాఁ బరిశీలింపవలె.

ర-ఱలు భిన్నము లని యెంచుచో "ఱకారమును శకటరేఫ మని వ్యవహరించుట యుక్తము కా' (వ్యా.సం.స.186) దని వఝలవారు పేర్కొనిరి. ఇది యుక్తియుక్తముగనె కన్పించును. ఱకారమునుచ్చారణములోఁ బ్రాచీనకాలమునటకారావేశ ముండెడి దనియు, కాని నన్నయకాలమునాఁటి కట్టియుచ్చారణము తెల్గున ద్విరుక్త శకటములందు సైతము లేకుండఁజేసియు, రఱలయుచ్చారణము స్థానకరణస్పర్శము లశైథిల్యశైథిల్యభావరూపభేదము మాత్రమె వెలయుచుండుటంజేసియు- (వ్యా.సం.స. 186) నని వివరించిరి. ఉచ్చారణభేద మున్నపుడు రూపభేద మొప్పును కానినన్నయ నాఁటికి లఘ్వలఘుయత్నంవలె శైథిల్యశైథిల్యభావములు మాత్రమె యున్నపుడు, అది మాత్రమె కల దని గుర్తించినపుడు రూపభేద మేల చెప్పఁబడె? హరి యతఁడు, కాయ- యనుచోట్లవలెనె పెరుగు, విరుగు అనురీతిగా రేఫము సమానముగాఁజెప్పలే దేల? రూపభేదమును బ్రమాణీకరించుచో నుచ్చారణభేదమునుగూడఁ బ్రమాణీకరించి (శకటరేఫ మని కాక) యలఘురేఫ మని కాని వ్యవహరింపఁదగుటయె యుచితము దంత్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ యన్నపుడు దంత్యచజలు భిన్నవర్ణములె కాని ఱలఘురేఫళకారము లట్లు గాలేదు. దంత్యతాలవ్యచజలలిపిభేదము పాటింపఁబడుట లేదు. కాని లఘ్వలఘురేఫల (లకార)లిపిభేదము నిల్చియేయున్న దే.(వఝలవారును ఱొట్లు అని యుంచినట్లు విరుగు అని యుంచరే.)దీనిబట్టియే ఱవర్ణముప్రత్యేకముగా గుర్తింపఁదగియున్న దనవచ్చును.

అలఘుళకారము విషయమునను నిట్లె యూహింపనగు. ళకారమున స్వయముగా నలఘుళకారంబునకు గ్రహణము న్యాయ్యం బయ్యె నేని బహువచనపరకతలో ళకారమున కలఘుళకార మేల యన్నగు. ప్ర.సం పరామర్శించుచు వీరు "చింతామణిలో నట్లు ళకారమున కలఘుళకారము పునరుక్తముగ విధింపఁబడలేదు. రో౯ః అవి రేఫమునకు మాత్రమె (అలఘు)ళకారదేశము చేయఁబడె' (వ్యా.సం.స.188)ననిరి. చిం. అలఘు వని యుచ్చరింపలేదు గాని రేఫమున కలఘువునే గదా విధించినది. (రో౯ః అనుచో వీరును ళకారముపై బిందువును జూపిరి) ళకారమునకు మాత్ర మట్లు విధింపకున్న నెట్లు? త్రాళ్లు అనుచో ళకారముపైని బిందు వుండదా? ఎక్కడి దలఘువో యెచ్చటను జెప్పలేదు. తల యనుచో మాత్ర మేల యలఘువు గాదు? కాక ళకార మెట లఘువో యెచ్చటి దలఘువో యుచ్చారణమునుబట్టియె తెలియనగు నన్న 'యత్రశ్రుతిర్మూర్ధ్న్యే లఘుయం ప్రవదన్తి' యనుచో మాత్ర మేల చెప్పవలె? త్రాళ్లు అనుచో ళకార మలఘు వని యుచ్చారణమునుబట్టి యేల తెలియవలె? చిం. చెప్పలేదు గనుకనా? కాఁగా చిం.ళకారమునకు నలఘుత్వమును విధింపకుండుటవలన నం దేదో విశేషము గల దని తలఁప వీలు లేదు. ఱకారమునకు విధింపనట్లె ళకారమునకుఁ జెప్పలే దంతియ. చిం. విడిచిపెట్టినయాంధ్రభాషాలక్షణకోటిలో నిదియుఁ జేరెను.

ఇంక 'సూరిగారికాలమునకు ద్రావిడమూర్ధన్యళకారమువలెనె యలఘుళకారము వ్రాయఁబడుటచే దానివి ప్రమాణీకరించి సూరి యట్లు చెప్పె(వ్యా.సం.స.188)ననిరి. బాలసరస్వతికిఁ బూర్వమునసే యలఘువు ళకారముగా నుండుట గమనించి యుంటిమి. కేతనలక్షణము వీర పేర్కొనిరి. అది సూరికాలమున నేర్పడుటయు సూరి ప్రమాణీకరించుటయుఁ గాదు. సూరికిఁ బూర్వమువందలయేండ్లక్రితమె యుండి యట్లు ప్రమాణీకరింపఁబడియున్నది.

చిం.మతమున 'ళ'కారము, నలఘుళకారమును భిన్నములా? భేదమును జూపినవరులవారే దన్త్యచజౌ. గురురలౌ చ చిన్దయుతౌ యనుచిం.లక్షణమును వ్యాఖ్యానించుచున్న 'గురురలౌచ'= అళలును'- (వ్యా.సం.స.88) అని గురు (అలఘు)ళకారమును ళకారముగనె యనువదించిరి. ళకారముపై బిందు వుంచిన ళకార మగు నవియె వివరించిరి. దీనింగూర్చి అలఘురేఫమువలె నలఘుళకారమునకుఁ బ్రత్యే కలిపి లేకుండుటచే "అలఘుళకారము సైతము ద్రావిడళకారలిపితోనె వ్రాయఁబడుట

సంభవించె '(వ్యా.సం.స.56) ననిరి! ఇది యస్పష్టము. అలఘులకారమును వ్రాయుటకుఁ బ్రత్యేకచిహ్నము లేనందునఁ దాము ద్రావిడళకారమును వ్రాసితి మందురా? లేక నన్నయనాఁటికి ద్రావిడళకార మలఘులకారముగా వ్రాయఁబడెడి దందురా? నన్నయనాఁటికె యట్లు వ్రాయఁబడుచున్న దన్న నప్పటియుచ్చారణమును మన మిప్పుడు తెలియలేము. కావున అలఘువు'ళ'కారముగా వ్రాయఁబడుచుండఁగా నది సూరికాలమునాఁటి కేర్పడిన దనరాదు గదా. కాక ఇట వ్యాఖ్యచేయుటలో నలఘులకారమునకుఁ బ్రత్యేకచిహ్నము లేకుండుటచే ద్రావిడళకారము చూపితి మన్న నదియు సరి గాదు. లకారము లిపి గలదు గదా. దానిపైఁ జుక్కయుంచిన నలఘు వగు నని లక్షణము చెప్పుచున్నది. తదనుగుణముగనె త్రాలు అనురీతిగా వీ రలఘువును జూపుచుండిరి. ఇటమాత్ర మ ట్లేల చూపరాదు?

వఝులవా రన్న ట్లీకారిక నన్నయయె వ్రాసె (వ్యా.సం.స.133) ననుకొందము. అట్టియెడల, లకారము, అలఘులకారము. (యరలవసహాళం తు హల్వర్గః అనుచోఁ జెప్పిన) ళకారము అనుమూఁడింటికి లిపిచిహ్నములు చెప్పవలయును. లకారము, గురులకార మనురెండింటికే లిపిచిహ్నము చెప్పఁబడినది. ళకారమున కొక్కదానికే లిపిచిహ్న మేల చెప్పఁబడలేదు. 'నన్నయ అళఅనులిపుల నుపేక్షించి యేకరీతిని సయుక్తికముగా లిపి నుపదేశించె' (వ్యా.సం.స.56) ననిరి వఝులవారు. కాని 'గురురలౌ చ' యనుచో నలఘురేఫ మనఁగా శకటరేఫ లిపిచిహ్నము గలదు. కాఁగా నుపేక్షిత మయినది ళకారమె యనవలె. అ ట్లది యొక్కటి యుపేక్షింపఁబడుట యసంభవము గావున గురులకార మని యిటఁ జెప్పినవర్ణమే 'యరలవసహాళం' అనునపుడు వర్ణమాలలోఁ బరిగణింపఁబడిన దని గ్రహింపఁదగును. బా.స. అప్ప. ప్రభృతులమత మె యనఁగా నలఘువు 'ళ'కారమె యని వఝులవారు నన్నయ కర్తృకము లని చెప్పినయీలిప్యుద్ధారకశ్లోకములమూలమున గ్రహింపవలసి యున్నది.

అన లీకారికలె ప్రక్షిప్తము లని యొకయభిప్రాయము. ఈలిపి నన్నయనాఁటిదే దని వఝులవారు నంగీకరింపక పోలేదు. 'వయిరీతి నుపదిష్టము లగునన్నయాథర్వణలిపు లెంతయుక్తియుక్తముగను నెంతశాస్త్రసమ్మతముగను నెంతసులభముగ నున్నను మార్పును సహింపనిజనసామాన్యముచే నుపయోగింపకొనఁబడదయ్యె' (వ్యా.సం.స.67) ఉపయోగమున లేనియీలిపికి వఝులవారు పెక్కుప్రశంస

లందించిరి. యుక్తి శాస్త్రము, తెలియ రాని నాలక్షణముల కనుగుణ మైయుండుట యర్థము గాదు. మార్పును సహింపనిజనసామాన్యము వచులవారు గుర్తించినసౌలక్ష్యమును సైతము తలపవైరి.

వి.వి. నయితము శకారలిపినిగూర్చి ప్రస్తావింపలేదు. కాఁగా త్రాల్లు అను రీతిగా వీరు పెక్కుచోట్లఁ జూపినయలఘులంకారలేఖనపద్ధతియె వివాదాస్పదము.

శకారమునకు భిన్నముగా నలఘులంకార మొకటి గలదనుటకు నాధారము లేదు. వచులవారివచనములను సమన్వయించిన నలఘులకారమె వర్ణమాలయందుఁ బరిగణింపఁబడిన 'శ'కార మని విశ్వయింపఁదగియున్న దనుటయుఁ దప్పు గాదు.

ఇట్లు అంపువు 'శ'వర్ణము కాఁగా నయ్యది లకారము నలఘురూప. మనక ప్రత్యేక వర్ణ మనుట లెస్స. వర్ణమాలయందలిదే యిది యని గుర్తించు టొక మార్గము. ఇప్పక్షమున శకటరేఫ మొక్కటి వర్ణమాలలోఁ బరిగణింపఁబడకుంట యెట్లు? అందుకె అప్ప.చిం. 'న షత్రింశత్'- అన్నది.

అలఘురేఫమునుగూర్చి పెట్టి, తీఱుచు- తీర్పు, చేకూరు- చేకుఱు మున్నగు విశేషములు వి.వి.కారికలు తద్వివరణప్రాయ మైనప్రౌఢ.లక్షణముల కనుగుణముగాఁ జెప్పిరి. దీర్ఘపూర్వకలఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘు వగుట యనిత్య మని కొంద ఱందురు. సూ.వి. (పుం. 257)

యవలంమైత్రి, రేఫముంమైత్రి లేమిని సూరి ప్రకీర్ణపరిచ్ఛేదమునందుఁ జెప్పఁగా సందర్భానుగుణముగ నీ రితనె చెప్పిరి. సూరి దాదాపుగా వ్యాకరణము. చివరఁ జేర్కొనెను. సంస్కృతశాస్త్రసంప్రదాయానుగుణముగా శాస్త్రాంతమున నన్యశాస్త్రప్రవేశమును సూచించుచు ఛందశ్శాస్త్రవిషయమును జెప్పె నని కొందఱు తద్జ్ఞులు పేర్కొందురు. వీరిగ్రంథమున గురులఘ్వాదులవివరణము విటవింతకు ముందే ప్రవేశించినవి.

## తత్సమము :

సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు (19)అనుసూరిసూత్రమును యథాతథముగ గ్రహించిరి.

సంస్కృతప్రాకృతసమములస్వరూపమును నిరూపించుచు 'అంధ్రవిభక్తియోగప్రత్యయనిమిత్తము లగుమార్పులను దప్ప నితరము లగుమార్పులు శబ్దావయవమున కలుగనిసంస్కృతశబ్దములు సంస్కృతసమములు. అట్టిప్రాకృతశబ్దములు ప్రాకృతసమము' (సూ.25, వ్యా.సం.స.153) లనిరి. ప్రాతిపదికలు సంస్కృతప్రాకృతములనుండి యథాతథముగ గ్రహింపఁబడు నన్నమాట. హలంతములు, స్త్రీలింగములు మున్నగుకొన్నింట భేద మున్నను నీవివరణ ముచితమె. సూరియు "విభక్తివిరహితంబు ప్రకృతిద్వయంబు తత్సమంబు" అని శ.ల.సం.(ప.74)లోఁ బేర్కొనెను.

ఇచట సూరి చూపినయుదాహరణములలోఁ గొన్నింటిని వీ రీగ్రంథమునఁ దొలఁగించిరి.

'జగత్' శబ్దమునకు సూరి 'జగత్తు జగము' అనునవి రెండు సమములుగాఁ జూపెను. వీరు 'జగత్తు' అనుదానిని దొలఁగించి 'సూరి సంస్కృతసమముగా నుదాహరించిన జగత్తు అనురూపాంతరము కవిప్రయోగములలోఁ గానరా'(సూ.25) దనిరి. సమస్తజగత్తు లోలిమై (3-493) జగత్తులఁ ద్రోచుచుండు (5-2-126) మున్నగా (భాగవతమున) నీశబ్దము ప్రయుక్తమైయున్నది. కావున నిటఁ జేర్పనగు.

ప్రాకృతసమములలో అటిః- అడీ- అడిః యనుసూరియుదాహృతిని గూడ వీరు దొలఁగించిరి. సంస్కృతమున అడిశబ్దము గలదు గావునఁ దెలుఁగులోని 'అడి' సంస్కృతసమ మని వ్యా.సం.స.(149)లోఁ జెప్పిరి. అడిబకసాంపరాయ మపి (మార్కం. 2.20) సిద్ధసమాసమునఁ బ్రయుక్త మవుటయుఁ గోశములం దుండుటంబట్టియు 'అడి' శబ్దము సంస్కృతమునఁ గల దనవచ్చును. పైప్రయోగమునుబట్టి యిది సంస్కృతమున నున్నను సంస్కృతసమ మనుట కది యాధారము గానేరదు. (ప్రాకృతవ్యాకరణములం దాడి యాటి శబ్దమునుండి సాధింపఁబడినదో యేప్రమాణమును బట్టి సూరి యట్లు పేర్కొనెనో పరిశీలింపవలసియున్నది.) కాని పరులవారియుక్తి సముచితముగనే యున్నది కావున వీరు దీనిని దొలఁగించుట యుక్తమె యని యిప్పటికి నిశ్చయింపవచ్చును. కాని వీ రాపిదప 'సంస్కృతసమము లనియుఁ జెప్పుటలో విరోధము లేకున్న నట్టివి ప్రాకృతసమములును నవఁదగియుండుటచేత బా.అచ్చ.1సూత్రముచొప్పునను సూరిమతమునను నవి యాచ్ఛికములయి యాచ్ఛికకావ్యప్రయోగయోగ్యము లగుచున్నవి' (వ్యా.సం.స.151)యని ప్రాకృతసమత్వమును గూడఁ బ్రస్తావించిరి. అట్టియెడల 'అడి'ని సంస్కృతసమముగాఁ గూడఁ జెప్పఁదలఁచిన సిద్ధసమాసాంతస్థ

లం చెట నేని ప్రయుక్త మైనస్థలమునే చూపవలసియుండును. కానిచో సూరి చెప్పిన ప్రాకృతసమత్వము నంగీకరించునపుడు సంస్కృతసమత్వమును గూడఁ జెప్ప నవసర మేమి? కాఁగా వాచ్చికకావ్యములం ప్రయుక్త మై కానవచ్చినఁ బ్రాకృతసమము మాత్రముగను గాక సిద్ధసమాసాంత మైయున్న సంస్కృతసమముగా మాత్రముగను, జెప్పఁదగు. రెండును గన్పించినప్పుడె యిది యుభయ సమఁదగు. రెండును గానరాకున్న సూరిమతమును నిరాధారముగాఁ దిరస్కరింప నేల? పరిశీలింతము.

'కటుః-కారో-కారము' అనునది గూడ వీరు దొలఁగించిరి. "కారము క్షార శబ్దభవ మని ప్రౌఢవ్యాకర్త యుదాహరించెను. ఇదియు వివాదగ్రస్తమె". (ఉ.26) కాని వ్యా.సం.వ.లో "స్మరకటోర్వీరసరకారా'- అనయోర్వ్యంజనం ఈనర. కార. ఇత్యాదేశౌ భవతః- అను ప్రాకృతవ్యాకరణసూత్రము చెప్పున కారో అనునది కటు శబ్దభవ మై యేర్పడును గాన సూరి యుదాహృతి సమూల మనఁదగు. (152) నని వీ రీయంశమును నిర్వివాదముగా స్థాపించిరి. క్షారశబ్దభవ మనుట సరి కా దని యటనే విస్తరించి చెప్పియున్నారు. కాఁగా దీని నుదాహృతులనుండి యుద్ద్యోతమునఁ దొలఁగించుటయె నిర్మూల మని వారిమాటలనుబట్టియె గుర్తింపఁదగును.

సూరి యుదాహరించిన మిరా(మేర)శబ్దము సంస్కృతకోశములలోఁ గానరా (ఉ.25) దనిరి. ప్రౌఢవ్యాకర్తయు వైకృతదీపికలో మేర—(ఎల్ల) మిరా- (పుట 94) అని మిరాశబ్దభవముగాఁ జెప్పుచో 'మిరా' సంస్కృతశబ్దమును జూపెను. కాఁగా వీరు 'దీని నుద్ద్యోతమున నుదాహృతులనుండి తొలఁగించుట విచార్యము.

### తద్భవము :

సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు (20)అనుసూరిలక్షణము వల్లె గ్రహించిరి. ఉదాహరణములలో మృగః- మెకము మెగ మన్నది పొరపాటున వరుసవారి గ్రంథమున నష్ట మైయుండును. శబ్దావయవమందు వర్ణాగమాదివికారము గలవి భవములుగా వీరు వివరించు టుచితముగ నున్నది.

వాలుమీకేసుఁడు ము న్నగునవింతతద్భవములను వీ రిటుఁ బ్రస్తావించిరి. వీనిలో ఉజ్జని- ఉజ్జయిని (పుట19) దూడి-దూది (98) అనువానిని వై.దీ. చూపుచున్నది. ఇట్టివానిని గవిప్రయోగానుగుణముగా గుర్తించు టుచితము.

ఇజ్జాల, కమ్మ శబ్దములు సంస్కృతమున నుండుట చేర్చొని వీ రట్టి వప్రసిద్ధము లగుట గాని మఱి యే దేని గారణముచే నీయవి ఇంగాలో, ఇంటో యను ప్రాకృతమునుండి వచ్చె ననియు నుదాహరించుట బా గున్నది.

## దేశ్యము :

త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు (21) అనుసూరిలక్షణము నించుక మార్చి వీరు 'త్రిలింగదేశవ్యవహారసిద్ధ మగుతద్భవేతరభాష దేశ్యము' అని సూత్రించిరి. సూరిసూత్రము సరి గా దనుచు 'తత్సమతద్భవములును త్రిలింగదేశ వ్యవహ్రియమాణములే కాన సూరి 'తత్సమతద్భవేతర' అని చెప్పకుండుట సరి కా (పు.29) దనిరి. త్రిలింగదేశమునఁ దత్సమములు వ్యవహ్రియమాణము లగుట గుర్తించి సూరి తత్సమతద్భవేతర- అని చెప్పవలె నని గుర్తించినవీరు మాత్రము సూత్రమునఁ దత్సమశబ్దము నేల చేర్పలేదు? సూరిలక్షణమునఁ జూపినదోషము కొంత తమగ్రంథముననె విడువుట విశేషము.

సూరిలక్షణము దుష్టమా? 'త్రిలింగదేశవ్యవహారసిద్ధ మనుటవలననే యీయది తత్సమతద్భవాదిభిన్న మని స్పష్టము. (ప్రవాహినీ దేశ్యా యనుకో చిం.సూడ విప్లై చెప్పినది గదా.) ఏశబ్దమునకు లోకవ్యవహారము మాత్ర మె మూలమో (సంస్కృతాదులు గావో) యది దేశ్యము. ఇది తత్సమతద్భవేతరమ యగుం గదా. వరుల వారు త్రిలింగదేశజనులు వ్యవహరించున దెల్ల దేశ్యముగా సూరిలక్షణమున కర్థము చేసికొనియందురు. అందుకే తత్సమతద్భవేతర మని యుండవలె నని చెప్పుట. (అట్లయినఁ ద్రిలింగదేశమునఁ బండితజనులు సంస్కృతమును నితరులు ప్రాకృతాదిభాషలను వ్యవహరించుచోఁ దత్సమతద్భవేతరము లగునవి యెల్ల దేశ్యము లగునా?) కాని లక్షణమునభిప్రాయ మదిగాదు. త్రిలింగదేశ(జనుల)వ్యవహారమునుండి సిద్ధించినది యనఁగా వే రొకయాధారము లేక జనవ్యవహారము మాత్రము మూలముగాఁ గలది దేశ్యము. 'రాముఁడు' అను(తత్సమ)తెలుఁగుపదము 'రామ' యను సంస్కృతశబ్దమునుండి సిద్ధించినది. అచ్చెరు వన్నది అచ్చేరమ్ అనుప్రాకృతశబ్దమునుండి సిద్ధించినది. ఊరు అనుదానికి మూల మేమి? త్రిలింగదేశవ్యవహారమె. అట్టివె దేశ్యములు. కానఁ దత్సమతద్భవేతర మని చెప్ప నవసరము లేకుండుటచేతనె సూరి యట్లు చెప్పలేదు. అది యెంతయు నుచితము.

## అన్యదేశ్యములు :



'తత్కాలమున విస్తరించి మహాకావ్యములలోఁ జేరియున్న యన్యదేశ్యములఁ నుదాహరింపకుండుటయు సరి గా' (ఉ.29) దని వీరు సూరి యన్యదేశ్యములను జెప్పకుండుటను విమర్శించిరి. అన్యదేశ్యములను సూరి పద్యాంధ్రవ్యాకరణమునఁ బ్రస్తావించెను. (చూ.39పుట) కాని బాల.లోఁ బ్రస్తావింపలేదు. బాల.రచనాలక్ష్యము ననుసరించి గావచ్చును.

వీ రన్యదేశ్యముల నంగీకరించిరి.తత్సమతద్భవాదులవలె నన్యదేశ్యములును గావ్యప్రయోగయోగ్యములె. కాని వీ రన్యదేశ్యాంధ్రములస్వరూపమును దమవ్యాకరణమున లక్షణబద్ధము చేసియుండలేదు.

ఇట వీరివివరణమును సరిగా లేదు. దేశ్యమును వీరు ఆంధ్రదేశ్యము-అన్యదేశ్యము నని రెండుగాఁ బేర్కొనిరి. (అన్యదేశ్యము లన నాంధ్రేతరదేశ్యములు. దేశ్యేతరములు గావు) కాన నన్యదేశ్యములును దేశ్యములలో నొకభాగ మై యున్నవి. ఆంధ్రేతరము లయినయీయన్యదేశ్యము లెక్కడివి? ఆంధ్రేతరభాషలనుండి చేరియుండవలె.సంస్కృతప్రాకృతములును దెలుఁగును గాక మిగిలినభాషాపదములు-వానిం గూడ వివరింపఁదగును గదా.

మొత్తముపై నన్యదేశ్యములు దేశ్యములలోనివె. కావున సంస్కృతసమేతరము లైనయీయన్యదేశ్యము లాచ్ఛికములె యగును.అనఁగా నచ్చతెనుఁగు.'అచ్చతెనుఁగునకు వర్ణములు ముప్పదియే' యని గదా వీరు చెప్పిరి. ఇం దున్న వంతె యగునా?

ఋప్రభృతి19వర్ణములు సంస్కృతసమాన్యదేశ్యానుకరణాదులనుండి తెలుఁగున వ్యవహరింపఁబడు ననిరి. (సం.4) అచట 'తత్సమశబ్దమాత్రవర్ణము' లని యావిషయమును సూచికలోఁ దెల్పిరి. సూత్రమున మాత్ర మన్యదేశ్యాదులను జేర్చిరి. (అన్య)దేశ్యము లచ్చతెనుఁగులే యైయుండఁగా నన్యదేశ్యమునందలివర్ణము లచ్చతెనుఁగులోనివి కాకుండఁ బోవు టెట్లు? అట్టియెడల ఋప్రభృతివర్ణము లన్యదేశ్యములలో నచ్చతెనుఁగున నున్నవే కదా. కాఁగా వరుసలవా రచ్చతెనుగునకు వర్ణములు ముప్పదియే యని చెప్పుట యసంగతము గాదా? అట్లే ఋప్రభృతివర్ణములప్రవేశముం గూర్చి చెప్పినలక్షణమును సమంజసము గా దనక తప్పునా?

కాని యనాంధ్రవర్ణము లున్న యన్యదేశ్యము (అనుకరణశబ్దము?) లచ్చ తెనుఁగునకుఁ జెందినవిగాఁ జెప్పుటయే ప్రమాదము. సంస్కృతసమములవలె నీ యన్యదేశ్యములును నచ్చతెనుఁగుకన్న భిన్నములు. అచ్చతెనుఁగులయిన పై31(37) వర్ణములకంటె వే ఱయినది యుండరాదు. అట్టివర్ణ మున్న నది యచ్చతెనుఁగు గాదు. కాఁగా నన్యదేశ్యములను పయులవారు దేశ్యములలో నొకభాగముగాఁ జెప్పుట సరి గా దని నిర్ణయింపవచ్చును.

దేశ్య మనుసంజ్ఞ యాంధ్రదేశ్య మనునర్థమునసే కుదురును. త్రిలింగదేశమున వ్యవహరింపఁబడుశబ్దము లెల్ల దేశ్యము లగు ననుదృష్టిలో నుండుటచే పయులవా రిట్లు పేర్కొనిరి. కాని త్రిలింగదేశజనులవ్యవహారమునుండి యేర్పడి ఆవ్యవహారము మాత్రమె మూలముగాఁ గలది దేశ్యము. అన్యదేశ్యముల కాయాదేశభాషలు మూల మగుం గాని త్రిలింగదేశవ్యవహారము మూలము గాదు గదా. కావున లక్షణమునుబట్టియు నన్యదేశ్యములు దేశ్యేతరముల యగును.

అన్యదేశ్యములను గూడఁ జెప్పదలఁచినఁదత్సమతద్భవదేశ్యాన్యదేశ్య(గ్రామ్య)ములుగా వింగడింపవలెను. అట్లన్యదేశ్యములను వేఱుగాఁ జెప్పినంతమాత్రమున నన్యదేశభాషాపదము లెల్లఁ దెలుఁగులోనికిఁ బ్రవేశించు ననుబాధ లేదు. సంస్కృతప్రాకృతములనుండి తత్సమతద్భవములుగా నాభాషాశబ్దము లెల్ల నెట్లు ప్రవేశింపవో యివియు నట్లే. వానివలె నివియుఁ గవిప్రయోగానుగుణముగనె గ్రహింపఁబడును.

అన్యదేశ్యములం దనాంధ్రవర్ణముల నంగీకరించియు (సం.4) ఖుతువసాహి, సికారు, ఫీజు అనురీతిగా నాంధ్రవర్ణములను జేసి చూపుట యవసరముగాఁ దోఁచదు. తురుష్కులు అవి పీ రిటనే చూపిరి కూడ. వ్యవహారానుగుణముగా ననాంధ్రవర్ణముల నట్లె యుంచఁదగును.

గ్రామ్యము :

లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు (22)అనుసూత్రలక్షణమును వీరు మిక్కిలిగా సవరించి యిట్లు పేర్కొనిరి. "మహాకవికర్తృకవ్యాకరణసమ్మత మేని, మహాకవిప్రయుక్త మేని కానియట్టిది కావ్యములందు వాడరాదు. (ఉ.22సూ.)

మహాకవికర్తృకవ్యాకరణ మనుటచే వ్యాకరణము వ్రాసినవాఁడు మహాకవియు

నయ్యుండవలె. చిం.నన్నయకర్తృకముగా నది యుద్దేశించి యిట్లు చెప్పఁ రనవచ్చును. ఇంకను వివరించుచు 'సామాన్యకవికృతలక్ష్యలక్షణములసమ్మత మయినను సాధువు కానేర' (ఉ.31) దనిరి. సామాన్యకవులు వ్రాసినవ్యాకరణములందలి యంశములను ప్రమాణీకరింప నక్కఱ లే దన్నమాట. అసలు కవియే కానివాఁడు వ్రాసినవ్యాకరణము సంగతి చెప్పనే యక్కఱ లేదు. బహుశః బాలవ్యాకరణోద్ద్యోతము వ్రాసిన వయులవారు మహాకవులె యైయుందురు. సూరి సాధించిన జగత్తు మున్నగువాని నసాధువులుగా నిర్ణయించుటలో బాలవ్యాకర్త సామాన్యకవి (లేక యసలు కవి కాఁడో) యనునుద్దేశ్యము లేదు గదా. అయినను సామాన్యకవులు- మహాకవులు ననురీతిగా విభాగించినను దాంధ్రవాఙ్మయమునఁ గవులలో నెవరు సామాన్యులో యెవ రసామాన్యులో వీరు నిర్ణయించి చెప్పిన బా గుండెడిది. లేనిచో నెవరిలక్ష్యలక్షణములను గ్రహించుట? యెవరివి తిరస్కరించుట? వీ రట్టినిర్ణయము చేయకుండుటచే వీరలక్షణమున 'మహాకవికృత'వ్యాకరణ మనుట యనవసర మనక తప్పదు. అట్టివివక్షయుఁ దగ దని చెప్పుట యుక్తము గదా.

ఇంతఁ దరువాత సూత్రమున 'మహాకవిప్రయుక్త మేని' గావలె ననిరి. అనఁగా మహాకవికృతలక్షణసమ్మతము గాకున్నను మహాకవిప్రయుక్తము లయినచోఁ గావ్యములందు వాడుకొనవచ్చును.అనఁగాఁ బ్రాణగొడ్డము ప్రభృతు లట్టిలక్షణసమ్మతములు గాకున్నను మహాకవిప్రయుక్తము లవుటచే గ్రాహ్యములె. కావ్యప్రయోగార్హములె.

సూరి ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని సూత్రించి 'పెద్దలు ప్రయోగించినది గ్రామ్య మయినను గ్రహింపఁదగు నని చెప్పెను. సూరి యట్లు చెప్పుట సరి గా దని వీరియిచ్చుటియభిప్రాయము. దీనింగూర్చి "మహాకావ్యప్రయుక్తముల ననింద్యగ్రామ్యము లనుట సరి కాదు. మహాకావ్యప్రయుక్తములు గ్రామ్యములు కానేరవు. వానివి వ్యాకరణములలోఁ జేర్చుకొనవలసినదే" (ఉ.31) యనిరి.

కటకంతుఁడు ప్రభృతులు లక్షణవిరుద్ధము లగుటచే గ్రామ్యము లయియు మహాకవిప్రయుక్తము లగుటచేఁ గాఁబోలు నివి యనింద్యగ్రామ్యము లందురు కొందఱు. సూరి యట్లు వ్యవహరించియుండలేదు. కాని వీరు 'సూరి భ్రమించి కపిలగడ్డము మున్నగునవి యనింద్యగ్రామ్యము లని వ్రాయుట పొరపాటు. అవి భారతప్రయుక్త

ములును గావు. కవిలగడ్డము (కపిలగడ్డ మట్టుపొరపాటట. సూరి యేయచ్చులోఁ జూచెనో) ము న్నగునవి భారతప్రయుక్తసాధురూపము (ఉ.31) లనిరి. కవిలగడ్డము మున్నగువానిని సూరి యనింద్యగ్రామ్యము లనె ననుట పొరపాటు. సూరి యామా టనె యెచ్చటను బ్రయోగింపలేదు. బహుశః సూరి యిట్లు దలఁచె ననియె వీ రీయం శమునకు ముందు 'గ్రామ్యము - ననింద్యగ్రామ్యము' నని యేతద్విషయసూచిక నుంచి రేమో.

ఇఁక నిట్టివానిని ననింద్యగ్రామ్యము లనక వ్యాకరణములోఁ జేర్పవలె ననిరి గదా. ప్రాణగొడ్డము జీవగఱ్ఱ యనువానిని వీరివ్యాకరణము సాధింపఁజాలునా? పర సపుమాటవంటిమిశ్రాదిసమాసములే జ్ఞాపితము చేసిరే. లక్షణబద్ధములు చేయకయె యవ్వానిని గేవలము సాధురూపములుగాఁ జెప్పుట యెట్లు?

మహాకావ్యప్రయుక్త మైనచో గ్రాహ్య మనిరి గావున నిట్లు వీనికి వ్యాకరణ మునఁ జేర్పు సంభవించిన దనవచ్చునా? ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యం బని సూరియు వీనిని గ్రాహ్యములుగాఁ గావ్యములఁ బ్రయోగించుకొనఁ దగు ననుట వ్యాకరణములోఁ జేర్చినట్లే కదా. ఇంక భేద మేమి? సూరి ముందుగా నీయవి లక్షణ విరుద్ధము (గ్రామ్యము) లగుటను జెప్పెను. వీరు చెప్పలేదు. కాని వీరు నిట్టివానిని లక్షణబద్ధము చేయకుండుట గమనార్హము. ఇంకను వ్యాకరణసమ్మత మేని మహాకవి ప్రయుక్త మేని' అనువీరివాక్యముచేత నివి లక్షణసమ్మతము గాని దనియు ననఁగా లక్షణవిరుద్ధ మనియుఁ జెప్పవచ్చునే కద.

లక్షణవిరుద్ధ మైనభాష గ్రామ్య మగుటలో (వ్యా.సం.స.7) విప్రతిపత్తి లేదు. కావున నట్లు చెప్పుసూరిలక్షణము సూక్తమె.

సంజీవనిలో "వ్యాకరణసమ్మతము గానిభాష గ్రామ్య మని సూరియాశయము. వ్యాకరణము మహాకవిప్రయోగమూలకము గాన మహాకవిప్రయోగసమ్మతము కాన ట్టియు నన్నయాదిపండితకవీంద్రకృతవ్యాకరణసమ్మతము కానట్టియు భాష గ్రామ్య మని పర్యవసితార్థము.'(వ్యా.సం.స.177) అని సూరిసూత్రవ్యాఖ్యగాఁ జెప్పినదానినె యిట సూత్రముగాఁ జెప్పి సూరిలక్షణము సరికా దనునుద్దేశ్యమును వ్యక్తము చేయుట యిందలివిశేషము. ఇట్టిస్థలములు సంజీవనికిఁ బిదప వచ్చువారికి సూరిపై గౌరవ మును దగ్గినట్లు సూచించు ననఁదగును. సూరిసూత్రమునకుఁ బైయర్థ మున్న దనుట విచార్యము. అయ్యు సూరిలక్షణము దుష్టము గానేరదు.

వీరిలక్షణమున నింకొకయనౌచిత్యము నిట్లు గ్రహింపవచ్చును. 'మహాకవికర్తృకవ్యాకరణసమ్మత మేని, మహాకావ్యప్రయుక్త మేని' అనుటచే- మహాకావ్యప్రయుక్తము గాకున్నను మహాకవికర్తృకవ్యాకరణసమ్మత మయినచో నట్టిశబ్దమును గావ్యములందు వాడుకొనవచ్చు నని వీరియభిప్రాయ మగుచున్నది. ఇట్లని వీరు వ్యాఖ్యానింపలేదు. కాని యీయర్థము నీసూత్ర మీయకమానదు. వీరును దమగ్రంథమున నట నట నీయర్థమును సమన్వయించుటయుఁ గానవచ్చును. వి.వి. 'విధాతా, ధాతా, దాతా, సవితా, నేతా' యనుశబ్దములను విధాత్రాదులుగాఁ బేర్కొనె. ఇందు విధాతృసవితృ(మాంధాతృ)శబ్దములు మాత్రమె ఋదంతములుగాఁ గవిప్రయుక్తములు ఇతరములు కవిప్రయుక్తములు గాకున్నను అథర్వణునివంటిలాక్షణికుఁడు పేర్కొనుటచే గ్రామ్యము గాక తప్ప దనిరి. ఇట్లె కూఁతు మొ॥ హనుమానుఁడు జగత్తు మొద లగువాని నహోబిలాదులు సాధించిరి. ఇవి కవిప్రయుక్తములు గాకుండుటచే సాధువులు గా వనిరి. అనఁగా నహోబిలాదులు సామాన్యపండితకవిలాక్షణికు లగుటచేతఁ దిరస్కరించినట్లు వీరిసూత్రమున దళసాద్గక్య మెన్నవచ్చును గదా. కాని యిట్టిసంప్రదాయము సమంజసము గా దనక తప్పదు.

ఇట్లు వటులవారిలక్షణ మనర్థకము నై యగ్రాహ్య మగుచున్నది.

వీరు దీనికి ముందు 'గ్రామ్యము' అని సూచించిరి. కాని ప్రస్తుతసూత్రమున గ్రామ్యసంజ్ఞను బ్రస్తావింపలేదు. గ్రామ్యతను విధించి ప్రయోగార్హము గా దని వివరించినసూరిరచనామార్గమె యుచితము. ఇంక ననుక్తన్యాయమున గ్రామ్యసంజ్ఞను బాలవ్యాకరణమునుండి యుద్యోతమున గ్రహింపఁదగు నేమో పరిశీలింపవలె.

'ఎస్తాఁడు ము న్నగురీతిగా గ్రామ్యరూపములలో సూరి ఖండానుస్వారమును జూపుట యసంగత (ఉ.31, వ్యా.సం.స.170) మనిరి. (ఇందు ఖండబిందు వుండుటయు గ్రామ్యతాలక్షణమె యని కొందఱు సమన్వయింపఁజూతురు. ఇయ్యది చమత్కారార్థము గావచ్చును) ఖండానుస్వారము లేకుండుటయె యుక్తము. అట్లు గాక యిట్టివి కావ్యప్రయుక్తము లై యుండఁగా సూరి యెటనేఁ జూచి విరసించె నేమో.

మొత్తముమీఁద సూరిసూత్రమే సముచిత మైయున్నది.

## అనింద్యగ్రామ్యములు :

'ఆర్యవ్యవహారంబుల దుష్టంబు గ్రామ్యంబు' (23)ననుసూరిలక్షణమును వఝలవారు దోలఁగించిరి. కాని దీనిని సూచించుచు వీరొకసూత్రము వ్రాసిరి. 'ప్రామాణికులు స్పష్టప్రతిపత్త్యాదికమునకై బుద్ధిపూర్వకముగా నిల్పిన లక్షణవిరుద్ధ ప్రయోగము అనింద్యగ్రామ్యము అనఁదగును' (ఉ.28సూ.) వీరీలక్షణమునెడఁ బైసూరిసూత్రమును సూచించిరి. వఝలవారు పైసూరిలక్షణముచే ననింద్యగ్రామ్యము అను దేర్పడునదిగాఁ దలఁచియుందురు. కాని సూరిలక్షణమునభిప్రాయము వీరి లక్షణముకంటె భిన్నము. సూరి యనింద్యగ్రామ్యము అనుదానిని ప్రస్తావింపలేదు. నింద్యములు అనింద్యములు ననువివక్ష సూరి చేయలేదు.

వీరు పూర్వసూత్రమున నాయాశబ్దములు కావ్యములందు వాడుకొనరా దనిరే కాని వానికి గ్రామ్యసంజ్ఞను విధింపలేదు. ఇట్లు గ్రామ్యసంజ్ఞయె విహితము గాకుండ నిట ననింద్యగ్రామ్యములను సూత్రించుట విశేషము. గ్రామ్యసంజ్ఞ ననుక్తన్యాయమున బాల.నుండి గ్రహింతము.

ఇఁక నీసూత్రమునఁ జెప్పినదానినిబట్టి యిట్టివి యనింద్యగ్రామ్యములు కాఁగా నేతద్భిన్నములు నింద్యగ్రామ్యము లని యెన్నవచ్చును. పూర్వసూత్రమును గూడ ననుసరించి యప్రామాణికులు లక్షణవిరుద్ధముగాఁ జెప్పినవి నింద్యగ్రామ్యము లన్నమాట. కావ్యప్రయోగార్హత లేకుండుటయె 'నింద్యలక్షణ'మని గ్రహింపవచ్చు. 'నింద్య'ము అని నిందింపకయె సూరి కావ్యప్రయోగార్హత లేకుండఁ జెప్పుట యుక్తము గానున్నది.

అనింద్యగ్రామ్యలక్షణసార్థక్యమును జూతము.

అఆఇఈ అనురీతిగా వర్ణమాలలో స్పష్టప్రతిపత్తికయి సంధికార్యము లేకుండఁ జెప్పిన నవి యనింద్యగ్రామ్యములె యనిరి వీరు. సూత్రము ననుసరించి యిట్టి వానిని ప్రామాణికులు చెప్పవలయును. అప్రామాణికులుమాత్రము స్పష్టప్రతిపత్తి నుద్దేశించినను అఆఇఈ యనురీతిగా సంధికార్యము లేకుండఁ జెప్పిన ననింద్య గ్రామ్యత యగును. అయినఁ గవులలో మహాకవులు మామూలుకవులనువలె నిచటఁ బ్రామాణికులు నప్రామాణికులు నిర్ణయింపఁబడలేదు. కాన అతివ్యాప్త్యాదిదోషము లుండ వని యుద్దేశ్యము గాఁబోలును. అప్రామాణికులు శాస్త్రీయముగా అయాయి యీ యనురీతిగా సంధికార్యములతోడి వర్ణనిర్దేశము చేయవలయును.

అదిశబ్దప్రయోజనమును వారు స్పష్టము చేయలేదు.

ఇటఁ బ్రామాదికము లైనను స్పష్టప్రతిపత్త్యాదికమునకై యైనను బుద్ధిపూర్వకముగా నిల్పినప్పుడే యవి యనింద్యగ్రామ్యము లగును. అనఁగాఁ బొరపాటున, నట్లు చెప్పవలె ననుబుద్ధి లేకుండఁగఁ జెప్పిన నయ్యది నింద్యగ్రామ్య మగును. (వా రెంత ప్రామాదికము లైనను) అట్టిబుద్ధి యున్నదియు లేనిదియు నెట్లు తెలియును. ప్రామాదికములు గాన నెల్ల బుద్ధిపూర్వకమె యనవలె. లేకున్న వీరిలక్షణము విరోధించును గదా.

ఇట్టివర్ణమాలాచులనిర్దేశము కావ్యములం దుండదు కావున నిది శాస్త్రభాషను గూర్చి చెప్పఁబడిన(లక్షణ) వివరణ మనఁదగు.

'స్పష్టప్రతిపత్తికయి యుద్ధరణచిహ్నముల నడుమ 'అది ఉండె' అనురీతిని సంధికార్యవిరహితముగఁ బ్రయోగించుట మొ॥' (ఉ.32) ఇట్టిప్రయోగము కావ్యభాషయం దుండదు. లక్షణగ్రంథముల నుండదు. బహుశః తమగ్రంథములను దృష్టియం దుంచుకొని యిట్లు వివరించి రేమో.

'షరా మ న్నగురీతి నన్యదేశ్యపదములను నర్థస్ఫూర్తికయి తెల్గున వాడు నపు డనాంధ్రవర్ణముల నిల్పుట'(అట సరా అని నిల్పినచో నర్థస్ఫూర్తి గలుగదు.) ఇది కూడఁ బ్రధానముగాఁ గావ్యేతరభాషాలక్షణమె యనవచ్చును.

సూరి రచించినవ్యాకరణము కావ్యభాషకు. వ్యాఖ్యానగ్రంథాదుల నున్నభాష లక్షణబద్ధము చేయుట సూరిమతము గాదు. అవసరమును గాదు.

అనింద్యగ్రామ్యము లిట్టివే యగునెడల వీనింగూర్చి సూరి ప్రస్తావింపకుం డుటయే యుక్తముగా నున్నది.

వసుులవారు ఋఋూౣ౦ౡ మొద లగువర్ణములు సంస్కృతసమాన్యదేశ్యానుకరణాదులంగూడి' (సం.4సూ) తెల్గున వచ్చు ననిరి. ఇ ట్లన్యదేశ్యములలో ననాంధ్రవర్ణస్థితి వీరులక్షణబద్ధము చేసిరి. కంఠము అనుసంస్కృతసమశబ్దమైన ననాంధ్రవర్ణ ముండుటంబట్టి యది యనింద్యగ్రామ్య మగు ననవచ్చునా? మఱి షరా ఇత్యాదుల (ననింద్య) గ్రామ్యలక్షణ మేది? సూరికంటె విశేషముగా నన్యదేశ్యము లందు ననాంధ్రవర్ణస్థితి లక్షణబద్ధము చేసియు (లక్షణవిరుద్ధము గాన?) ప్రామా

వికప్రయుక్త మై యనింద్యగ్రామ్య మగు చున్న దనుట యెట్లు? ఇంతకు ముందే వీరు తెలుఁగున అన్యదేశ్యముల నొకభాగముగా నంగీకరించుట యుక్తము. అట్టి యన్యదేశ్యములలోని యనాంధ్రవర్ణములను దొలఁగించి వానిచో దత్సన్నిహితాచ్ఛాంధ్రవర్ణముల నిల్పుట యుక్తము. అట్టి మార్పుచే నర్థస్ఫూర్తిప్రతిబంధము గల్గుచో నట్టియనాంధ్రవర్ణముల నిల్పుట యుక్తమె (ఉ.9) యనిరి. అట్టి వనింద్యగ్రామ్యము లగుట యేమి? తాము కాపీ.(కాఫీ) పీజు (ఫీజు) అన్నట్లుగా నెవ్వ రేని షరా-యన్న దానిని సరా యందు రేమో యని యి ట్లనిరా? అయిన నర్థస్ఫూర్తికి భంగము గల్గు చున్నను ననాంధ్రవర్ణముల నచ్ఛాంధ్రవర్ణములుగా మార్చి ప్రయోగించుట నేని అనింద్యగ్రామ్యతగాఁ బేర్కొనఁదగుఁ గాని యిది కాదు.

ఇంక నన్యదేశ్యములు దేశ్యేతరములు కాఁగా నం దనాంధ్రవర్ణస్థితిఁ మూలానుగుణముగాఁ బేర్కొనవచ్చును. కాని వీరు ధ్వన్యనుకరణశబ్దములను గూడ సంస్కృతసమాన్యదేశ్యములతోఁ జేర్చిరి. కాని యటఁ జేర్పక యిట ననింద్యగ్రామ్యములుగాఁ జెప్పఁదగు నేమో యని సందేహము. గుభుల్ ఫెళిల్లు, ధణేల్ మొద లగు ధ్వన్యనుకరణశబ్దములు దేశ్యములుగాఁ జెప్పుచో ననాంధ్రవర్ణము లుండుట లక్షణవిరుద్ధ మై గ్రామ్యతమే యగును. మహాకవిప్రయుక్త మై గ్రాహ్య మగును.

ఇంక వీని నితరభాషలనుండి గ్రహించినట్లు చెప్పుటకు వలను పడదు. క్రాకన్నను శంఖాకి అనుచోఁ బ్లుతమువలె నిది ప్రత్యేకముగా విధించుకొనవచ్చును. కాని వర్ణమాలలో లే దని ప్లుతమును విరసించినవడులవా రనుకరణశబ్దములందలి యనాంధ్రవర్ణముల నెట్లు సంగ్రహించిరో యర్థము గాదు. సంస్కృతసమముల సంస్కృతమునుండి యన్యదేశ్యముల నన్యదేశభాషాశబ్దములనుండి యనాంధ్రవర్ణములు తెలుఁగునఁ బ్రవేశించు నన్నను ననుకరణశబ్దము లెచ్చటనుండి వచ్చును. తెలుఁగునందలిశబ్దములందుఁ దెలుఁగున లేనివర్ణ మెచ్చటనో యుండి యెట్లు వచ్చును. అన్యదేశ్యములు ననరాదే.

ఇటఁ బేర్కొనకున్నప్పటికి గుభుల్ గుభుల్ అనుచో ననుకరణశబ్దము లం దనాంధ్రవర్ణములను దొలఁగింపరా దనుచు నింతకు ముం దనింద్యగ్రామ్యముగాఁ జూపిరి. (ఉ.9) పిదప సం.4సూత్రమున ననుకరణమున ననాంధ్రవర్ణస్థితిని లక్షణబద్ధము చేసియును నింద్యగ్రామ్య మనుట విశేషము. ఇయ్యది 'మహాకవికర్తృకవ్యాకరణసమ్మతము గాని, మహాకావ్య (ప్రయుక్త) మేని' గా దేమో.

మత్తా మున్నగువానిలో ననాంధ్రవర్ణ ప్రయోగము చేయుట(ఉ.282) గూడ ఇట్టిదే యనిరి. దీని ననింద్యగ్రామ్యముగా నింతకు ముందును జేర్కొనిరి. (ఉ.9) అన్యదేశ్యముగా నిట్టివియుం దనాంధ్రవర్ణస్థితిని సంగ్రహింపఁదగును గదా.

'అచ్చాంధ్రకావ్యములలో సంస్కృతపదములను (సంజ్ఞావాచకాది) వాడుట మున్నగునవి యనింద్యగ్రామ్యములు' (ఉ 32) "తెనుఁగునను మాఱుపేళ్ళిడి పెనఁచిన నినఁగూడ దనుచు బిరుదులు పేర్లన్ మును వేల్పుబాస వెంబడి నునుచుట" యచ్చాంధ్రకావ్యములలోఁ గలదు. కాని యట్టివి లక్షణవిరుద్ధము లనుట యెట్లు? అచ్చాంధ్రకావ్యములలో సంజ్ఞావాచకాదులు తత్సమములుగాఁ బ్రయోగింపఁబడుట యన్నది తత్కావ్యరచనాసంప్రదాయము. దానికి శబ్దశాస్త్రము నియామక మగు టెట్లు? ఛందోఽనుగుణముగా లక్షణబద్ధము లైనరూపములు లాయువి యచ్చటఁ దప్పక ప్రయోగింపవలసి వచ్చిన నదియు ననింద్యగ్రామ్య మగు నన్న నె ట్లుండును? ఇది యట్టిద.

ఈ ట్లాయాస్థలములందున్నభాషాస్థితిని వర్ణించుట నది యుక్తమె యనియుటఁ జెప్పిన వీని ననింద్యగ్రామ్యము లనవలసినయవసర మేమి? అనఁగా స్పష్టప్రతిపత్త్యధికమునకై సంధివిరహముగాఁ బ్రయోగింపవచ్చును.(వ్యాఖ్యానాదులందు?కావ్యముల నిది కుదురదు) అనురీతిగాఁ జేర్కొన్న నయ్యది లక్షణబద్ధ మగు. అట్టిస్థితి సామాన్యముగా సమ్మత మైనపుడు (అనింద్య) గ్రామ్యతాకల్పన మేల?

మొత్తముమీఁద వచులవారు 'అనింద్యగ్రామ్యములు'గాఁ జెప్పినస్థలములు ముం దసలు గ్రామ్యములె యనరాని వనియు నిక్కమైన 'అనింద్యగ్రామ్యములు' అనుకల్పనమె యసమంజస మనియు నిర్ణయింపవచ్చును.

కాఁగా వచులవారియాలక్షణము ప్రయోజనవంతము గాదు.

## గ్రాహ్యగ్రామ్యములు :

ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యం బన్నసూరిలక్షణమునభిప్రాయము పైరీతిని గా దనుట ప్రసిద్ధమె. లక్షణవిరుద్ధ మయినశబ్ద మార్యవ్యవహారమునందుఁ గానవచ్చిన గ్రహింపవలెను. 'గ్రామ్యం తత్తద్విధో సాధు కలశంఠముఖా హితా' యను ని.వి.లో నిట్టియభిప్రాయము గలదు.

వీరు వ్యాకరణసమ్మతము గాకున్నను మహాకావ్యప్రయుక్తమైనఁ గావ్యప్రయోగార్హమె యనిరి. అనఁగా లక్షణసమ్మతము గాకున్నను మహాకావ్యప్రయుక్తమైన గ్రాహ్య మని యర్థము. లక్షణసమ్మతము గానిదానికి గ్రామ్య మనుసంజ్ఞ సంప్రదాయానుగుణముగనె యుంచి యాస్యవ్యవహారమునుండి గ్రహింపఁదగు నని సూరియుఁ జెప్పెను. సూరియభిప్రాయమును వడలవా దస్పష్టముగా సంగ్రహించి రనఁదగును.

కావ్యప్రయుక్తమైన దెల్ల సాధారణముగా నంగీకరింపుటకంటె సూరి యనుసరించిన మార్గమె సముచితమైయున్నది.

కలకంఠుఁడు. (చూ.త్రి.శే.)

జీవగఱ్ఱ వైరిసమాసము గాన గ్రామ్యము. అయ్యుఁ గవిప్రయుక్త మై గ్రాహ్యము. ప్రాణముగొడ్డము అన్నచోనది యగ్రామ్యమె యగు నని (వ్యా.సం.స. 188) వీరు పేర్కొనిరి. కాని గొడ్డ మనునది యొకటి గానరాదు. కానఁ బ్రాణము గొడ్డము అనియు లక్షణసిద్ధ మగుసవకాశము లేదు. (చూ.త్రి.శే.)

కపిలకన్నులు మొ॥ కపిలశబ్దము గల దందురు వీరు. తాము చూచిన తాళపత్రప్రతులు పెక్కింట 'అవసర-కపిల-తపసి- ఉవిద- అనియే యున్న దని స్పష్టము చేసియు(వ్యా.సం.స.190) పవప్రాస మితరత్ర లేదు గాన ప్రౌఢవ్యాకర్తృవచన మంగీకార్య మనిరి.'తాళపత్రప్రతులు తప్పులతిప్పలు గావ నందున్న వట్లు గ్రహింపరా దని వీరి టిప్పణిలోఁ జేర్కొందురు. (చూ.త్రి.శే.)

ఇట సూరియుదాహరణములసామంజస్యము త్రి.శే.లోఁ జూడఁదగు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

# సంధిపరిచ్ఛేదము

## ఉత్త్వసంధి :

ఉత్తున కచ్చు పరం బగునప్పుడు సంధి యగు (1)ననుసూరిలక్షణమును వీరు 'ఉత్తున కచ్చు పరం బగునప్పుడు పరరూపసంధి నిత్యము' అని చూపిరి. సంధి యను దానికిఁ బరరూప మను విశేషణము 'పూర్వస్యపరరూపత్వమత్రైవ నియతం భవేత్' అను వి.వి. ప్రభావముతోఁ జేర్చియుందురు. లేదా స్పష్టత కని వీరె తగిలించియుండ వచ్చు. కాని సూరి సంధి యనుట దురుక్తి కాదు. వీరిలక్షణమున నైన నది యెంత వఱ కవసరమో చూతము.

'పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశం బగుట స్వరసంధి యనం బడు' ననువీరివివరణము ననుసరించి పూర్వపరస్వరములు రెంటికిని బరస్వరమే నిల్చుట సంధిలక్షణమే యైయున్నది. కావున సంధి యగు నన్నమాత్రముననె వీరి మతమునఁ గూడఁ బరరూపసంధి యగు ననునర్థము సిద్ధించుచునే యున్నది. కావునఁ బరరూపవిశేషణమును జేర్చుటవలనఁ బ్రయోజన మేమియు లేదు. సూరిలక్షణము కంటె విశేషార్థమును లేదు.

ఈసంధినిర్వచనమునందును వీరు స్వరసంధి యనంబడు నని సూరికంటె స్వరశబ్దము నధికముగాఁ జూపిరి. పూర్వమునందును బరమునందును స్వరమే యుండఁగా నైనయాకలయికను స్వరసంధి యనురీతిగా విశేషముగాఁ జేర్కొనవలసిన యవసరము లేదు. వివరణమె గదా యని యింకను స్పష్టతకై యిట్లు చెప్పియుందురు. కాని స్వరశబ్దమును జేర్పనిసూరినిర్వచనము నిర్దుష్టమె.

ఇంక నిట సూరిసూత్రమున సంధి యగు నని చెప్పుటయు నాసూత్రమందలి సంధిపదమును నిర్వచించుస్థలముగా సంధి యనంబడు ననుటయు సక్రమముగ నున్నది. కాని వీరు సూత్రమునఁ 'బరరూపసంధిని' చెప్పిరి. వివరణమున 'స్వర సంధిని జేర్కొనిరి. సూత్రమునఁ జెప్పినదానికంటె భిన్న మగునంశమును జెప్పిరేమో యనునను మానమును గల్గించుచుంట యుచితము. ఇంతకు ముందు 'తెలుఁగున స్వర సంధి సాధారణముగఁ బరరూపసంధిమాత్రమె (ఉ.33) యని చెప్పియున్నారు. దానింబట్టి పరరూపసంధి కాని స్వరసంధి యసాధారణముగఁ గల దని యూహింపఁ

దగియున్నది. ఇట 'స్వరసంధి'ని వివరించినస్థలమునఁ బూర్వపరస్వరములకుఁ బరస్వరైకాదేశమనే పేర్కొనియుండుటచే స్వరసంధి యనఁగాఁ బరరూపసంధి మాత్రమె యనియు నసాధారణముగ నైనను బరరూపము లేనిస్వరసంధి లేదనియు నెఱుంగవలసియున్నది. నా+అది అనుచోఁ బరస్వరలోపసందర్భమునందియు స్వరసంధియె యని 'సాధారణముగ' నని యితఃపూర్వము పరరూపసంధిసందర్భమునఁ బేర్కొనిరేమో. అది వా రెచ్చటను స్పష్టము చేయలేదు. కాని యీస్వరసంధినిర్వచనమున మాత్ర మట్టిదానికి నవకాశము కల్పింపఁబడలేదు.

మొత్తముమీఁద సూరిసూత్రవివరణములఁ గలక్రమము వజ్ఝలవారిగ్రంథమున లేకుండఁగా నింకను వివాదాస్పద మైన దని స్పష్టము.

సూరి సంధిని 'అగు' నని విధింపఁగా వీరు 'నిత్య' మనిరి. సూరి అగు- నిత్య మనువాని కీషద్భేదము నుద్దేశించె నని కొందఱు (సర్వ.)వ్యాఖ్యాత లెంచిరి. కాని యది సరి గాదు. అయ్యుష్మదాగమాదిసూత్రసందర్భమునను వీరును సూరి వలెనె 'యగు' నని మాత్రమె చెప్పియున్నారు. కావున నిట నిత్య మని చెప్పుటలో నెది యేని విశేషప్రయోజనము సాధించి రనుకొనుట కవకాశము గానరాదు. వీరును వివరింపలేదు. సూరియభిప్రాయమును వీరు సూత్రమునను వ్యాఖ్యానించి రనఁదగును. సూరిలక్షణము నిర్దుష్టమె.

ఉత్తు అనుచో తకారమును బరముగాఁ జేర్చుటవలన తపరస్తత్కాలస్య యనులక్షణము ననుసరించి తత్కాలమాత్రగ్రహణము ప్రయోజనము. ఉకార మనురీతి నున్నఁ గారప్రత్యయయోగమున నట్టియర్థము లభింపనేర (వ్యా.సం.స. 205) దనిరి.

అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' నన్నసూరి, ఆహా+ఆహా, ఎట్టా+ఎట్టా- అన్నవియుఁ జూపెను. ఇటఁ దపరకరణము లేమిం జేసి దీర్ఘస్వరములకు సంధి యైనది. ఉహూహూ యని వడఁకె (భాగ.10.పూ.800) ననుచో ఉహూ హూ యని సంధికాకుంట యిచ్చటితపరకరణమునకుఁ బ్రయోజనము. ఇట్లె యూకారమున కెల్ల యెడల.

'వచ్చెను + అతఁ డన్నది యుదాహరించుచు వీరు "సూరి వచ్చెను + అతఁడు వచ్చెనతఁడు అనురీతి గలద్రుతోకారసంధుల నుదాహరింపలేదు. ను వి అనునవే కదా

ద్రుతస్వరూపములు. ద్రుతమునకు స్వరపరకత్వమున ద్రుతస్వరలోపమున కింత కంటె మార్గాంతరము లేదు గదా. (ఉ.33) యనిరి.(వ్యా సం.ప.208) ఈసూత్రము స్వరలోపమును జెప్పుచున్నదా?పరరూపసంధి యగు నని పూర్వస్వరలోపము చేయు టెట్లు? పూర్వపరస్వరములకుఁ బరస్వరైకాదేశ మనుసంధివిధానముచేతఁ బూర్వ (ద్రుత)స్వరము లోపించుట కెట్టిప్రసక్తి యున్నది? సంధి యనఁగాఁ బూర్వస్వర లోప మనురీతిగా నర్థమును వీరును జెప్పియుండలేదు. ఇం కొకమార్గ మున్నదో లేదో తరువాతిసంగతి. ద్రుతస్వరలోపమున కీ(పరరూప) సంధివిధానము కిది మార్గ మనుట సంగతము గానేరదు. వచ్చె నతఁ డనురీతి వీసూత్రమునకు సూరిమత మున లక్ష్యములు గావు. ఇఁకాదిసూత్రసందర్భమున దీనివిషయము స్పష్ట మగును.

హరి యనెను అనుదానిం గూడ నీ రీతినే యుదాహరించుట యింకను విశే షము. దీనింగూర్చి 'హరిని + అనెను- హరి యనెను ము న్నగుచోటులందును నీ సూత్రపరరూపసంధివిధి వర్తిల్లును. సూ-కు- అనువానినుండియే ఏ-కి అనునవి యేర్పడె (ఉ.34) యనిరి. హరిని అనుచో నువర్ణమే యిత్వ మంది నివర్ణ మైనది. కావునఁ బూర్వరూపమునం దుత్వ ముండుటచే నుత్తున కచ్చు పరం బగునపు డను సూత్రముచేతనే సంధి యగు నని వజ్ఝలవారియభిప్రాయము స్పష్టము. (వ్యా.సం. ప.206)ప్రస్తుతరూపమునం దిత్వ ముండఁగాఁ బూర్వరూపము ననుసరించి యుత్త్వ సంధియే యవు ననుట యక్రమము. ప్రథమేతరవిభక్తిసూత్రమునొద్ద కువిభక్తి యం దుత్వమునకు సంధిని జూపినసూరి కిషష్ఠియం దిత్తునకు సంధి యవుటకయి దాని నేమ్యాదులలోఁ జేర్చుటనుబట్టి సూరి కిట్టియభిప్రాయములే దని నిశ్చయింపవచ్చును.

ఇందలియనౌచిత్యము వఝలవారి క్రియాపదేకార సంధిస్థలమునఁ బైవిధి గుర్తింపఁగలము.

ఇట వజ్ఝలవారిప్రక్రియ లాక్షణికసమ్మతము గా దని స్పష్టము.

హరిని అనుచో నివర్ణము ద్రుతమె. కావున సూరిప్రణాళిక ననుసరించి స్వర పరకత్వమున ద్రుతము పొల్ల యగును గాన హరిన్+అనియె హరి ననియె నని యవుటలో సంధి యవుట లేనేలేదు.

## ద్రుతపూర్వోత్వసంధి :

ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగు' (2)ననుసూరిసూత్రమును 'నీనాతాశబ్దములద్వితీయావిభక్తి రూపములు, చతుర్థ్యాదివిభక్తిప్రత్యయములు శత్రర్థకచువర్ణకము అనువానిద్రుతోకారమునకు స్వరము పర మగునప్పుడు ద్రుతలోపపూర్వకపరరూపసంధి వికల్పముగ నగును' అని చూపిరి. ఇది సూరిసూత్రమునకు వ్యాఖ్యానముగా అం.భా.అ. (సంధి.20) లక్షణము ననుసరించి చెప్పఁబడినట్లు గుర్తింపవచ్చు.

తృతీయావిభక్తులందు ఉకారము లేమి, ద్వితీయలో నీమూఁడుశబ్దములందు మాత్రమె యుకారము గలిమియు ననుసరించి స్పష్టముగా నుండు నని వీ రిట్లు చెప్పి యుందురు. చతుర్థ్యాదు లన్నిఁ. కాని స్పష్టముగాఁ జెప్పఁబూనినపు డట మాత్ర మట్లు చెప్ప నేల? చతుర్థ్యాదులలో కయి, వలన, కంటె, పట్టి, యొక్క, లోపల, న అను పెక్కింట నుత్వము లేదు. కొఱకు, కు, అందు అనుమూఁడింట మాత్రమె యుత్వము గలదు. కావునఁ జతుర్థ్యాదు లని సామాన్యముగాఁ జెప్పక యామూఁడింటిని నిర్దేశించిన మొత్తము స్పష్టముగా నుండెడిది గదా. వీనితోపాటు ఇందు, ఎందు అనువవ్యయములనుగూడఁ గలిపిన 'అందు'చే సప్తమీవిభక్తియు తత్రార్థక మగు నవ్యయమును (అంద్వాదుల కలిగాగమంబు సంధి.44) గ్రహింపఁబడి లక్షణ మింకను బా గుండెడిది. వీరియీసూత్ర మెట్లును సంగ్రహవ్యాఖ్యగనె యున్నది గదా. ఏ లన నిట్లు వివరింపనిసూరిసూత్రముచే నితరవిభక్తిస్థలముల సంధి లేదు. అందుకారమె లేదు గాన. ఇంకను వీరు స్పష్టముగా సూత్రమునఁ 'బ్రత్యయములు' అనియుఁ జెప్పిరి. (అందు) ఇందు ఎందులు- ప్రత్యయములు గావు వానిని బ్రత్యేకముగా నిర్దేశించుటయుఁ బ్రత్యయములను బేర్కొనుటచే మఱలఁ బ్రత్యయము లనకుండుటయు నుచితము.

అందు ఇందు ఎందు అనువాని సంధినిగూర్చి వీ రి ట్లనిరి. అందును, ఇందును, ఎందును అనునవి సప్తమ్యర్థకము లగుటంజేసి యవి ద్రుతప్రకృతికము లగుట వీనిసంధివిషయములోఁ బైవిధి వర్తిల్లుటలో విరోధము లేదు. (వ్యా.సం.వ. 212) సప్తమ్యర్థకములు కాని యవి సప్తమ్యంతములు గావు. సప్తమ్యంతము లైన సప్తమ్యర్థము నిచ్చుటలో విశేష మేమి? సప్తమ్యంతయే పేర్కొనియుందురు గదా. ద్రు.ప్ర. అగుటకు సప్తమ్యర్థక మగుట హేతు వగునా? పూలను దెచ్చె ననుచో

జనంబుద్వితీయకుఁ బ్రథమ రాఁగా పూలు దెచ్చె నని యగును. ద్వితీయ కయినది గావున నిచ్చటిప్రథమ ద్వితీయార్థకము.అయ్యుఁబూలు అన్నది ద్రు.ప్ర.అగునా?అట్లె యింపప్రత్యయములు ద్రు.ప్ర.అగుట కని సప్తమ్యర్థకము అగుట హేతువు కాఁజాలదు.

అందున ఇత్యాదులు ద్రుతాంతము లైనయవ్యయము లందుము. ఈవిధి యటఁ బ్రవర్తించుట యెట్లు? వజ్ఝలవారిపయివాక్యములందు సప్తమ్యర్థక మగుట ద్రు.ప్ర.త్వమునకు హేతువు కాఁగా ద్రు.ప్ర. అగుట యీసూత్రము వర్తించుటకు హేతు వయినట్లుగాఁ జెప్పుట తోఁచు. ద్రు.ప్ర. అయినచో నీసూత్రము వర్తించు ననుట కేవల మసంగతము గదా. కావున సప్తమ్యర్థకము (అయి ద్రు.ప్ర.) అగుట వలన నీవిధి వర్తించు ననవలె. ప్రథమేతరవిభక్తి విధి విభక్తిని బ్రస్తావించునదే కాని ద్రు.ప్ర.త్వమును గాదు. ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణముల నుకార మున్న యది (ద్రు.ప్ర.యే అయ్యున్నది కాని) కళ యైనచో నీసూత్రము వర్తింప దనుట కిం దాధారము లేదు. కావున సప్తమ్యర్థక మగుట యీసూత్రప్రవృత్తికి హేతువు గాఁ జెప్పవలె.

కాని యదియు సరి గాదు. ఈసూత్రము 'విభక్త్యలయం దున్నయుకారము నకుఁ గదా సంధిని జెప్పుచున్నది. సప్తమ్యర్థకములె యైనను అందు ఇందు ఎందు అనువీనియందలియుత్వము విభక్తిగత మయినదా? అది యట్లె యైన రామున్ + అభిరామున్ అనురీతిస్థలములందు నీవిధి ప్రవర్తింపవలసియే యుండును. ఇందు సప్తమ్యర్థక మయినట్లె రామున్ ద్వితీయార్థక మైనది. ప్రథమేతరమె కదా. పూలను- పూలు + అడిగెను.అనురీతిస్థలములందును నీవిధి వర్తించి వైకల్పిక మగుట, సంధి రానిపక్షమున పూలు యడిగె ననురీతి నపరూపములు గావలదా? కావున వజ్ఝలవారియీసమర్థన మనర్థక మగుచున్నది.'నన్నున్'అనుచో న్నువర్ణము విభక్తి కాగమ మనియుఁ దన్మూలమున నందలియుకారము విభక్తిసంబంధి యనియు నిరూపించియు నంద్వాదులలోని యుకారము విభక్తిసంబంధి యగు టెట్లో నిరూపింప రైరి. సూరి 'అందు'ను స్వతంత్రపదమును జూపలేదు. ఇం ద్వెందులనుబట్టి యట్టి యెందును గ్రహింపవలెను.

ఉదాహరణములలోఁ జూపినసామర్థ్యము ననుసరించి ప్రత్యయేతరములందలియుకారమునెడలను గొన్నియెడల నీవిధి వర్తించు ననఁదగునా? అప్పుడుఁకాదుల లోని- ఎట్టకున్, పేలకున్ అనుచోట్ల కువర్ణమునందలియుత్వమునకు నీవిధానముచే

సంధి చేయనగును గదా యనిపించును. ఇది యింకను బరిశీలింపవలె.

కాని ఉ.లో వడ్లమూడివారు వీనిని ప్రత్యేకముగ సూత్రమునఁ బ్రస్తావించిన బా గుండెడి దనిపించుచున్నది.

ఇఁక వీరిలక్షణమున విశేషము 'ద్రుతలోపపూర్వకముగాఁ బరరూపసంధిని విధించుట'

సూరి యిట్టిచోట్ల 'నన్నున్ + అడిగె' నాకున్ + అదరువు అనురీతిగా ద్రుత మును బొల్లనకారముతోనె చూపెను.దానిని మార్చి వీరు 'నన్నును + అడిగె నాకును + అదరువు అనురీతిగా నుత్వవిశిష్టముగాఁ జూపిరి. 'బాలవ్యాకరణపద్ధతిలో నువ ర్ణము ద్రుతస్వరూప మగుటచే నాకున్ + అదరువు అనురూప మె యనంభవ మగు ను. (ఇట్లే నన్నున్ + అడిగె) నాకును అనుదానికి స్వరపరకత్వమునఁ బరరూప సంధి యగునే కాని నా కాదరువు అనురూప మెట్లు కల్గును? ద్రుతస్వరలోప మె (ఉ.34) ట్లనిరి. బాల. కనుగుణముగ వీరు నిట ద్రుతము 'ను'స్వరూపముగనె పేర్కొనిరి. ఇట నట్ల చూపిరి. మూలమున ద్రుతము 'ను'వర్ణమై యుండ నిచటఁ బొల్లనకారమె చూపఁబడఁగా వీరు 'ను'వర్ణము చూపుట విశేషము.బాల.మతమును గొంత గ్రహించి కొంత విడిచిరి. నాకును + అదరువు నా కాదరువు కాదు. (సూరి యిట నగు నన లేదు.) నాకున్ + అదరువు అనుచో నా కాదరు వని యవుటలో బాధ లేదు.

ఎల్లెడల ద్రుతస్వరమునకు లోపము చేసి సూరి ప్రదర్శించియుండఁగా 'ద్రుతస్వరలోప మెట్లు' అని సందేహింప నేల? ఎట్లైన సాధించుకొనవలె.

స్వరపరకత్వమున సూరి దాదాపు నియతముగనె ద్రుతస్వరలోపముతోఁ బ్రద ర్శించెను. అది యట్లు గుర్తింపవలె. ఉభయప్రార్థనమున దుగాగమమున కత్వము చెప్పెను. (క్రియా.30) దుగాగమము చెప్పలేదు.అత్వవిధానసామర్థ్యముచే దుగాగమ ము చేసికొనలేదా? అదే విధముగా నిట ద్రుతమును స్వరలోపముతోఁ జూపుచుండ నట్లు గ్రహించుట కేమి? ఉదాహరణస్థల మయ్యు నివియు నదే లాక్షణికవచనముల గదా. కాఁగా నీయుదాహరించినస్థలము లాధారముగా "అవసానంబునందు ద్రుతస్వ రంబున కేని ద్రుతంబున కేని'(సంధి.20)అనుసూత్రమందలిబహుళపదసామర్థ్యముచే నవ్యకార్యముగా స్వరపరకతయందుఁ దఱచుగా ద్రుతస్వరము లోపించు నని యేని చెప్పుకొనుట యుక్తము. కాక యిట లక్ష్యప్రదర్శనసామర్థ్యము నే నాశ్రయింపవను.

కాక వీరివలె ద్రుతమును సస్వరముగాఁ జూపిన 'చూచుచును+ఏఁగెను' అని యుండుఁ గదా. ఇట ద్రుతము లోపించి తత్పూర్వస్వరమునకుఁ బరరూపసంధి కాఁగా చూచు చేఁగె నని యగు. లోపము లేనిచో ద్రుతమునందలియు త్త్వమునకె పరరూప సంధి యయి చూచుచు నేఁగెను. ఇట్లివి రెండును బరరూపసంధి యైనరూపములే యగుట విశేషము. చూచు చేఁగె నన్నది ప్రస్తుతసూత్రముచేతను, చూచుచు నేఁగె నన్నది పూర్వసూత్రముచేతను సంధి యైన రూపము లన్నమాట. ఈప్రక్రియయం దలియౌచిత్య మూహ కందకున్నది.

స్వరము పర మయి సంధి లేనిచోటఁ గశలపై యకారమును(చెలువయడిగె) ద్రు.ప్ర.లమొదల ద్రుతము (చెలువ నడిగె) నుండుట (కొందఱు లాక్షణికులు పేర్కొనిరి.) యనుమార్గములో ద్రుతము నిల్చియున్న రూపము సంధికార్యస్థలముగా నెన్నుట యుచితమె.

సూరిప్రక్రియలో దురుక్తి లేదు. కాన లక్షణము గ్రాహ్యము.

'వచ్చుచున్నాఁడు' మున్నగుక్రియాపదములందలిచువర్ణము శత్రర్థకప్రత్యయము గాదు. అది ద్రుతప్రకృతికమె కాదు. అచట సంధి. 'సూత్రముచొప్పున నిత్యపర రూపసంధి యగును.'(ఉ.365) అది ద్రు.ప్ర.యే కా దన నేల? శత్రర్థకప్రత్యయము గాకపోయినను ద్రు.ప్ర. యైనచోఁ బ్రస్తుతసూత్రము ప్రవర్తించు ననువపార్థము గల్గుచున్నది గదా. ఇంక వీ రిట 'ముత్తున కచ్చు పరం బగునపు' డనుసూత్రముచే సంధి యగు ననువరులవారిమత ముచితముగాఁ గానరాదు. ఇచ్చటఁ బర మైన'ఉన్న' అనునది (ఉ.361) యనుబంధముగ విహితము. ఈయనుబంధము పదము గాదు. కావున సంధి.11సూ.చే నపదాదిస్వరపరకసంధి యగు ననుటుచిత మని తోఁచు.

## యడాగమము :

'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' (2)ననుదాని నట్ల గ్రహించిరి. (ఉ.4సూ)

సూరిస్వరపరకత్వమున ద్రుతస్వరమునకు లోపము చేసియుండుటచే సంధ్య భావస్థితిలో ద్రుతము(వ్యంజనము)కంటెఁ బరం బయినస్వరంబునకు యడాగమము

రాకుండుటకై 'స్వరంబుకంబె' నని చెప్పుట సూరిలక్షణమున సార్థకము. దీనివలన నన్నున్ + అడిగె, వచ్చెన్ + ఎవఁడు ఇత్యాదులలో సంధి లేనప్పుడు స్వరము స్వరముకంబెఁ బరముగా లేదు గావున యడాగమము వారింపఁబడి నన్నున్నడిగె, (ననుయడిగె)వచ్చెన్నెవఁ (వచ్చెయెవఁ) డనురీతియపరూపములు వారింపఁబడినవి. కాఁగా ద్రు.ప్ర.లకు సంధి లేనప్పుడు యడాగమము వారించుటకు స్వరంబుకంబె ననునది సార్థకము.

పరులవా రీస్థలమునను ద్రుతమునె స్వరసహితముగా భావించిరి. ద్రుతము నువర్ణమె. 'ని' అని నిల్చినను నువర్ణమునుండియె యగుచున్నది గాన వివరమునందును ఉత్వసంధియె. కాఁగా ద్రు.ప్ర.ల ద్రుతమునకు (వచ్చెను + ఎవఁడు, హరిని + అనెను) ఉత్వసంధియె నిత్యముగా నగు నని నిర్ణయించికొనిరి. కాఁగా సంధ్యభావస్థలములం దంతట నచ్చున కచ్చు పర మగుటయె కాని హల్లునకుఁ బర మగుట యన్నది లేమి (అట వారించుటకుఁగాను) స్వరంబుకంబె ననుదళము వరులం వారిలక్షణమున నిరర్థకమె యగుచున్నది. వీరు పెక్కెడల స్పష్టతకుఁగా సూత్రములను వివరణాత్మకములుగఁ జెప్పుదురు గావున నిటఁ గూడ నట్లు చెప్పి రనవలె.

ఈ రీతిఁ 'చవుతి ఇత్యాదులలో లఘువకారము' గూర్చి చేసినప్రసంగ మనుచితము. (చూ.సం.18సూ.)

## అత్వసంధి :

అత్తునకు సంధి బహుళముగా నగు(4) ననుసూరిసూత్రమును వీ రట్ల గ్రహించిరి. (ఉ.5సూ)

వివరణమున 'భారతాదిప్రాచీనగ్రంథములలో శుద్ధసంస్కృతాకారమునకు, స్త్రీవాచకతత్సమసంబోధనాంతములఅకారమునకును సంధి లేదు. అర్వాచీనకావ్యములం దట్టిసంధులు గలవు' (ఉ.36) అనిరి. సూరివివరణవాక్యము నెత్తివ్రాయలే దన్నమాత్రమే కాని యాయభిప్రాయమె యిట వివరింపఁబడినది. శుద్ధసంస్కృతాకారమునకు సంధి లేమి యిందలియొకవిశేషముగా పరులవా రెంచియుండనగు. సంస్కృతశబ్దము యథాతథముగాఁ దెలుగున నుండుట యసంభవము. కావున సూరి దానిం బ్రత్యేకముగఁ జెప్పనవసరము లే దని యెంచియుండనగు. తుభ్యంనమః + అనె నన్నచో

తత్త్వం నమ యనె నని సంధి రాకుండుటను నూరి యుదాహరించెను. తత్సమము లంద యత్తునకు సంధి లే దన సంస్కృత మగునత్తునకు సంధి లే దని వేఱ చెప్ప నక్కఱ లే దని యెంచె నేమో. అయ్యు వఘులవారు శుద్ధసంస్కృతాకారమునకు సంధి లేమిని వివరించుట స్పష్టతర మై యుచిత మైయున్నది.

ఇట భారతాదులలోఁ దత్సమాకారమునకు సంధి లే దనియు నర్వాచీనకావ్యములందె కల దనియుఁ జెప్పినవీరు బాహా + అప్పళించి బాహాప్పళించి యనుచోఁ దిక్కనయె యాసంధిని బ్రయోగించినట్లు చెప్పుట (ఉ.116) విరుద్ధము. తిక్కన గూడ నర్వాచీనుఁడా?

మహాత్త + అణఁగి- మహాత్త యణఁగి. అదిప్రాచీనపద్ధతి. మహాత్తణఁగి (వనవ.6.246) మహాత్తు అనునది వ్యావహారికపదము. (ఉ.37) ఇట్లే వార్తని మొదలగునవి యిటఁ జూపిరి. అనఁగాఁ బాల్కురికిసోమననుండి కవుల నర్వాచీనులుగా వీరు గణించి రనవలె. అప్ప + అల-అప్పల (ఉ.హరి)(ఉ.37) నాచనసోమన ప్రాచీనుఁడు గాదు. ఈసోమనయె 'విశ్వకర్మని' అని ప్రయోగించె నని తలఁచినవీరు విశ్వకర్మకు త్రీత్వము వికల్ప మనుట (ఉ.తత్స.138) గమనార్హము. భారతకవులు మాత్రమె ప్రాచీను లని వీరియభిప్రాయమా. తిక్కన నర్వాచీనుడుగాఁ జెప్పుటవలె నిది ప్రమాదమా? భారతాదిప్రాచీనగ్రంథములలో ఆది ప్రాచీనగ్రంథకర్త లెవరో. శ్రీనాథాదులు ప్రాచీనులుగా నట నటఁ జెప్పుదురు. శివకవులప్రయోగములకును ప్రామాణ్యము గల్పించుట యుక్తము గాకపోదు.

ఇట్లే వీరు ప్రత్యేకముగా శుద్ధసంస్కృతాకారమునకు సంధి లే దని చెప్పియు 'వరదాయ నమశ్శంకర శరణనఁ జొచ్చెన్' (కుమా.3.277) శుద్ధసంస్కృతవాక్యమగుటచే శరణ అని పదచ్ఛేదము చేయక తీఱదు. (ఉ.37) నన్నెచోడుఁడు నర్వాచీనుఁడ యయ్యెను.

భారతము ప్రాచీనము. అందలియరణ్యపర్వమున మిగిలినది వ్రాసినయెఱ్ఱయ ప్రాచీనుఁ డనవలె. కాని నడుమనున్నవారు మాత్ర మర్వాచీనులు. తిక్కనయె యర్వాచీనులలోఁ జేరుట గుర్తించితిమి కదా. ఒక్కటియు లెక్క. పైఁజెప్పినసంధ్యభావము గలవి ప్రాచీనములు. సంధి చేసినవా రర్వాచీనులు.

శివకవులభాషను గూడ లక్షణబద్ధము చేయఁబూనినవారి నర్వాచీను లనుట కంటె లక్షణమును దదనుగుణముగఁ జెప్పుకొనుట యుక్తము.

సూరియాదులనేకకృతులందు స్త్రీవాచకతత్సమంబులకు సంధి గల దనఁగా వీరు సంబోధనాకారమునకును గల దని ప్రయోగము లిచ్చిరి. ఇందు జనవ.ప్రయోగ మట్లుండ 'అప్పల'అనునాచనసోమునిప్రయోగము సరి యైనలక్ష్యము గాదు. 'అల్లంత దవ్వుల నప్ప లప్ప లనంగ నెదురుగాఁ బఱతేఱ నెత్త నెత్తి' అనుచో (అప్ప+అల) (అప్ప+అల)అప్పల+అప్పల -అప్ప లప్పల అని యగు నని పేరిసమన్వయము నెన్నవలె. ఇటుఁ బ్రాచీనకావ్యములం దైన నె ట్లుండును? 'అప్ప య లప్పయల'.ఇట్టిప్రయోగము లే దనుటకంటె భాషలో నుండ దనుటయె యుక్తము.ప్రౌఢ.వలె వీరు నిట 'అల' చెప్పిరి. అమ్మలక్కలు, అన్నలా మొదలుగా నీసందర్భమున నెచ్చటను సంధిలేమియె గుర్తింపరాకున్నది. అప్పలు+అప్పలు అనువిధముగాఁ బ్రథమాబహువచనాంతముగా నీయది గుర్తింపఁదగును.

'అప్ప' యనుశబ్దముపై వాత్సల్యార్థవిశేషమున బహువచనమును, ద్విరుక్తియును రాఁగా అప్పలు+అప్పలు అని యవును. అప్పలు అప్పలు అనుతీరుగానిటఁ బిల్పుట యగుచున్నది. 'ఎదురుగాఁ బఱతేర ననుతరువాతిమాటలనుబట్టియు నిది స్పష్టము. (కాఁగా నిట మధ్యపుమరుషార్థము గమ్యమాన మవుచున్నది. అప్పలు-అప్పలు (రమ్ము) ఏకత్వముననే వాత్సల్యార్థమున బహువచనము గావున నిట నారగాగమముప్రసక్తియె లేదు. పెద్దలు మీరు రం డనుచో పెద్దలార యని యేకత్వమునఁ గాదు గదా. (ఇట నత్వమును లేమి గమనింపవలె.) అప్పలు+అప్పలు అనుచో నప్ప లప్ప లని మాత్రమె యగుచున్నది. కాఁగా నప్పయలప్పయల యని గాని 'అప్పయ లప్పయల యనంగ' నని గానుండదు. ఇట్లె తొడిఁబడ నమ్మలక్కలని (ఆము.2.159) యనుచోఁ గూడ అమ్మలు+అక్కలు (వావిళ్ళ.వ్యాఖ్య.పుట.128) (చూ.త్రి.శే.)

సూరివలెనె వీరును వివరణమున '--స్త్రీవాచకతత్సమసంబోధనాంతము యకారమునకె సంధి లేమినిజెప్పిరి.సంబోధనాద్యంతము లని యాదిశబ్దమును జేర్చిన నుచితముగా నుండెడి దనిపించు. సంబోధన మను విశేషార్థమం దయినయకారమునకెట్లు సంధి లేదో యట్ల యితరము లగునర్థములం దయిన యత్తునకును సంధి లేదు. కావుమ+అని=కావు మని యని సంధి కాదు. కావుమ యని.

లేనిద+అగు లేనిద యగు మొ॥ అవధారణార్థక మైన'అ'అనునవ్యయమునకును సంధి లేదు. ఇవియు బహుళపదముచే (వెలయాల్వాదులలోఁ జేర్చి) సం

హించుకొనఁదగినవి.

బహుళపదముచేఁ గొన్నియెడల నీకార్యము (సంధి)నిత్యముగాఁ బ్రవర్తింప వచ్చును. అట్టిసంధినిత్యస్థలములనుగూర్చి వయులవా రిట్లు వివరించిరి.

"ప్రత్యయాచ్పరకత్వమందును(అందు,అవతప్ప సీతయందు ఎనిమిదియవ) వామ్రేడితపరకత్వమందును బూజ్యార్థకశబ్దపరకత్వమందును (అన.మొ॥) అకార సంధినిత్యము.(ఉ.37) అందు అవ తప్ప ప్రత్యయాచ్పరకత్వమందు అకారమునకు సంధి నిత్య మన్నవీరు సీతయందు-అని చూపుట సముచితమే. కాని యెనిమిదియవ అనునది యుదాహరించుట పొరపాటు- ఎనిమిది+అవ- అనుచోఁ బర మయినది యవయే గాని సంధిరాని దికారమునకు. అకారమునకుఁ గాదు. 'అకారసంధిసందర్భ మున నికారమును జూపు టెట్లు? సంఖ్యావాచకము లదంతము లసాధారణము. లక్షయవ' అనురీతి నొకటి చూపఁదగియున్నది. ఇంక నీవివరణమే కొంత యనుచిత ము. 'ప్రత్యయాచ్- అర్థ+ఇంచు అర్థించు (ఇది శుద్ధసంస్కృతసంధియు) మూర +ఎడు- మూరెఁడు- (చూ.సంధి.12.వసూ)' (ఉ.37)ఇటఁ బ్రత్యయాచ్పంధియనుచు అర్థించు అనుదాని నుదాహరించుట పొరపాటు. ఇందు ఇంచు అనునది యాగమమే కాని ప్రత్యయము కాదు. వీరును నీయించును గి త్తైనయాగమముగానే(ఉ.క్రియా.2) చెప్పుట గమనింపవలె. ఆగమము ప్రత్యయ మె ట్లవును? కాన నిది ప్రత్యయాత్ప రకసంధిగా నుదాహరించుట యుచితము గానేరదు.

సంధి.12.వసూత్రము చూడు మవిరి గదా.అంద్వవగాపంబులు దప్ప నపదాది స్వరంబు పరం బగునపు డనూనాసూత్రము చూడఁగా నీరీతిప్రత్యయాద్యపదాదిస్వర పరకసంధి యాసూత్రముచేత నవుచున్నట్లు స్పష్ట మవుచున్నది. మఱి యిట వేల యుదాహరించిరి?

బహుళ పదముచేఁ గొన్నియెడల నిత్యప్రవృత్తి గలయందుల కిది యిట నుదాహరింపఁబడిన దనఁగా మూర+ఎఁడు మూరెఁడు అనురీతిగా నీసూత్రమువల ననే యని భ్రమయింపవలయు. వీ రిటఁ జూపిన సిద్ధన- ఇత్యాదుల కిదియే తప్ప వింకొకయాధారము లేదు గదా. అర్థించు మూరెఁడు అనువానిని వీ రాసూత్రముకడఁ గూడ నుదాహరించిరి (ఉ.42) మఱి వా రి కీసూత్రమునందలిబహుళశబ్దముచే సంధి

చేయవలయునా లేక యాలక్షణము ననుసరింపవలయునా? విశేష మగునవదాదిస్వరపరకత్వమునఁ జెప్పినయాలక్షణమె ప్రవర్తించును. కావున వీని నిట నుదాహరింపఁ తగదు.

కావున బహుళపదమునకుఁ బ్రవృత్తి నిరూపింపవలసిన తావులలోఁ బ్రత్యయాచ్పరకసంధిని జూపుట పొరపాటే.

అదేవిధముగా నామ్రేడితపరకతయందు బొర+బొర- బొరబొర (సంధి11సూ) అనురీతిగా నామ్రేడితసంధి నుదాహరించుటయుఁ బొరపాటె యగుట స్పష్టమే. వీరు వీనిని గూడ నీరెండుస్థలములయందు నుదాహరించిరి. ఆసూత్రమునకు లక్ష్యము లవి యిటనే స్పష్టము చేయుచుఁ గూడ బహుళపదమువలనివిత్యస్థలములలో నుదాహరించుట యెట్లు? అట్లయిన నీరూపము లీసూత్రమునకును లక్ష్యములు గాక తప్పదు. ఆచోట నాలక్షణము ప్రవర్తింపఁగా నిట బహుళపదముచే సంగ్రహింపవలసినయవసర మే మున్నది?

ఇంక మిగిలినది పూజ్యార్థక మగునన్నాదిపరకసంధి. సిద్ధ+అన=సిద్ధన మల్ల+అన-మల్లన అన్న+అమ.అన్నమ.(ఇవి శుద్ధసంస్కృతాకారసంధులను) (ఉ.38) ఇవియు నర్వాచీనములే యవునా? శుద్ధసంస్కృతాకారమునకు సంధి ప్రాచీనకావ్యములందు లే దని గదా వీరు చెప్పిరి. అయినను నిది శుద్ధసంస్కృతాకారసంధి యనుట యథర్వణసమ్మతము గాదు. సిద్ధుఁడు+అన- అని యుండఁగా 'లోపస్స్వర్ణ్యాదివర్ణానా' మ్మనుకారికచే డుజ్జు లోపించి సిద్ధు+అన, అని కాఁగా నత్వము కావలె నన్న క్వచిత్వం క్వచిచ్ఛాత్వ మ్మనుకారికచే నయి సిద్ధ+అన- అని యవును. కావున నీయత్వము తెలుఁగువ్యాకరణసిద్ధ మగునకారము గావున శుద్ధసంస్కృత మనుట సరి గాదు. కాని వరుంలవారు సంస్కృతవిభక్తులకే లోపము చేసి ప్రాతిపదికమును నిల్పుటచే శుద్ధసంస్కృతకారసంధి యని పేర్కొనిరి. సూరి యీసూత్రమందలిబహుళపదముచే నీరీతిసంధి యగు నని భావింపలే దనఁదగు.

నిజమున కయ్యాదిశ్రేష్ఠతావాచకములు పరము లవునపుడు సంధి యకారమునకే కాక యితరాచ్చులకును సామాన్యముగా నవుచున్నది. లక్ష్మి+అమ్మ- లక్ష్మమ్మ వదినె+అమ్మ- వదినమ్మ. ఆది+అమ్మ- ఆదమ్మ- ఈసూత్రమందలిబహుళపదము నాశ్రయించిన నత్తునకు మాత్రమె సాధ్య మగును. రామయ్య- అనురీతిని

సాధించినను లక్ష్మమ్మ- ఇత్యాదులసాధనకుఁ బ్రత్యేకవిధానము తప్పదు గదా.

అర్థ + ఇంచు మూర + ఎఁడు- అనుచో నీసూత్రమందలిబహుళపదముచే నిత్యసంధి చేయఁదగదా. అపదాదిస్వరసంధి యేల చెప్పెను- అనఁగా నితరస్వరము లకును గల్గుటనుబట్టియే గదా. అట్లే యార్యాద్యర్థకపరకత్వమందను నన్నియచ్చు లకును నపదాదిస్వరపరకత్వమునవలె సంధి (నిత్యముగనే)యవుటచేఁ బ్రత్యేకముగా విధించికొనుటయే యుక్తముగా నెన్నఁదగు. వి.వి. 'సంధిర్నిత్యం ప్రత్యయాచ స్త్ర థార్యాదిగతస్య చ'- అని చెప్పియుండుటను గమనింపఁదగును.

కావున నీబహుళపదముచే నత్వమున కిరీతిసంధి సాధింపఁబూనుట సూరి మతము గా దనవచ్చు. వర్ణులవా రట్లు చేసినను నితరస్వరములయెడఁ బ్రవర్తింపమి వానికిఁ బ్రత్యేకవిధాన మెట్లును నవసర మవుటంజేసి యట నీయత్వమునకు నీసంధి సాధింపఁదగునే కదా.

కావున దీనిని బహుళపదప్రయోజనముగాఁ జెప్పుటకంటె 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకములు పరంబు లగునపు డన్నియచ్చులకు సంధి నిత్యముగాఁ జెప్పిన ప్రౌఢలక్షణము నిటఁ జేర్పఁగానఁదగు. రామయ్య ఇత్యాదులతో పాటు లక్ష్మ మ్మ-ఇత్యాదులను సిద్ధించు.

కావున నీసంధి ప్రస్తుతసూత్రమందలిబహుళపదప్రయోజనము గాదు.

ఆర్యాద్యర్థకములు పర మైనపుడు ప్రౌఢ. సంధి నిత్య మనియెఁ గాన నటఁ గూడ సంధ్యభావము గలదు. అమ్మాజియమ్మ (పాం.1.67) (అమ్మాజమ్మ-పాం.1. 68) కందాళప్పగారిన్ అనుచో నీగ్రంథముననే (1-78) యత్తునకు సంధి కాఁగా 'కందాళయప్పగారు' అనుచో నిందే (1-77) సంధ్యభావమును గలదు. కావున నార్యా ద్యర్థకపరకతలో సంధి ప్రాయిక మనఁదగు ననిపించు.

వచ్చుచున్న + వాఁడు అనుచోఁ దచ్ఛబ్దనకారము లోపించినపుడు 'బాహుళ కముచే నిట సంధి నిత్య' మని (క్రియా.117) సూరి వివరించెను. అది యిట సంధి నిత్యస్థలముగాఁ జూపఁదగినదే. కాని వర్ణులవా రదానిని ప్రస్తావింపలేదు. స్థలాం తరముతఁ జూపియు నటఁ గూడ నావివరణము చేయలేదు. సం.లోఁ జేసిరి.

కాని సూరివివరణమె పరిశీలనార్హము. ఉన్నకలనపర్ణకాంతములు కృదంత ప్రాతిపదికములు. వీనిపై విభక్తి విశక్తిలోఁ జేరిన దాతచ్ఛబ్దము. అయ్యాది పద మనుట

కవకాశము లేదు. అపదము కాఁగా సంధి.11.సూత్రముచే నపదాదిస్వరపరకత్వం
దలిసంధిగా గుర్తింపఁదగియుండఁగా నీకోటిబహుళపదముచే నిత్యసంధి యనుట
యుక్తమా యని సందేహము.

ఇట నథర్వణునిలక్షణమును గూర్చినసూరివివరణము పొరపాటని వజ్ఝల
వా రిట్లు వివరించిరి.

"కుత్రచిత్సంస్కృతీయోఽపీత్యాద్యథర్వణసూత్రమునకుఁ దత్సమశబ్దసామా
న్యము యొక్క అకారమునకు సంధి యగు నని యర్థము చేసికొని వ్రాయుట సరి
కాదు.అయ్య-ప్రభృతిశబ్దాదిస్వరపరకత్వమున సంస్కృతీయమున కనఁగాసంస్కృత
శబ్దగతాకారమునకు సంధి కల దని మాత్రమె యథర్వణునికారికకుఁ దాత్పర్య
(వ్యా.సం.స.225) మనిరి. వి.వి.కారికకు వజ్ఝలవారు చేసినయర్థ మసంగత మని
గ్రంథాంతరమున స్పష్ట మగును. సూరి వజ్ఝలవారివలె నర్థము చేయకుండు టుచి
తమె. అహో. చేసినయర్థమె యుక్తము. దానిని సూరి గ్రహించుటలోఁ బొరపాటు
లేదు. అహో. 'రంగత్తరంగ' అనురీతిసంధియె కారికకుఁ బ్రయోజన మనుటను
తిరస్కరించినవజ్ఝలవారును బాహ + అప్పళించి= బాహప్పళించి యనుచోఁ (వ్యా.
సం.స.561) దిక్కనప్రయోగమున నట్టిసంధిని బ్రయోజనముగాఁ బేర్కొనియున్నా
రు. 'రంగత్తరంగ అనురీతిప్రయోగములు ప్రాచీనములు లేవనుకారణముచేతనెసిద్ధన
అనురీతిసంధియె దీనికిఁ బ్రయోజన మని చెప్పువజ్ఝలవా రట్టిప్రయోగమునుదిక్కన
భారతముననే చూపుటఁ దమవ్యాఖ్యలోనిపొరపాటు కొంత తామే సూచించిరి. సిద్ధ
యన ఇత్యాదు లున్నవా? ఇట్టిసంధిని గ్రుతచిదిత్యాదిగా మిక్కిలియరుదుగా వి.వి.
చెప్ప నేల?ఇతరము లగు నాధారములనుబట్టియు నీకారికకు వజ్ఝలవారు చెప్పు
నర్థము సరి గాదు అహో. కనుగుణముగా సూరి గ్రహించి వివరించినతీరు సము
చితమె.

## ఏమ్యాదులు :

'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు' (5) ననుదానిని 'ఏమ్యా
దులయిత్తునకు సంధి బహుళము' అని (ఉ.6సూ) సవరించిరి. బహుళ మనుటవలని
ప్రయోజనమును వీరు వివరింపలేదు.

బావార్థకమిజ్యంతములు ధాతుజవిశేషణము లగునెడిప్రత్యయాంతములు మొద

లగుచోట్ల సంధ్యభావమును జేర్కొనిరి.(ఉ.38) ఇందుకై బహుళ మవిరా? ఇతరము లగునిత్యాన్యకార్యములను వీ రిటఁ జూపలేదు. "ఈనాల్గిటిలో నే వైనయథాసంభవముగా వర్తిల్లును (ఉ.38) గావున నప్రవృత్తి విభాష యనురెండింటికయియే వీరు బహుళపదమును జేర్చి రేమో.

సూరి బహుళ మనలేదు. ఈసంధ్యభావ మసాధ్యమా? అత్తునకువలె వీట నిత్తునకు సంధిని సామాన్యముగాఁ జెప్పలేదే. ఎల్లెడల వర్తిల్లుటకు? వీరిలక్షణమందు నయిత మిత్తునకు సంధి బహుళ మనురీతిని సాధారణముగఁ జెప్పఁబడలేదు. 'ఏమ్యాదులకు' సంధి రావలె. ఇట్టిసంధ్యభావస్థలము లేమ్యాదులలోఁ జేర్చినపుడే యాసూత్రముచే సంధి ప్రాప్తించును. ఇట సంధి లే దని గుర్తించియు వీని నేమ్యాదులలోఁ జేర్ప నేల? అకృతిగణ మన్న నెల్లవియుఁ జేరునా? అట్టిచో నేమ్యాదు లవ నేల. 'ఇత్తున' కనురీతిగ సాధారణముగనె విధింపవచ్చునే. వీ రింకను స్పష్టముగా 'అట్లు పఠించుటకు వీలు కాని, ప్రయోగములనుబట్టి తెలిసికొనఁదగినది యాకృతిగణ' (ఉ.38) మని పేర్కొనిరి. ప్రయోగములం దెచ్చటియికారమునకు సంధి గలదో యాశబ్ద మేమ్యాదిగణమునఁ జేర్చుకొనవలయు ననుట స్పష్టము. అట్టిమొద మిజ్యంతములు మొద లగుసంధి లేనిస్థలముల నేమ్యాదులలోఁ జేర్చుటయె తగదు. అట్లవి యేమ్యాదులలోఁ జేరనపుడు వానికి సంధి ప్రాప్తియే లేదు గావున దానిని వారించుటకై బహుళ మని చెప్పవలయు ననరాదు. వనము మొద లగువానిని జరిత్రాదులలోఁ జేర్చి బహుళపదముచే నట ములోపము లే దని చెప్పుట యుచిత మగునా?

కాఁగా నప్రవృత్తికై యిట్టిస్థలముల 'బహుళ'పద మనవసరము.

కౌరిచ్చు-అర్చిడఁగ రాదు, మొద లగుచోట్లఁ దత్పమేకారమునకు భారతాది ప్రబంధములలో లేక యాధునికకృతులందు మాత్రము వైకల్పికముగా సంధి గానవచ్చును. దానిని సాధించుటకయి బహుళపద మవసరమా? స్త్రీవాచకతత్సమాకారములకు సంధి లే దని చెప్పియు నాధునికప్రయోగములం దుంటను సూరి పేర్కొన్నట్లుగా విటఁ బేర్కొనుట దోషము గాదు గదా!

షష్ఠీసమాసేకారమునకును భారతాదిప్రబంధములలో సంధి లే దనియు నర్వాచీనకవులు ప్రయోగించుచున్నా రనియుఁ జెప్పి మగనాలు (కాశీ.) దీనంప్రములు (నైష)

(ఉ.39) కూడఁ జూపిరి.శ్రీనాథుఁడు సైత మర్వాచీనుఁడే.శ్రీనాథుఁడే యేమి?తిక్కనయె యర్వాచీనుఁ డయ్యె నిక్కడనే. "తత్సమేకారసంధులు క్త్వార్థకేకారసంధులు-సమాపేకారసంధులును భారతాదిప్రబంధములలో లేవు.అర్వాచీనకవులు ప్రయోగించుచున్నారు" (ఉ.39) అని పేర్కొని ('వెలచి+ఇట్లు- వెలచిట్లు' అనుతిక్కనప్రయోగము చూపిరి.ఇది భారతమందలిది కాదు గాని తిక్కన భారతముకంటెఁ బూర్వమునదే. ఏమయిన క్త్వార్థకేకారసంధిని బ్రయోగించినతిక్కన యర్వాచీనుఁ డయ్యెఁ గదా. ప్రాచీను లన నన్నయ యొక్కఁడ యేమో. పూజ్యతయందు బహువచనము.

క్త్వార్థకేకారసంధినిగూర్చి పైని జూతము.

మొత్తముపై వీరిసూత్రమందలిబహుళపదము నిరర్థకము. సూరి వైకల్పిక మనుట ఏదుష్టము.

ప్రాయస్తు స్యాత్క్వామాదికస్యేతః అనుసూత్రమునందలిప్రాయశ్శబ్దమున కహో.బహుళార్థమునే చెప్పెను (కవిశి.285)అయ్యు సూరి యది యనవసర మనియే వైకల్పిక మనె. కవిశి.ప్రభావముచే వయ్యలవారు సవరింపఁబూని రేమో కాని వైకల్పిక మనుసూరిలక్షణమ యుచితము.

ఇతరస్థలముల సంధి వైకల్పిక మగుట వీరు వివరించిరి.'పూజ్యార్థకపరకత్వమంతను ఇకారసంధ్యభావము గలదు' అమ్మాజియమ్మ' (ఉ.39) ఇట్లనుటచే విది వైకల్పికసంధిస్థలముల నుదాహరింపఁదగిన దని వీరు తలఁచి రన్నమాట. వాఙ్మయము మొత్తమున నొకటో రెండో మిక్కిలియరు దయియున్నయిట్టిరూపములకై యిట సంధి వైకల్పిక మనరాదు.లక్ష్మియమ్మ యనురీతి నుండునా? అరుదుగా సంధి లేనిస్థలమునకుఁ దఱుచుగా సంధి యగులక్షణముతో సమప్రాధాన్య మిచ్చుట లక్ష్యానుగుణము కానేరదు గదా. సంధ్యభావము గల దనుటలో సంధి ప్రాయిక మనియే వయ్యలవారును దలఁచినట్లు స్పష్టముగాఁ బేర్కొనక వైకల్పికస్థలములలోఁ గలుపనేల? అరు దగునీసంధ్యభావ మిత్త్వమునెడలన కాదు.అత్వమునెడలను గల్గుట వింతకు ముందు గుర్తించితిమి.

ఇంకను నార్యాద్యర్థకపరకసంధి యత్త్వసంధిస్థలమున వేఱుగాను,ఇత్త్వసంధిస్థలమున వేఱుగాను జెప్పుకొనుట యనవసరము. వదినె+అమ్మ వది నమ్మ మున్న

గువానినిబట్టి యామ్రేడితవదకసంధివలె దీనిని వేఱుగా సూత్రించుటయ యుచిత మని గుర్తించితిమి.

సం.లో 'ఏమ్యాదులయిత్తున కని చెప్పుటచేత వ్యతిరేకార్థకవిశేషణేతరాసమాపకక్రియలయినకాదము, తత్సమేకారము, షష్ఠీసమాసమున నున్నగువానికి సంధికానేరదనియుఁ దక్కిన మహాకవిప్రయోగసమ్మతము లగునికారములకుఁ బాక్షికసంధివర్తిల్లుననియుఁ దాత్పర్యము.' (వ్యా.సం.స.229) అనిరి. మొదటఁ జెప్పఁబడ్డవి మహాకవిప్రయోగసమ్మతములు గానివి యని గ్రహింపఁదగును. తరువాతివాక్యమునుబట్టి మహాకవిప్రయోగసమ్మతము లైనను నట నంధి రానేర దని తలఁపరాదు. అర్చి+ఇడఁగ=అర్చిడఁగ (వసు.3.181) మగనాలు (కాశీ.2.83) (ఉ.39) మున్నగునవి మహాకవిప్రయుక్తములుగా వనూద్దేశ్యముతో వీరు వానికి సంధి లేదని నిశ్చయించి రేమో. బసవపురాణాదులను బ్రమాణీకరించి వీని నుపేక్షింప నేల? అర్వాచీనకవిప్రయుక్తములుగనైన గుర్తింపు గల్గుట యుచితమె.

'వ్యతిరేకార్థకవిశేషణేతరాసమాపకక్రియ' లన నేమి? చేసెడి (యతఁడు) అనునవి యట్టివా? వ్యతిరేకార్థకవిశేషణము (చేయనట్టి) మున్నగునీధాతుజవిశేషణములు నసమాపక్రియ లనుట యొప్పునా? ప్రౌఢ.అసమాపకక్రియలను వివరించినది. (వాక్య.3) అందు ధాతుజవిశేషణములు గానరావు. కాక వరుసవారు వ్యతిరేకార్థకవిశేషణేతరములును, అసమాపకక్రియలును అనునర్థము నుద్దేశించి రేమో. స్పష్టముగఁ దోఁపదు.

ధా.వి.లలో వి త్తుండుట వ్యతిరేకార్థకములను విడచిన ఎడివర్ణకాంత మగు తద్ధర్మార్థకవిశేషణస్థలమున మాత్రమె. అట సంధి లేదు. కావున ఎడిప్రత్యయాంత విశేషణము లేమ్యాదులలో లే వని స్పష్టముగనె చెప్పనగు.(ధాతుజవిశేషణము లగు ఎడిప్రత్యయాంతములు. (ఉ.39)

అసమాపకక్రియలను "క్త్వాతద్వ్యతిరేక, శతృతుమాపంత్యర్థ్యచేదాద్యర్థకములు'గాఁ బ్రౌఢవ్యాకర్త పేర్కొనెను. ఇందు వ్యతిరేకక్త్వార్థమునం ది త్తుండదు. వండక, మొ॥ అం దత్తునకు వైకల్పికసంధి యవుట పూర్వసూత్రముచే సిద్ధము. (వ్యా.సం.స.221) శత్రర్థకమువర్ణమునం దున్నది యుత్త్వము.(అట వైకల్పికసంధి సంధి.2సూ.చే సిద్ధము.) తుమర్థమునందు ధాతువునుత్వమున కత్వ మగుటచే నందు నిత్త్వ ముండదు. వండన్ (వండను) మొ॥ అనంతర్యార్థకడువర్ణమునం దున్నది

యుత్త్వము. చేదాద్యర్థమునందును నపర్యకమున నిత్త్వము లేదు. వండినన్. తుమావంతర్యచేదాద్యర్థకములు ద్రు.ప్ర. లవుటచే నీకాదిసూత్రము(సంధి.8)చే సంధి లేదు. ఇంక నసమాపకక్రియలలో మిగిలియున్నది 'క్త్వార్థం' బొందు. 'క్త్వార్థంబైనయిత్తునకు సంధి లే' దని యటఁ గూడఁ బ్రత్యేకముగా సంధి నిషిద్ధ మైనది. కాఁగా నసమాపకక్రియల కింకఁ బ్రస్తావింపవలసినయవసరము లేదు.

ఇట్లు వయులవారు సం.లో ననవసరముగాఁ జేసికొన్న వివరణమునుబట్టి 'బహుళ'విధి యవసర మని తలఁచి యిట బహుళ మని సూత్రించి రేమో. అనవసరము.

సూరి యేమ్యాదులలో 'కిషష్ఠి'ని జేర్కొనెను. వీరు దానిని దిరస్కరించుచు అనుషష్ఠియె కిని అని తత్స.26.సూ.చెప్పిన మాటను గాన హరికిని+ఇచ్చె-హరి కిచ్చె హరికి నిచ్చె అనురీతిని సంధి.3వసూత్రముచేతనె సిద్ధించును గాన దానిని ఏమ్యాదులలోఁ జేర్పరా' (ఉ.39) దనిరి. ఇట్టిసమన్వయము సరి కా దనియు నట్టి యెడలఁ గ్రియాపదేకారసంధిలోఁ దడఁబాటు గల్గుచున్న దనియు నితఃపూర్వము స్పష్టము.

వీరికి నీయభిప్రాయ మిదివఱలో లేదు. ఈసిద్ధాంతమే చిం.లోను సమన్వయింపఁదగియున్నది గదా. కాని యిట 'తద్వత్తదాదిజస్య 'ఏది- ఏవి- కిషష్ఠి-మొదలగునవి తదాదులు. (వ్యా.సం.స.227) అని తదాదులలో నేల చేర్చిరి? అంతే గాదావిషయము తరువాత మఱచిన ట్లున్నారు. "ద్రుతము పరమందుఁ గల'ఇ'కారాంతములకు కిషష్ఠిభిన్నములకు కిమాదులలో పాఠము నుజ్జగించుటచే (వ్యా.సం.స.247) అనఁగా కిషష్ఠిని కిమాదులలోఁ గూడఁ జెర్చి రన్నమాట. తదాదులకు వికల్ప మనియుఁ గిమాదులకుఁ బ్రాయిక మనియు నీరెంటికి భేదముగలిమిచేతనే (నన్నయప్రయోగములందు) చిం.రెండుసూత్రములుగాఁ జెప్పిన దనియు (రెండుసూత్రములుగాఁ జెప్పుట స్పష్టతకే యన్న) అహోబలునుక్తిని (కవిశి.282) దిరస్కరించినవీరు కిషష్ఠినిదదాదులలోను గిమాదులలోను బఠించిరి. ఒకచోటఁ జెప్పుటయే యనవసర మని ప్రస్తుత మభిప్రాయపడుచున్నారు. (వ్యా.సం.స.237)

సూరి యిట్టియభిప్రాయ మందక కిషష్ఠి నేమ్యాదులలోఁ జేర్చుటయు (తదాదులఁ గిమాదులలోఁ గలుపుటయు) నుచితము. వయులవారు చేసినసమన్వయము

ప్రకారము వారిమతమందే క్రియాపదేకారసంధిలో తడఁబాటు గల్గిన దని గుర్తింపవలెను.

కాఁగా నిట సూరిలక్షణవివరణము లెంతయు నసమంజసము లైయున్న వని గుర్తింపఁదగును.

## క్రియాపదములు :

'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' (6) ననుసూరిలక్షణమును వీరు 'సమాపకక్రియల యం దిత్తునకు సంధి వైకల్పికము' (ఉ.7సూ.)అని చూపిరి. సూరిసూత్రమును వ్యాఖ్యానించుచో సం.లో "క్రియాపదంబులం దిత్తునకనఁగా సమాపకక్రియాపదములందలిహ్రస్వేకారమున కని యర్థము (వ్యా.సం.స. 236) అని చెప్పిరి.తమవ్యాఖ్యయందలివిషయము నిట వీరు సూత్రమునఁ జేర్చిరన్నమాట. వీ రిట్లు కొన్నిమార్పులు వివరణాత్మకముగాఁ జేయుచుందురు.సమాపకక్రియేతరములకుఁ గ్రియాపదము అని వ్యవహార మున్నదా? 'సమాపకక్రియ' లన్నదే మాత్రము. కాఁగాఁ గ్రియాపదము లన పరుులవారిమాటలలోనే సమాపకక్రియలు గావున సూరిలక్షణము సూక్తము.

పరుులవారిమతము (ఉ.34) ననుసరించిన నిచ్చటి'రివి(ని)మి'యనువవిరుపు (ను)ము అనుక్రియావిభక్తులనుండియే (యుష్మత్త్వమున కిత్వ మగుటచే) ఏర్పడినవి కావున వీనియం దిత్తునకు 'ఉత్తున కచ్చు పరంబగునపు' డను మొదటిసూత్రముచేతనె సంధి వచ్చును. అయిన నాసంధి నిత్యము గావున వికల్పత్వమునకై యిట్లు చెప్పఁబడిన దనవచ్చు. (పరుులవా రిట్లు వివరించుకొనవలసినది.) సూరిమతమున నీవిధి యప్రాప్తవిభాష. పరుులవారిమతమునఁ బ్రాప్తవిభాష యగు నది భేదము.

## మధ్యమపురుష :

'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును.' (7) అనుసూరిలక్షణమును వీరు 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి నిత్యము' (ఉ.8) అని చూపిరి. నిత్య మనుటంగూర్చి సంధి మొదటిసూత్రమున గమనించితిమి. కాఁగా

'అగును' అనుసూరిలక్షణమున 'నిత్యము' అనియె యర్థము గాన సూరిలక్షణము దురుక్తము గాదు.

వఝలవారిప్రకాశికలో నీసూత్రము ప్రారంభము విచార్యము. పూర్వసూత్రముచేత సంధి వికల్పముగాఁ బ్రాప్తించుచుండఁగా నిది నిత్య మని చెప్పవలసివచ్చినది. కాని క్రియాపదములందలి రివి(వి)మి- అనునవి రుము(ను)వు అనువానినుండి యేర్పడిన వగుటచే వీరిప్రకాశికనుబట్టి సంధి.1.సూత్రముచే నిత్యసంధి యగును. నిత్యసంధి యగుచుండఁగా వికల్ప మని వికల్పము గావలసియుండఁగా మరల నిత్య మనుట యేమి? వికల్పత్వము ననుసరించి నిత్యసంధిని బాధించి వైకల్పికసంధి రావలసినది ప్రథమోత్తమపురుషక్రియలయందే. కావునఁ బై సూత్రమున నవ్వానికి మాత్రమె వికల్పసంధి విధింపవలెను. అప్పు డీసూత్రము చెప్ప నవసరమే లేదు. మధ్యమపురుషక్రియలలో నిత్యసంధి యవు చుండఁగా సంధి.1.సూత్రముచే నగు నిత్యసంధిని బాధించి వైకల్పికసంధిని జెప్పుట పూర్వ సూత్రమున దోషము గదా?

ఉత్వస్థానిక మైనయీయిత్వమున కుత్వసంధియే యవు నని తాము లోఁగడ నిర్ణయించినసంగతిని వీ రిట మఱచియుందురు. కానిచో నిఁకాదిసూత్రమువలె వీనిని మార్చి చెప్పెడివారే కదా. పైఁగా మొదటిసూత్రముచే సంధి నిత్యముగాఁ బ్రాప్తించుచుండఁగా నీ(ఉ.7) సూత్రముచే వైకల్పిక మయిన దనియు వీరు స్పష్టము చేయరైరి కదా. ను,రు అనువానినుండి యేర్పడిన- వి కి అనువానికుత్వసంధులు వర్తించినపుడు (ఉ.34) రువు(ను)ములనుండియే యేర్పడినరివి(వి) మిల కుత్వసంధి యేల రాదు?

వఝలవారియీమార్గములో నిం కొకయిబ్బందియును గలదు. మధ్యమపురుషక్రియల కీసూత్రముచే సంధి నిత్యము. కాఁగాఁ బ్రథమోత్తమపురుషక్రియలలో నేకబహువచనములు రెండింట నిత్యమునకుఁ బూర్వసూత్రముచే సంధి వికల్పముగా రావలెఁ గదా. కానీ వీరు ప్రథమోత్తమపురుషబహువచనాంతములనె యుదాహరించిరి గాని యేకవచనాంతములు చూపలేదు. సూరియుఁ జూపలేదు. కాని యది సూరి పద్ధతి కనుగుణము. సూరి స్వరపరకత్వమున ద్రుతస్వరమునకు లోపము చేసెను గావునను, ఇఁకాదులకుఁ దప్ప ద్రు.ప్ర.లకు సంధి నిషేధించెను గావునను, విలఁ ప్రథమోత్తమైకవచనాంతము లిదంతములు ద్రు.ప్ర.లే యవును గావునను, చెప్పఁ

లోపసంధినిషేధమునుబట్టి వానిని సూరి యిటఁ జూపకుండుట యుచితము. కాని సూరి ననుసరించి వీ రుదాహరింప మానుటకు వీలు లేదు.

స్వరపరకత్వమునను ద్రుతమును స్వరసహితముగనె వీరిమతమునఁ జూపవలయును. (ఉ.34) హారివి + అనియె అన్నట్లుగా నిటఁ గూడ వచ్చెదిని + అతఁడు, వచ్చితిని + అంటివి అనురీతిగా ద్రుతమున సత్వ ముండును. ఇత్వ ముండుటంబట్టియు, సమాపకక్రియలే యవుటంబట్టియు ద్రు.ప్ర. లైన నివి యీ(7)సూత్రమునను లక్ష్యములు గాక తప్పదు.

ఇఁకాదిసూత్రమున వీరు "ఇఁకాదులకు ద్రుతలోపపూర్వకపరరూపసంధి చెప్పిరి. (ఉ.10సూ.) ఇవి యిఁకాదులలోనివి గావు. కావున ద్రుతలోపపూర్వకపరరూపసంధి రాదు. అనఁగా ద్రుతమునకుఁ బూర్వమునం దున్నయిత్వమునకు సంధి రాదు. మఱి ద్రుతమునం దున్నయిత్వమునకు సంధి యవుటలో నాసూత్రము విరోధింపదు గదా. మఱి వీ రేల యిటఁ జూపరు. సూరిమార్గమును విడచినవీరికి సూరిపద్ధతి ననుసరించునవకాశ మేది?

వచ్చెదిని + అతఁడు, వచ్చితివి + అంటివి అని యుండఁగా సంధి నిత్యముగా రావలసియుండఁగా సమాపకక్రియలం దను(7)సూత్రముచే వైకల్పికముగా నగును. కావున సంధి యైనచో వచ్చెడి నతఁడు, వచ్చితి వంటివి అని యవును. వికల్పము గదా. సంధి రానిచో నే మవును? సంధి లేనిచోట స్వరంబుకంటె (ఈద్రుతస్వరము లోపింపదు గదా) పర మయినస్వరమునకు యడాగమము రావలె. అపుడు వచ్చితివి యంటివి, వచ్చెదిని యతఁడు అని కావలయును. ఇట్టిరూపము లుండునా? వీరు సాధించినయీరూపములు సాక్షికముగాఁ గవిప్రయుక్తములు గావచ్చును. కాని యెవరుఁ బ్రయోగించినజాడ లేదు.

వీరు తరువాతిసూత్రమునొద్ద 'కొలిచి తద్దిజను, కొలిచితి నద్దిజను (ఉ.41) అనియే చూపిరి. 'కొలిచితిని యద్దిజను అని విశేషముగా సాధించికొన్నరూపము నుదాహరింపరైరి. యడాగమము వారింపఁబడుమార్గ మేది?

కొలిచితిని ఇట్టివానికి స్వరము పర మగునపు డిచట ఇకార ముకారస్థానికము గాన నుకారమునకువలెనె నిత్యసంధి యగును. (వ్యా.సం.స.237) ఉత్త్వసంధి రావలసియ యున్నది. కాని 7సూత్రము వానిని బాధించి వైకల్పికము చేసినది. ఇంత

నుత్వసంధి ప్రాప్తించు టెట్లు? కొలిచితిమి + అప్పు డనుచో మివర్ణమునందలి యిత్వము నుత్వస్థానికమె. అట నుత్వసంధి (నిత్యముగా) నగుచున్నదా?

కాఁగా నుత్తున కను (1) సూత్రముచే సమాపక క్రియాపదము లాటింట నిత్య సంధి రావలసియుండఁగాఁ బ్రథమోత్తమపురుషబహువచనములు రెండింట మాత్రమే సంధి వికల్ప మవుచుండ సమాపకక్రియలం దని సాధారణముగ వైకల్పికసంధి చెప్పుట యసంగతము. అట్లయినఁ బ్రథమోత్తమైకవచనములందును, సంధి నిత్యమైయుండఁగా మధ్యమపురుషయందు మాత్రమె నిత్యమని చెప్పుటయు నసంగతము గదా. 'కొలిచితివి యబ్ధిజను' గాక తప్పదు.

కాని యిత్వ ముత్వస్థానికము గావున నుత్వసంధి యగు ననురీతినమన్వయమె సరి కాదు. దానిని విడిచిపుచ్చిన సూరిమార్గానుగుణము లగునీవిధు లుచితము లగును.

వీ రింతకు ముం దేమ్యాదిసూత్రమునొద్ద సంధి రానిస్థలములను జెప్పుచు భావార్థకమిజ్యంతము లిత్యాదిగా (ధాతునిష్పన్నము లైన) కృదంతములను బేర్కొనిరి. సంధి రానిస్థలములఁ బేర్కొనుటకంటెనీ ప్రథమోత్తమపురుషబహువచనాంత క్రియల వైకల్పికసంధిస్థలములలోఁ బేర్కొనియున్న సమాపకక్రియలసంధిని జెప్పనీ రెండుసూత్రములను జెప్పకయె సరిపోయెడిది. అంతేగాక పైరీతియనర్థములును లేకుండుట ముఖ్యప్రయోజన మయ్యెడిది.

కిషష్ఠి నేమ్యాదులలోఁ జేర్చినసూరిమతమున నుత్వస్థానిక మగుని త్త్వమున కుత్త్వసంధి యగు ననువరులవారిసిద్ధాంతము లేమి స్పష్టము. మధ్యమపురుషక్రియల యిత్తునకు సంధి వికల్పము గాదు గావున నాసంధి నెట్లును సూరి ప్రత్యేకముగాఁ జెప్పవలసినదే. క్రియాపదముల మిగిలినవాని నేమ్యాదులలోఁ జేర్చుటకంటె నాసంధిని వేఱుగా సూత్రించుట యుక్తమ యనఁదగు. ఏమ్యాదులవలె విభిన్నస్థలములు గాక యెల్లధాతువులనుండి యేర్పడున వగుటచే వీనిని స్పష్టముగా నిరూపింపఁదగియుండుటంబట్టియు సూరి ప్రత్యేకించి సూత్రించె ననఁదగు.

### క్త్వార్థము:

క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు (8) అనుసూరిసూత్రమును వీరు క్త్వార్థంబయినయిత్తునకు భారతమందు మాత్రము సంధి గానరాదు అని సవరించిరి.

భారతప్రయోగముల కొకలక్షణమును భారతేతరప్రయోగముల కొకలక్షణమును జెప్పుచుండిరా యెల్లవిషయములను. భారతేతరప్రయోగములందుఁ గువర్ణక పరకత్వమున నగాగమాభావమును సాధించుటకయి సూత్రమునందే ప్రాయిక మని చెప్పిరి. భారతమందుమాత్రము నియత మైయున్న దన్నపు డట సూత్రమం దట్లు చెప్పియుండలేదు.

క్త్వార్థకేకారసంధి, ము న్నగునవి భారతమున లే వని (ఉ.39) పేర్కొనిరి. ఇట క్త్వార్థకేకారసంధివి మాత్ర మె భారతమున లే దని ప్రస్తావింప నేల? తత్సమే కారసంధి, షష్ఠీసమాసేకారసంధి భారతాదుల లే దని గుర్తించినవా రవి యేల విశే షింపలేదు. అట్టివి యర్వాచీనకవులప్రయోగముల నుండ నేమ్యాదిసూత్రము సాధిం చును గదా. క్త్వార్థకేకారసంధి మాత్ర మ ట్లేల సంగ్రహింపఁబడదు.

ఇటఁ గూడ 'క్త్వార్థకేకార మేమ్యాదులలోనిది.ఉదాహృతు లచ్చటఁ గలవు' (ఉ.40) అనిరి. మఱి ప్రస్తుతసూత్ర మేల చెప్పవలె. దీని నేమ్యాదులలోఁ జేర్చు టచే నీసూత్రము సూరిలక్షణమును దిరస్కరింప మాత్ర మె యేర్పఱుపఁబడినదా యనిపించును.-సక్త్వః- క్వాపి నవర్ణే దృశ్యతే యనిసూరిసూత్రాంధ్రవ్యాకరణమునఁ బేర్కొనఁగా '-నవర్ణేతరస్వరపరకత్వమున నరుదుగను గన్పట్టుచున్న' (వ్యా.సం. స.243) దనిరి వీరు. అట్టివి రిచట క్త్వార్థకము నేమ్యాదులలోఁ జేర్చి సంధిని సాధా రణముగాఁ బేర్కొనుట లక్ష్యానుగుణము గా దనక తప్పదు. భారతేతరగ్రంథము లందును నీసంధి క్వాచిత్కమె కదా. భారతమున లే కున్నను దిక్కన విర్వ.లో వెఱ చిట్లు అనుచో నీసంధిని బ్రయోగించినట్లు వీర పేర్కొనిరి.

కాఁగా భారత, భారతేతరప్రయోగములను వివక్ష యెల్లయెడల ననుసరింపఁ బడలేదు కావునను, క్త్వార్థకేకారసంధి మిక్కిలియరు దగుటచేతను, భాషాసామాన్య లక్షణముగా'క్త్వార్థం బై నయిత్తునకు సంధి లే' దనుసూరిలక్షణము లక్ష్యానుగుణ మవి గుర్తింపవచ్చును. ఆమ్రేడితపరకత్వమునను నీసంధి యరు దయియుండుట గమనా ర్హము; కాకున్న నామ్రేడితపరకస్థలములను గూడ దృష్టియందిడుకొని' క్త్వార్థం బయినయిత్తున కంతట సంధి క్వాచిత్కంబయి చూపట్టెడి'నను రీతిగ సూత్రించుకొన్నఁ గొంతనయ మవి తోఁచును.

ఆమ్రేడితపరకత్వమునందలి సంధి వారించుటకై యీనిషేధ మారబ్ధము. 'పర్యుదస్తవ్యపల్లక్షణ ప్రవృత్తిః' కనుక వచ్చి యిచ్చెను- అనురీతివియు లక్ష్యము లగును.

ఇఁకాదిసంధి :

'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు.' (9) అనుదానిని వీరు 'ఇఁకాదుల కచ్చు పర మగునపుడు ద్రుతలోపపూర్వకపరరూపసంధి బహుళముగా నగు' (ఉ.10సూ) నని సవరించిరి. ద్రు.ప్ర.లసంధివిషయమున వీరిమతము సూరిమతముకంటె భిన్న మగుట నీలక్షణ మిట్లయిన దనవచ్చు.

సంధి.2.సూత్రమునొద్దవలెనె 'వచ్చున్ + ఇపు' డనురీతి సూరియుదాహృతు లసంభవములనియు,ఇఁకాదులకు ద్రుతలోపము లేనిదే సంధియే యసంభవ మనియుఁ (ఉ.40) జెప్పిరి. స్వరపరకతలో ద్రుతస్వరలోపముఁగూర్చి సంధి.2సూత్రముకడ గమనించితిమి.

ఇఁక ద్రుతము లోపింపక సంధి యసంభవ మనుట చూతము. స్వరపరకతలో ద్రుతస్వరము లోపించుటచే ఇఁకన్ + ఏమి అనురీతిగా నుండును. ఇట సంధి వైకల్పికము. ద్రుతమున స్వరము లేమిఁ బూర్వస్వర మన ద్రుతపూర్వస్వర మగుచున్నది.సంధి రావలె నన్న (ద్రుత)పూర్వస్వరమునకును బరస్వరమునకు రెండింటి స్థానమునను బరస్వరమే యేకాదేశము గావలె. ద్రుతమునకుఁ బూర్వమునం దున్న యచ్చునకును, ద్రుతమునకు మీఁద నున్నయచ్చునకు రెండింటికిఁ గలిపి పరస్వరమేకాదేశ మగునపుడు ద్రుతము తనంత తాన నష్ట మగును. నడుమ నున్న ద్రుతముతోఁ గూడఁ బూర్వపరస్వరములకుఁ బరస్వర మేకాదేశ మగును. కావున ద్రుతము లోపింపనిదే సంధి యసంభవ మనుట యసంగతము.

ఇంతకు ముందు 'వచ్చె నతఁ డనుచో- ఉత్వసంధిని జేసి 'ద్రుతస్వరలోపమున కింతకంటె మార్గాంతరము లేదు గదా' యనుటయు 'వచ్చున్ + ఇపుడు' అసంభవ మగుటఁ జెప్పుటయు వరుఁలవారివచనములలోఁ గొంతభేదమును సూచించును.

ద్రుతమందు స్వర ముండఁగా (నా ద్రుతము మొత్తము లోపించి) అంతకు

ముం దున్నస్వరమునకు సంధి యగు ననువీరిప్రక్రియకంటె స్వరపరకతలో ద్రుతస్వరము లోపించి పూర్వస్వరమునఁ దత్పూర్వస్వరమునకు సంధి జరుగుట యనుసూరిమతము యుక్తము కదా.

“కననయ్యె డనఘ. సూరియుఁ బ్రౌఢయు సాధింపలేదు.” (ఉ.40) అనఁగా నియ్యెడి యిఁకారాదులలోఁ జేరు ననవలెనా? “మహాకవిప్రయుక్తస్థలము“ (ఉ.41) లిఁకారాదులలోఁ జేర్చుట వీరిమతము. కననయ్యె డనఘ, ఒనర్చు దురుమహిమ, చేయు దేను. అనుభట్టుమూర్తిద్వర్థికావ్యప్రయోగము లిచ్చిరి. చెఱఁగొల కింతె, ననుభాస్కరశతకస్థలమును, నగిం చటు అనుపంచతంత్రప్రయోగమును ‘మహాకవిప్రయుక్తస్థలములు’గా వఝలవారు పేర్కొనుటనుదావహము. భాస్కరరామాయణాదిస్థలములు గూడ సామాన్యకవిప్రయోగము లని (ఉ.138) తక్కువచేయ కున్న బా గుండెడిది. మహాకవి సామాన్యకవి యని నిర్ణయించుట కాధారము వఝలవారివచనములుమాత్ర మగుట యొప్పునా?

ఇచ్చటనే వీరు ‘కొలిచి తద్ద్విజను కొలిచితి నద్ద్విజను, చేసి తచ్యుతార్చనము చేసితి నచ్యుతార్చనము (అహో.) (ఉ.41) అనియుఁ బేర్కొనిరి. అనఁగా నివియు నిఁకారాదులలోఁ జేరిన వన్నమాట. ‘మహాకవిప్రయుక్తములు గ్రహింపఁదగు’ నన్నవీరివి యేమహాకవిప్రయుక్తము లని యిటఁ బేర్కొనిరి. అహో.పలుకులే తప్ప కవిప్రయోగమును నయితము చూపలేదే. ఇంతకు ముందు “కొలిచి తపుడు అను రీతి గలయనిష్టరూపములు గలుగనేరవు. చేసి తచ్యుతార్చనము- చేసితి నచ్యుతార్చనము అనునహోబలపండితీయప్రామాదికవ్యాఖ్య-’ (వ్యా.సం.స.237,388) అని యహో.వ్యాఖ్య ప్రామాదిక మనిరి. కాని యిట నదే ప్రామాణిక మగుటకు మహాకవిప్రయోగమొక్క టేని చూపిన బా గుండెడిది గదా యనిపించును. అహో. హనుమానుఁ డిత్యాదులు చూపె. మహాకవిప్రయుక్తములు గా వని తిరస్కరించిరే. (అహో. సాధించినవిధానము దుష్ట మయినఁ గావచ్చు. కాని యాకారణముచే శబ్దము దుష్ట మవరాదు గదా. సూరి సముచితముగనే సాధించెను. అయ్యుఁ దిరస్కరించిరే.) మఱి యీరూపముల యెడ నాప్రామాదికవ్యాఖ్య ప్రమాణ మగుట యేమి? సూరిమతాభిప్రాయమును విమర్శించుట కయియుండు నేమో.

కననయ్యె డనఘ యనురీతిని కేవల మాధునికము లగుటయే కాక మిక్కిలి యరు దగుటచేతను (క్త్వార్థకేకారసంధివలెనె) సూరి యుపేక్షించె ననఁదగు. భాషా

సామాన్యలక్షణనిరూపణమున నది యుచితము.

ఇఁకాదులకు సంధి వైకల్పికమె. కననయ్యె ననఘ యనురీతిస్థలములందుఁ గ్వాచిత్కము. అందుకయియె వీరు సూత్రమున బహుళపదమును బ్రయోగించి రన వలె. సంధి నిత్యముగా వచ్చునట్టితావులు లేవుగదా.కాన నిటఁ బ్రవృత్తి కవకాశము లేదు. అన్యకార్యము నేదియుఁ గానరాదు. వీరును నిరూపింపలేదు. ఇఁకాదు లని గణము నేర్పఱచుటచే సంధి లేనిస్థలము లిఁకాదులలోఁ జేరవు గావున నిచట నప్రవృత్తి యుండదు. ఇఁకాదులకు వైకల్పికసంధిని సూరియు స్పష్టము చేసెను. ఇంక బహుళ మనువయులవారిసవరణ మేల? పైయాదుపికప్రయోగముల నుద్దేశించిమాత్ర మె బహుళ మని రనవలె. సూరి బహుళపదమును బ్రయోగించినయనేకస్థలము లలో 'స్పష్టముగా' నిరూపింపఁబూనినవీరు (తత్స.51మొ॥) ఇట లక్షణము స్పష్టముగా నిరూపింపఁబడు ననియె బహుళపదమును బ్రయోగించిరా?

ఇఁకాదులకు సంధి వైకల్పిక మని చెప్పి యాధునికప్రయోగములను విశేష స్థలములుగాఁ బ్రస్తావించుట యుక్తమును స్పష్టతాసాధకము ననఁదగు. ఉ.సంధి.31. సూత్రస్థలమును జూచిన నిట నర్వాచీనప్రయోగములనుబట్టి బహుళ మనుట తగ దని గుర్తింపవచ్చును.

ఇఁక వీరిమిగిలినవిధానమునుగూర్చి పరిశీలింతము. వీరు సూత్రమున "అచ్చు పరం బగునపు' డనుట యనవసరము. "ద్రుతలోపపూర్వకపరరూపసంధి యనుట చేతనే యచ్చు పర మగుట యనునర్థము సిద్ధించుచునే యున్నది. ఇంతకు ముందు సూత్రములందును నీదళము లేదు. ఈసూత్రమున లేకున్నమాత్రమున నీకార్యము హల్లు పర మగు నపు డగువిబ్బంది లేదు. 'అచ్చు పరం బగునపు' డని సూత్రమునఁ జెప్ప నక్కఱ లేదు.

ద్రుతము నిటఁ గూడ ససర్వరముగాఁ జూపుటచే'ద్రుతలోపపూర్వకపరరూప సంధిని' జెప్పుకొనవలసివచ్చుటయు నందువలననే యిఁకాదులకుసంధినిజెప్పుకొనుట వయులవారిమతమున నవసరము లైనవి. సూరిమతము భిన్నము. తదనుగుణముగా ద్రుతపూర్వస్వరమునకు సంధి ప్రాప్తించు చుండఁగా సూరి యిఁకాదిభిన్నములకు సంధిని నిషేధించెను. అది సూరిమతానుగుణము. (చూ.ద్రు.)

ఇఁకాదులలో వయులవారు ఎట్టకును శబ్దమునకు ఏంకు ఏని [illegible]

మగునపుడు సంధి వికల్ప మని వివరించిరి. (ఉ.41) 'ఎట్టకేలకు' అనుదానికి వే ళాకయజాదిశబ్దము పర మైనపుడు విశ్లై (ఏలకను శబ్దమునందును ద్రుతపూర్వో కారమునకు) సంధి వికల్ప మని చెప్పఁదగును. అందు, ఇందు, ఎందు, అనువాని వలె ఎట్టకు, ఏలకు అనువానికిఁ బ్రథమేతరవిభక్తి విధిచే వైకల్పికసంధి యగు నని సూరిమతముగాఁ జెప్పఁదగు నేమో పరిశీలింపఁదగు.

### ఆమ్రేడితపరకసంధి :

'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱచుగ నగు' (10) నను సూరిలక్షణమును దాదా పట్లే (ఆమ్రేడితము) గ్రహించిరి.

సం.లో 'ద్విరుక్తత్రిరుక్తశబ్దభాగ' మెల్ల నామ్రేడితమె యని చెప్పఁదగి యున్నను -- పాణినీయవ్యవహారము ననుసరించి సూరి -- (ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడిత మని వివరణము వ్రాసె'(వ్యా.సం.స.522) ననిరి.శబ్దశాస్త్రమున నట్టిశాస్త్రమునకనుగుణముగాఁజెప్పుట యుచితమ కదా.కానియిట మాత్రము వీరు'ద్విత్రిరుక్తములపరరూపము లామ్రేడితము లనఁబడును' (ఉ.41) అనిరి. బాల.వివరణము (పాణినీయము?) సరి కా దని వీరియుద్దేశ్యము గావలెను. మినుమినుకుమినుకు అను రీతిగాఁ ద్రిరుక్తస్థలములు గలవు. తొలతొలఁగుతొలఁగు మనుచున్, పిలుపిలుపు పిలుపు మనుచున్ (రాజ.2.72) తొంతొలఁగుతొలఁగు మనుచుం, దలతలతలమను చు (రాజ.3.45) నిలు నిలు నిలు పోకు నిలు పోకు పోకు పోకు నిలు నిలు రఘురామ (రం.రా.169పుట)యని త్రిరుక్తపరకత్వమునను నామ్రేడితపరకతయందుఁ జెప్పిన కార్యములు గానవచ్చున్నవి. ప్రసిద్ధి ననుసరించియు సూరి పై నట్లు పేర్కొని యుండును.

తఱచుగ ననుటచే నొకానొకచో వైకల్పికసంధి కల దని సూరి 'ఏమి యేమి' యనునది యుదాహరించెను. దానింగూర్చి వీరు "ఏమి యేమి యనుసంధ్యభావము నకుఁ బ్రాచీనమహాకవిప్రయోగ మగపడదు. ఏమియేమియొ నాహృదయమందు అను కళాపూర్ణోదయప్రయోగమున ఏమిశబ్దంబులు రెండును భిన్నార్థకములు గాన నామ్రే డితస్థలము కా దనఁదగును. (ఉ.42) అనిరి. 'కా దనఁదగు' ననుట యేల?ప్రయోగ ములు లే వను టేల? ఇట వీరివివరణవాక్యమునుబట్టి కళాపూర్ణోదయప్రయోగము

ప్రాచీనమహాకవిప్రయోగముగాఁ దలఁచినట్లు చెప్పవలె. తిక్కనాదులనే యర్వాచీను లుగాఁ జెప్పినవరులవారు సూరన ప్రాచీనుఁ డని తలంచుట సక్రమమా? అర్వాచీనుఁ డైనసూరనప్రయోగమున నిట్టిసంధివికల్పత్వ మున్నను 'కా దనఁదగు' నన నేల? ప్రాచీనమహాకవిప్రయోగ మగపడ దనువీరినిర్ణయమునకు బాధకము గాదు గదా. ఇంక నర్థభేదమునుబట్టియె యైన 'కా దనఁదగు' నన నేల? కా దని నిశ్చ యింపఁదగదా? అర్థభేద మేమో వరులవారు వివరింపలేదు. కళాపూర్ణోదయమందే స్థలాంతరమున 'ఏది ఏదీ యిది చాలఁ గ్రొత్త (1.94) అని ప్రయుక్తము. ఇంచుక యించుక గాని (శృం.నై.2.68) మొద లగుప్రయోగము లిట్టివ. కావున 'ఇట్టియెడ సంధ్యభావమునకుఁ బ్రయోగము గన్పట్టలేదు. ఎట్టయెదుట మున్నగువాని నుదాహరించుట తెన్ప (వ్యా.సం.వ.258) యనుట సరి కాదని నిశ్చయింపఁదగును.బహుశః పైసం.లోనియభిప్రాయము ననుసరించియె కాఁబోలును ఉ.లో. సంధి లేమియుఁ గల దని యెఱుంగఁదగు' (ఉ.41) నని ఎట్టయెదుట నన్నదే చూపిరి. (ఇట 'నెట్టెదుట' అనురీతిప్రయోగము గల దేమో వెదుకవలె.) కాని పైని జేర్కొన్నరీతి సంధ్యభావస్థితి కవిప్రయుక్త మైయుండుటంబట్టి సూరి 'యొకానొకచో వైకల్పిక సంధి' యనుటలో దురుక్తి లేదు.

అది య ట్లుండఁగా 'విశ్వకర్మని' అని యొకేయొక్కరూపమునుబట్టి విశ్వకర్మకు వికల్పముగా విశ్వకర్మఁ డనురూప ముండవలె నని నిశ్చయించినవరులవారామార్గములో 'ఎట్టయెదుట?అనునొకేస్థలము ననుసరించియు వైకల్పిక మనుటవిరుద్ధ మనరాదు.అయ్యు నీసంధ్యభావమునకుఁ బ్రయోగాంతరములు గలవు గాన సూరిమత మునను విరోధము లేదు.

## అపదాదిస్వరపరకసంధి :

'అంద్వవగాగమంబులు దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' (11) ననుసూరిలక్షణము నట్ల గ్రహించిరి. వీరు పెక్కుచోట్ల సూరి సూత్రమును సవరించుటవలన ననర్థములు గల్గి యిట సూరిసూత్రము నట్లగ్రహించుట వలన వీరిమతమున రోధము లేర్పడినవి. 'సంఖ్యకుం బూరణార్థంబు నం దవగాగమం బగు' (అచ్చి.26) నని 'అవ'ను ఆగమముగా విధించుటచే నిట సూత్రవివరణములం దవగాగమ మనుట సూరిమతమున నుచితమె. కాని వీ రట్టు

'సంఖ్యకుం బూరణార్థమున అవప్రత్యయము తుదిని నిల్చును' (ఉ.అచ్చి.67సూ.) అని 'అవ'ను ప్రత్యయముగా విధించిరి. ఇచ్చటనే 'అవ పూరణార్థకతద్ధితప్రత్యయము' (ఉ.42) అనిప్రత్యయముగనె వివరించిరి. సం.లో 'అవ అనునది పూరణార్థక ప్రత్యయము' (బాల.అచ్చి.25సూ.) (వ్యా.సం.స.255) అనిరి. అవగాగమముగాఁ జెప్పినబాల.లక్షణమును ప్రస్తావించుచు 'అవ'ప్రత్యయ మనుట యింకను విశేషము గదా. ప్రత్యయము నాగమము నభిన్నములా? పిదప వారే "సూరిప్రత్యయ మనక ఆవద మనుటచేత ఇంచుగాగమము అవగాగమము మున్నగునవి సయితము గ్రహింపఁబడుచున్న (వ్యా.సం.స.225) వనిరి. అనఁగాఁ బ్రత్యయ మన్న (అవక) ఆగమము సంగ్రహింపఁబడదు. కాఁగా నాగమమును బ్రత్యయ మనుట యసంగతము. అనఁగా నట పీ రంతకుముందు చెప్పిన (ఆగమ మగు)'అవ'ను బూరణార్థకప్రత్యయ మనుట యసంగతము. అట్లే ఉ.లోఁ బ్రత్యయముగా విధించికొన్న 'అవ'ను కత్తుగను, నాగమముగను బేర్కొనుట యసంగతము. వరులవారిపైవివరణము ననుసరించియే యాగమముపువర్ణములను బ్రత్యయములుగా వ్యవహరించుట (ఉ.150, మొ॥) సరి కాదు. ఇంతకు ముందును ఇంచుగాగమమును (ఉ.37) బ్రత్యయ మనిరి.

ఇచటనే యీలక్షణవిషయమును సూచించుచు నిది 'ప్రత్యయాచ్చరకసంధి' యనిరి. అపదమనఁగాఁ బ్రత్యయాదికస్వర మని వివరించుచు (ఉ.42) అర్థించు విర్థించు అని యించుగాగమవరకసంధి నుదాహరించుచు వీ రీవిధానమును 'ప్రత్యయాచ్చరకసంధి' యని సూచించుట యుచితమా?

ఏని ఏసి యన్నవి యవ్యయము లనియు నవదములు గా వనియుఁ బేర్కొనిరి. (వ్యా.సం.స.255) పీసి నెవ రే నవదము లని రేమొ. వరులవారివివరణముచితము.

## ద్విరుక్తటకారము :

కుఱుచియుకడునడువిడుశబ్దంబులంబడల కచ్చు పరం బగునప్పుడు ద్విరుక్తటకారం బగు. (12) ననుదాని నట్లు స్వీకరించిరి.

వీనిలో కడు అనుదానిని శ.ర.ద్రుతాంత మైనయవ్యయముగాఁ బేర్కొనుటను బరామర్శించుచు వరులవారు బాల.పక్షమున నిది తళయే యనియు, సత్యంతాతిశ

యుద్యోతమున నుశబ్దాంత మగుటచే కడున్ అనుద్రుతాంతరూప మేర్పడు ననియు (వ్యా.సం.స.25) తలంచిరి. బాల.పక్షమునఁ గళ యనుట కాధార మేది? కడు+ఎదురు అనియె సూరి యిట నుదాహరించె ననియా? కుఱు(చ)+ఉసురు అనుచో సమాసమున వర్ణలోపముతో నుదాహరింపలేదా? శబ్దము కుఱు అన్నది కాదుగదా. అట్లే కడున్+ఎదురు అనుచో సామాసిక మగుద్రుతలోపానంతరస్థితిని సూరి చూపె నని గ్రహింపఁదగును. కాఁగాఁ గడు ద్రుతాంత మనుట కిచ్చటిసూరియుదాహృతి యాధారము గాఁజాలదు. ఇది కళ యని నిర్ణయించునట్టియాధార మొండొకటి లేదు. కాఁగా 'కడు' సూరి(బా.ల.)మతమునను ద్రుతాంత మైనయవ్యయమె యని చెప్పుటలో బాధ లేదు.

పిదప వీరు "కుఱ్ఱాదులయం దీవిధి నిత్య మయ్యును కడువిషయమున మాత్రము పాక్షిక మని బాలవ్యాకరణసూత్రమును సవరించుకొనవలసియున్న దని (వ్యా.సం.స.267, 269) పేర్కొని కడునడలు కడునెండ యన్న వుదాహరించిరి. ఇట ద్విరుక్తటకారము లేదు గావున వికల్ప మనవలె నన్నమాట. ద్విరుక్తటకారము రానిపక్షమున కడు+అడలు అని గదా యుండును. బాల.పక్షమున నిది కళయే యని చెప్పిరి గదా వీ రిటనే. అట్టియెడలఁ 'గఱకుటమ్ము' వలె 'కడుటడలు'కావలె. లేదా (కాఱడవివలె) కడలుక యని కావలె. కడునలుక యని నడుమ ద్రుత మెక్కడి నుండి యైనది. ఇట నుగాగమము విధింపఁబడలేదే. ఇంకఁ బాక్షిక మగుద్విరుక్తటకారము రానపు డెల్ల నత్యంతాతిశయార్థమును దదర్థబోధమునకై నుశబ్దము నుండునా యిచట. దీనింబట్టియు నీశబ్దము ద్రు.ప్ర.యే యని నిశ్చయింపవచ్చును.

కడున్+అడలు అనుచో సమాన మైన ద్రుతము లోపింపక తప్పదు.(అప్పుడు ద్విరుక్తటకారమును దప్పదు. కడునడ లని ద్రుతము నిల్చియున్నది(లోపింపలేదు) అనఁగా నీయది సమాసమె కా దన్నమాట.ద్విరుక్తటకార మగునది సమాసములందే యని సామాసికద్రుత(అది)లోపానంతరరూపప్రదర్శనముచేత సుస్పష్టము. (లేనిచో సూత్రము కుఱుచ చిఱుత ఇత్యాదిగ నారంభించి యెట్లో చెప్పవలసియుండును.) కాఁగా ద్రుతలోప మైనపిదప నుండు కడుటెండ లేదా కడెండ యనురూపములు చూపినఁ గాని దీని కీకార్యము పాక్షిక మనుటకు వీలు లేదు. అట్టిరూపములు లేవు. కావున కడుశబ్దమునకును ద్విరుక్తటకారము నిత్య మని గుర్తింపవలె. పరుండవా రీయంశమును పిదప గుర్తించి యుద్యోతములో 'కడుశబ్దటకారమున కాచ్ఛికసమా

సమున ద్విరుక్తటకారము వచ్చును. కట్టెదురు.కడునడలున' అనునది వ్యస్తస్థలము' (ఉ.43) అని వివరించి సూరిలక్షణమె నిర్దుష్ట మని స్పష్టము చేసిరి. కాన సం.లోని వీరివివరణము పొరపా టని వీరివాక్యములవలననే గుర్తింపఁదగు.

కాని వీరు 'ఇట (కడునడలు) కడు + ను అనునది ప్రతోపజీవిశబ్దము. నుశబ్ద మత్యంతాతిశయమును దెల్పును. ఇది ద్రుతప్రకృతిక మనెడిశ.ర. సరి కా (ఉ.43) దనుట సరి కాదు.

ఇట నుశబ్ద మత్యంతాతిశయమును దెల్పుచున్న దనియే యనుకొందము. ఒక వేళ నాయర్థవిశేషమును వివక్షింపము. అపుడు నుశబ్దము రాదు గదా. అట్టియెడల 'కడడలు' అని యగునా? ఇట ద్విరుక్తటకార మగుట కిది సమాసమును గాదు. అనఁగా సమాసము చేయఁదలఁపక వ్యస్తముగనె ప్రయోగించుచుంటిమి. ద్విరుక్తటకారము రాదు గదా.

సమాసము చేయనిచో నర్థవిశేషము లేకున్నను శబ్దము నిరర్థకముగనె యగు ననవలెనా? లేనిచోఁ గడడలు అని కావలెను.

'కడు' అన్నది కళ యగునపుడు సమాసము నిత్యముగా నగు నని చెప్పవలెనా? లేనిచోఁ గడడలు అని కావలె.

వ్యస్తతయందు నుశబ్దము నియతముగా నేల చేయవలె. కాకున్న 'కడుకడు కడు కరుణాశీలుఁ' డనురీతిగా నుండవలె. కాని కడుంగడు అనురీతిగనె ప్రసిద్ధ మగుట స్పష్టము. (చూ.ఎల్ల) 'కను' వార్థకనుశబ్దాంత మనువరులవారివివరణ మసంగతము.

కుఱ్ఱాదులయందు హల్లునకు మాత్రమె ద్విరుక్తటకార మయి అరలమీఁది యుత్త్వము నిల్చియుండు ననియు (కుట్టు + ఉసురు) పిదప నుత్త్వసంధి యగు ననియు వీరు భావించిరి. (వ్యా.సం.న.257) కుట్టు + ఉసురు అనుచో సంధియె వచ్చును గాని టుగాగమము రానేర దనుచు నిట్లు వివరించిరి.

"అడల కవ్యవహితాచ్ఛరత్వము సూరిచే నుద్దేశింపఁబడలే దని యాతనియుదాహృతులె విశదీకరించుచున్నవి. కాన నచట మిగిలినఉకారమునకుఁ బరరూపసంధి

వర్తిల్లును. అంతియ కాని పట్టుటసురు కుఱుటుసురు మున్నగునవిష్టరూపములు కల్గనేరవు. అట్టిటుగాగమనివారణమునకె యీసూత్ర మీస్వరసంధిసందర్భమునఁగ్రంథ కర్తచే సుసంగతముగ నిల్పఁబడెను' (వ్యా.సం.స.208) ఇందు టుగాగమము వారింపఁబడుట కుత్త్వసంధియె యగు ననుటకు సరియైనయాధారము గానరాదు.

అవ్యవహితాచ్పరకత్వ ముద్దేశింపఁబడలేదు గావున మీఁద నుత్వ మున్నను అకారడకారముహల్లులకు ద్విరుక్తటకారము వచ్చి కుట్టు + ఉసురు అని యగును. దీనివలన నుత్వసంధి యగు నని యెట్లు చెప్పుదురు.టుగాగమము రాక యుత్వసంధి యగుటయె యుద్దేశించినయెడల పొల్లులకె యేల? ఉత్వసహితములకు (అడులకు) ద్విరుక్తటకారము నాదేశించిన సంధిగౌరవమును దగ్గిపోవునే కదా.

ఉత్వసంధియె కాదు టుగాగమమునకు వ్యవహితాచ్పరకత్వము నుద్దేశింపనపుడె సంభవించును. అడలకుఁ బరస్వర మవ్యవహితముగా నున్నపుడు (నడిమియుత్వ మెట్టి నుండదు కాన) నుత్వసంధికిఁ బ్రసక్తి లేదు.కాని టుగాగమము నయిత ముత్తు నకె కదా చెప్పినది. ఉత్వము లేమి నుత్వసంధివలె టుగాగమమునకును బ్రసక్తియె లేదు. కాఁగా టుగాగమ మనిష్టమై దానిని వారింపవలె నన్న నవ్యవహితాచ్పరత్వ మునె యుద్దేశించె నన్నపుడే యది సంభవించును. (సంధి చేయవలసినప్రక్రియాగౌరవమును దగ్గును.)

అయినను నీయంశము నుదాహృతులనుబట్టి యెట్లు నిర్ణయింతుదు?అవ్యవహితాచ్పరత్వము నుద్దేశించినచో కుట్ + ఉసురు అని చూపవలయునా?షష్ఠీసమాసమున నుగాగమము చెప్పుచో రాజాయొక్క + ఆజ్ఞ యనురీతిగా యొక్కను జూపలేదా, చేతలోదపలనం నిత్వము చెప్పుచో నీచేతన్ + ప్రోపు అని యేల చూపెను.చూపెఁ గావున ద్రుతము లోపింప దన్న నిష్టరూపసిద్ధి యెట్లు. ఇత్వము చేసినపిదప నిష్ట రూపసిద్ధికై ద్రుతలోపము చేయుదురా? కాఁగా కుఱు + ఉసురు అని యుత్వముతో నుదాహరించుటనుబట్టి యవ్యవహితాచ్పరత్వము సూరిచే నుద్దేశింపఁబడలే దని చెప్పుటకును వీలు లేదు. ఉద్దేశించెనా లేదా యన్నది తరువాతిసంగతి. ఉదాహరణములను బట్టి నిర్ణయింపరా దన్నది ప్రస్తుతాంశము.

టుగాగమము రా దనుటకే సంధిసందర్భమునఁ జెప్పె ననుట కూడ సరియైన యాధారము గానేరదు. టుగాగమము వచ్చు నన్న నీసందర్భము గుదురదా?పుంవులు విధింపకపూర్వమె పుంపులపై నుగాగమము చెప్పలేదా(సింగపుంగొదమ)సందర్భము

కుదుర దనియే యుండదు. ఇష్టము గానిటుగాగమము రాకుండ లక్షణమున నేర్పాటు చేయవలెఁ గాని వే ఱొకకల్పన యేల?

నిజమునకు కుఱు + ఉసురు అని యుండిన 'నుత్తున కచ్చు పరం బగునప్పుడు (సంధి.1) డనుసూత్రముచే సంధి రావలసియుండఁగా దానిని బాధించి కర్మధారయం బులం దుత్తున కనుసూత్రముచే టుగాగమము రావలెను. దానిని సైతము బాధించియిట ద్విరుక్తటకార మగు ననుటకు వీలు లేదు. ద్విరుక్తటకారము హల్లులకె యగుచున్నది. టుగాగమ మగుటకు హల్లులతో నిమిత్తము లేదు. కర్మధారయ మయి, ఉత్తున కచ్చు పరము గావలె. ద్విరుక్తటకార మయినను నాలక్షణము లిందుఁ గలవు. కుట్టు ఉసురు అనుచో టుగాగమ మగుటలో బాధ యేమి? ద్విరుక్తటకారము అడ(హల్లు) లకుఁ గాఁగా, (మీఁది)ఉత్తునకు టుగాగమము గావచ్చును. రెండింటికి స్థానములు వేఱు గదా. ఇంక ద్విరుక్తటకారము నిత్యముగా విధింపఁబడుటంజేసి కుఱుటుసురు అనుకృతిరూపము నివారింపఁబడును గాని 'కుట్టుటుసు' రన్నది వారింపఁబడుట కవకాశము లేదు.

ద్విరుక్తటకారవిధి టుగాగమమునకు బాధకము గా దనుటను గుర్తించియె తుదకి వీరు టుగాగమము వారించుటకు సంధిసందర్భము నాశ్రయించియుందురు. అనఁగా సందర్భమునుబట్టి (లేక కుట్టుసురు అని టుగాగమము లేకుండ మూరిచూపిన సామర్థ్యమునుబట్టియో) టుగాగమమును వారించుకొనవలసినదే కాని లక్షణమున నేమియు నాధారము లే దనవలెను. మఱి వీ రుద్ద్యోతమున నయినను నట్టియత్నమేమి చేయలేదు.

బా.సా.పే. పేర్కొన్నట్లు సూత్రమున 'అడల' కనక 'ఱుడుల' కని చెప్పిన టుగాగమమును సలక్షణముగా వారింపఁబడును. ఇంకను ద్విరుక్తటకారము చేసిన పిదప నుత్త్వసంధిప్రక్రియాగౌరవము నుండదు. ఈశబ్దములలో ఱుడులే కాని యుత్తర స్వరము తోఁ గూడిన అడలు లేవు. కావున ఱుడు లనుట యింకను స్పష్టతర మై యుండును.

అడ లన్నను ఱుడుల కగునవకాశము లేకపోలేదు. ఇటం 'గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' (కృత్-2) ననుసూత్రముచే గకారమునకు లోప మగు ననఁగా, అలుగు + క్క యనుచో గువర్ణముయొత్తము లోపించు

యున్నది గదా. అట్లు యిటఁ గూడ ఉడల కనుదానిచే నన్వరము లగుఉడలకు ద్విరుక్తటకార మగును.

ఇట్లు కుఱు+ఉసురు కుట్ట్+ఉసురు కుట్టుసురు అని యగును. కాఁగా కుట్టు+ఉసురు అనురీతిప్రక్రియను జెప్ప నవసరము లేదు.

పిదప 'సంస్కృతశబ్దపరకత్వమున నిట్టిసంధి లాక్షణికమహాకవిసమ్మతము గాదు. బాలవ్యాకరణపక్షమునం దన్ననో కడుశబ్దేతరము లగు'కుఱు' మున్నగురూపము లాచ్ఛికవృత్తిలో మాత్రమె సిద్ధించును గాన నందు కుట్టుసురు మున్నగురూపము లుత్పత్తిల్ల నేరవు. కడుశబ్దపక్షమున నీద్విరుక్తటకారవిధి పాక్షిక మని యీపఱకె వ్రాయఁబడెను.' (వ్యా.సం.స.258) కడుశబ్దమునకుఁ బాక్షిక మనుట సమంజసము గా దని యీపఱకె పదుంలవారివచనములనుండియు గ్రహించితిమి. మిశ్రసమాసములందు కుఱు అనురీతిరూపము లుండవు గావ ద్విరుక్తటకారప్రసక్తి యుండ దను టుచితమె. మిశ్రసమాసములె లే వనఁదగు.

కాని యిట్లు చెప్పువారు కడుశబ్దమున కీవిధి పాక్షిక మనుట నిట మఱలఁ బ్రస్తావించుటలో దానికి మిశ్రసమాసములందు నునికి సిద్ధ మైనను ద్విరుక్తటకారము రానేర దనియు నయ్యది పాక్షిక మనుటవలన సిద్ధ మైన దనియుఁ జెప్పుట తాత్పర్యము గావలె. ఏల యన సోమన కట్టుగ్రముగ, కట్టుగ్రుఁడు అని ప్రయోగించుటను బ్రస్తావించి వీరు-"ఇంతవింతతద్భవములను బ్రయోగించుస్వభావము గలవాఁడు గానఁ బయిస్థలమున కట్టుగ్గముగ, కట్టుగ్గుఁ డగుచు అని ప్రయోగించె నేమో"(వ్యా.సం.స. 258) యనిరి. ఏమో యనుటంబట్టి వీరు చూపినపాఠమున కెట్టియాధారమును (తాళపత్రప్రతులందును) లే దని గ్రహింపవచ్చును. ఇట్లూహించుట సరి కాదు. పమానమై ప్రుతము లోపించి కడు+ఉగ్రుఁడు అని యుండఁగా (ద్విరుక్త) టకారము గాకున్న) టుగాగమ మయి కడుటుగ్రు డని యగునా? లేక పెక్కెడల మనురీతిగా నుత్వసంధి యై కడుగ్రుఁ డని యగునా? దీనింబట్టి సోమన కట్టుగ్రుఁ డనియె ప్రయోగించె ననఁదగును. వింతప్రయోగములె యైనను వీరిసిద్ధాంతములకు విరుద్ధముగాని వింతతో సోమన ప్రయోగించుట యనలు వింత. కట్టుగ్రుఁడు అన్నదే వింతగా నుండును గదా యని తనస్వభావమునుబట్టి సోమన ప్రయోగించె ననరాదా యనియు తోఁచును.

దీనికంటె (మిగిలినవానివలె) కడుశబ్దము నాచ్ఛికములతో మాత్రమె నము

సించుచున్న దని చెప్పవచ్చును. అప్పుడు కడు నుగ్రము, కడు నధికుఁ డిత్యాదిగా వ్యస్తముగానే ప్రయుక్త మనవచ్చును. అంతే కాని యసలు కడుశబ్దమునకుద్విరుక్త టకారము పాక్షిక మనుటవలన మిశ్రసమాసములందు ద్విరుక్తటకార మసలు రానేర దని చెప్పుట యెట్లు కుదురును? నిజమున కాయర్థమువలన కడుటుగ్రుఁడు లేదా కడు గ్రుఁ డనురీతిగా నపరూపము లేర్పడుననర్థమై కల్గా నని గుర్తింపవచ్చును. ఉద్యోత మున "కడుశబ్దటకారమున కాచ్ఛికసమాసమున ద్విరుక్తటకార మగు' (ఉ.48) నను టలో మిశ్రమునఁ గా దని చెప్పుటయే వీరియభిప్రాయ మనవలె నది యసంగతము. ద్విరుక్తటకారము రానప్పుడు కడునధికుఁ డనురీతిగా నుండు నని యెంచుచోఁ గడు నడలున ననుతీరుగా నివియు వ్యస్తములుగా గుర్తింపవలెను. కాఁగా (మిశ్ర సమాసములు లేవు కావున) నాచ్ఛికసమాసములు మాత్రమె సంభవించుటచే నందె కడుశబ్దమునకు కుఱ్ఱాదులవలె ద్విరుక్తటకార మవు నని చెప్పవలె.

కట్టుగ్రుఁ డనురీతివాని నంగీకరింపఁదగు.

## గసడదవలు :

ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగ నగు' (13)ననుసూరి లక్షణమును వీరు దాదాపుగ నట్లే గ్రహించిరి.

సూరి యిట నప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతము లను టనుగూర్చి నిత్యైకవచనాంతము లనఁగాఁ బ్రథమైకవచనాంతము లని యర్థము. (వ్యా.సం.న.263) అనిరి. పొరపాటున నిట్లు చెప్పియుండనవు. నిత్యము నేకవచ నాంతము లై యుండు ననఁగా శబ్దప్రయోగము ప్రథమయందే యుండు నని చెప్పు టెట్లు? 'బియ్యము' నిత్యైకవచనాంతమె. బియ్యమును, బియ్యముకొఱకు, బియ్యము వలన మున్నగురీతి నెల్లవిభక్తులు నుండుట లేదా? అట్లే యిటఁ గూడ అప్పటినుండి (వలనకు ద్వితీయ) అప్పటికంటె, అప్పటికి,అప్పటన్ అనురీతిగా నితరవిభక్త్యంత రూపములు గంపు గదా. ఎప్పుడు నేకవచనాంత మైయుండు ననఁగాఁ బ్రథమాది విభక్తు లన్నింటియందు నేకవచనముతో మాత్రమె యుండుఁ గాని బహువచనము తోఁ బ్రయోగింపఁబడ దనియే కదా యర్థము.'అప్పుడుశబ్దము ప్రథమైకవచనాంతమె యన్నంతవఱ కిబ్బంది లేదు. కాని యీశబ్ద మెప్పుడు నట్లు మాత్రమె ప్రయుక్త

మగు ననుట, నిత్యైకవచనాంతము లగుశబ్దము లెల్లఁ బ్రథమావిభక్తియందు మాత్రమె ప్రయుక్త మగు ననుట సరి కాదు.

"వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థ" మనుటను దృష్టి నుంచుకొన్నను విటఁ బ్రథమైకవచనాంతము లని యర్థము చేయరాదు.

(యదా తదా అనుచో ఇపుడు ప్రస్తావింపఁబడలేదు. అయ్యు నది ద్రు.ప్ర. గానేరదు. యదాతదాశబ్దములను గ్రహించుట స్పష్టతకె కాని ఇదానీమర్థకమును బరిహరించుటను నియమించుటకును గాదు.)

చిం. కళలను బేర్కొనుచు తిఙ్ధ్యశేషషష్ఠీసుప్.... నస్త్రావ యదా తదా కిమేవాంశ్చ'- యని మున్నగాఁ బేర్కొన్నది. యదా తదా యనువానిచేఁ దదర్థకము లైనశబ్దరూపము లన్నియు గ్రహించిన అప్పటికంటెన్, అప్పటికిన్ మున్నగునితర విభక్త్యంతములును గ్రహింపఁబడి యవియుఁ గళలే యగును. ప్రథమాద్యంత మైనపుడు (అప్పటికై) కళ యగుటయు ద్వితీయాద్యంత మైనపుడు ద్రు.ప్ర. అగుటయు సమ్మత మైన నయ్యది సామాన్యముగ (శేషషష్ఠీ సుప్ ఇత్యాదిచేతనె) సిద్ధించుచుండ 'యదా తదా' యని విశేషముగఁ బ్రస్తావించుట యేల? ఇట్టిపరిగణనమువలన మిగిలినరామాదిశబ్దములకు భిన్నముగా నివి యెప్పుడు ననఁగా నేవిభక్త్యంతము లైనను గళలే యవు నని తలఁపరాదు. స్పష్టతకే 'యదా తదా' యను(పునః)పరిగణనము జరిగిన దని చెప్పుటయె సూరియభిప్రాయము. సంస్కృతమునం దీశబ్దము లవ్యయము లగుటచే నట నెల్లెడల నొకేతీ రగురూపములతో నుండును. కాని తెలుఁగున నివి యేకవచనాంతము లై యాయావిభక్తులతో రూపభేదము నందుచున్నవి. అవి యెల్లఁ గళ లనరాదు. అందుకయి స్పష్టతకుఁగాఁ జిం. చెప్పె నని సూరి వివరించె నని గ్రహింపఁదగును.

## సాంస్కృతికపరుషములు :

తెనుఁగుంలమీఁదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు" (14) అను సూత్ర మవిమర్శకృతము. (ఉ.44) అని పరుులవారు దీనిని దమగ్రంథమునఁ దొలఁగించిరి. సం.లో 'ఈసూత్రము నిర్మూల' (వ్యా.సం.ప.288) మనిరి.వ వికృతిశబ్దా త్తసూత్రమునకు బాలసరస్వత్యాదులు చేసినవ్యాఖ్య ననుసరించి 'అపార్థము చేసికొని సూరి యీసూత్రమును భారతప్రయోగవిరుద్ధముగ సూత్రించెను.'

(వ్యా.సం.స.266) సూరిసూత్రమును సూత్రించుటలో బాధ లేదు గాని యది యపార్థ మను టెట్లు? పైచిం.సూత్రమునకు వీరు చేసినవ్యాఖ్యయే యసహజముగా నున్నదని యు నసంగత మనియుఁ దద్గ్రంథపరామర్శనమున గుర్తింతము. బాలసరస్వత్యాదులు చేసినది యపవ్యాఖ్య యని సూరి యెఱుఁగలేదు. సూరికి ముం దుండి వరుల వా రట్లు వ్యాఖ్యానించిన నస లర్థ మేదో సూరి తెలిసికొనెడివాఁడే.

బాలసరస్వత్యాదులు, తదనుగుణముగా సూరియుఁ జెప్పినయర్థము భారత ప్రయోగవిరుద్ధమా? భారతమున 'ఎంతగుమతు' లను ప్రయోగ మొక్కఁడ చూపిరి. ఇట్టిప్రయోగములు వాఙ్మయములో మిక్కిలి యరు దని వారిప్రయోగప్రదర్శనము తీరునుబట్టియు గ్రహింపవచ్చును. ఇట్టి మెడలం చిసూత్రమునకుఁ గర్త యెవ రని వరులవారు విశ్వసించిరో యానన్నయప్రయోగ మొక్కండును జూపలేదు. చిం. కర్త నన్నయ కాఁగా నన్నయభారతమున నిట్టిప్రయోగ మొక్కటియు లేకుండఁగా నట్టియాదేశము భారతప్రయోగవిరుద్ధము గావున బాలసరస్వత్యాదు లీసూత్రమునకుఁ జేసినది యపార్థ మనుట యసంగతము గదా. ప్రథమపురుషక్రియేకారమునకుఁ దిక్కనాదులు వైకల్పికసంధిని బ్రయోగింప నయ్యది భారతప్రయోగప్రసిద్ధమ యయ్యెను. నన్నయ తనభారతమునఁ బ్రథమపురుషక్రియేకారమునకు నిత్యసంధియే చేసియున్నాఁడు కావున నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః అని యట నిత్యసంధినే విధించె నని పేర్కొనిరి. అట్లె యిచట దెనుఁగులపై సాంస్కృతికపరుషములగసడదవాదేశము ను దిక్కనాదులు మిక్కిలి యరుదుగ బ్రయోగించినను నన్నయ తాను బ్రయోగింప లేదు గావున నట్టిది విషేధించె ననుటకు బాధ యేమి?ఆసూత్రమున కట్లర్థముచేసిన నది నన్నయభారతప్రయోగానుగుణ మయ్యెం గద నపార్థ మగు టెట్లు?నన్నయప్రయోగానుగుణమైయున్నప్రథమపురుషక్రియేకారనిత్యసంధివిధానము చిం., భారతము లేక కర్తృకము లగుట నిరూపించునప్పుడు (వ్యా.సం.స.297) తద్భిన్నముగాఁ జెప్పనయిచోటివ్యాఖ్య భిన్నకర్తృకము లని నిరూపింతు నేమో కదా. 'అనుత్తమపురుష' యనుచో 'నుత్తమ'శబ్దము నుత్తమపురుషయుఁ బురుషశబ్దముచేఁ బ్రథమపురుషయు గ్రహింపఁబడు నన్నయర్థ (వ్యా.సం.స.298) (మెంతసహజ) మెట్టిదో (అది యెట్టిదో) యిచట వికృతిశబ్దమువేత 'ద్వాదిప్రత్యయములు లోపించిన' మన్నగు వరులవారు చేసినయర్థము నంత సహజమై యట్టిద యగుచున్నది.

కావునఁ జిం.సూత్రమునకు బా.స.ప్రభృతులు చెప్పినయర్థము సముచితమె.

కాన నీసూరిలక్షణము నిర్మూల మిత్యాదిగా పరులవారు పేర్కొనుట సరి కాదు.

అయినను సూరి తాఁ జెప్పఁదలఁచినలక్షణమునకు నే దేని (నన్నయాధర్వణుల?) మూలము కలిగియుండవలె ననియుఁ గానిచో నాలక్షణము గ్రాహ్యము గా దనుటయు, మూలం మున్నయెడఁ గవిప్రయోగవిరుద్ధ మైనను గ్రాహ్య మగు ననురీతి యభిప్రాయముల కవకాశ మీయరాదు.

ప్రౌఢవ్యాకర్తయు 'తెనుఁగులమీఁదిసాంస్కృతికకతవలకు గదవలు కానంబడిమెడి' నని సడ లెచ్చటను లేకుండుటయు గదవలు సరుదుగా నుండుటయుఁ బ్రస్తావించుట గమనార్హము. సీత చంద్రముఖి, ఆమె పతివ్రత ఇత్యాదిగా నీయాదేశము లేకుంటయె ప్రచురము. (రమ.) ఇట్లీయాదేశము లేకుండుటయె భాషాసామాన్యలక్షణము గావున సూరి యట్లు పేర్కొను టెంకయు సుచితము. (చూ.త్రి.శే.)

పిదప 'నేను-ఏను- అనునవి ప్రథమాంతము లగుకళలు వానిమీఁద నీయాదేశము నియతము.'(వ్యా.సం.స 288) అనుట కేవల మసంగతము. ప్రాసేతరస్థలము నం దుండి కాని పీ రట్టిప్రయోగమును నన్నయభారతమునుండి చూపలేదు. అట్టిరూపము లేప్రతిలోను లేవు. తానునేనులు ద్రు.ప్ర.లు (చూ.ద్రుత.) 'నియత' మని యింకను గట్టిగా నెట్లు చెప్పుమరో యర్థము గాదు.

## క్త్వార్థకము-గసడదవలు :

'క్రూరాత్మం డై సీర లొలిచి- అనుచో క్త్వార్థకముపై నీయాదేశ మున్నట్లు తిమ్మన చెప్పఁగా నట్టిప్రయోగ మిం కొకటి తిక్కనప్రయోగములందు లేకుండుటం జేసి యటఁ దిక్కన చీరశబ్దభవ మగుసీరను బ్రయోగించినట్లు వీరు పేర్కొనిరి. (వ్యా.సం.స.272) అట్టియెడల 'ఏను పిదప' అనుచోఁ దప్ప నింక నెచ్చటఁ దిక్కన యీరీతిని బ్రయోగించె నని వీ రివి కళ లనియు వీనిపై గసడదవలు నియతమనియు నిర్ణయించిరి.

## శబ్దపల్లవములు-గసడదవలు :

చేపట్టు, చేపడు, కైకొను ఇత్యాదులయందు నీయాదేశము లేకుండుటను గుర్తించినవ ర్జులదారు కై సేయు,చేసేత ఇత్యాదులలో నీయాదేశ ముండుటనుగూర్చి

యి ట్లనిరి. "కై సేయు చేసేతన్ అనునవి వయివానివంటివి కావు. కై శబ్దము ద్వితీయార్థకప్రథమగా వివక్షిత మయ్యెను. కాన నాదేశము వచ్చుట విరుద్ధము గాదయ్యె. (చేయి + చేయి + అన్ - చేసేతన్ చేతి + అన్ అని చూపు టుచితము.) అనుచో 'చే'శబ్దము ప్రథమాంతము గాన నాదేశము వచ్చుచున్నది.' (వ్యా.సం.స.273) ఈ సమన్వయ మసంగతము. కై సేయు అనుచో కై శబ్దమువలెనె 'కైకొని', చేపట్టు అనుచో కై శబ్దములు ద్వితీయార్థకప్రథమాంతములు. చేసేత యనుచోఁ జేయి ప్రథమాంతముగా మీఁద నీయాదేశ మయిన దనిరి. చేపడు అనుచో చేశబ్ద మిట్టిది కాదా? ఆదేశము లేనివాని కాదేశ మైనవానితో భేద మున్నట్లుగా వీరు పేర్కొన్న యంశము సామ్యమె యగుచున్నది.

అస లిచ్చట ద్వితీయార్థమును గూర్చినప్రసంగ మేల? ద్వితీయార్థక మైనఁ బ్రథమమీఁద నికార్యము గాదా? విగ్రహ వాక్యమె యన్న దిక్కే గదా. లక్షణమున శబ్దము ప్రథమాంతము గావలయునఁ బ్రస్తావింపఁబడినది కాని యది యేయర్థమునం దయినది కావలెనో నియమింపఁబడలేదు గదా. వీరును ద్వితీయార్థకప్రథమాంతముపైని 'కై సేయు' అని గసడదవాదేశము చూపిరి. ద్వితీయకుఁ గాని ప్రథమ పైనినికార్యమును జూపిరి. (చేసేత) అట్టియెడల కై సేయు అనుచో ద్వితీయార్థమునుగూర్చి ప్రస్తావించుట కిట సందర్భ మే మేమున్నదా? స్పష్టతకయి వివరించి రేమో. కాని యది లేని సందేహములను గల్పించు.

ఏ దే మైనను కై సేయు- కైకొని, చేపట్టు- చేసేత- చేపడు అనువానికిఁ బోలిక లే దనుట సరి కాదు. కావున నిట్టికారణముచే నాదేశతదభావములను నిరూపింప వీలు లేదు. ఇట రెండవవిధ మైనరూపమును (కైగొను, చేచేత మొ॥)లేదు. కావున బాహుళకముచేఁ గొన్నియెడల తెల్లవారు, తెల్లగా ఇత్యాదులవలెఁ బ్రవృత్తియుఁ గొన్నియెడల నప్రవృత్తియు నని చెప్పవచ్చు. ఇవి శబ్దపల్లవము లగుట వీని వర్ణవికారములు విశిష్టవిషయములు. మినువడు మారుకొను మొ॥

సమాసము-గసడదవలు :

'శేషషష్ఠీసమాసమునందును గర్మధారయమందును నీగసడదవాదేశమురాదు. ఈయాదేశము వ్యస్తమాత్ర(ద్వంద్వేతర)గోచరము.' (వ్యా.సం.స.273) ద్వంద్వే

తరము లగుసమాసములందు లే దని (వ్యస్తస్థలమున మాత్రమె యుండు ననియు) చెప్పఁదలఁచినపుడు శేషషష్ఠీకర్మధారయసమాసములను బ్రత్యేకించి పేర్కొనుట విశేషము బహువ్రీహి, ద్వితీయాదితత్పురుషయిలందు నంగీకరింతురా?నెల తక్కువవాఁ డని సూరియ చూపెను. వ్యధికరణసమాసములలోఁ బూర్వపదము ప్రథమేతర విభక్త్యంత మగుచుండ శేషషష్ఠి నైనను విడఁ బ్రస్తావింప నవసర మేమి? ద్వంద్వేతరసమాసములందు లే దని స్పష్టముగాఁ జెప్పనవునే.

కర్మధారయబహువ్రీహులలోఁ (ద్వంద్వేతర) బూర్వపదము ప్రథమాంత మగుట సంభవించును. ఇందుఁ గర్మధారయములలోఁ బూర్వపదము స్త్రీసమమైనప్పుడీయాదేశ ముండుటను వరులవారు నంగీకరించిరి. "ఒండుగడ, ఎంత, అనునవి ప్రథమాంతములే యగుటచే వీనిపయిని నాదేశము వచ్చుటయె సహజ'(వ్యా.సం.స. 274) మనిరి. అనఁగా నీయవి సమస్తయిలు గా వని యభిప్రాయము. కాఁగా నాదేశ మున్న వ్యస్తములె యనియు (వీరు వ్యస్తతయందె యాదేశ మగు ననిరి కదా.) ఆదేశము గానిచో సమస్తము లనియు (సమాసములం దాదేశము లే దనిరి గదా.) గ్రహింపవలె నన్నమాట.

శ.ర.ప్రభృతికోశముల తెలిగంటి తెలిదమ్మికంటి, తెలిపిట్ట తెలిపులుగుఇత్యాదిగా నియమశూన్యముగా నీయాదేశమును సమాసములం దంగీకరించిన వనియు 'అవ్యయే కర్మధారయే' యనులక్షణ మాధర్వణము కాదు. గావున తెలిదమ్మి వెలిదామర యన్నవి యాధర్వణములుగా నహోబలుఁడు చెప్పుట సరి గా దనియుఁ (వ్యా. సం.స.277) జెప్పిరి.

కోశములు చూపినవానిలో నియమశూన్యత యెట్టిది. తెలిదమ్మి యనుచో నాదేశమును జూపి తెలిపిట్ట యనుచోఁ జూపకుండుటయా? నియమవంతముగా నుండవలె. నని కవిప్రయోగములకు భిన్నముగా నిరాధారముగాఁ జూపవలెనా?కర్మధారయమునా? కర్మధారయమున నొకచో నాదేశ మున్న నెల్లయెడల నుండవలసినదే యగునా? ద్వంద్వమునఁ గొన్నియెడల నాదేశము కన్పింపకపోవుటనుబట్టి యది నియమశూన్యమందురా? ఇం తేల?ఇంతకు ముందు శబ్దపల్లవములలో కై కొను అనుచో నాదేశము లేకుండుటను, కై సేయు అనుచో నాదేశ ముండుటకును వీరు చేసిననియమ మెట్టిదో గమనించియున్నారము కదా.కాఁగాఁ గోశములు' నియమశూన్యము'గాఁ జూపె ననుట సరి కాదు.

'ఆవశ్యకే కర్మధారయే' యన్న దాథర్వణము గా దనిరి. అవుఁ గాక. ఆథర్వణుఁడు చెప్పినఁ గవిప్రయోగములందు లేకున్నను నాదేశము పాక్షికముగా నియతముగా నుండు నని చెప్పవచ్చు నేమో. (ధాతృఁడు మొ॥) ఆథర్వణుఁడు చెప్పకున్నఁ బ్రయోగములం దున్నను నంగీకరింప వీలు లేదా? దీనింగూర్చి నిర్ణయించునపుడు కవిప్రయోగములు ప్రధానము. కాని యొకలాక్షణికుఁడు చెప్పుటయుఁ జెప్పకపోవుటయు నన్నదానినిబట్టి నిర్ణయింపరాదు. వయికారిక యాథర్వణము కా దనియె యందము. శృంగారభూషణుఁ డనువాఁడు లాక్షణికుఁడు చెప్పెను గదా. అతఁ డప్రామాణికుఁ డనియు, నథర్వణుఁడు చెప్పినదే ప్రమాణ మనియు నంగీకరింతము. ఈశృంగారభూషణునిమతము నథర్వణుఁ డేల ప్రస్తావించెను? ఆయంశము తాను సమ్మతింపనిచోఁ దాని దనగ్రంథమున నుద్ధరించుట యేల? ఇతరలాక్షణికుల పేరఁ జెప్పినచోట్లఁ గూడ నది యథర్వణసమ్మత మందురే. ఇతరలాక్షణికులమతముగాఁ జెప్పుచో నొక్కటి యథర్వణునకు సమ్మత మనియు నొకటి గా దనియు నియమించుటకాధార మేమి? వఝలవారిసిద్ధాంత మొండు కాకూడదు గదా. కాఁగా నీకారిక నథర్వణుఁడే చెప్పియున్న నయ్యది యథర్వణాంగీకృత మనక తీరదు. కాఁగా నహోబలపత్యాదు లిట్లుదాహరించుటను వఝలవారు తిరస్కరించుట యన్యాయ్యము. కాఁగాఁ గర్మధారయమున గసడదవాదేశ మథర్వణసమ్మత మనియుఁ దేలినది. (కావున్న నిబ్బంది లేదు కాని యైనది.)

వీరె యొకపక్షమున 'తెలిదామర, తెలిదమ్మి' మున్నగురూపములే వేధి సమ్మతించునపుడు విత్కలాదిసూత్రము గాని ప్రౌఢ.సమా.38.సూ. కాని యాశ్రయించి సామాసికవిధిగాఁ గల్పించుకొనవలెనె కాని కర్మధారయద్విగువులలో గసడదవాదేశము పాక్షిక మనుట చింతామణిభారతములకు సమ్మతము గా దనిరి. (వ్యా.సం.స. 277) ఏ మైనఁ దెలిదమ్మి యనురీతి నాదేశము గలరూపము నంగీకరించుపక్షమునఁ గల దని వఝులవారు పేర్కొనుటకు సంతసింపవచ్చును. చిం. చెప్పియుండమిఁ దత్సమ్మతము గా దందురు గాక. చిం. చెప్పని వన్ని భాషయం దుండరా దని గాని తప్పనిసరిగా నంగీకరింపవలసివచ్చుచో నెట్లో సాధింపవలె ననియుఁ జెప్పుటేల?

భారతసమ్మతము గా దనుట యుచితముగా లేదు. "నలుగడలు ఇరుగడ ఇరువది యఱువది నలువది మున్నగుచోటులం దెల్ల గసడదవాదేశ మయ్యె నని

(సమాసాశ్రయవిధిగ) నెఱుంగునది' (వ్యా.సం.స.346) యనిరి. నలుగడాదులు భారతమునందలివె. కావునఁ 'గర్మధారయద్విగువు'లందు గసడదవాదేశము భారత సమ్మతము గా దనుట సరి కాదు. భారతమున బ్రయోగములు లే వని యీయాదేశమును దిరస్కరించుటయు నందువలన నీకార్యము ప్రాప్తింపకపోవుటచేత భారతాదులయందలిప్రయోగములలోనిగసడదవాదేశమును మార్గాంతరమున సాధించుటయు సక్రమములు గావు గదా. ఈయాదేశము 'నొకపక్షమున సమ్మతించునప్పు' డనిరే. వేఱొకపక్షమున నంగీకరింపకుండుట కవకాశము గల దన్నమాట. అనఁగా తెల్లతమ్మి యని యుండునా? అట్టియెడల భారతమునఁ దెల్లతమ్మి యని మాత్రమె యున్నదా?

'తెల్లదమ్మి' యనురీతి నీయాదేశము గల దని గుర్తించినపక్షమునను దీనిని సమాసాశ్రయవిధిగాఁ జెప్పనవసర మేమి? 'ఔపవిభక్తికపదస్తవిధయశ్చ' యని సమాసమధ్యమునఁ గల్గునీయాదేశమును సమాసాంతకార్యముగాఁ జెప్పుటయె విశేషము.

ఇంక సమాసాశ్రయవిధు లేవి? 'సమాసాశ్రయవిధుల నాంధ్రవైయాకరణులు విస్తరించి చెప్పలేదు. భూయసీ దేశ్యశబ్దేషు లోపవర్ణాగమశ్రుతిః, నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు అనునవి యాదిగాఁ గలసూత్రములచే సాధించుకొననగును. (వ్యా.సం.స.274) అనిరి. ఆదిగాఁ గలసూత్రము లేవియో తెలియవచ్చుట లేదు. కాని యసలు పైవి మాత్రము సమాసాశ్రవిధులను బేర్కొనునవిగా వర్షులవారియిచ్చటివివరణమునుబట్టి మాత్రమె గ్రహింపవలె. నిక్కల మున్నగునది సమాసములను బ్రస్తావించునది. సమాసములుగా నాయావానివి బ్రయోగానుసారముగా గ్రహింపఁదగు ననఁగా నిందేమి విపరీత మయిన దని లక్షణసాధ్యము గాక ప్రయోగమునుబట్టి గ్రహింపవలసివచ్చుటకు? నిక్కల మొదలగువానికంటె భిన్నముగా నలుగడాదులఁ గల్పించుకార్య(గసడదవాదేశ) మీవ్యాకరణములందుఁ బ్రస్తావింపఁబడియే యున్నది. కావున దాని ననుసరించియె సాధించికొనుట యొప్పును.

ఈఁకాదిసూత్రమునందు వర్షులవారు బహుళపదమును బ్రయోగించిరి. దానిచేఁ 'గనన మ్యె డనమ-' యనురీతిమహాకవిప్రయుక్తస్థలములసంధిని గుర్తింపవలె నని వారియుద్దేశ్యము. సూరి ప్రస్తుతసూత్రమునను బహుళపదము ప్రయుక్తము. దీనిచే నైనను గవిప్రయోగానుసారముగాఁ బూర్వపదము ప్రథమాంత మగుకర్మధారయాది సమాసములలో గసడదవలు గల్గుటను సాధించుకొనవచ్చును గదా. కావున తెలిదమ్మి,

తెల్లగంటి యిత్యాదులలోఁ గసడదవాదేశము సమాసాశ్రయవిధిగా నిరాధారముగాఁ జెప్పుటకంటెఁ బ్రస్తుతగసడదవాదేశవిధానస్థలమునందలిబహుళపదముచేఁ గవిప్రయోగానుసారముగ నాయెడల నీవిధిచేతనె గసడదవ లగు ననుట యుచితము. కావున పిన్నతునియ లిత్యాదుల బాధ లేదు. సూత్రాంధ్రమున కర్మధారయమందలిగసడదవలను బ్రస్తావించినసూరి యిట బహుళపదసాధ్యమైన దని యెంచియుండవచ్చును. (ఏమైన నేదో సమాసాశ్రయవిధి యనుట మాత్రము నిరాధారము.)

## వే-వేగ-గసడదవాదేశము :

వేవేగశబ్దములపయి నీయాదేశము లేకపోవుటనుగూర్చి 'ఇట్టిచోటులందలి వే,వేగశబ్దములు ప్రథమాంతవిశేష్యములు కావనియు వేగముగా అనువర్థమున ఉత్తకన్‌శబ్దక్రియావిశేషణములుగా భారతకవులచేవివక్షింపఁబడిన వనియు నక్కారణమున వీనిమీఁద గసడదవాదేశము భారతకవిసమ్మతము కాదయ్యె ననియు గ్రహింపవలయును' (వ్యా.సం.స.274) అనిరి. కన్‌శబ్దము లోపించిన దనుటకంటె (నుజ్యంత మగునగుధాతువురూపము. క్రియా.115) 'కాను'శబ్దము లోపించినదనుట యుక్తము. (ప్రౌఢ. క్రియా.22) హ్రస్వాదులు చేసి లోపింపఁజేయుటవలనఁ బ్రయోజన మేమి? ప్రక్రియాగౌరవము దప్ప. అసలు కాను చేరలే దని చెప్పుట యింకను లాఘవము.

వచ్చి లోపించిన దనియె యుందము. అందువలన గసడదవాదేశము రా దని చెప్పుట యెట్లు? విశేష్యముకాకుండ విశేషణ మగుఁ గాక. అవి ప్రథమాంతములు గావా? విశేషణములపై రా దనుటకుఁ బ్రమాణ మేమి? ఒండుగడ ఎంత గుమతులు అనుకీతిస్థలములందు "ఒండు ఎంత మున్నగునవి విశేషణార్థము నిచ్చుచున్నను నివి ప్రథమాంతసర్వనామము"(వ్యా.సం.స.274)లనిరి.ఈవాక్యములచే విశేషణములన్న నాదేశము వచ్చుటకు వీలు లే దనియు నందువలన విశేషణార్థకములై (విశేష్యములు గాక?) ప్రథమాంతము లగుటవలన నాదేశ మైన దనియుఁ జెప్పుట తోఁచుచున్నది. ఇట మాత్ర మ ట్లేల తలఁపరాదు.

'కాను' లోపింపలే దందము. వేగ కా వేగ కన్ అని యుండునా? సూరి 'యిట నరకంబు నిత్యంబు' (క్రియా.116) అనె. వీనిపైని బ్రస్తుతసూత్రముచే

(బాహుళకమువలన) గకారాదేశము నిత్యము.వీరు నిట్లు నిరూపించిరి. 'ఇవి ప్రథమ మీఁద నిల్చునపుడు గకారాదేశము నిత్యము. (చూ.సంధి.14సూ) (ఉ.427) వేగ+కా- అనుచోఁ బ్రథమమీఁద నిల్చుటచే గాదేశ మీసూత్రముచే నిత్యముగా నైనది. అది విశేషణ మైనను నాదేశ మైనది. ఇట నేల కాదు. అటఁ బ్రథమాంత మె. కాను చేరునపుడు ప్రథమాంత మైనయీశబ్దము కాను లోపించినఁ బ్రథమాంతము గానే రదా?

ఇంకను బై రీతిని జెప్పుటలో వేవేగశబ్దములపై భారతేతరస్థలముల నీయాదేశము గల దని వరుులవారియభిప్రాయమును జెప్పవలసియున్నది.కాని యట్టిప్రయోగము లింతకుఁ గానరావు. వీరును జూపలేదు. భారతమునం దున్న (ఇతరగ్రంథముల నున్నను) కన్లోపము గలవిశేషణములుగాఁ గాక విశేష్యములుగా సమన్వయించిన సరిపడునా? (అన లింతకును వేగగా, వేగా, నన్నవియు వెదుకవలె.) వరుులవారియాకల్పన మెల్లఁ బరస్పరవిరుద్ధ మనక తీఱదు.

వేవేగశబ్దములు విశేషణము లైన విశేష్యము లైనఁ బ్రథమాంతము లగుట మీఁద గసడదవాదేశము రాకతప్పదు. కవిప్రయోగముల నట్టికార్యము గానరాదు గావున నాదేశాభావమును బ్రస్తుతసూత్రమునందలిబహుళపదముచే సిద్ధించుచున్నట్లు గుర్తించుట సమంజసము.

### అవ్యయము_గసడదవలు :

'అవ్యయే కర్మధారయే' యున్న బాధర్వణము కాదు గాన నవ్యయములపైఁ గూడ గసడదవ లుండుట వరుులవారికి సమ్మతము గాదు.

'అట్లుగ' (నిర్వ.4.7) ననుచో నట్లుశబ్దముపై నీయాదేశ మున్నది. కావున దీనిని సమన్వయించుటకై యిది యవ్యయము గా దనిరి. "అట్టు ఏకవచనము. అట్లు బహువచనము. అటులన్ అట్లన్ -ద్వితీయాబహువచనములు. ఇట్లగుటచే అట్టు-అట్టులు అనునవి యవ్యయములు కా వనవచ్చు' '(వ్యా.సం.స.288) ననిరి.'కా వన వచ్చు' ననుటలో నివి యవ్యయము లగు ననునభిప్రాయమునకు నవకాశ మున్నది. అయ్యావిభక్త్యంతరూపములు తత్తద్విభక్త్యర్థమున నున్నవా? అని నిశ్చయముగాఁ జెప్పరాదా? అట్టు, అట్లు అనునవి రెండును బర్యాయములె యనుట స్పష్టము. కావు ననె ప్రౌఢ.'కొన్నియవ్యయంబులు బహువచనాంతతుల్యంబు లగు' నని పేర్కొని

యివ్వాలిం జూపెను. ఆయభిప్రాయమును దిరస్కరించుటకుఁ దగినబల మైనయాధారములను వయిలవారు ప్రదర్శింపకుండుటచే వివి యవ్యయములు గా వని విశ్వసింప రాకున్నది.

కాఁగా నవ్యయములపైఁ గొన్నియెడల నాదేశము నంగీకరింపఁదగు. అను ప్రయుక్త మగు 'కాను' శబ్దకకారమునకు గాదేశము నిత్యము. 'అట్లుక' అనురీతిరూప మన లుండను గదా.

## ద్వంద్వము-గసడదవలు :

'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' (15) నను సూరిలక్షణమును వీ రట్ల గ్రహించిరి. (ఉ.15సూ)

ద్వంద్వమునందు చతపలకు సదవలు గొన్నియెడలఁ గానఁబడకుండుటను ప్రౌఢ. పేర్కొనఁగా వయిలవా రది ప్రబలప్రమాణమూలకము గా దనిరి. ప్రౌఢ. చూపినలక్ష్యములు 'ప్రాసస్థలనిబద్ధములు గామింజేసి యచ్చటియాదేశరాహిత్యము తత్కవ్యభిప్రేతమే యని నిశ్చితము కానేరదు'(వ్యా.సం.స.278)ప్రాసస్థలనిబద్ధము లయిన దిద్దుటకు వీ లుండదు గాని యితరస్థలముల దిద్దవచ్చును గావున నవి ప్రబలములు గా వన్నమాట. అయ్యు 'నర్వాచీనమహాకవు లీయాదేశవిషయమున నియతత్వ ముపేక్షించి రనియుఁ (వ్యా.సంస.స.278) బేర్కొనిరి. కాఁగా భారతేతరము లం దున్నకండకుండెములు,రాకపోక లనుచోటియాదేశము లేమిఁ బ్రాసేతరస్థలమం దున్నను స్వీకరింపఁదగు ననుట నంతసింపఁదగినదే. కవిప్రయోగముకంటె నితర మైనప్రమాణ మేమి కావలె సూత్రించుటకు? వీరు ఇఁకారులలోఁ జూపిన-'కననయ్యె డును' అనురీతిని భారతప్రయుక్తములా?ఏల స్వీకరించిరి? ఉ.లో వైన ద్వంద్వము నందలియీయాదేశాభావమును బ్రస్తావింప రేమి? క్వార్థకేకారసంధివలె (ఉ.సంధి. 8)నీయాదేశనిత్యతయు భారతమం దనియో భారతాదులయం దనియో చెప్పకపోయి రేమి? భారతమందలిది గాకున్నను. దిక్కనప్రయోగము అప్పాచెల్లె ల్లన్నది ప్రౌఢ. చూపినది. దానింగూర్చి 'తాళపత్రమాతృకలలో- అప్పఁజెలియ లి ట్లని- ఇ ట్లిపట వ్యస్తముగనె తిక్కన ప్రయోగించె ననుటలో బాధ చూపట్టు' (వ్యా.సం.స.278) దనిరి. అనఁగాఁ దాళపత్రప్రతులలో. అప్పఁజెలియ లనియే యుండ ముద్రప్రతు లం దెల్ల అప్పాచెల్లె లని యుంట నజ్ఞకర్తలు దిద్దిరనవలె.ప్రౌఢవ్యాకర్త గూడ

పఘులవారివలెఁజూచినఁ దాళపత్త్రప్రతుల ననుసరించి అప్పఁజెలియ అనియె గ్రహించెడివాఁడేమో. అప్పఁజెలియ అని ప్రయోగించె ననుటలో బాధ చూపట్ట దనుట విశేషము. అప్పాచెల్లె అని ప్రయోగించె నన్నచో బాధవీరిసిద్ధాంతమునకు విరుద్ధము గాన నంతె కాని వీరియభిప్రాయమున కనుగుణముగా నున్నట్లు గ్రహించుటలో బాధ యెట్లు చూపట్టును? ఇట్లు బాధ చూపట్టకుండఁగాఁ గవిప్రయోగముల నెట్లైని గ్రహింపఁ వగు నేమో.

ఇంకను వీ రింతకు ముందు 'ద్వంద్వసమాసమందలిగసడదవాదేశమునకును -- ప్రాసాదిస్థలగతప్రబలప్రయోగములు లభింపలేదు. కాని యీవిషయమున -- నన్నయభట్టారకుసూత్రమె ప్రబలప్రమాణ (వ్యా.సం.ప.277) మనిరి. అదృష్టవశమునఁ జిం.లోఁ జెప్పఁబడినది గాన సరిపోయినది కాని లేకున్నఁ బ్రబలప్రయోగములు లభింపలే దని వీరు ద్వంద్వమునందును (అసలు సమాసమునం దెక్కడను) సడదవాదేశ ముండరా దనియుఁ దాళపత్త్రప్రతులలో నట్లు లే దనియుఁ జెప్పెడివారేమో యని తోఁచుచున్నది. నన్నయాధర్వణులపై వరులవారికిఁ గలయనన్యప్రామాణికబు వలన నాంధ్రభాషకు వారివలన జరుగవలసినంతన్యాయము జరుగలే దేమో యని పించుచున్నది.

ఏమైనను ద్వంద్వమున గసడదవాదేశమును నియతముగను నాదేశాభావమును గవిప్రయోగానుసారముగాను గ్రహింపఁదగు ననుటయే యుక్తము.

### పరుషములకు-సరళములు :

ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు (16) ననుసూరిసూత్రమును 'ద్రుతముమీఁదిపరుషములకు సరళము లగు' (ఉ.16సూ) నని సవరించిరి. వీరిసవరణమువలన "ద్రుతోపజీవిశబ్దములమీఁదను వీయాదేశము గల్గు (ఉ.45) నని ప్రయోజనమును వివరించిరి. కావచ్చును. సూరిలక్షణమున దోష మేమి? "సూరి ద్రుతప్రకృతికములమీఁదిపరుషములకు అనుట సరి కాదు. ద్రుతోపజీవిశబ్దములమీఁదను వీయాదేశాదు లగును. ఉదా. అదియును గాక మెు॥ (ఉ.45) అనిరి. దోసఁగు చిం.లోను గలదు. ద్రుతప్రకృతికాత్పరళాస్స్యుః లుగ్వా ద్రుతప్రకృతకాత్పరతః మున్నగాఁ జిం.లోను ద్రు.ప్ర.శబ్దము ప్రయుక్తము. అది నదియును గాక, ఉయ్యెల యునుబోలె ఇత్యాదిరూపము లసాధ్యము లని వీరు పేర్కొనలేదు.

(చిం.)బాల.మతమున నిరూపములు గా ననుట యసంగతము.వీరివలె సూరి (చిం.)ద్రుతాంతములను ద్రు.ప్ర.లు ద్రుతోపజీవులు నని రెండుగా విభాగింపలేదు. ద్రుతము చివర నున్నయవి యెల్ల ద్రు.ప్ర.లే. అందులకే వరుసలవారు ద్రుతోపజీవులుగా ద్రు.ప్ర లకంటె భిన్నముగా నిటఁ బేర్కొను ఎంతయున్, అయ్యున్ అనువానిని సూరి ద్రు.ప్ర.లలోనే చూపెను. 'అదియును' అనుచోఁ జివర ద్రుతము గలదు.కాన నాశబ్దము ద్రు.ప్ర.కాన దానిపై సరళము లగుట మొద లగుకార్యము లెల్ల నగును. అసలు ద్రుతోపజీవు లని వేఱు చేయనిబాల.మతమున నవి ద్రు.ప్ర.లే యగుచుండ ద్రు.ప్ర.లయెడఁ జెప్పినకార్యము వానియెడ నగుటలో బాధ యేమి యున్నది. సూరిలక్షణ మాతనిప్రణాళిక కనుగుణమై సూక్తమె.

ద్రుతోపజీవులు ద్రు.ప్ర.లు ననుభేదము(వి.వి.లోఁ గల దనుట విచార్యము) పేరు కల్పించికొనిరి. కావున వీరిమార్గమున బాధక మగుచో ద్రు.ప్ర.లమీఁద ననేక యేమైన నందురు గాక. ఆయవసరము సూరి కే మున్నది.

ఇంకను ద్రు.ప్ర.లు ద్రుతోపజీవులు భిన్నము (వ్యా.సం.స.89)లని పేర్కొన్నవీరే తద్విరుద్ధముగా ద్రుతోపజీవులలో నుదాహరించి యుండుట (ఉ.14)గుర్తించితిమి. ఇంకను ద్రుతోపజీవు లనుభేదమును గల్పించుటవలన శాస్త్రమున నెట్టిప్రయోజనమును లేకుండుటయు నట గమనించితిమి. కాఁగా వరుసలవా రాశ్రయించిన సూరిమతముకంటె వే ఱగుమార్గమె సరి కా దని నిశ్చయింపఁదగును.

సూరిలక్షణము నిర్దుష్టము నవశ్యగ్రాహ్యము.

### సంశ్లేషము :

'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు.' (17) ననుసూరిలక్షణము నట్ల గ్రహించిరి. (ఉ.17సూ)

సూత్రమందలిబిందుశబ్దముచేఁ బూర్ణార్ధములు రెండును గ్రాహ్యము (ఉ.48) లనుట వీరిమతమునకుఁ గొంతభిన్నమైనను (ఉ.సం.14,15సూ) సూరిమతమున కనుగుణము.

'సూరి సంశ్లేష మనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట అని వివరించుట సరి

కాదు. సూరిపక్షమునను ద్రుతము నుస్వరూపము' (ఉ.48) కావున 'సంశ్లేష మనఁగా ద్రుత మకారలోపపూర్వకముగఁ బరహల్లుతో సంయోగించుట' (ఉ.48) యని వీరి వలె సూరి సంశ్లేషమును వివరింపవలె ననిరి. ఇది సూరిమతమునకు వివరణమె యనఁదగును.

సూరి సంశ్లేషమునుగూర్చి గు.ప్ర. స్వరలోప మనుటను వివరింపఁగా వీరు ద్రుతస్వరలోప మవసానమునకే చెప్పఁబడుటచే హల్పరకత్వమున నెట్లు వచ్చు నని శంకించి సంశ్లేషవిధాన మసంగతము వ్యర్థము గాకుండ నట్టిసంశ్లేషవిధానసామర్థ్యముచే స్వరలోపము నంగీకరింపవలసియున్నట్లు పేర్కొనిరి. (వ్యా.సం.స.285) వీరెట్లు చెప్పినను సూరిమత మిదియె. అయ్యు సంశ్లేషవిధాన మసంగత మగు నని తలఁపరాదు. ద్రుతము సస్వర మగుటచేతనె సంశ్లేషవిధాన మవసర మగుచున్నది. (చూ.ప్ర.కా.)

వీరు సంశ్లేషమును 'స్వరలోపపూర్వకముగఁ బరహల్లుతో సంయోగించుట' యనిరి. స్వరలోపమును జెప్పినఁ బరహల్సంయోగము చెప్పనేల? పదాంతంబు లయిన నులురుల యుత్వము హల్పరకత్వమున లోపించునప్పుడు, ప్రాన్పడె, విల్వాని, వత్తుర్వా రనురీతిగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట ప్రత్యేకముగా విధింపఁబడినదా. లేఖనమున మీఁదిహల్లుతోఁ గలిపి వ్రాయకున్నను నుచ్చారణమున స్వరలోపముచే నట్టి సంశ్లిష్టత సిద్ధము. అందుకే సూరి వచ్చెన్ ఋషి (ప్రకీ.1) సంశ్లేషమున కుదాహరించె. వీరు తమలక్షణమున కనుగుణముగా వచ్చెన్ఋషి యని చూపిరి. వచ్చెన్ ఋషి యని వ్రాసినఁ దప్పు గాదు గదా. సంశ్లేషమునకు- ఇచ్చటన్ మె చ్చగు. (ఉ.478)

కాఁగా వరుఁచవారిసంశ్లేషవివరణమున స్వరలోపము చెప్పినఁ బరహల్లుతోఁ గూడికొనుట వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు. పరహల్లుతోఁ గూడికొనుటను జెప్పిన (సూరిమతానుగుణముగ) స్వరలోపమును జెప్ప నవసరము లేదు.

సూరివివరణము నుచితమె.

## స్వత్వము :

చిం.లో ను,వి, అనునవి ద్రుతములు గా వనియు అట్లున్నచోట్ల 'ను' కళ యనియు నహో. ప్రమాదముచే సూరియు నట్టిది ద్రుత మని భ్రమించియుండు ననియు,

(వ్యా.సం.స.284) వఝలవారు పేర్కొనిరి. పైతపయభిప్రాయమునందలియనంగ తలను వారే గుర్తించి రవి ఉ.లో సువర్ణంబు ద్రుతం బని చెప్పి ద్రుతము యొక్క నునిలనుస్వత్వరూపములను సాధించుటనుబట్టి గ్రహింపవచ్చు. (చూ.ప్ర.)

## సరళస్థిరపరకత :

'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' (18) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి.

ఇచట వఝలవారు 'వచ్చెన్ క్షత్రియుఁడు ఇత్యాదులలోఁ బర మైనవరుసము లకు సరళములు గాకుండుటను వివరించిరి. సూరి సూత్రాంధ్రమున 'న చయశ్చరి విక్రృతిః' అని సూత్రించెను. కాఁగా బాల.లో నీవిశేషాంశమును బూర్వ(సంధి.17) సూత్రమునందలివిభాషాపదమునకు వ్యవస్థ చేసి గ్రహింపఁదగును. కాని సరళములు గాకుండుటయె కాక సరళస్థిరపరకతయందువలె లోపాదు లగుటయుఁ గలదు. కావున నీయంశమును ప్రత్యేకముగ సూత్రించుటయె యుచిత మేమో యనిపించు చున్నది.

## మకారపరకబిందువు :

వర్గయుక్సరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిం దువును గానంబడియెడి (19) ననుసూరిలక్షణము వివరించి వర్గయుక్సరళములు మకారమును బరంబు లగునపుడు కొన్నియెడల ద్రుతమునకుఁ బూర్ణ బిందువును గానంబడియెడి (ఉ.19వ.) నని పేర్కొనిరి. సూరి యొకానొకచో ననఁగా వీరు కొన్నియెడల ననిరి. ఒకానొకచో నన్నది కొన్నియెడల ననుదానికంటె విరళతా సూచక మగుచు నముచితమ యనఁదగియున్నది.

ఇఁక నిట విశేషము. మకారపరకతయందును ద్రుతమునకుఁ బూర్ణబింద వును జెప్పుట. అవసరమా?

ఇమ్ముగ, పంద్యుం ముని, కమ్మనిలతాంతములకుం మొనసి- ఇది యమా నాపికప్రాస మని యప్పకవి యుదాహరించెను. (ఉ.48) అప్పకవి యమానాపికప్రా సము నిట్లె చెప్పెను. కాని యిం దేదియు నట నుదాహరింపకుంట విశేషము. ఈరీతి

నన్నయప్రయోగములను దృష్టియం దుంచుకొనియె యాప్రాసమును జెప్పెనా? అయిన నన్నయ ప్రయోగ మొక్కటిని జూపలే దేమి? (ధాతంనాభిని అనుదాని కాధార మేమి?)

అప్పకవి యనునాసికప్రాసము చెప్పెను గావున మకారమునకు ముందటి ద్రుతమునకుఁ బూర్ణబిందు వగు ననవలెనా? అప్పకవి యచట తమకుఁ దాము ద్విత్వంబులై తనరుననియుఁ, బూర్ణబిందులు దాపలఁ బొరయుననియుఁ, గలసి యనునాసిక ప్రాసము అనుపేర, నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁదాము (అప్ప.3.340) అని నకారమునకు సైత మిట్టిప్రాసను జెప్పెను. మిన్నేఱు పాదమున ధాతంనాభిని (341) అని యుదాహరించె. అప్పకవి చెప్పినయనునాసికప్రాసము ననుసరించి మకారపరకతయందు బిందువును జెప్పిన పీ రాచోటనే చెప్పినదానింబట్టి నకారపరకతయందు మాత్రము బిందు వేల గ్రహింపరు? ప్రయోగములు లే వనియా? అయిన మకారపరకతయందు బిందు వగు ననుటయును ప్రయోగములనుబట్టియే చెప్పవలెఁ నంతియ కాని యీయంశమున కప్పకవి యనునాసికప్రాస మాధార మనరాదుగదా.

కాఁగా నాధారము కవిప్రయోగము. కవిప్రయోగములం దిట బిందు వున్నదా? పంద్యమ్మ్ముని (పంద్యం బరమున్ అని కొన్నిప్రతులు) పేసె మ్మహానది, లతాంతములకు మ్మొనసి యనురీతిగా ద్రుతస్థానమున మకారమె యున్నది కాని బిందువు కానరాదు. బహుశః అందుకే అనఁగా నిట బిందు వున్న దనుట కాధారము లేకపోవుట వలననె వరులవా రప్పకవి 'యనునాసికప్రాసము'ను ప్రమాణముగాఁ జేకొనియుందురు.

'కేచిద్ద్రుతస్యభేదత్వమనుస్వారమకారయోః అనుకారికచే నధర్వణుఁ డీ'కమ్మ నిలతాంతములకుం మొనసి' (వ్యా.సం.స.287) యనురీతిస్థితి నంగీకరించె నని తలఁచుటవలననె వీరెల్లెడల దీని నిట్లు చూపుచుండి రనవచ్చును. (ద్రుతమునకు మకారమును జెప్పులక్షణము 'నన్నయాధర్వణుల'గ్రంథమున లేకుండుటయు నొకకారణము గావచ్చు నేమో.) అహోబలుఁ డీకారికచే సున్నస్థానమున మకారము చేసి లతాంతములకు మ్మొనసి (కవిశి.297) యని చూపుట గమనింపఁదగును. ఇట్లు కవిప్రయోగముం బిట ద్రుతమునకు మకారమె కన్పించును. (అంమ శంపనిధి అనురీతిప్రాఁత పద్ధతిలో నొకవేళ నెట నేని లతాంతములకుం మొనసి యని యున్నను నది యట్లే

యని నిర్ణయింప నవకాశ మేది?)ఇట్లు ద్రుతమునకు మకారమె కన్పించుటయు నట్లు లాక్షణికులు వివరించుటయు (సూరియు) గ్రహించియె ప్రౌఢ. ద్రుతమునకు మకారము విధించినది. కావున 'పైవిషయములను గ్రహింపక ప్రౌఢవ్యాకర్త ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు'అని మార్గాంతరమును ద్రొక్కుట సరి కా (ఉ.49) దని వఝలవారు విమర్శించుట సమంజసము గాదు. ప్రాసమునం దనుట సరి కాక పోవచ్చు నేమో కాని ప్రౌఢవ్యాకర్త ద్రుతమ్మునకు మకారాదేశమును జెప్పుట శిష్ట మయినదే కాని స్వతంత్రకల్పనము గాదు.

కాఁగా మకారపరకతయందు ద్రుతమునకు మకారము చెప్పవలెఁ గాని పూర్ణబిందువును గాదు. కావున సూరికంటె నధికముగా వీరు సూత్రమున 'మకారమును' అని చెప్పుట తగ దనియు సూరిలక్షణమె సూక్త మనియు గ్రహింపఁదగును.

'పూర్ణబిందువును అనుచోటిసముచ్చయార్థకనుశబ్దముచేతఁ బూర్ణ బిందువేకాక వెనుకటిసూత్రముచొప్పున లోపసంశ్లేషస్వత్వములు నగు నని (ఉ.48) వివరించి తదనుగుణముగాఁ బూర్ణబిందురూపమును ముందు చూపి లోపాదులతోడిరూపము లను బిదప నిచ్చిరి. ఇట బిందువునకుఁ బ్రాధాన్యము గల్గుట సూరిమతము గాదు. 'లోపాదులతోపాటు పూర్ణబిందువు'నగు నని లోపాదులు సామాన్యములుగను బూర్ణబిందువు కవిప్రయోగైక గ్రాహ్య మగుచు విశేషముగను జెప్పుట సూరి మతము.

మకారపరకతలో వీరు విశేషముగా బిందువును జెప్పియు, నీలక్షణమును వర్గయుక్పరకశపరకద్రుతసంధిగా సూచించుట విశేషము.

## స్థిరపరకసంధి:

వర్గయుక్(మకార)పరకత్వమునఁ బైసూత్రముచే బిందువు రాఁగా వచ్చెం ధాత్రీపతి యనురీతిరూపము లగును. దీనిం గూర్చి "సంజ్ఞా.16సూత్రముచొప్పున స్థిరపరకబిందు వుండరా దనుట కీసూత్ర మపవాద మగుచున్నది. (ఉ.48) యనిరి. (వ్యా.సం.స.290) కాని యాసూత్రము 'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగు శబ్దములయందు-' అనుచున్నది. ఇ ట్లనుటచే నిది యచ్చతెనుఁగుశబ్దమధ్యమ్మునం దని చెప్పవలె. ('వైకృతమధ్యేఽత్ర నాన్యవర్ణే పరే తు మః'అని వి.వి.మూలాంశము)

పదాంతబిందువునుగూర్చి యీసూత్రము చెప్పదు. భాషయం దనక శబ్దములయం దనుటచే (హల్లు పరముగా నుండునట్లుగా బిందు వుంచుచో నాపర మగుహల్లు పరుషమో సరళమో యగును.) శబ్దమధ్యమున నని యర్థ మగును.

పచ్చెం ధాత్రీపతి యనుచో బిందువు పదాంతమునందలిది. (ధాత్రీపతి సంస్కృతసమశబ్దమును.) ఉదయించినం ధరిత్రి. మొ॥ ఇట్టిచోట్లబిందుప్రసంగమున సంజ్ఞా16సూత్రమున కిది యపవాదమను బాధకము ననుట సరికాదు.

## అవసానద్రుతకార్యములు :

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు' (20)ననుసూరిసూత్రమున 'బహుళంబు' తొలఁగించిరి. 'విభాష' యనిరి.

"గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబు లేదు -- ఈసూరివాక్యము లనావశ్యకములు' (ఉ.49) అనఁగా పీప్రయోజనముకయిచే సూరి సూత్రమున బహుళపద ముంచె ననియు విది యనావశ్యకము గాన బహుళపద మనవసర మని యు వీరియుద్దేశ్య మని వ్యా.సం.స.(807)నుబట్టి గ్రహింపవచ్చు. కాని సూరిగారి యీవాక్యము లనావశ్యకము లన్నవీరు సైతము "ఈలోపము పద్యాంతములందు గణానుసారంబుగ వ్యవస్థితం బయియుండు' (ఉ.49)నని సూరి ననుసరించిచెప్పియే యుండిరి. వీరు విభాషాపదమునకు వ్యవస్థ చేసి ప్రవృత్త్యప్రవృత్తులను సాధించుచునే యుండిరి. 'ఈనాల్గింటిలో నేదైన యథాసంభవముగా వర్తిల్లునపుడు' [ఉ.36] బహుళపదము ప్రయోగింపఁదగియేయున్నది. కావున సూరిలక్షణమున నెట్టిదురుక్తి యును లేదు.చేయుచున్నాను (చాను)ఇత్యాదుల ద్రుతస్వర,లోపాదువిషయము మొదలగునంశముల పీబహుళశబ్దము సార్థకమె.

గుర్వవసాయి యగు మున్నగు వనావశ్యకము లన్నవాక్యము 'ఈలోపంబు పద్యాంతములందు గణానుసారంబుగా వ్యవస్థితం బయియుండు' ననుదానికేవివరణప్రాయము. అవి యనావశ్యకము లన్నవరులవారు దానికి మూల మగు'ఈలోపంబు ఇత్యాదివాక్యము నేల గ్రహించిరో తెలియదు.ఇదియు ననావశ్యక మె.(చూ.ద్రు.కా.)

## ద్రుతము మీఁద నకారము :

'కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' (21) ననుసూరి లక్షణమును వీరు 'కొన్ని యెడల ద్రుతంబుమీఁద ద్రుతంబు గానంబడియెడి' (ప్ర.27 సూ) నని చూపిరి. సూరి విధించిననకారమును వీరు ద్రుతముగాఁ బేర్కొనిరి. ఈ నకారము ద్రుత మె కదా యని వీ రిట్లు చెప్పియుందురు. కాని యిది సరి కాదు. 'పదాంత నువర్ణంబు ద్రుతంబు' అని కదా వీరు ద్రుతలక్షణమును జెప్పిరి. పదముచివర నుండు నువర్ణ మిట నగుట యెట్లు? నువర్ణమును సాధారణముగా ద్రుత మనలేదు గదా.

సూరియు ద్రుతము నుస్వరూపముగనె భావించినవాఁ డగుట ప్రసిద్ధమె. అయిన నిట సూరి నువర్ణమును గాక నకారము విధించెను. దీనివలన నిట వచ్చిచేరునదే పొల్లనకారము కావున ద్రుతకార్యము లగునపుడు స్వత్వస్థితిలోను అడియునున్ గాక యని పొల్లనకారమె యుండును. నువర్ణమును విధించిన స్వత్వస్థితిలో అడియును నుగాక యని కావలె. అట్టిరూపములు భాషలో నుండవు. కావున సూరి 'నకారం' బను టచే స్వత్వములో నువర్ణముతోడియపరూపముం బ్రసక్తి లేకుండఁబోవుట ప్రయోజనము.

'ను' ఆగమము చేసిన విభాషకు వ్యవస్థచేసి యీ ద్రుతమునకు స్వత్వము లేదని చెప్పవచ్చును. కాని వీరుల వా రట్లు వివరింపను లేదు.

## చాద్యర్థకము :

వీరి ప్రణాళిక యేమో స్పష్టము కాదు. ఇట వీరు చాద్యర్థకమౌశబ్దమునుగూర్చి వివరించిరి. ప్రౌఢ. లక్షణానుగుణముగాఁ జెప్పినదీనిని వీరు సూత్రముగాఁ బేర్కొన లేదు. అందువలన నీయంశము పైసూత్రమునకె వివరణముగాఁ జెప్పిన ట్లగు చున్నది. సం.లో నిట్ల చెప్పఁబడినది. అది యసంగతము. చూ. ద్రు.కా.

ఇఁక వీరివివరణమును జూతము. 'ఇయ్యది సముచ్చయాద్యర్థవిశేషబోధక మగునుశబ్దము) కళలమీఁద 'యును' లేదా 'ను' అనురూపముతో నిల్చును." —ఇట శబ్దమే 'ను' స్వరూపము గలది గావున నది 'ను' అనురూపముతో నిల్చుటలో విశేషము లేదు. ఇఁకఁ గళలపై 'యును' అని యువర్ణము పూర్వమందుఁ గలిగియుండుట విశేషము. కావున 'కళ లగునపుడంతశబ్దములమీఁద యువర్ణపూర్వకంబు విభాష నగు'

అని ప్రౌఢ. చెప్పినవిధ ముచితము.దానికి వివరణముగాఁ జెప్పఁదగు నన్నను విట పీ రాయర్థము నాపద్ధతిలో వివరింపవలె.

దీని కుదాహరణములలో 'సుబంతములమీఁద అదియునుం గాక-అనునదియుఁ జూపిరి (ఉ.58) అది శబ్దముపై 'యును' నిల్చిన అదియును గాక యని యగును. తదియునుం గాక, యని మ తొక్క ద్రుతము పై సూత్రముచే నైనదా? అనఁగా వివ రణము సూత్రమునకు సంబంధించినది కాదు. ఇట నేల?

పిదప "ద్రుతములమీఁదను ఉకారాంతములమీఁదను నును లేదా ను అనురూ పముతోను నిలుచును' అనిరి. శబ్దమే నువర్ణ మగుట విది నుస్వరూపముతో నుండు టలో విశేషము లేదు. 'నును' అనురూపముతో నుండుటయ విశేషము. దీని నాంధ్ర లాక్షణికు లెవ్వరు జెప్పినజాడ లేదు.

ద్రుతము నువర్ణము. దానిపైఁ బై వివృతిచే 'నును' అనునది చేరినపక్షమున మూఁడునువర్ణము లగును. నాకును, నాకునునును, ఇట్టివి భాషలో నేకాలమునను నుండ వని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ద్రుత ముకారాంతము గాఁగా నుకారాంతములను జెప్పుచునే ద్రుతమును వేఱుగాఁ జెప్ప నేల? కావున 'ని' అనుద్రుతముపైఁ గూడ విది యగు ననవలె. హరిని+నును ఇకారముపై విత్వము వచ్చి 'హరినినిని' అని యగును. ఎంతటి యతిశయార్థ్యర్థములు వివక్షించినను నిట్టిరూపములు భాషలో నుండవు.

కావున ద్రుతముపై 'నును' నిల్చు ననుట యసంగతము.(నువర్ణము నొక్క దానినె చెప్పఁదగు)

ఉకారాంతము(కళ)లమీఁద 'నును' నిల్చునా? దివంబునుంబోలె నన్నవి దీని కుదాహృతు లని వరులవా రెంచి రేమో. బహుళః సూరి యుదాహృతిని దృష్టియం దుంచుకొనియె 'నును' అగుటను ప్రస్తావించి రేమో. అ ట్లయిన నది యసంగతము. 'అదియునుం గాక' యనుచో 'యును'అనుదానిపై ద్రుత మె ట్లయినదో 'దివం బును' (బోలె) అనుదానిపై ద్రుత మట్ల యగును. దివంబునుంబోలె ననుచో 'నును' శబ్దమనియు అదియునుం గాక యనుచో నుశబ్దముపై ద్రుత మయిన దనియుఁ జెప్ప నవసర మేమి? దివంబునుంబోలె ననుచో నుద్రుతమునకుఁ బూర్ణ మయినది స్వత్వ మయిన దివంబునునుబోలె నని యుండునా? 'నును'విధాన మేల?

అసలు నుశబ్దము 'నును' అనురూపముతో నిలువవలె ననుటేమో వెన్కో యొక ద్రుతము చేరిన దనవలె. ఏవిధి ననుసరించి చేరుచున్నది? ఈవిధివలననె 'ను' శబ్దము 'నును' అనురూపమును బొందు నందము. అది యేల? ప్రస్తుతసూత్రముచే నుశబ్దము(ద్రుతము)పై ద్రుతము (న) రాఁగా, అదియునుంగాక యని యైనట్లు దీపంబును బోలె దీపంబునుంబోలె నన్నది ప్రస్తుతసూత్రసిద్ధ మగుటచే నీ దుకారాంతములపై నైన 'నును'శబ్దము చేరు ననుట యసంగతము.

కావున నుకారాంతములపైఁ గూడ నుశబ్దముపై నిల్చు ననియు అదియునుంగాక యనుచోవలె నిట నుశబ్దముపై గకారము చేరిన దనియు భావించినబాలప్రౌఢ వ్యాకర్తలమత మెంతయు నుచితము. వఝలవారు దానిని మార్చుట సరి కాదు.

పిదప వివరణమున 1.నుశబ్దము సముచ్చయాద్యర్థవిశేషబోధక మగును. 2. కొన్నియెడల నది నిరర్థక మగును. 3.అర్థవిశేష మున్నను నుశబ్దము వచ్చి లోపించుట గల దనియుఁ జెప్పిరి. అతిమానుషమత్యద్భుత మిత్యాదిగా నుశబ్దము లేనిస్థలములయం దది వచ్చి లోపించిన దని భావింపవలసినయవసరము లేదు. ప్రక్రియాగౌరవము దప్ప నిందుఁ బ్రయోజన మేమి? నుశబ్ద మున్నచోట్లఁ గూడఁ గొన్నియెడల నిరర్థక మగుట గలదు గదా. సముచ్చయార్థవిశేషాదులందుఁ దఱుచుగ నగు నన్నప్రౌఢ. లక్షణ ముచితము.

అదియునుంగాక ఇట మీఁదఁ జెప్పినదాని కతిశయము సముచ్చయార్థము. '-- ఇట్టి వెల్ల నిరర్థకములుఁ బాదపూరణములు నని బాలవ్యాకర్తయుఁ బ్రౌఢవ్యాకర్తయుఁ దలంచుట సరి కా' (ఉ.60) దనిరి. సూరిసూత్రము సాధించురూపములను బ్రస్తావించి యిట్లు వివరించుటంబట్టి వీరియీవివరణము వయిసూత్రమునకుఁ బ్రాణము గనె వఝలవారు తలఁచి రేమో యనిపించునది సరి కాదు.

'అది' యనుదానిపై 'యును' చేర అదియును అని యయ్యె దానిపై ద్రుత మెక్కడిది? ద్రుతముపై ను లేదా 'నును' అనురూపముతో నిల్చు ననువివరణముచే నతిశయార్థమున నువర్ణ మైనదా? అయిన సూత్ర మేమి చెప్పుచున్నది?

ఇచ్చటిరెండవద్రుతము సూత్రముచే నైన దన్న సూత్రమునం దర్థవిశేషము

ప్రస్తావింపఁబడలేదు. అర్థవిశేషమును జెప్పలే దని తిరస్కరించిన సూరిసూత్రమునె కదా వీ రిట నుద్ధరించినది. కావున సూత్రముచే ద్రుత మైన దన్న నది నిరర్థకమె. కాక వివరణము ననుసరించి యర్థవిశేషమునం దైన దన్న విర్బంధి లేదు. కాని యీమాత్ర మిట నేల చెప్పఁబడియె. దీని కుదాహరణము లేవి యన్నది సందేహ మగు. వీరు వివరణమునఁ జెప్పినయర్థము సూత్రముచే సిద్ధించుట కవకాశమె లేదు.

సూత్రమున ద్రుతముపై ద్రుత మని చెప్పి వివరణమునఁ గళలమీఁద'యును' వచ్చు ననుట లక్షణవిరుద్ధము కాదా? అట్లె సూత్రమున సముచ్చయాద్యర్థవిశేషములు ప్రస్తావింపఁబడకుండుటచే సూత్రముచే నగుద్రుతము నిరర్థకమె. అర్థవంత మగుట యుం బ్రతిపాదించినవీరివివరణము సూత్రవిరుద్ధము కాదా? సూరి అదియును,(న్) దివంబును(న్) అనుచో నుశబ్దముపైని నకారమును సాధించుట కాలక్షణము చేసెను. కాని నుశబ్దమును విధించుటకుఁ గాదు. వీ రదేలక్షణమును గ్రహించి భిన్నార్థమును జెప్పుట కుదురదు.

ఇంకను ప్రౌఢవ్యాకర్త పాదపూరణార్థక మని చెప్పినది(కొన్నియెడలనున్న) నుశబ్దమును. నిరర్థకముగా సూరి చూపినది దానిపైని నకారము. (దివంబును బోలె నెట్లును భిన్నము) వీ రారెండింటి నేకము చేసి సరి కా దనుట సమంజసము గాదు.

ఇంక వీ రర్థవిశేషము విశేషముగాఁ దెల్పుదురు. 'అదియునుంగాక'యనుచో జెప్పఁదలఁచినయర్థవిశేషము 'ను'శబ్దము చెప్పఁజాలదా? అతిశయమును దెల్పుటకై మఱొకనుశబ్దము చేరినదా? ఇంకను, ఇం కింకను నతిశయము బోధింప నెంచిన నుశబ్దము లిట్లే చేరుచున్న భాష యెట్లగునో యూహ కందకున్నది.'అదియును'అను చోద్రుతముపై వీరివివరణము ననుసరించి నుశబ్దము ను లేదా నును అనుఆకారముతో నుండవచ్చును. 'నును' వచ్చిన 'అదియునునును' అని యగును.

'నును'అనుఆకారములో నొకనువర్ణ మర్థవిశేషము బోధించు నన్న రెండవది నిరర్థకము కాదా? విశేషార్థకనుశబ్దము 'నును' అనిరి వీరు. విశేషార్థకనుశబ్దముపై ద్రుతము చేరె నని చూపె సూరి. ఏది శబ్దశాస్త్రిసమ్మతము? అర్థవిశేషకల్పనముల వల్లను వారిప్రక్రియ సూరిమతముకంటె విశిష్ట మె ట్లయినది? 'నును'విధానముతో వీరె (దివంబునుంబోలె ననుచో వలె)అదియునుంగాకేత్యాదులలోను రెండవద్రుతము నిరర్థకమె యని పరోక్షముగా నంగీకరించిన ట్లయినదే కదా.

నిరర్థక మని భావించి యట్లు విధించినసూరిలక్షణము నట్లు వీ రేల గ్రహించిరి. సూరిసూత్రమును దొలఁగించి తమ వివరణమునే సూత్రముగా నుంచుకొనఁబోయిరా? వీరిలక్ష్యలక్షణములనుబట్టియును నీద్రుతము విశేషార్థక మగుటకు వీలు లేదు.

అదియును, దివంబును(బోలె)అనుచోటిద్రుతము నీసూత్రమును విధింపదు. అది విశేషార్థక మవుటయుఁగాకుండుటయు ననువానిని సూరిలక్షణము ప్రస్తావింపదు. ద్రుతంబుమీఁద నవి సామాన్యముగాఁ జెప్పుటచే నీద్రుతము నుకర్థమై కావలసిన యవసరమును లేదు. అతనివి జయింతుము. అతనినిన్ జయింతుము. అదియును-నిట్లనియె, అనవుడును నయ్యాధోముఖవిగ్రుల్ అంటివి+ఇందలకు (స్వరపరకతలో సూరిమతమున ద్రుతస్వరలోపము ప్రాయిక మనియు నందువలనఁ గొన్నియెడల ద్రుతము సస్వర మై యుండుటయు గుర్తింపఁదగు. చూ.(దు.కా.) అంటివి నిందలకు మున్నగుస్థలములును దీనికి లక్ష్యములే.ఉదాహరణములనుబట్టి కాఁబోలు నుకర్థ ప్రసంగము నధికముగా వయ్యలవారు చేసి లక్షణమున దానిని సమన్వయింపఁబూనిరని తోఁచుచున్నది. అట్టియెడల నీసూరిసూత్రమునకు మాఱుగా ప్రౌఢ. లక్షణమును జూపినను గొంత బా గుండెడిది.

అతఁడును నితఁడును వచ్చిరి యని యొక్కొక్కచో నుకర్థ ముచ్చారణసౌకర్యార్థము నిరర్థకముగాఁ జేరిన దని వీరును జెప్పుదురు (సూ.50) 'అదియునుం గాక' యనుచో (విశేషార్థక?) నుకర్థమున్పైని ద్రుతము మాత్రము నిరర్థకము గా దనిసూరి యట్లనరా దని చెప్పుదురు. ఇది సక్రమము కాదు గదా.

మొత్తముపై నుకర్థవిధానమునకును, నీసూరిలక్షణమునకును సంబంధము లేదు. ఇట్లయిన ద్రుతము నిరర్థకమై. సూరిలక్షణ మెంతయు సార్థకము.

## ద్రుతద్విత్వము:

ఇట్లు ద్రుతముమీఁద ద్రుతము వచ్చుసందర్భములవలననే ద్రుతద్విత్వమును గూడ వయ్యలవారు సాధించిరి. 'మునిన' అనుద్విత్రివర్ణములస్థితిలో నుచ్చారణసౌకర్యమునకై పూర్వనకారముమీఁదిస్వరము వికల్పముగ లోపించును.అట్టియెడల నకారద్విత్వము బాసిల్లును (సూ.67) అనిరి. త్రివర్ణస్థితియుఁ బూర్వస్వరలోపము నసహజ

విచార్యములు. కాని యిట నకార(ద్రుత)ద్విత్వమను ప్రస్తావించు టుచితము యనఁ దగును. తిక్కయజ్వ తనవిరాటంభారతభాగమున ద్రుతద్విత్వమును వాడలేదు(ఉ.51) నన్నయ వలెతావులఁ బ్రయోగించినఁ గవిజనాశ్రయాదులు దుష్టంపు అని విరసించు నా? (చూ.ప్ర.కా.) పిదపఁ బెక్కుర ప్రయోగించుటచే విది లక్షణబద్ధము చేయవలసినదే. ప్రౌఢ. చెప్పెను గదా యని వీరు సూత్రింపక వివరించి రేమో. సూరిమత మున నీసూత్రముచేతనే సాధింపఁదగు నేమో యనిపించు.

సర్వమును + అతని అనుచో స్వరపరకత్వమున ద్రుతస్వరమునకుఁ దఱుచుగా లోప మగును గావున సర్వమున్ + అతని అని యుండ నకారము ద్రుత మె కదా. ఈసూత్రముచే దానిపై ద్రుత మయి సర్వమున్న్ అతని సర్వము న్నతని అని యగును.

## కన్నాకు :

'మఱియు కను + ఆకు=కన్నాకు (ముఖ్యుఁడు) వలు + అలుపులు- వల్ల అవులు (జల్పితములు) మున్నగుచోటులు యథాప్రయోగముగ నెన్నునది.' (ఉ.57) అనఁగా నిచ్చటఁ గూడ ద్విత్వ మయిన దని యుద్దేశ్యము.

శ.ర. కన్ను + ఆకు అని పూర్వశబ్దము కన్నుగాఁ జూపినది. అయ్యుఁ బ్రౌఢ.లో కను + ఆకు అని చూపఁబడినది. కానీ వీ రాతర్వాత 'కన్-(కన్ను) పెన్ (పెద్ద) వల్ (వలు- పెక్కు) మున్నగునేకప్రహస్వాచ్కహలంతశబ్దముం (ఉత్వలోపము)పై నచ్చు నిల్చుటచేత సహజముగా నచటిహల్లు ద్విత్వము నందును. ఈటుక్కు రాదు. (ఉ.57) అనిరి. ఇపు డిది కను అని యుండునా? కన్ అని యుండునా? సహజముగా ద్విత్వము నందు ననఁగా నయ్యది శాస్త్రముచేఁ జేయనవసరము లేదా? కన్ను + ఆకు కన్నాకు- అని యగు ననుట యుక్తము గదా. వల్ల అవులు- (చూ.త్రి.శే.)

## నుడితొలిహ్రస్వము-ఖండము :

అఁటయిఁకచుఁడుశబ్దంబులందప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువునకు ద్రుతంబునకు లోపంబును లేవు (22) అనుసూరిలక్షణమును వీరు 'ఇఁక ఇఁగ అఁట మఁద్దులనుశబ్దంబులం దప్పనుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు

లోపంబును లేవు- (ఉ.22సూ) అని చూపిరి. విధానమున సూరితో వీరు భేదింపలేదు. అఁట యిఁకచుఁడు అనుటలో సూరి యకారాదిక్రమము ననుసరించె ననవచ్చును. ఇఁకతోఁ బ్రారంభించినవీరిలక్షణమున నట్టిక్రమము లేదు.

సూరి యిఁకాదులలో 'ఇఁక, ఇఁగ' అని యీరెంటిని బిందుసహితములు గానే చూపెను. కాని ప్రస్తుతసూత్రమున ఇఁగశబ్దమును జూపలేదు. వరుసవారు చేర్చు టుచితమ యనఁదగు.

అఁట-అంట- అని యుండఁదగినచోటులం దెల్ల భారతమున అటె అట్టె అనునవి సంస్కర్తలచే నిలుపఁబడినవి.' (ఉ.62) అనఁగా నన్నయ అఁట, అంట అనియె ప్రయోగింపఁగా సంస్కర్త లెల్లయెడల దిద్ది రన్నమాట. సంస్కర్తలకు అట్టియుబలాట మేమో. కాని దిద్దున దెవరు? "అటు+ఎ-అటె, అట్టు+ఎ అట్టె అనురీతి నేర్పడిన వనఁదగుటంజేసి యవి కిలార్థము ననిపించుకొనఁజాలవు. కిలార్థా దుభయోర్యోగః అనుకారికలోనికిలార్థకము అఁటశబ్దమె యనక తీఱదు గదా. (వ్యా.సం.స.323) కావున సంస్కర్తలు దిద్దివేసిరా (వ్యా.సం.స.322)యని యాలోచింప వలసియున్నట్లు సం.లోఁ జేర్కొనిరి. ఆలోచించి దిద్ది రని యిట నిర్ణయించి రన్న మాట. అధర్వణుఁడు 'కిల' యని చెప్పుటకు నన్నయ యట్లే ప్రయోగింపవలయు ననుటకుసంబంధ మేమియో స్పష్టము గాదు.(నళినదళనేత్ర వరియింప దట్టె యనుచో శ.ర. సూ.ని. 'అటె' కిలార్థకముగాఁ జేర్కొన్నవి.

## అఁటయిఁకచుఁడుశబ్దములు:

'అఁటయిఁకచుఁడు' అనుతెలుఁగుశబ్దములను యథాస్థితముగ సంస్కృతమున ననుకరించి అఁటయిఁకచుఁడుశబ్దాః అని సిద్ధసమాసము చేయఁబడిన దని తలంప నగును. (వ్యా.సం.స.320) యథాస్థితముగ ననుకరించునపుడు 'యిఁక'యనుచో యాగా గమ మెట్లు? అఁట, ఇఁకను, చుఁడు అనునవి వానియథాస్థితరూపములు. ఇది సాధ్య సమాసమె యని చెప్పఁదగును. అఁటయును, ఇఁకనును, చుఁడును అనురీతిగాఁ బొర్థ మునందుఁ దెలుఁగున వీనికి ద్వంద్వసమాస మేర్పడును. 'అఁట' యనుశబ్ద మనుకర్త మనురీతి నివి త్రిపదములే. కావున ద్వంద్వము తెలుఁగున నేర్పడుటలో బాధయు లేదు.

తెలుఁగున నైనసమానము గావున నిందుఁ దెలుఁగుసంధికార్యములు యథాగమము, (ఇఁకను అనుచో ద్రుతలోపము) వచ్చుటయు సముచితముగనె కనుపడుచున్నవి. 'అఁటయిఁకచుఁడు' ద్వంద్వమున గసడదవాదేశము రావలసియున్నను స్పష్టతకయి మానె ననఁదగు. (ఇది యొకటి యీపక్షమున సమర్థించుకొనవలసినదే.)అఁటయిఁక చుఁడు అనెడిశబ్దములు అఁటయిఁకచుఁడుశబ్దములు అనుతీరునఁ బినపఁ దెలుఁ గునఁ గర్మధారయ మగును. (చిగు రనెడికయిదువు చిగురుంగయిదువు. (వ్యా. సం.స.34)

## తాను నేనులు-సంశ్లేషము :

తానునేనువదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు. (23) అనుసూరిలక్షణ మును వర్యులవారు 'భ్రాంతిమూలకముగా'భావించి తమగ్రంథమునుండి తొలఁగించిరి. ఆభ్రాంతి నిట్లు పేర్కొనిరి. "వినా ద్వితీయ మ్మిత్యాద్యథర్వణకారిక వీరిభ్రాంతికి మూల మైయుండును. తాన్ చదివె (ఇది యచ్చుపొరపాటు గాదు.వ్యా.సం.స.325) తాన్ వినె అనుసంశ్లేషరూపము లుండవు. కాని తాఞ్చదివె తాన్వినె అనూన్వత్వము సమ్మతమె." (ఉ.52) తాన్‌చదివె, తాన్‌వినె అనురూపములును సూరిమతమున నసం భవములు. తాఞ్చదివె తావినె అనువానిని నిరసించెను. నన్నయాథర్వణుల ద్రుతస్వత్వ సంశ్లేషస్వరూపము వీరికివలె సూరి కర్థము గాలే దనుట యథార్థము. అది యుచిత ము. కావున నథర్వణుఁడు విషేధించిన'సంశ్లేషము' సూరి నిషేధించె. ఇందు భ్రాంతి లేదు. ఈవిధి సముచిత మని ద్రు.కా..లో గమనింపఁదగును.

## నేనుదానులు :

బా.సా.పే. 'నేనుదాను' అని ప్రయోగించుటంగూర్చి 'నేనుతానుశబ్దము లను కృతము లగుచు సిద్ధద్వంద్వముగ నేర్పడునపు డాంధ్రశబ్దసంబంధికార్య మగుగసడ దవాదేశము వచ్చుట దుర్ఘటము, కాన నేనుతానులమ్మిఁది అనియే యుండవలయును. నేనుతాను అనునవి ప్రథమైకవచనాంతము లగుటచే సాధ్యదంద్వ మనుట పొసఁ గదు. (వ్యా.సం.స.328) అనిరి. సిద్ధద్వంద్వ మయిన 'నేనుతాను' లనియే నుండ నవు. కాని యిది సాధ్యద్వంద్వము గా దనిరి. ద్వంద్వము ప్రథమాంతములంకే యే ర్పడును. కావి ప్రథమైకవచనము విల్చియుండుటచేఁ గుదుర దని యేమో.(అటయిన

నేదాము లని కావలె నేమో సాధ్యదంద్వమున) కాక యివి స్త్రీసమములు గామి ద్వంద్వము గుమత దని వీరియభిప్రాయ మనఁదగును. కాని యివి స్త్రీసమములే. 'నేను దానులు' అనుసమాసమందలి నేను, తాను, అనునవి ప్రథమైకవచనము నిల్చినవె యైనను యస్మదాత్మార్థములను బోధించునవి కావు. నేను అనుశబ్దమును, తాను అను శబ్దమును అనురీతిగా నాశబ్దములు మాత్రమె స్వీకరింపఁబడును. 'నేను' అనుశబ్దము అనునర్థమున 'నేను' అనునది మొత్తము ప్రాతిపదికమె యగును. కాఁగా విది స్త్రీసమమె. ఇట్లె 'తాను.' ఇట్లు స్త్రీసమము లైనయీశబ్దములకుఁ దెలుఁగున ద్వంద్వసమాస మేర్పఁడగా సాధ్యద్వంద్వ మయినచో గసడదవాదేశమునకు బాధ లే దని వరుులవారివివరణము నంగీకరించుచున్నది గదా. నేనుదానులు అని యగుటలో బాధ లేదు.

## సమానము-ద్రుతలోపము :

'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' (24) ననుసూరిసూత్రమున 'సమాసంబునందు'- అని మాత్రము మార్చిరి. ఇది యుద్దేశ్యపూర్వకముగాఁ గాకపోవచ్చును. 'సమాసంబునయందు' అనునది దుష్టము గాదు. వీరు సాధించియే యుండిరి. (ఉ.తత్స.29సూ)

కాని యిట సూరివివరణమును బూర్తిగాఁ దొలఁగించి 'రామునియొక్క గుణములు, రామునిన్ గుణములు. రామునిగుణములు' అని యుదాహరించిరి. 'షష్ఠీతత్పురుషమునందలిషష్ఠి ద్వితీయానకారముగా నిల్చి ననుటయు,నది దీనిచే లోపించుటయు ననునన్నయపద్ధతి- (ఉ.63) ననుసరించి వీ రిట్లు పేర్కొనిరి. నన్నయమార్గమును సూరి విడచుటలోనియౌచిత్యము పైని స్పష్ట మగును (సమా.25)షష్ఠి ద్వితీయాతుల్యమగుట యన్నది సూరిసమ్మతము గాదు గావునఁ బై వి వరులవా రుదాహరించినట్టివి సూరిమతమున లక్ష్యములే కావు. ఆప్రక్రియ యుచితము.

## ఎల్ల :

సూరి చూపినఎల్లయర్థము ననురీతిని దీని కుదాహరణములు గావా? మార్పు నేల? "ఎల్లశబ్ద మాచ్ఛికసర్వనామప్రథమైకవచనము. అవ్యయము కాదు. ఎల్లలు- ఎల్లరకు ఎల్లయందు, ఎల్లన్ శిష్యులు'- మున్నగునవి సార్థకముశబ్దయోగము

ద్రుతోపజీవిశబ్దములు" (ఉ.53) ద్రుతోపజీవివిభాగ మనవసర మగుటయుఁ గొందొకచో ననర్థకము నగుటయు నింతకు ముందు గమనించితిమి.

మొత్తముపై ఎల్లశబ్ద మవ్యయము గాదు. సహజముగా ద్రుతాంతము గాదు అని వీరినిశ్చయము. ఇట్లనుటవలన నేర్పడునిబ్బందులను సం.లో గుర్తించియె యున్నారు. అవ్యయలక్షణమునుబట్టి దీని కితరవిభక్త్యంతరూప ముండదు. వీ రవ్యయము గా దనుటవలన —రాధేయుఁబోటితులువ లెల్లను (ఉద్యో.1.36) పోష్యం బెల్లన్, (సభా.2.66) మూక లెల్లన్ (ఆది.4.186) ననుచోట్ల నెల్లశబ్దమున విశేష్యవిభక్తి(వచనము) లయినవా? అది యెట్లనఁగా 'ఎల్లశబ్దము బార్థకనుశబ్దయుక్తమై వివిధవిభక్త్యంతవిశేష్యమున కవ్యవహితపరవిశేషణముగఁ బ్రయుక్తం బగు'- అని యొకసూత్రమును గల్పించుకొనుట యుక్తము' (వ్యా.సం.స.332) అనిరి. అవ్యయముగాఁ జెప్పరాదు. కాని యీలక్షణము లెల్ల దీనికిఁ గల వని యొకసూత్రము చేయవలెనా? బార్థకనుశబ్దయుక్త మై యనుటచే నెల్లశబ్దము ద్రుతాంత మయ్యుండు టను గుర్తించినట్లే సూరి సహజముగా ద్రుతాంత మనఁగా వీ రాద్రుతము బార్థకనుశబ్ద మనిరి. బార్థకనుశబ్ద మని చెప్పుటయుఁ గుదురదు. అట్లైనను నుశబ్దము చేరుటకు ఎల్ల ప్రథమాంతమా? ప్రాతిపదికపై నుశబ్దము చేరదు. కానఁ బ్రథమాంతమె. బహువచనము లేదు గాన (లుప్త)ప్రథమైకవచనాంత మనవలెను. అర్థసందర్భాదులను వివరించుచు నెల్ల ప్రథమైకవచనాంత మని నిరూపించుప్రయోగ మొక్కటి యీయవలసినది. కాక యిట మాత్రము ప్రాతిపదికపైఁ జేరు నని యొకసూత్రము చెప్పవలెనా?

అవుఁ గాక. ఎల్ల అనునదంతముపై నుశబ్దము యువర్ణపూర్వకముగా గావలెఁ గదా. 'ఎల్లను' అనుస్థానమున 'ఎల్లయును' అని యుండవలె. అట్టిదియు నొకటి చూపిన బాగుండెడిది. లేక యిట మాత్ర మెప్పుడును యువర్ణము రా దనుచు నింకొకసూత్రమును గల్పించుకొనవలయు నేమో.

ఇంకను నిట్టియెడలఁ బార్థకశబ్దము నియతముగా నుండుటను జెప్పుచు నింకొకసూత్రమును యుక్తముగఁ గల్పించుకొనఁదగును.

'విశేష్యమున కవ్యవహితపరవిశేషణము' అనఁగా 'దీని కసమాసంబున విశ్యంబునకు ముందు ప్రయోగంబు లేదు' అనుసూరివాక్యమె యర్థము. మార్గాంతరమున సూరియభిప్రాయమునె సూత్రింపవలె నన్నమాట.

విభక్తినిగూర్చి చెప్పిరి. ఇఁక విశేష్యలింగము దీని కగునా కాదా? 'రాధేయుఁ బోటితులువ లెల్లను' పడుఁ డని పల్కె భార్గవుఁ డెల్ల వినఁగ' పీనిలోనిఎల్లఅను దానికి ఎల్లరు అని యర్థము (వ్యా.సం.స.333) అనిరి. ఉ.లో నీవిషయములు చెప్ప లేదు. కాని 'ఎల్లన్ శిష్యుల' నని వీ రుదాహరించిరే. అందు ఎల్లన్ మహత్తుగాదా? అనఁగా 'ఎల్లను' అనునది మహదర్థకము నయినది. వలుకు లెల్లను,(అతివలెల్లను) ఇత్యాదుల నమహదర్థమున నీయది ప్రసిద్ధమె యని వరుులవారిభావము. మొత్తము 'ఎల్లను' అనునది మహదమహదర్థములు రెంట నున్నది. దీని కిం కొకసూత్రమును గల్పింపవలె నని చెప్పలేదు కాని వరుులవారు 'ఎల్లఅనుదానికి ఎల్లరు ఎల్లవి అను మహదమహదర్థములు రెండును గల (వ్యా.సం.స.332) వనిరి. ఇది యవ్యయ లక్షణము కాదా? కా దన్న వేఱ సూత్రింప నెట్లు సిద్ధించు? ఎల్లవిభక్తులయందువలె నెల్ల యర్థము (మహదమహదర్థములు)లందును 'ఎల్లను' సమానముగా నుండు నని యుఁ జెప్పవలెను గదా.

ఇంక వీరు వచనముంగూర్చి యిటఁ బేర్కొనియుండలేదు. ధన మెల్లఁ గొల్లఁగొట్టి, పురమునం దెల్లఁ గ్రుమ్మరి. ఇత్యాదులలో నది యేకత్వబోధకము కాఁగా, తులువ లెల్లను ఇత్యాదులలో నీయది బహుత్వార్థకము గదా.కాఁగా 'ఎల్లను' అనుదాని ఏకత్వబహుత్వములు రెండింట సమానమె. దీని విం కొకసూత్రముగాఁ జెప్పవలెనా?

'ఎల్లను' అనురూపము సహజముగా నిరూపించి యిన్నిసూత్రములు వ్రాసి కొనుటకంటె నిన్నిలక్షణములను సంగ్రహించునట్టి 'ద్రుతాంత మైనయవ్యయము' అనుసూరిమతము నంగీకరించుట యుక్తము.సూరివాక్యము పొరపాటన్నను వీరే తద ర్థము నెల్ల నెట్లో కల్పించుకొనక తప్పమినిబట్టియే సూరివివరణము సూక్త మని స్పష్టము.

సూరివివరణము నంగీకరింపనివీ రట్టియర్థము నెల్ల వే ఱొకసూత్రమును గల్పించి సాధించుకొనవలె నని సం.లోఁ దలఁచిరి.కాని యిట నట్టిసూత్రమునుగూర్చి ప్రస్తావింపకయె సూరివివరణమును దొలఁగించిరి. సం.లోఁ జేసినవివరణమును నిటఁ బ్రస్తావింపనిమాత్రమున నయ్యది సహజసిద్ధ మైపోదు గదా.

ఇంక వీరు విశేషణ(విశేష్యమునకుఁ బరముగాఁ బ్రయుక్త)మయినపుడే చార్థ

కనుశబ్దము చేరదనిరి. కాన విశేష్యమునకుఁ బూర్వమునందుఁ బ్రయుక్త మగు నపుడు నుశబ్దము చేరదు గావున నిట సామాసికద్రుతలోపప్రసక్తి లే దన్నమాట. ఇట్లు వివరించిరి.

'ఎల్ల కలుషములు, ఎల్ల యర్థములు అనుచోట్లయందుఁ బ్రథమాబహువచనాంత మగుఎల్ల అనువిశేషణము నిల్చె నని కాని ఎల్ల అనుప్రకృతియె సమాసమున నిల్చె నని కాని గ్రహింపవచ్చును. కాన నివి ప్రకృతసమాసద్రుతలోపశాస్త్రమునకు లక్ష్యములు కా వని గ్రహింపఁదగును' (వ్యా.సం.స.333)

ఎల్ల కలుషము అనుచోఁ బూర్వపదము 'ఎల్ల'. ఇది బహువచనాంతమా? బహువచనాంత మయినపుడును 'ఎల్ల' అనియే యుండునా? బహువచన మే మైనది. సమాసమున లోపింపవచ్చును. అది యుచితమె. కాని పక్షాంతరమున ఎల్ల అనుప్రకృతియే నిల్చె నం టే మి? ప్రకృతికే మీఁదిపదముతో సమాస మయినదా? "అ, ఈ, ఏ- అను నవి పదములు కావు. కావున నట్టిత్రికమునకు సమాసయోగ్యతయే లేదు' (ఉ.283) 'అని సూరివి విమర్శించిరి. సూరి కొకనియమమును వీరి కొక నియమము నగుట యేమి? కాక ప్రకృతికి సమాసము చేయలే దనియు, ప్రథమాంతము(ఏకవచనాంతము?)నకే సమాసము చేయ విభక్తి లోపించి ఎల్ల కలుషము అని సమాసమునఁ బ్రకృతి నిల్చె నందురా? అయినఁ బ్రథమాబహువచనాంతము నిల్చె నని చెప్పినసందర్భమున 'ఎల్ల కలుషము' అనుసమాసములోఁ బూర్వపదము ప్రథమాబహువచనాంత రూపమా? ఇది లుక్సమాసము గాఁబోలును. ఇది యేకవచనాంతమును బహువచనాంతమును నగుట విశేషమె. స్త్రీసమ మన్నఁ బ్రథమైకవచనము లోపించు. కాని యే మన్నను బహువచనము లోపించుప్రసక్తి లేదే. అలౌకికవిగ్రహముతో సంస్కృతవిభక్తులకే లోపము చెప్పుదురు. (తెలుఁగువిభక్తియే లోపించు నన్నను) ఇటఁ బూర్వపదము ప్రకృతియె నిల్చె నని చేసినవివరణ మసంగతము.

మహదర్థమున నెల్లరు బహువచనాంతరూప మందురు. ఎల్ల కలుషములు, ఎల్ల యర్థము అనుచో నమహదర్థము. అమహదర్థమున బహువచనాంతరూపము 'ఎల్లలు' అని యుండవలదా? సమాస మైన లువిభక్తి లోపించు. సమాసము చేయకుందము. ఎల్లలు కలుషములు ఎల్ల లర్థము లని యుండునా? ఇట సమాసము నిత్యముగనె చేయవలయు నని యొకసూత్రము చెప్పుదురా? అయిన వ్యస్తతలో ఎల్లలు, ఎల్లలను, ఎల్ల చేత ననురీతి నుండునా?

వీరిసమన్వయ మేపక్షమునను సంగతము గాదు.

సమాసమునఁ బూర్వమున నుండు 'ఎల్ల' చార్థకనుశబ్దాంతము కానేకాదు. (ఒకవేళ నయినఁ బ్రకృతసూత్రమునకు లక్ష్య మగు. అట్లగుట వరులవా రంగీక రింపరు గదా.) సమాసము చేయుచున్న 'కలుషము లెల్లను'అని ఎల్లశబ్దము విశేష్య మునకుఁ బరముగానే యుండి చార్థకనుశబ్దాంత మగును. ఎల్లకలుషములు, కలుషము లెల్లను అనువానికి నర్థమున భేదము గలదా? అర్థము సమానమే యైనపుడు వ్యస్తత లోఁ జార్థకనుశబ్ద మేల చేరినది? అదియుఁ దప్పక చేరు టేల?ఇంక నీచార్థకశబ్దము నిరర్థకముగాఁ జేరినదా?నిరర్థక మైనపుడు నియతముగాఁ జేరు టెంకను నసంగతమే. కాక యర్థవిశేషమునఁ జేరిన దందురా? ఎల్లకలుషము లనుదానికంటె (గలుషము లెల్లను అనుచో నర్థవిశేష మున్న దనియే యనుకొందము. అట్టియర్థవిశేషమును వివ క్షింపనిచో 'ను'శబ్దము చేర నక్కఱ లేదు గదా. 'ఎల్లకలుషములు తొలఁగినవి' యనునర్థమున గలుషము లెల్ల తొలఁగినవి' యని ద్రుతకార్యవిరహితముగా నుండు నా? అర్థవిశేష మున్నపు డర్థవిశేషమునను, లేనపుడు నిరర్థకముగను నుశబ్దము చేరునా? అర్థవిశేషమునందుఁ జేరునుశబ్దము విశేష్యమునకుఁ బూర్వము ప్రయు క్త మగునపుడు రాదా? అట్టియెడల నర్థవిశేషమును వివక్షించుటకే వీలు లేదా?సమా స మయినపు డర్థవిశేషము లేనేలేకుండుటయు వ్యస్త మయినపుడే యుండుటయు నేల?

వరులవారినుశబ్దకల్పనము మిక్కిలియసంగత మని నిస్సంశయముగా నిశ్చయింపవచ్చును గదా. సహజద్రుతాంతముగాఁ జెప్పినసూరిమత మెంతయు నుచి తము.

## ఎల్ల సర్వనామమా?

'ఎల్లశబ్ది మాచ్ఛికసర్వనామప్రథమైకవచనాంత" (ఉ.౬౫) మని వీరినిశ్చయ ము. అది యసంగత మగుట స్పష్టమె. అవ్యయ మన్నసూరిమతమున నేర్పడిన యర్థ మీసమన్వయమునఁ గుదురమి గుర్తించితిమి కదా.

ఉ.లో వీరు సర్వనామముగాఁ జెప్పుట యింతయు వింత. ఇట సర్వనామము లలో నెల్లశబ్దమును జేర్పలేదు. సూరి యవ్యయముగా నెంచుట నాతఁడు సర్వనామ ములలోఁ జేర్పలేదు. ఆశబ్దములను సూరివలె గ్రహించిరి. వీరు సర్వనామములలోఁ

బలింపుకొనకుండుట మొదటి పొరపాటు.



ఇంకను నచ్చట వీ రన్నిప్రభృతులను సర్వనామము లనుట తగ దనియుఁ దెలుఁగున సర్వనామసంజ్ఞ చెప్పరా దనియు మిక్కిలిగా విమర్శించిరి. కావుననే వీ రన్నిప్రభృతులకు సర్వనామసంజ్ఞ విధింపలేదు. అది యవసర మైనచోట్ల 'నన్ని ప్రభృతుల' కనియె విధానములు చేసికొనిరి. కాఁగా వరులవారిమతమునఁ దెలుఁగులో సర్వనామము లనునవి యసలు లేనేలేవు. అట్టియెడల వీరు సర్వనామసంజ్ఞను దిరస్కరించినయీగ్రంథములోనె 'ఎల్ల'శబ్దము సర్వనామ మనుట యెట్లు? నన్నయాథర్వణులు చెప్పమిఁ దిరస్కరించినను నిచట ఎల్లసర్వనామ మనుట 'బాలవ్యాకరణ వాసన'చేఁ గాఁబోలును.

ఇంక- ఎల్ల ప్రథమైకవచనాంతరూప మనఁ బ్రాతిపదిక మెల్ల యనునదే. మహదమహదర్థములు రెంట నది స్త్రీసమమె యందము. ప్రథమైకవచనము లోపించి 'ఎల్ల' అని యైన దందము. బహువచనాంత మగుచో మహదర్థమున 'ఎల్లరు ఎల్లరను, ఎల్లరచేత' నిత్యాదిగా నగును. అమహదర్థమున, బహువచనలకారమునకు రేఫము కాదు గావునఁ బెక్కులు, వేలు, ఇత్యాదిగ, ఎల్లలు, ఎల్లలను ఇత్యాదిగఁ గావలెను గదా. అట్టిరూపములు వీరును జూపలేదే. అమహదర్థమున నిది యేకవచనాంతమె యగు ననవలెనా? అట్లన్నను గొంతనయమే. (ద్వితీయాదులలో బాధ యెట్లును దప్పదు. ఎల్లను, ఎల్లచేత నిత్యాదిగను లేవు గదా.)

'ఎల్ల అనుదానికి ఎల్లరు- ఎల్లవి అనుమహదమహదర్థములు రెండును గల (వ్యా.సం.స.332) వనుటలో ఎల్లశబ్దమునకు నమహదర్థమున బహువచనాంతరూపము 'ఎల్లవి' యని తలఁచిరా యని సందేహము. వీ ర ట్లని స్పష్టముగాఁ జెప్పలేదు గాన నంతగా బాధ లేదు. కాని 'వినుము తీర్థము లెల్లవియును (వ్యా.సం.స. 332) నే దిట్టఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా విన నోర్తు సంజయా (భీష్మ-1.) (శ.ర.దిట్టఁడుశబ్దమునొద్ద.) తీర్థము లెల్లవియును పేం (అను.4.241) అగునెల్లవియున్ (ఆర.6.208) కాని యీ'ఎల్లవి' అన్నది యెల్లశబ్ద(అమహదర్థ)బహువచనాంతరూప మనరాదు. ఎల్లన్+అవి- ఎల్లవి, ఎల్లయవి యని తదర్థకముతో నెల్లశబ్దము సమసించినరూప మీయది. ఎఱుఁగంగఁ బాలివి యెల్లయవియు (అను.4.16) ఈయర్థమున నేకవచనమున 'నెల్ల' అని కాక 'ఎల్లది' యని యుండు. (సూ.వి.) వనుపుఁ దెల్లదానిని (సభా.2.244) మహదర్థకమునను ఎల్లవాఁడు-ఎల్లవారు, ఎల్ల

వాఁడుం దనవారి (విరా.3.127) కావున నెల్లశబ్దమున కమహదర్థమున బహువచ రూపములు లేవు.

మనమే యిది నిత్యైకవచనాంత మందము. కాని యేకవచనమున మాత్రము ద్వితీయాదివిభక్తులరూపము లున్నవా? సూరి 'ఎల్లను' అని చూపె. ఈనువర్ణము నాకొక్కఁడెక్కఁడసారి చార్థకనుశబ్ద మన్నను గొండొకచో ద్వితీయావిభక్తిగాఁజెప్పుదురు గాక, తులువ లెల్లను అనుచోఁ దుదినువర్ణము చార్థకావ్యయశబ్దము. పోష్యుల నెల్లను అనుచోఁ దుదినువర్ణము ద్వితీయావిభక్తి. కాని తృతీయాదులయం దెట్లు? ఎల్లచేత ఎల్లకొఱకు అవి గలవా? వీరు లే వని చెప్పను లేదు. ఉన్న వని చూపను లేదు. లేవు. దీనినిబట్టియే పోష్యుల నెల్లను అనుచోఁ గూడ నువర్ణము ద్వితీయ గా దన దగును.

ఇంక మహదర్థమున 'ఎల్లరు' అని యగు నన్న ఎల్లరన్ ఇత్యాదులను ద్వితీయాదులందుఁ జూపవచ్చును. కాని యేకవచనమున నెట్లు? ప్రథమయందు త్రీసమ మనవచ్చు. ఇతరవిభక్తులలో ఎల్లచేత ఇత్యాదులు గలవా? ప్రథమయం దేని 'ఎల్ల' అని యుండుట (ద్రుతవిరహితముగ) లే దని పైని గుర్తించియే యుంటిమి. కాఁగా నమహదర్థమున నేకబహువచములను నెల్ల శబ్దములకు రూపములు లే వని తేలినది కదా.

కాని ప్రౌఢ.ఎల్లశబ్దమునకు సప్తమి కల దన్నది. ఎల్లయందు నధికసాత్త్వికుఁ (ఆది 2.163) డనుచో నెల్లయం దనఁగా నెల్లరయందు (ఎల్లవారియందు)అని మహ దర్థకము. ఎల్లయందును దా వసియించుట(ఉద్యో.2.326) అనుచో నెల్లయం దనఁగా నెల్లవానియం దని యమహదర్థకము. ఇట్లు మహదమహదర్థములు రెండింట 'ఎల్ల యందు' అని సప్తమ్యంతరూపము సమాన మనవలె. కాని అందు అన్నది సప్తమీ విభక్తియే కాక యవ్యయ మగుస్వతంత్రపదమును గల దిచ్చటి దదియే యనఁదగు. (చూ.త్రి.శే.)

వఝులవారు 'ఎల్లరు-ఎల్లరన్ ఎల్ల- ఎల్లరన్ ఎల్ల-రచేతన్ ఎల్లరకున్-ఎల్ల ఎల్లయందును (వ్యా,సం.స.331)అని చూపి లింగవిభక్తివచనభేదము గ్లదు కావున నవ్యయత్వము పొసఁగ దనిరి. ఇందు 'ఎల్ల' సమాసమునఁ బూర్వావయవముగ మాత్రమె యుండు ననువీరియభిప్రాయము సరిగా దనియు 'ఎల్లయందు' అన్నది

సప్తమ్యంతముగా చేరదగియుండెనని స్పష్టము.



ఇంక మహదర్థమున బహువచవచనాంతరూపములు మాత్రమె మిగిలి యున్నవి.

శ.ర. వీనిని ఎల్ల+వారు. ఎల్లరు అని చూపినది. కాని ప్రౌఢ.లో ఎల్లశబ్ద బహువచనాంతరూపము 'ఎల్లరు' అని ఎల్లశబ్దము సర్వనామముగాఁ జెప్పుటలో నుద్దేశ్యమేమో స్పష్టము గాకున్నది. సూ.వి.క్రమతాంతావ్యయముగను, సర్వనామముగను జెప్పె. అట్టి + వారు అట్టిరు అనుచోవలె ఎల్ల శబ్దముపైఁ గూడ వాలోపముతో పఠింపవచ్చును. కాని 1.అట్టి + వాఁడు అట్టిఁడు అనుదానివలె ఎల్లవాఁడు ఎల్లఁడు అని లేకుండుట. 2.బహుత్వమున అట్టిరను, అట్టిరచేత ఇత్యాదిగ లేకుండఁగా ఎల్లరను, ఎల్లరచేత ననురీతిగా నుండుటయు, 3.ముఖ్యముగా ఎల్ల + వారు ఎల్లరు అని యైనట్లుగా, ఎల్ల + వారిని ఎల్లరిని- ఇట్లే ఎల్లరిచేత నిత్యాదిగఁ గాకుండ ఎల్లరను ఎల్లరచేత నిత్యాదిగ నుండుటయే ప్రామాణిక మగుటయునున్నగుకారణములచేఁ బ్రౌఢ.లో శ.ర.మార్గము పరిహరింపఁబడియుండవచ్చును. ఇం దనౌచిత్యము గానరాదు. 'ఎల్లను' అవ్యయము 'ఎల్ల' సర్వనామముగా నిత్యబహువచనాంతశబ్దముగాఁ జెప్పి దీని కమహదర్థమునఁ బ్రయోగము లే దని గుర్తించుట యుచిత మేమో.

ఇందు మార్గాంతర మేది యేని లభ్య మగు నేమో నిశితముగఁ బరిశీలింప వలసియున్నది.

ఇఁక ఎల్లన్ శబ్దస్థలము తప్ప నిం కొకటి ప్రస్తుతలక్షణమునకు లక్ష్యమే లేదా? సూరి సూత్రమునకు కువలయంబునవా రనురీతి యలక్ష్యమానస్థలములు గల వని గుర్తించిన వజ్ఝలవారు(వ్యా.సం.న.334)'ఎల్లన్‌శబ్దమువంటిస్థలమునుసృజించె' నన నేల? అనఁగా కువలయంబున వా రనురీతిని లక్ష్యము లని సూరి తలంపలే దనిరి. సూత్రమునొద్దఁ జూపినవి తప్ప నిం కొకటి లక్ష్య మగు నని సూత్రకర్త తలంపలే దనుట యుక్తమా?

చేతతో దవలనల కిత్వంబు సమానంబునందగు ననుసూత్రముచేచేత ము న్నగు వానితుదిఅకారమునకె యాదేశముగ ఇత్వము విధింపఁబడుటంజేసి నీచేతిప్రోవు మున్నగువానిసాధనమునఁ బ్రకృతసూత్రమునకుఁ బ్రసక్తి లే దని చెప్పవచ్చు'(వ్యా.సం.స.333) ననిరి. కాని యాసూత్రమువ్యాఖ్యలో "ఈయిత్వము చేతాదులయకార

మునకు ద్రుతసహిత మయినదాని కాదేశముగా విల్ల నని వ్యాఖ్య చేసినను జేయ వచ్చును. అల్యాగమసాహచర్యమున దీని నాగమముగా నెంచినచో నిట సామాసిక ద్రుతలోపము చేసి అపవాదిస్వరసంధి చేసినచో -(వ్యా.సం.స.396) అనిరి. ఆగమ మనుపక్షమున లోపించుద్రుత మాదేశ మనుపక్షమున నేల లోపింపదు? అనేకాల్లగు అలి నాగమముగా విధించుట యవసరము. వి.వి. కూడ అల్యాగమస్స్యాత్ అని, అలి నాగమముగాఁ జెప్పియు భవేదిష్టసిచేతయోః- అని యిత్వము నాగమ మనలేదు. ఆదేశ మనుటలోనె ప్రక్రియయందు లాఘవము గల్గును. ఇత్వము చేతాదులఅత్వ మున కాదేశ మయినఁ బైని ద్రుత మే మగును? సిచేతిన్ ప్రోపు అని యగును. నయిఁగా ద్రుతము స్వరసహిత మైయుండఁగా సిచేతను + ప్రోపు అని యుండ నంత్యవర్ణమున కనఁగా ద్రుతమునందలియుత్వమున కాదేశ మై సిచేతవిప్రో పని కావలె. ఇత్వ మగు నన్న నేకాల్లగునియాదేశ మంత్యమునకుఁ గావలయియుండఁగా నంత్య మగుద్రుత(స్వర)మును విడచి చేతాదులయత్వమున కగు నని వ్యాఖ్యానించు టయే పొసఁగదే.

పిదప ద్రుతసహిత మయినదాని కాదేశ మగు ననిరి. ఇది కేవలము నిరాధారము. ద్రుతముతోఁ గూడఁ జేతాదులయత్వము (అను)మొత్తమునకు నాదేశ మగు ననుటకు లక్షణమున నే మే నాధారము చూపఁగలరా? ఇట్టివ్యాఖ్య నిరాధార మగుట చేతనె వీరు మార్గాంతరమును జూపి యుందు రనవలె.

అల్యాగమసాహచర్యమున నిత్వము నాగమముగా నెంచవలె ననుటయు నసంగత మె. ఇత్వము నాగమముగనె తలఁచిన అలిగాగమ మన్నట్లుగా ఇగాగమ మన వలదా? ఇంకను, అలికంటె నిత్వమె పూర్వము విధింపఁబడినది కూడ. ఇత్వమాదేశ మనుటలో లాఘవము గలిమియు నలి న ట్లాదేశముగాఁ జెప్ప వీలు లేమియు గమనించితిమి. ఆగమ మందము. అంతమాత్రమున ద్రుత మెట్లు లోపించును? ఆగమము నర మైననే సామాసికద్రుతలోప మగు నని నియమే మేది? నాయందలికరుణ యనుచోఁ గూడ నాయందున్ + కరుణ అని యుండ సమాసమున ద్రుతము లోపించిన పిదపనె అలిగాగమ మగును. అట్లే సిచేతన్ + ప్రోపు అనుచో ముందుగా సమాసమునందలిద్రుతము లోపింపఁగఁ బిదప నేకాల్లగునిత్వము 'సిచేత+ప్రోపు' అనుచో చేతయందలియత్వమున కాదేశ మై సిచేతిప్రోపు అని యేర్పడును.

కావున చేత,తోడ,వలనలయుక్సమాసములయందును ద్రుతము ప్రస్తుత

సూత్రముచే లోపించు నట్టిస్థలములు దీనికి లక్ష్యము లగును. అలిగాగమసందర్భమునఁ బ్రకృతసూత్రముచే ద్రుతలోపమును వీరే స్పష్టము చేసిరి.(వ్యా.సం.స.400) అట్టి యెడలఁ బ్రకృతసూత్రమునకు లక్ష్యము లెన్నియు నుండఁగా సూరి యందుకయి యెల్ల శబ్దమును ద్రుతాంతముగాఁ గల్పించె ననుట యసంగతము గదా.

వీ రనుచితమార్గమున సమన్వయింపఁజూచినను, కడును+ఎదురు- కడు+ఎదురు (కట్టెదురు,) అనుచో ద్రుతలోపము ప్రకృతసూత్రముచేతనె యగు నని సూరిమతము. వీరది కళ యనియు కడునడలు అనుచోనుశబ్దాంతమనియుఁ జెప్పుచో (ఉ.43) నెల్ల శబ్దముచోఁ గలయసంగతులు కొన్ని యచ్చటను నేర్పడినవి.

ఇట్లు పెక్కులక్ష్యము లుండఁగా నీసూత్రమున కుదాహరణములు దొరకక 'ఎల్లను' సూరి సృష్టి చేసె ననుట యంగీకరింపరాదు.

సూరిలక్షణము సూక్తము.

## స్త్రీసమము :

సమానంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుషపరకంబులు పరంబు లగునపుడు మగాగమం బగు' (25) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి.

'స్త్రీసమంబులు-ప్రథమైకవచనమున డుజాదిప్రత్యయములు లోపించునాచ్ఛిక శబ్దములు.' (వ్యా.సం.స.341,372) అని వివరించిరి. ఉ.లో స్త్రీసమము లాచ్ఛికములు మాత్రమె యగుటను గుర్తింపకుండుట గమనార్హము. కావున సూరిమతమున స్త్రీసమము లాచ్ఛికములె యగుట (సం.లో వీరు నట్లు తలఁచి రీసూత్రమునొద్ద) నాతఁడు సాధారణముగా స్త్రీసమము లను బుద్ధిస్థార్థమును సాధించును. పరులవారు తత్సమపదలును స్త్రీసమములుగాఁ జెప్పుదురు. కావ నిట 'నాచ్ఛికస్త్రీసమము' లని సూత్రమున వారు మార్పు చేసికొనవలసియున్నది గదా.

ఇంక నాచ్ఛికశబ్దము లని గుర్తించునపుడు 'ప్రథమైకవచనమున డుజాదులు లోపించు' ననుట కుదురదు. లోపించుటకు ముందు డుజాదులు కావలెను గదా. అగుచున్నవా?

డుజాదు లన డుమ్మువులు.డుజ్జు వేని కగును?'అన్న' అయ్య అనురీతిశబ్దములు

మహత్తు లయినను బుంలింగ(తుల్య)ములు గావు గదా. మహత్తగుటతోపాటు పుంలింగము నయినఁ గాని డుజ్జు రాదు. దైవము. మిత్రము. మొ॥ ఇట్లు పుంలింగత్వము లేమి దీనికి డుజ్జు ప్రాప్తించుటయే లేదే. అమహత్తుల కెట్లును డుజ్జు రాదు గదా. మఱి యిట డుజ్జు లోపించుప్రసక్తి యేది? వీనికి మువు లసలే రావు.

అమ్మ, చిలుక, గోడ మున్నగునమహత్తులకు (డుజ్జు రాదు)మువర్ణకమును ప్రాప్తింపదు. ఇవి యదంతము లగునమహత్తు లగుటచే మువర్ణకము రావచ్చును. కాని యాచ్ఛికశబ్దములకుఁ గ్లీబసమత్వాతిదేశవిధానమునుబట్టి యమహత్త్వముచే మువర్ణము రానేరదు. క్లీబసమత్వాతిదేశమువలనఁ గదా మువర్ణక మగు నని సూరి (ఆచ్ఛి.2) వివరించినది. ఇవి క్లీబసమములు గామి వీనికి మువర్ణకమును రాదు.

ఇఁక నాచ్ఛికశబ్దములు వువర్ణకము వచ్చునవి లేనే లేవు. (వ్యా.సం.న. 464) ఊరు, పేరు మున్నగునుదంతములపై ముందుగా వువర్ణకము చేసి (తత్స.48) స్త్రీసమత్వముచే దానికి లోపము చేయవలయునా? ఆతత్స.48.సూత్రమున సర్వత్ర యనుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థ' మని సూరి వివరించెను. వధువు ఇత్యాదులలో వువర్ణకము చేసి దానికి లోపము చేయుటకు వీలు లేదు గదా. అట్లే యిటఁ గూడ.

తల్లి, తండ్రి వదినె ఇత్యాదుల నెట్లును డుజాదులప్రసక్తియే లేదు. కావున వీ రిట (నాచ్ఛికశబ్దములనుగూర్చి చెప్పునపుడు)డుజాదులు లోపించు ననురీతిని వివరించుట సరి కా దని నిశ్చయింపఁదగును. హరి, పిత మొద లగుతత్సమస్థలము లందు నిట్లె.

ఇట (సం.లో) వీరు స్త్రీసమము లాచ్ఛికశబ్దము లనుట యుక్తముగా నున్నది. కాని యాపిదప ఈసందర్భమునందలి స్త్రీసమశబ్ద మాచ్ఛికమాత్రవిషయకము. పిత దూత మున్నగునవి ప్రథమైకవచనలోపాదికమునకై స్త్రీసమములుగా సూరిచే సూత్రింపఁబడినను నట్టితత్సమముల నిచటిస్త్రీసమములలోఁ జేర్పరా' (వ్యా.సం.న. 342) దనిరి. ఈసందర్భమునఁ గాక సూరి స్త్రీసమశబ్దమును ప్రయోగించిన మఱి యేసందర్భమున పితదూతవంటిసంస్కృతసమాలు గ్రహింపఁబడుచున్నవో వజ్ఝల వారు వివరించియుండవలసినది. అట్టివి లేవు. ఇంక పిత దూత మొదలగువానిని స్త్రీసమాలుగా సూరి సూత్రించె ననుటయు సరి కాదు. పై రీతిగ్లే 'స్వస్రాదులుప్రకృత

సూత్రముచొప్పున స్త్రీసమరూపము లందును. (వ్యా.సం.స.562) ఋదంత స్త్రీసమ ప్రయోగములు (566) విశ్వకర్మ స్త్రీసమము (551) ఇత్యాదిగ సంస్కృతసమము లను స్త్రీసమములుగ వ్యవహరించిరి. ప్రథమైకవచనలోపాదికమునకై ఋకారాంత ములకు స్త్రీవద్భావమును (తత్స.52)దూతాదులకు, (తత్స.61) విశ్వకర్మాదులకు (తత్స.75)స్త్రీత్వమును సూరి యుపదేశించెను. అస్త్రీలింగము లగుసంస్కృతశబ్ద ములకు స్త్రీలింగకార్యమునకై సూరి యెచ్చటను స్త్రీసమత్వమును జెప్పనేలేదు. చిం. గూడఁ జెప్పలేదు. ఆచ్ఛికశబ్దములయెడ మాత్రమె (చిం.) సూరి, స్త్రీసమశబ్దమును (సంజ్ఞగా) ప్రయోగించెను. కావున నెచ్చటనే సూరి స్త్రీసమశబ్దమును ప్రయోగించిన యెడ నాచ్ఛికము మాత్రమె గ్రహింపఁబడవలెను.

పిత, దూత మొ॥సంస్కృతసమములను గూడ స్త్రీసమములుగాఁ జెప్పనచో నట్టివి యిట నేల గ్రహింపఁబడవు. సంస్కృతసమములును స్త్రీసమము లయినచో నాచ్ఛికములు మాత్రమే గ్రహింపఁబడు నని చెప్పుట లక్షణానుగుణము గానేరదు. సూరికి భిన్నముగా నట్లు సంస్కృతసమములను స్త్రీసమములుగాఁ జెప్పినవీ రయినను సూత్రమున సామాన్యముగా స్త్రీసమము లనక యాచ్ఛికస్త్రీసమము లని- చెప్పవలదా? ఏ మైనను సంస్కృతసమములను స్త్రీసమములుగాఁ జెప్పనిసూరి మత ముచితము.

'అదంతతద్ధర్మార్థకవిశేషణములు స్త్రీసమములె యైనను వానిపై నీయాగమము భారతాదిప్రాచీనగ్రంథములందు లేదు. ముద్దు సేయుకొడుకు' (ఉ.54) (వ్యా.సం.స. 342) ఇట నుదంతధా.వి. లన్నను ధా.వి. లెల్ల (ననుదంతములును) స్త్రీసమములె యని వీరిమతము. కాని యివి స్త్రీసమములు గావు. (చూ.ప్రదత.) కావున నిట నుగా గమములేమి లక్షణసిద్ధమె యగుటచే సూరిమతమున నిది విశేషముగాఁ జెప్ప నవసరము లేదు. కాని ధా.వి. లెల్ల స్త్రీసమములుగా నెంచినవరుంబవారిమతమున వారిలక్ష ణముచే ముద్దుసేయుంగొడు కని కాక తప్పదు. భారతాదిప్రాచీనప్రయోగములకు వీరిలక్షణము విరుద్ధ మైనది.

క్త్వార్థకేకారసంధివలె (ఉ.సంధి.9సూ) ఉదంత(స్త్రీసమ)ధాతుజవిశేషణముల కిట భారతాదికవిప్రయోగములందు నుగాగమము లే దని వీరు వేఱుగా సూ త్రింపకుండుట పరి కా ధనక తప్పదు. అది యవసరముగా నిది యనవసర మగు టెట్లు?

సూత్రమువొవ్వున స్త్రీసమరూపము అందును. (వ్యా.సం.స.582) ఋదంత స్త్రీసమ ప్రయోగములు (588) విశ్వకర్మ స్త్రీసమము (651) ఇత్యాదిగ సంస్కృతసమము లను స్త్రీసమములుగ వ్యవహరించిరి. ప్రథమైకవచనలోపాదికమునకై ఋకారాంత ములకు స్త్రీవద్భావమును (తత్స.52)దూతాదులకు, (తత్స.61) విశ్వకర్మాదులకు (తత్స.75)స్త్రీత్వమును సూరి యుపదేశించెను. అస్త్రీలింగము లగుసంస్కృతశబ్ద ములకు స్త్రీలింగకార్యమునకై సూరి యెచ్చటను స్త్రీసమత్వమును జెప్పనేలేదు. చిం. గూడఁ జెప్పలేదు. ఆచ్ఛికశబ్దములయెడ మాత్రమె (చిం.) సూరి, స్త్రీసమశబ్దమును (సంజ్ఞగా) బ్రయోగించెను. కావున నెచ్చటనే సూరి స్త్రీసమశబ్దమును బ్రయోగించిన యెడ నాచ్ఛికము మాత్రమె గ్రహింపఁబడవలెను.

పిత, దూత మొ॥సంస్కృతసమములను గూడ స్త్రీసమములుగాఁ జెప్పనచో నట్టివి యిట నేల గ్రహింపఁబడవు. సంస్కృతసమములును స్త్రీసమము లయినచో నాచ్ఛికములు మాత్రమే గ్రహింపఁబడు నని చెప్పుట లక్షణానుగుణము గానేరదు. సూరికి భిన్నముగా నట్లు సంస్కృతసమములను స్త్రీసమములుగాఁ జెప్పినవీ రయినను సూత్రమున సామాన్యముగా స్త్రీసమము లనక యాచ్ఛికస్త్రీసమము లని చెప్పవలదా? ఏ మైనను సంస్కృతసమములను స్త్రీసమములుగాఁ జెప్పనిసూరి మత ముచితము.

'అదంతతద్ధర్మార్థకవిశేషణములు స్త్రీసమములె యైనను వానిపై నీయాగమము భారతాదిప్రాచీనగ్రంథములందు లేదు. ముద్దు సేయుకొడుకు' (ఉ.54) (వ్యా.సం.స. 342) ఇట నుదంతధా.వి. లన్నను ధా.వి. లెల్ల (ననుదంతములును) స్త్రీసమములె యని వీరిమతము. కాని యివి స్త్రీసమములు గావు. (చూ.ద్రుత.) కావున నిట నుగా గమములేమి లక్షణసిద్ధమె యగుటచే సూరిమతమున నిది విశేషముగాఁ జెప్ప నవస రము లేదు. కాని ధా.వి. లెల్ల స్త్రీసమములుగా నెంచినవరులంవారిమతమున వారిలక్ష ణముచే ముద్దుసేయుంగొడు కని కాక తప్పదు. భారతాదిప్రాచీనప్రయోగములకు వీరిలక్షణము విరుద్ధ మైనది.

క్త్వార్థకేకారసంధివలె (ఉ.సంధి.9సూ) ఉదంత(స్త్రీసమ)ధాతుజవిశేషణముల కిట భారతాదికవిప్రయోగములందు నుగాగమము లే దని వీరు వేఱుగా సూ త్రింపకుండుట పరి కా దనక తప్పదు. అది యవసరముగా నిది యనవసర మగు టెట్లు?

ప్రయోగమము రా దనుటకు మూఁడుకృతులు అనునది యుదాహరించిరి. సమాస మైన నది మిశ్రమె కదా. విశేషముగఁ జెప్ప నేల?

మిశ్రసమాసములందు లేదు గాఁబట్టి చెడుంప్రవర్తన మని కా దనిరి. అది యట్లుండుఁగాక. 'చెడుందెఱఁగు' అనవచ్చు నని వీరివివరణము తెలుపుచున్నది. కాని యన లీ'చెడు'అనునది తద్ధర్మార్థకధా.వి. అగును. ఉదంతతద్ధర్మార్థకవిశేషణములు త్రికసమములె యైనను భారతాదిప్రాచీనగ్రంథములలో నీయాగమము లే దని యింతకు ముందే కదా చెప్పిరి. మఱి యీతిక్కనభారతప్రయోగమునందు (చెడుం దెఱఁగు) చెడు అనుఉదంతతద్ధర్మార్థకధా.వి.పై నీయాగమ ముండఁగా భారతాదులం దుందు లే దని నిర్ణయించుట యసంగతము కాదా? మఱి యావిస్మయము తప్పా? ఈప్రయోగము సమన్వయము తప్పా?

ఈప్రయోగము నుగాగమ మయినస్థలము గాదు. బుధవత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా వినమిఁ గడం జెడుందెరువు వీరలపంపొనరింపు పెంపునన్'(ఉద్యో.3.344) అనుచో 'వినమి' అనునది ప్రథమాంతముగాఁ దలఁచి 'వినక పోవుట మిక్కిలిచెడు మార్గ' మని యన్వయించికొని రేమో. చెడు- తెఱఁగు అనునవి విశేషణవిశేష్యము లుగాఁ దలఁచుట పొరపాటు. వినమి కడుం జెడుం దెరు వని వ్యా.సం.స.లోఁ (345) ప్రథమాంతముగాఁ జూపిరి. కాని 'వినమిఁ గడుం జెడుం దెరు' వనునదిసరి యైనపాఠము. ఇట వినమిన్ అన్నది ద్వితీయాంతము. వినమిచేత ననుచోటిహేతుత్వ తీయకు ద్వితీయ యైన(కార.22)రూపము. దీని ననుసరించి హరి చెప్పఁగా వినమి (కారణముగా)చేతఁ 'దెరువు కడున్ జెడున్' అనురీతిగా నిచ్చోటి'చెడును' అనునది తద్ధర్మార్థకప్రథమపురుషైకవచనాంతక్రియాపదమే కాని ధా.వి. కాదు. చెడుందెరువు' అనునది (విశేషణవిశేష్యముల) సమాసమే కాదు. సమాస మై నుగాగమ మయిన దని వ్యుత్పత్తివారు పొరపడియుందురు. 'చెడున్' అనునది క్రియాపద మని గుర్తించిన చో నీని నిట నుదాహరించుట కసలు సందర్భ మేది?

మొత్తముపై 'చెడు' ధా.వి. అయినపక్షమున చెడుం ప్రవర్తనము అని కాన త్లే చెడుం దెఱఁ గనియును గానేరదు. భారతాదిభిన్నస్థలముల నైనను ధా.వి.లపై నిట్టియాగమము నియతము గాదు గదా. చేటు ఇత్యాది యగువర్ణములు దీనికి లేవు. 'చెడు' అనునది కృదంతరూపమును గాదు. కాఁగా మిశ్రసమాసములలో నుగాగమ ము రాదనుటకు చెడుంప్రవర్తన మనుధా.వి.స్థలమును జూపత యిట దానిని దొలఁగి

ముటఁ జూపిన 'చేటుకొల' మనుదానినే యట నుదాహరించు టుచితము.

ఇంక నిది మిశ్రసమాసములందే యేమి? కీడువల్కు మున్నగురీతి నాచ్ఛిక సమాసములందును లేగు. (ఉ.64) గదా.

అన లీనుగాగమము మిశ్రసమాసములందు రా దనుట యుక్తమా? 'పుంప్వుల వట్ల సంస్కృతసమములమీఁదను మిశ్రసమాసములందును నుక్కు వచ్చును. వర పుడపుంజరిత్రము' (ఉ.64) అని పుంప్వులపై నీ రాగమమును జూపియే యుండిరి. పైవివరణమున సంస్కృతసమములమీఁదను, మిశ్రసమాసములందు నన నేల? 'సంస్కృతసమములమీఁదను' అనుచో నుత్తరపద మాచ్ఛికము గారాదా? ఆచ్ఛిక మైన మిశ్రమె యగును. మిశ్రములందుఁ బిదపఁ జెప్పుచుండిరే. వరపుడపుంజరిత్రము. మిశ్రమున వైకృత మగుపూర్వపదము. ఉన్నతంపుంగొడుగు అనుచోఁబూర్వపదము సంస్కృతసమ మైయుండుట సూరియే ప్రదర్శించెను. ఉన్నతంపుఁజరిత్ర మనఁదగుఁ గదా. ఇట్లు సాధ్యమిశ్రసమాసముల నెల్ల నిది యగుచున్నది. సంస్కృతసమములమీఁదను (ఉన్నతంపుంజరిత్రము, ఉన్నతంపుంగొడుగు) మిశ్రసమాసములందును (వరపుడపుంజరిత్రము)నని చెప్పుటలోఁ బూర్వపదము సంస్కృతసమమై యుత్తరపద మాచ్ఛిక మైనదానిని భిన్నముగాఁ దలఁచిరా యని సందేహ మగు. (సాధ్య)సాంస్కృతికమిశ్రముల నగు నన్న సందేహ ముండదు.

ఇట్లాచ్ఛికేతరసమాసములందును నాయాకార్యములు గుర్తించుచునే వయుల వా రవి సమాససామాన్యశాస్త్రసిద్ధములుగాఁ జెప్పరా దనుటలో నౌచిత్యము గానరాదు. (చూ.సమా.)

మిశ్రసమాసములఁ బుంప్వులపై నుగాగమము గల దనుటలో స్త్రీసమముల పైని లే దనుటయే వీరి (చెడుంద్రవర్తనము)పూర్వవివరణమునుద్దేశ్య మనవచ్చును. కాని యానిర్ణయమును లక్ష్యలక్షణవిరుద్ధ మైయున్నది. కలకుందవస్వేజనుఁ దేఁచిన (నృసింహ.2.124) అలరుంగుంకుమధూళి (భీమ.6.122) వేల్పుంజకోరేక్షణల్ (భీమ.9.105) పువ్వుంబరిమళముఁబోలె. (ఉ.హ.3.126) వేలుపుందరువులు (పారి. 4.66) అనుగుంగ్రీడల నెల్లవారలకు(వసు.3.32)మొదలుగా మిశ్రసమాసములందుఁ బుంప్వులపైవలె స్త్రీసమముల పైని గూడ నీయాగమము కవిప్రయోగప్రసిద్ధమైయున్నది.

మిశ్రసమాసములందు రా దనుటకు లక్షణమున నాధార మేది? పుంపులపై నవుచునే యున్నదే. కాఁగా మిశ్రసమాసములం దీయాగమము లే దని వజ్ఝలవారు సామాన్యముగాఁ జెప్పుట లక్షణముతోపాటు లక్ష్యములకును విరుద్ధ మగుట నంగీకార యోగ్యము గాదు. చేటుకాలమువంటివి కీడువల్కు లనురీతివిగా గుర్తింపఁ దగును.

“ఉన్నంతపున్గాడుగు” ఇందలి సంశ్లేషమును నిర్వహించుప్రయోగములు లభింపలేదు.” (ఉ.53,55) అన్నను వీరు సూత్రవివరణమున సంశ్లేషమును చేర్కొని ‘ఉన్నతంపున్గాడు’ గని యుదాహరించుట యుచితముగా నున్నది. స్త్రీపరకతలో సిస్ట్రెపున్నెతెలి యనుచోఁ బెద్దనప్రయోగమున నీద్రుతమునకు సంశ్లేష మగుటను వీరు చూపియే యున్నారు. (స్త్రీపరకతలో నది తప్పదేమో. లేక యాగమమై రాలే దన వచ్చును గదా.)

వీరు పైసూత్రమందును నిట్లే ‘సామాసికద్రుతాగమమునకు స్వత్వమే గాక సంశ్లేషమును బ్రయోగారూఢముగ నగపడదు. తళుకును గజ్జెలు అనరాదు సరికదా. తళుకు గ్గజ్జెలు అను సంశ్లేషమును నిర్వహించుప్రయోగమును నగపడదు (ఉ.55) అనిరి. (వ్యా.సం.స.347) అయినను సమాసమున సూరి స్వత్వమును మాత్రమే నిషేధించుట పొరపాటని వీరు చెప్పలేదు. అట్లని వీరును స్వత్వముతోపాటు సంశ్లేషమును గూడ సమాసమున నిషేధించియుండను లేదు. పైఁగాఁ బ్రస్తుతసూత్రమునొద్ద సంశ్లేష మగుటను వివరించి యుదాహరించిరి. ఇట్లు సంశ్లేష మగుటను జూపి, పై సూత్రమున స్వత్వమును మాత్రమె నిషేధించియును నీ రాసూత్రవిషయమును ‘సామాసికస్వత్వసంశ్లేషనిషేధము’ అనుపేర సూచించుట యుచితముగా లేదు. లక్షణవివరణములకు భిన్నము.

‘సంఖ్యావాచకములపయి నీయాగమము రా’ (ఉ.54) దనిరి. మూఁడుకృతులు సమానమైన మిశ్ర మిటఁ జూపరాదు. ఐదుప్రొద్దులు (మూఁడుకృతులు) అనురీతివి సూరిమతమున సమాసములే కావు. (చూ.సమా.17) కావున నిట నాగమప్రసక్తియే లేదు.

కీడువల్కులు చేటుకాలము ఇత్యాదులలో నీయాగమము లేమిని గుర్తింపవలసియే యున్నది. ‘నలుగడాదుల నీయాగమంబు లే దంద్రు’ అని సూరి పేర్కొనె. వీనిని నలుగడాదులలోఁ జేర్చుట తగునా యని సందేహము. ‘అగమశాస్త్రమనిత్య’

మ్మనుపరిభాష నాశ్రయించి యిట్లు కొన్నియెడల నీయాగమము లేకుండుటను సాధింపఁ గొనవచ్చును.

## సమాసము-స్వత్వాభావము:

‘సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వము లేదు’ (26) అనుసూరిలక్షణము నట్ల గ్రహించిరి. (ఉ.25.సూ) సూరివలె స్వత్వమును మాత్రమె నిషేధించియు వీరీసూత్రవిషయమును ‘సామాసికస్వత్వసంశ్లేషనిషేధ’ మని సంశ్లేషము గూడ నిషేధింపఁబడినట్లు చెప్పుట విరుద్ధముగా నున్నది. (వ్యా.సం.ప.347) సంశ్లేషమును గూడ నిషేధింపఁదలఁచియు నది సూత్రమునఁ జేర్చుట మఱచి రందమా? ఇంతకు ముందుసూత్రమునొద్ద సమాసమున సంశ్లేష మగుటను వివరించి యుదాహరించియే యుండిరి, స్థిరపరకత్వమందును నుక్కు అరుదుగనగపడుచున్నది.‘విచ్చెపున్ మేతెలి’ (ఉ.64) అనఁగున్వెలఁది (వ్యా.సం.ప.336) అని పేర్కొనిరి. స్థిరపరకతయం దీనుగాగమము గల దనుటకు సంశ్లేషస్థితి మాత్రమె యాధారమైయున్నది. ‘విచ్చెప్రమేతెలి’ అని యున్న నుగాగమమె రాలే దనవచ్చు. స్వత్వము లేదు. వర్గయుక్ (మకార) భిన్నస్థిరపరకతయందు బిందువును లేదు. కాఁగా నిట్టియెడల సంశ్లేషస్థితి మాత్రమె ప్రధాన మగునాధారముగఁ గన్పట్టుచున్నది. వీరిప్రక్రియ ననుసరించి కప్టోయిలో విధి యాగమద్రుతమున కైనసంశ్లేషమె. ఆగమద్రుతము సహజద్రుత మన్నవివక్షయు నేలకో.

అర్వాచీనకావ్యములందు సంశ్లేషము నుదాహరించియును ‘నిట్టిసంశ్లేషము కవి ప్రయోగములఁ దెచ్చుటను లే (వ్యా.సం.ప.347) దని నిర్ద్వంద్వముగాఁ జెప్ప నెట్లు కుదురును?

ఈసూరిలక్షణమునకు ‘స్వత్వం ప్రశ్లేషతా బిన్దుస్సమాసే న ప్రయోగతః’ అనువి.వి.లక్షణమును మూలముగాఁ జూపి సూరి యట్లు చెప్పుట భ్రాంతిమూలక మనిరి. (వ్యా.సం.ప.347) సూరియీలక్షణమున కాకారిక మూల మనుకొనుటయే భ్రాంతిమూలకము. వయికారిక సమాసమున స్వత్వసంశ్లేషబిందువులు మూఁటిని నిషేధించినది. అనఁగా లోపమును జెప్పుచున్న దనవలయును.సూరి లక్షణమునకు దేనికే నివి.వి.కారిక మూలముగాఁ జెప్పఁగోరుచో ‘సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు’ ననుదానికి మూల మనవచ్చును. కాని యావిషయమును ‘ద్రుతస్య

సర్వత్ర లాక్సమాసేషు' అనుచిం.సూత్రము సూటిగఁ జెప్పుచున్నది. కాన సామాసిక ద్రుతలోపవిధానమునకుఁ బైచిం.లక్షణము మూల మనుట యొప్పును.

ఆధర్వణునిలక్షణమున 'స్వత్వం ప్రశ్లేషతా' యని స్వత్వముతోపాటు సంశ్లేషము గూడ నిషేధింపఁబడఁగా తన్మూలక మగుసీలక్షణము స్వత్వము నొక్కదానినె నిషేధించి సంశ్లేషమును నిషేధింపకుండుట సరి గా దందురా? అయిన నా చిం.లక్షణము సంశ్లేషముతోపాటు 'బిన్దుస్సమాసే న ప్రయోగతః' అని బిందువును గూడ నిషేధించినది. బిందువును నిషేధింపకుండుట సరి గా దని చెప్ప రేమి?

కాక యధర్వణుఁడు బిందుస్వత్వసంశ్లేషములు మూఁడు నిషేధింపఁగా బిందుసంశ్లేషములు గలవు గావున స్వత్వము మాత్రము నిషేధింపవలె నని సూరి దానిని సవరించె ననియు నది భ్రాంతి యనియుఁ జెప్పుదురా? 'ఆధర్వణస్వత్వము వేఱు సూరిమతమున స్వత్వము వేఱు (వ్యా.సం.స.347)కాఁగా స్వమతానుగుణముగ సూరి స్వత్వమును మాత్రమె నిషేధించె నని గుర్తింపవలదా? అందు భ్రాంతి యేమి? తళుకుమగఙ్డ లనువానితోపాటు తలన్రబా లనురీతిరూపములును లేవు గదా.

స్వత్వం ప్రశ్లేషతా యనుకారిక యీసూరిసూత్రమునకు మూలమనుటయు నిట సూరి భ్రాంతిపడె ననుటయుఁ గేవల మసంగతములు.

కావునఁ బ్రయోగములందు బిందుసంశ్లేషములు గలిమి స్పష్టమె. కావున స్వత్వమువలె సంశ్లేషమును నిషేధింపరాదు. సూరి సంశ్లేషమును నిషేధింపలేదు గాని నిషేధించినచో వికృతివివేకవాసనచే సూరి సంశ్లేషము లే దనెఁ గాని యది కవి ప్రయోగములందుఁ గల దని పైప్రయోగములె చూపెడివారు గదా వీరు.

సూరిలక్షణము సూక్తము.

## తలంబ్రాలు :

తలఁబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతంబునకు లోపంబు లేదు. (27) అనుసూరిసూత్రము వల్ల గ్రహించిరి. (ఉ.26సూ)వీనిని వీరు మధ్యమపదలోపసమాసములుగాఁ జెప్పుట విశేషము. తోడను తోను అనున వవ్యయము లనుట పైని బరామర్శింతము. (కార.5)

## టుగాగమము :

'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు'(28) 'కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు' (29)ననుసూరిలక్షణములు రెంటిని గలిపి వయ్యలవా రిట్లు విస్తరించిరి. 'సమానాధికరణసమాసములందును, శేషషష్ఠీసమాసములందును సంఖ్యావాచకాదిభిన్నము లగుఉదంతవిశేషణములకును, పుంపులకును నచ్చు పరంబగునపుడు టుగాగమము బహుళముగ నగు' (ఉ.27సూ)

సూరి 'కర్మధారయంబులందు' అన్నదానికి వీరు చెప్పిన 'సమానాధికరణసమాసములందు' అన్నది పర్యాయమె కాని భిన్నము గాదు. అనఁగా సూరి కర్మధారయమంబులం దనుటలో దురుక్తి లేదు. లాఘవరూప మైనప్రయోజనమె కలదు.

పిదప వీరు 'శేషషష్ఠీస్థలములందు' అన్నది యధికముగాఁ జేర్కొనిరి. 'సూరి శేషషష్ఠీస్థలములందలిటుక్కును సూత్రింపలేదు. (ఉ.55) కాని యట్టివానిని సూరి సాధించియే యున్నవిషయము వీరివాక్యములవలననే తెలియవచ్చును.

'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' ననుసూత్రమునొద్ద వీరు "కర్మధారయంబులందు అనుబహువచనపుమహిమచేత సాంస్కృతికాచ్ఛికమిశ్రములందును, షష్ఠీసమాసమందును నీవిధి వర్తిల్లా కయ్యెపువెలపు '(ఉ.59) అని పేర్కొనిరి. (సాధ్య)సాంస్కృతికాచ్ఛికమిశ్రసమాసము లనునర్థమును విశేషముగాఁ జెప్పవలసినయక్కఱ సూరిప్రణాళికలో లేదు. సూరి యట్టివానిని సమాససామాన్య (శాస్త్రసిద్ధ)ములుగానె సాధించెను. ఆచ్ఛికేతరసమాసములు జ్ఞాపకసిద్ధములు గావలె నని యెంచువయ్యలవా రిట విశేషముగాఁ బేర్కొనిరి. ఏది యే మైనను నటఁ 'గర్మధారయంబులందు' అనుచోటిబహువచనమహిమచేత షష్ఠీసమాసములందుఁ బుంపు లవు నని చెప్పిరి గదా. అదేవిధముగా సూరి యీసూత్రమునందును - కర్మధారయంబులం దని యీసూత్రమునవలెనె బహువచనము(తో)నే ప్రయోగించెను. అట బహువచనముచే పుంపులు షష్ఠీ-సమాసమున నయినట్లుగా నిట బహువచనముచే టుగాగమము షష్ఠీసమాసములందుఁ గాదా? అటఁ గల ప్రయోజన మదే విధముగాఁ

జెప్పినయీస్థలమున నేల యుండదు? ఈసూత్రమునందుఁ 'గర్మధారయంబులం' దని బహువచనముతోఁ జెప్పి పయిసూత్రమునఁ 'గర్మధారయమునం' దని సూరి యేక వచనముతోఁ జెప్పుట గమనార్హము. సామానాధికరణ్యేషు అని చిం. కూడఁ జెప్ప నహోబలుఁడును "సామానాధికరణ్యేష్వితి బహువచనజ్ఞాపకాదసామానాధికరణ్యేష్వపి క్వచి' త్తని (కవిశి.) వ్యాఖ్య చేసెను. అట నహో. చూపిన రూపకసమాసములను గర్మధారయములుగనె సమన్వయింపఁదగియుండుటంజేసి తిక్కయజ్వ ప్రయోగించిన షష్ఠీసమాసములందలిటుక్కును వీరు చూపిరి. (వ్యా.సం.స.362,365)కాఁగాఁ జిం. లో బహువచనస్వారస్యముచే నచ్చోటను, నట్లే యున్న యీసూరిలక్షణముచేతనచ్చో టను షష్ఠీసమాసమందలిటుక్కు సాధింపఁబడుచునే యున్నది. ఇట్లు షష్ఠీసమాసము లందలిటుక్కును సూరి ప్రత్యేకముగా సూత్రించియుండలేదు. కాని సాధించియే యుండెను. వీరు ప్రత్యేకముగా సూత్రమున 'శేషషష్ఠీసమాసములందును' అనుట సూరిసూత్రమందలిబహువచనమునకు వ్యాఖ్యానమే యని గుర్తింపఁదగును.

'సంఖ్యావాచకాదిభిన్నము లగు' ననునది యిం కొకటి వీరిలక్షణమున నధి కము. బాలింగూర్చి వారే 'స్పష్టతకై సూత్రమున సంఖ్యావాచకాదిభిన్నము లగు' అని నిల్పఁబడెను. (ఉ.56) అని స్పష్టతకు మాత్రమే యనిరి. కాఁగా నిది సూరిలక్ష ణమున లేకుండుటవలన ననర్థము లేదు. పైఁగా షష్ఠీసమాసమున నీయది సార్వత్రి కము గాకుండుటయు గమనార్హము.

పిదప వీరు "ఉదంతవిశేషణములకును" అనుచో 'విశేషణములకు' అనుట యుఁ గేవలము స్పష్టతకే 'కర్మధారయంబులం దుత్తునకు' -అనుటచేతనే యిచటి కర్మధారయములందుఁ బూర్వపద ముదంతము గావలె నని' స్పష్టము. అయ్యది విశేషణ మగుట కర్మధారయలక్షణమె. కావున 'విశేషణంబులకు' నని విశేషముగాఁ జెప్పనవసరము లేదు. ఇంకను వరుసలవా రిట్లు చెప్పుటవలనఁ గొంతయనర్థమును గల్గినది. సమానాధికరణసమాసములందును, శేషషష్ఠీసమాసములందును,అనుసూత్ర ము ననుసరించి యుదంతవిశేషణములకును అనునది శేషషష్ఠీసమాసములందు నన్వ యింపవలె.అటఁ బూర్వపదము విశేషణ మగునా?కావున విశేషణము లని పేర్కొ నుట యనర్థకము నైనది.

ఇంక 'ఉదంతమునకు' ననుటకంటె 'నుత్తున' కగు ననుసూరివచనము స్పష్ట తర మైయున్నది.

అపిదప వీరు 'పుంపులకు' అని విశేషముగఁ జేర్కొనిరి. సూరి యిది సుడువ లేదు. అయిన పుంపులపై సూరిలక్షణముచే టుగాగమము రాదా? పుంపులయందున్ను నుత్వమె యున్నది. కావున నుత్తునకుఁ జెప్పినటుగాగమము వీని కేల ప్రాప్తింపదు? చిం.లో సన్నపుటీక, శోకార్తపుటొడళంతో విత్యాదిప్రయోగములందలిటుక్కు 'సామానాధికరణ్యేషూదన్తానా' మ్మనుదానిచే సాధింపఁబడును గదా. అట్లే యిటఁ గూడ ఉత్తునకు (ఉదంతవిశేషణములకు) ననుటచేతనే పుంపులపైవి టుక్కు సిద్ధించు చుండఁగా వీరు మఱల సూత్రమునఁ బ్రత్యేకముగా 'పుంపులకును' అని చెప్పుట యనవసరము. కర్మధారయంబులం దుత్తున కనుసూత్రమునొద్ద సూరి నరసపుటలుకయని యుదాహరించుట గమనింపఁదగును. పుంపుల కని సూరి ప్రత్యేకముగాఁజెప్పకుంట యుచితముగా నున్నది. సంధి.26సూత్రమునొద్ద పుంపులను బ్రత్యేకముగాఁ బ్రస్తావించుట యవసరము (వ్యా.సం.స.343) ఇట ననవసరము.

కాఁగా "సమానాధికరణసమాసములందును, శేషషష్ఠీసమాసములందును, సంఖ్యావాచకాదిభిన్నము లగు- ఉదంతవిశేషములకును పుంపులకును" అన్నంత వఱకు వచులవారిసూత్రము 'కర్మధారయంబులం దుత్తున' కనుసూరిలక్షణమునకు వ్యాఖ్యానమె యని గుర్తింపవచ్చును.

సూరి యీసూత్రమున 'టుగాగమం బగు' ననియుఁ దరువాతిసూత్రమునఁ బేర్వాదులకు విభాష' యనియుఁ జెప్పఁగా వీ రారెంటిని గలిపి 'బహుళంబుగా నగు' నని యొక్కచోటనె సంగ్రహించిరి.

కర్మధారయంబులం దుత్తున కనుదానిని వ్యాఖ్యానముగా విస్తరించి చెప్పుట యు నిత్యవైభాషికస్థలములను బహుళముగా సంగ్రహించుటయు వీరిసూత్రరచన లోని ప్రత్యేకతలు.

ప్రయోగములనుబట్టి స్పష్టముగా సూత్రించుట యుక్తమని వచులవారిసిద్ధాంతము. అందుకే యట నట (తత్స.50,68మొ॥) సూరిసూత్రమందలిబహుళపదమును దొలఁగించి తత్ప్రయోజనమును సూత్రమునందే వివరించి చెప్పుదురు. కాని యిట మాత్రము కర్మధారయమున సామాన్యముగా నిత్యముగఁ జెప్పి పేర్వాదులకుఁ గొన్నింటికి మాత్రమె వికల్ప మగుటను సూరి స్పష్టముగఁ జేర్కొనఁగా వీ రది పరి శా దవి బహుళ మనిరి. ఒకనియమము ననుసరించి యుండకపోవుటచే నిట్టి వైపరీత్యము వచులవారివచనములలో సంభవించిన దనవచ్చును.

సూరివిధానము నిర్దుష్ట మగుట (వఝలవారిస్పష్టనిరూపణసిద్ధాంతమున కనుగుణము నగుట)స్పష్టము.

'పేరుటురము అనుచు వైభాషికటుక్కును సూరి విధించెను. అట్టిప్రయోగమే లేదు' (ఉ.55) అనిరి. అందుకయి విభాషగా టుక్కగు నన్నసూరిలక్షణమును వీరు బొలఁగించిరా? "బహుళ మనుటచేతనె దీనికి వైకల్పికత్వమును గలదు. చిగురాకు చిగురుటాకు." (ఉ.56) అని వీరే కొన్నియెడల టుక్కు వైభాషిక మగుట నిరూపించిరే. పేరుటుర మనుప్రయోగమె లేకున్నఁ బేర్వాదు లనకుందురు గాక టుక్కు విభాష యగుట చిగుర్వాదులయం దేని గలదు గదా. మఱి పేర్వాదు లనకున్నను జిగుర్వాదు లని సూత్రింపక పోయిరా? కాఁగా వైభాషికటుక్కు గలదు. కావున దానిని సూత్రించుట యుక్తమే. పేర్వాదు లనుట తగదా? అట్టిప్రయోగమె లే దందురు వీరు. పేరుటుర మనుదానిని సూరి కల్పించె ననుటకంటె నెట నీరూపమును గవిప్రయోగములలోఁ జూచె నేమో వెదుకఁదగదా. "ఉడుపతిబారికిన్ వెఱచి యూరట యా నని పేరుటూపమిన్" (మను.3.34) అనుచోఁ గవితాపితామహుఁడు పేరుశబ్దమునకు టుగాగమము చేసి ప్రయోగించెను.

సూరి 'పేర్వాదు' లనుట దుష్టము గాదు.

సూరి 'సరసపుటలుక' యనుదానిని 'టుగాగమం బగు' ననుస్థలమున నుదాహరించుట నట (పుంపులపై) టుగాగమాభావ మిష్టము గా దేమో యనిపించును. కాఁగా వఝలవారు 'బహుళ మనుటచేత పుంపులపైని రాకుండుటయుఁ గలదు) ఆముదపాకు, కప్రవనఁటులు' (ఉ.58) ఉత్తరించు తములంపాకు (ఉ.హరి.4.28. సూ.వి.ఇట్లు పుంపులపై టుగభావము ప్రాచీనప్రయోగములఁ గాననవుచునేయున్నది. ఆముదపాకు, తములపా కనురీతిస్థలముల నాముదపు టాకనురీతిగా టుగాగమము వచ్చినరూపములె వింతగ నుండును. ఎటనేఁ గవిప్రయోగములం దున్న వేమో వెదుకవలె. ఆగమశాస్త్ర మనిత్య మ్మనుపరిభాషచే నీయవి రక్షితముల యగును. కావున నిట్టివానికై బహుళ మనఁ బని లేదు. అయినఁ జిగురాకు ఇత్యాదులలో టుక్కు వైభాషిక మగుట స్పష్టముగా నిరూపింపఁదగియుండుటచే దానిని ప్రత్యేకముగా సూత్రించుటయే యుచితము.

'బహుళ మనుటచేతనె తద్ధర్మాద్యర్థకవిశేషణములఉకారమునకు టుక్కు రాదు. నుక్కే వచ్చు. చేయునతిథిపూజ (ఉ.58) అనఁగా బహుళ మననిసూరిమత

మున నిట నుక్కు రాక టుక్కు వచ్చునా? అయిన నూదంతతద్ధర్మార్థకవిశేషణముల కట నుగాగమము విధించుట యేల? వ్యర్థము కాదా? కావున బహుళ మనకున్నను నావిశేషవిధి ననుసరించి యట నుక్కే యగును గాని టుక్కెంతమాత్రమును గాదు. కావున నందుకై బహుళ మని చెప్పనవసరము లేదు.

'సంఖ్యావాచకాదిభిన్నము లగు' అనుదళమును స్పష్టతకే చేర్చితి మన్నవి రాసిదప 'ఆది' శబ్దమును నిల్పుటచేత పెక్కు తక్కుమున్నగుస్థలములందును టుక్కు రాదు. పెక్కెండల తక్కన్నిగర్భములు (ఉ.57) అని వివరించిరి. ఇట్టిది ప్రయోజనవంత మగుచుండ స్పష్టత కని యేల పేర్కొనిరో తెలియదు. కాఁగా నీయాది పదముచేత టుగాగమము రానిస్థలము లెల్ల సంగ్రహింపఁబడును. కావున టుగాగమము ప్రాప్తించుచుండఁగా బహుళపదముచే నప్రవృత్తి యని చెప్పవలసినతా విట నుండదు. సూరిమతమున 'ఆగమశాస్త్రమనిత్య' మ్మనుపరిభాష ననుసరించి క్వాచిత్కముగ పట్టిస్థలముల నాగమము రాలే దని గుర్తింపఁదగును.

'టితివర్ణంబులు పరంబు లగునప్పు డుత్వంబున కిత్వం బగు' ననుచో 'నగు' నని విధించి 'నెత్తుటికి' ఇత్యాదుల నిత్వము లేకుండుటను బేర్కొనుట యిట స్మరింపఁదగు. కాఱడవి (సిం.1.245) కాఱడవుం (ఉ.రా.6.279) కాఱడవినె(దశ.2.51) పూవమ్ము (హరి.7.56)పట్టపేనుంగు (ఉ.రా.5.268) (కళా.8.31) ఇల్లటవల్లుని గాంచి రయ్యెడన్ (రామా.3.44)బంగారందియల్ (రామా.3.146)పాడిల్లునబోలె (ద్రోణ.2.337)పూవడిదపుజోదు (నీలా.1.108)మొ॥

మొత్తముపై సూరిలక్షణము సూక్తము. భాషాలక్షణమును స్పష్టముగా నిరూపించుచుండ నావిధానము నట్లు గ్రహించుట యుక్తము.

## దుక్కిటెద్దు :

శ.ర. దుక్కిటెద్దు, మిద్దెటిల్లు అనువానిం జూపఁగా వఝలవా రవ్వానిని 'సాధువులు కావు అట్టికవిప్రయోగములు లేవు. దుక్కియెద్దు మిద్దెయిల్లు తేనెయీఁగ అనియే ప్రయోగింపనగు '(ఉ.57) ననిరి. దుక్కిటెద్దుల బల్మితోడ నిచ్చు (నీలా. 1.49) కమ్మటూకులు (సిం.4.240) పూసటెమ్మకములు (కాశీ.6.41)

యతిప్రాసాదిగణములు గా వని దిద్దివేయుటకంటె (వ్యా.సం.స.337) ఉదంతములపైఁ బ్రచుర మయ్యె ననుదంతములపై నరుదుగఁ గానవచ్చుట నంగీకరింపఁదగు నని తోఁచును.

## రుగాగమము :

'పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునప్పుడు కర్మధారయంబునందు రుగాగమం బగు' (30) కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు' (31) ననుసూరిలక్షణముల నట్ల (ఉ. 28,29సూ) గ్రహించిరి.

ధీర+ఆలు మున్నగుచోటులందు సూరి వచించినకర్మధారయంబు 'త్రిక-- సమా.6. అనుకర్మధారయలక్షణ మెట్లు సరిపడు నని యాతఁడు తలంచెనో'(ఉ.28) యనిరి. ధీరురాలు అనురీతిని గర్మధారయము గుదుర దని తెలిసినవీ రయినను నట్టి సమాసమును బ్రత్యేకముగా విధించిరా? ఇట్లు వివరించిరి. "ఈసందర్భమునందలి సమాసము లెల్ల జ్ఞాపకసిద్ధము లని యెఱుంగునది. మిశ్రకర్మధారయము సామాన్య సమాసశాస్త్రసిద్ధము గాదు గాన నిట్టివి సూత్రారంభసామర్థ్యమున సిద్ధించును. (ఉ.68, విర్ధయురాలు 278) వీ రిట సూరిసూత్రము నట్లే గ్రహించిరి. ఏతత్సూత్రారంభసామర్థ్యముచే నీసమాసము వీరికి సిద్ధించినపు డస లీసూత్రమును జెప్పినసూరిపక్షమున మాత్ర మీసూత్రారంభసామర్థ్యముచే నేల సిద్ధింపదు? సూరి యిట వివరింపలేదు.

వీరివివరణమునయిత మీసమాసమును సాధించునా? వివరణమునుబట్టి చూచిన మిశ్రకర్మధారయము సూత్రారంభసామర్థ్యముచే సిద్ధించును. సూరిమతమున మిశ్రములు (సాధ్యసాంస్కృతికములు) సామాన్యసమాసశాస్త్రముచేతనె సిద్ధించును. కర్మధారయంబు త్రిక- ఇత్యాదిలక్షణమున కనుగుణముగనె మిశ్రసమాసము లైన నుండవలెను. త్రికాదిభిన్న మయినచో నాచ్ఛికమున కేని సంస్కృతసమమునకే యేని (మీఁదివిశేష్యముతోఁ) గర్మధారయము చేయరాదు. ధీర యైనయాలు అనుచో మిశ్రసమాస మవఁదగినను నది సామాన్యసమాసశాస్త్రసిద్ధము గానేరదు.

మిశ్ర మనఁగా సంస్కృతసమాచ్ఛికముల కయినసమాసము. అట్టిమిశ్రసమాస మీసూత్రముచే సిద్ధించు ననిరి. గుణవంతురాలు అనున దెట్లు చూపిరి? 'గుణవత్' అనుశబ్దము స్త్రీత్వమున స్త్రీప్రత్యయములఁ గూడి గుణవతి యని గదా తెలుఁ

గునఁ దత్సమ మగునది? గుణవతి యైనయాలు అని విగ్రహము చెప్పి గుణవతి+ఆలు అని మిశ్రసమాసమును జూపవలదా? (గుణవంత+ను+ఆలు+ను అని చూపుట కవకాశము లేదు. గుణవంత+ను- గుణవతి యని తెలుఁగున నేర్పడదు గదా.) గుణవంత+ఆలు, అనుచో గుణవంత యన్నది ప్రాతిపదికమె కాని సంస్కృతసమము గాదు. మిశ్రసమాస మైనను ప్రాతిపదికముఁ జేయరాదు గదా. కావున గుణవంత+ఆలు అని చూపి యిట్టిమిశ్రసమాసము లీసూత్రముచే సిద్ధించు నని చెప్పుట సంగతము గాదేమో. వీరివివరణము లక్ష్యవిరుద్ధము. అట్టివీరు సూరిలక్షణమును విమర్శించియు నాడోటును దిద్దకపోవుట విశేషమే.

సూరిమతమున నిట్టిసమాసము లేర్పడు టెట్లు? సూరి స్పష్టముగనె చెప్పెను. శ్రీమంత మున్నగుప్రాతికములకు "మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు విద్యావంతురా లనియుఁ బ్రయోగింపఁదగు'(తత్స.71సూ.వివరణము) (ఉ.138) ఇం కొకచోట నీవిషయము నిట్లు చెప్పెను. బల్లిదాదులు సంస్కృత తుల్యము లగుటవలన "స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుం గలుగు నని యెఱుంగునది' (ఆచ్ఛి.3.సూ.వివరణము)యని యింకను స్పష్టముగాఁజెప్పెను. అనఁగా బల్లిదాదిప్రాతిపదికలే (స్త్రీత్వమున) ఆలుశబ్దముతో సమసించు ననియే కదా యర్థము. సంస్కృతతుల్యత్వముచే నిట్టివి సిద్ధించు ననఁగా సంస్కృతముల కిట్టివి సిద్ధించుచున్నది. కావున (బల్లిదాదిసంస్కృతతుల్యములవలె) గుణవంత మున్నగు ప్రాతిపదికలే స్త్రీత్వమునం దాలుశబ్దముతోడ సమసించు ననియు (గుణవంతురాలు మున్నగురీతిగాఁ బ్రయోగింపఁబడు ననియు) సూరియభిప్రాయము స్పష్టము. కావున నీసమాసమును ప్రస్తుతసూత్రమునఁ గాక తత్స.71, ఆచ్ఛి.3. సూత్రవివరణములచే సూరి జ్ఞాపితము చేసె నని యెఱుంగఁదగును. వీరు నయితము సూరివలెఁ జెప్పియే (ఇంకను బల్లిదాదిసూత్రముననే చేర్చి) యుండిరి. కావున వీరు నీసమాసమును ప్రస్తుతసూత్రముచే జ్ఞాపితము చేయవలసినయవసరము లేదు. ఇట్టిసమాసత్వకల్పన సామర్థ్యముచేత నీయవి మిశ్రసమాసము లనుటయుఁ దప్పు గాదు. వే ఱొకతీరుగ సమన్వయించునవకాశమును లేదు గదా.

ఇల్లాలు :

'ఇల్లుయొక్క+ఆలు- ఇల్లాలు అను శేషషష్ఠీసమాసమును సంబంధార్థవివక్షచేఁ గర్మధారయముగ భావింపనగును గాని యట్టిరూపములు కవిప్రయోగాధీనములు

గాన నట రుగాగమము రాదు' (ఉ.58) అనిరి. ఇది శేషషష్ఠీసమాసముగానె చూపి యుఁ గర్మధారయ మనుకొనుటయు, నందువలన రుగాగమము ప్రాప్తించుచుండఁ గవిప్రయోగముల ననుసరించి రా దనియుఁ జెప్ప నేలకో, గర్మధారయంబులం దన్నను శేషషష్ఠియందలిటుక్కును సూత్రింపక తప్పదని యింతకు ముందు ప్రయోగములలోఁ గన్పించుచున్నటుగాగమువిషయమునఁ జెప్పిరి. లేనిరుగాగమమునెడల షష్ఠీసమాసమును గర్మధారయముగ భావింపనగు ననుచుండిరి. ఇది పరస్పరవిరుద్ధ మగుసమన్వయము గదా.

(రుగాగమము)లక్షణసిద్ధ మగుచుండఁగాఁ గవిప్రయోగాధీనము గావున లే దనుట సరి యగుసమన్వయమా? ఏది మాత్రము కవిప్రయోగాధీనము గాదు? (విధింపఁబడినరుగాగమము కవిప్రయోగానుగుణము గాదా?) శబ్దస్వరూపము కవిప్రయోగాధీన మైయుండఁ దదనుగుణముగ లక్షణము చేయుట యుచితము గదా.

మగనాలు ఇల్లాలు మున్నగుసమాసములు సమానాధికరణములు కామింజేసి యట్టియెడల రుగాగమము రాదయ్యెను --- షష్ఠీసమాసమునందును సామానాధికరణ్యమును జూపనగుటంజేసి -రుగాగమము చేయరాదా. అట్టిప్రయోగ మున్నపుడు గత్యంతరాభావమున షష్ఠీసమాసమున సామానాధికరణ్యము నెట్లో చూపవలసినదే కాని యెల్లయెడల నట్లు చూపి షష్ఠీసమాసస్థితికి నిర్విషయత్వమును ఘటించుట యుక్తము కాదు (వ్యా.సం.స.359)అని వీరే యింతకు ముందు పేర్కొనుట స్మరింపఁదగును. కాని యిట్టివీరు టుగాగమమును శేషషష్ఠీసమాసములందు నూరి విధింపకుండుట సరి కా దని ప్రత్యేకముగఁ బేర్కొనుట విశేషము.

కర్మధారయమునందే యెట నైన రుగాగమము లేనిచో (పేదాదుల కనుట చేత) పేదాదులలోఁ జేర్చకుండ రుగాగమమును వారించుకొనఁదగియుండఁగా షష్ఠీసమాసముల నిందుఁ దెచ్చిపెట్టి రుగాగమమును శంకించుట యుక్తమా?

అన లిట వీరు ఇల్లుయొక్క(ఆలు)అని చూపుటయే విశేషము. అహో. కన్నునది యని యుదాహరించుటంగూర్చి వీరు "కన్నుశబ్ద మౌపవిభక్తిక మగుటంజేసి కంటియొక్క+అది కంటిది అని యేర్పడును గాని 'కన్నునది' అని యేర్పడనేర (వ్యా.సం.స.407) దనిరే. మఱి ఇల్లుయొక్క-ఆలు-ఇల్లాలు- గృహిణి (వ్యా.సం.స.371, ఉ.58) యని వీ రెట్లు చెప్పిరి. కన్నుశబ్దమువలె నిల్లుశబ్ద మౌపవిభక్తికము గాదా? కన్నునది యనురూప మనిష్ట మగుటంజేసిదానియౌపవిభక్తికత్వమును

ప్రస్తావించిరి. 'ఇల్లాలు' ఇష్ట మగుటచే నది మానిరా? మఱి యీరూప మెట్లు?

ఇందుకయి ఇల్లు + ఆలు అనుతీరుగా షష్ఠ్యర్థమునఁ బ్రథమతోఁ గర్మధారయ మని రుగాగమమును శంకించిరా? అట్టియుద్దేశ్యము వీరికి లే దని సం.వివరణమును బట్టియే కాక యిట 'ఇల్లుయొక్క' అని చూపుటంబట్టియు గుర్తింపఁదగును. షష్ఠీ విభక్తికబాధచేఁ గర్మధారయముగాఁ జెప్పవలసి వచ్చిన దని వారును వివరింపలేదు. అది యుచితమె. షష్ఠ్యర్థమునఁ బ్రథమ యెట్లు?

షష్ఠీవిభక్తికములు ప్రాయిక మవుట (వీరు బహుళ మనిరి) నిట రాలే దని చెప్పు టొకమార్గము. ఇంటిది యనురీతివానినిబట్టి ఇల్లాలు వికృతాదులలోఁ జేర్చుటయు నొప్పును. ఇల్లుటా లగుయశోద. (నిలా.1.71)

ఆలు - స్త్రీ :

"ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము. అని సూరి వచించుట సరి కాదు. 'కలుచుట దోసమే మగలఁ గల్వక యాండురు దొల్లి యాండురం గలుతురె.' ఆలుశబ్దమునకు స్త్రీ యనునర్థమె కల' (ఉ.68) దనిరి. ఇట నీసమాసమునం దాలుశబ్దమునకు స్త్రీ యని మాత్రమె యర్థ మనఁగా సమాసేతరస్థలములం దాయర్థము లే దని చెప్పు టెట్లు? 'ఆలుశబ్దమునకు స్త్రీ యనునర్థమె కల' దనుటలో వరుల వారియుద్దేశ్యము 'ఆలు'కు స్త్రీ యనునర్థ మొక్కటె కల దని కాకపోవచ్చును. భార్య యనునర్థము ప్రసిద్ధమె కదా. వృత్తియందలివిశేషముగాఁ గాక 'ఆలుశబ్దమునకు స్త్రీ యనునర్థము సహజముగనె కల దని చెప్పుట వారియుద్దేశ్య మందము. కాఁగా భార్య యనువిం కొకయర్థ మాలుశబ్దమునకుఁ గలదు గదా. ఇచట వృత్తియందు స్త్రీమాత్రపర మనుటలో భార్య యనునర్థ ముండనేర దని వచించుట ప్రయోజనము కాఁగా ఆలు, అనుదానికి వ్యస్తతలోఁ గాని మఱియొకసమాసమునఁ గాని స్త్రీ యనునర్థమె లే దని సూరివాక్యముల కర్థము చేయు టెట్లు?

అట్లయ్యును వీ రింతకు ముందు "వ్యస్తతలో నాలుశబ్దమునకు భార్య యని మాత్రమె యర్థ మైనను నీసందర్భములో నిసమాసమున నది స్త్రీమాత్రపర మని యధర్వణుఁడు నవరించుచున్నాఁ (వ్యా.సం.స.368) డని పేర్కొనిరి. (అధర్వణాభిప్రాయము పైసూరివివరణము ననుసరించి గ్రహించి రనుటలో దోషము లేదు.అధ యభిప్రాయముపైసూరివివరణము ననుసరించి గ్రహించి రనుటలో దోషము లేదు.

త్వము(దు 'సంబద్ధే క్వచిదర్థస్స్యాచ్చసంబద్ధే విలక్షణః' అని మాత్రమె చెప్పె.సూరియె స్పష్టముగాఁ జెప్పె ని ట్లన.) కాఁగా వ్యస్తతలో (కర్మధారయేతరసమాసములందు ను. రాముఁనియాలు మొ॥) ఆలుశబ్దమునకు భార్య యనియే కాని స్త్రీ యని యర్థము లే దని వీరే నిర్ణయించిరి. పై. కు.సం.ప్రయోగమునుగూర్చి 'సన్నయాధర్వణుల వచనములనుబట్టి వ్యస్తతలో స్త్రీపరముగా నాలుశబ్దమును సన్నెచోటను బ్రయోగించుట కవులనిరంకుశత్వము వ్యక్త మగుచున్న' (వ్యా.సం.న.౨౬౮) దనిరి.అట్టినిరంకుశప్రయోగమునుఁబట్టియా భాషాసామాన్యలక్షణము (వ్యస్తతలోను ఆలు-స్త్రీ అని) చేయుట. సూ.వి. ఆలవు బాలవు అనుకు.సం.ప్రయోగమునె చూపి 'ఈయర్థమందు (స్త్రీ) వ్యస్తప్రయోగము ఈగ్రంథమునసే కనఁబడుచున్న' దని స్పష్టము చేసినది. అట్టియెడల నీయవి విశేషస్థలములుగా నెన్నుట యుచితము గాని సహజ మైనట్లు పేర్కొనుట భాషాసామాన్యలక్షణమున కనుగుణము కాదు.

కాఁగా సూరివాక్యమునర్థము 'ఇతరస్థలములయందు భార్యార్థక మైనయాలుశబ్దము ప్రస్తుతరుగాగమస్థలములయందు స్త్రీ యని మాత్రమె యర్థమును దెల్పు నని'గ్రహింపఁదగు. అందుకే మార్గాంతరము లేమిఁ గాఁబోలు దారార్థేఽతఉదపి రః (నిత్యం దారాదేశ్చ స్యాత్) అని దారార్థకముగానె చిం. చెప్పినది.

సూరివివరణము సమంజసము.

"ఇచట ననఁగా సూత్రద్వయవిషయమునందును ఆలుశబ్దము సమాసగతమై కాన నట్టిస్థితియందుదానికి స్త్రీ అనియె యర్థము.వ్యస్తస్థితిలో నది భార్యకు వాచకము (వ్యా.సం.న.259) అనిరి. సమాసగతమై కాన ననుటలో నాలుశబ్దము వ్యస్తస్థితిలో మాత్రమె భార్యార్థక మగు ననియు సమాసగత మైనప్పు డెల్ల స్త్రీ యనియే కాని భార్య యనునర్థ ముండ దనియు వీరియుద్దేశ్య మనవలసియున్నది. కాని యిది సరి కాదు. సూరి 'ఇచట' ననఁగా (రుగాగమమగునట్టి) కర్మధారయములందు మాత్రమె యని యర్థము. సమాసమునం దెల్ల నయిన 'ఇచట' నన నేల? పేద(యొక్క) యాలు గుణవంతునియాలు మున్నగుస్థలముల నాలుశబ్దము సమాసగతమై యయ్యు (వ్యస్తము గాకున్నను) భార్యార్థకమె యగును. వరులవారిపైవివరణవాక్యముల వలన దీని కవకాశ ముండదని నాయభిప్రాయము సరి కాదు.

### మ్ముంబులు - పుంపులు :

'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' (32) ననుసూరిలక్షణము నట్ల గ్రహించుచు- 'మువర్ణకమునకు పుంపు లగు'(ఉ.30సూ) నని ద్రుతకార్యములు మానిరి. ఈరీతిస్పష్టత యనవసరము.

"మువర్ణకంబున కనుదానిచే మువర్ణకమునకును,మాగాగమమునకును మ్ముంబులకును నీయాదేశము వచ్చు నని యెఱుంగునది" (వ్యా.సం.స.363)యనిరి.'ముట్వోర్వవేతాం పుంప్వాఖ్యావాదేశౌ' యను వి.వి.లక్షణముప్రభావముచేతఁ గావచ్చును వజ్ఝలవారు మ్ముంబులకు నీయాదేశము వచ్చుటను బ్రస్తావించిరి. కాని యది యనవసరగౌరవము.మువర్ణమునకు మాముడియో'ంబు'వర్ణమో చేసి యాపిదప పుంపులు చేయ నేల? మువర్ణకమునకే పుంపులు చేసిన నిష్టరూపము సిద్ధింపదా? నెయ్యపుఁ బలు కనుచో నెయ్యమైనపలుకు నెయ్యము+పలుకు అని యుండగా మువర్ణకమునకు పుంపులు చేయఁ బిదప నెయ్యపుఁ బలుకు నెయ్యంపుఁ బలుకు అని యగును. నెయ్యమ్ము, నెయ్యంబు అని చూపవలసినయవసర మేమి? మ్ముంబులకు రా వన్న నెయ్యపుఁ బలు కను నుద్దిష్టరూపము సాధ్యము గాదా?

కావున వజ్ఝలవారు మ్ముంబులకు పుంపులగు నని చెప్పుట యనవసర మని నిశ్చయింపఁదగును.

### షష్ఠీసమాసము -పుంపులు :

"షష్ఠీసమాసములో నిపుంపులకుఁ బ్రానస్థలస్థగితసోమయాజిప్రయోగము లుండఁగా నథర్వణుఁడు వానిని సాధించియుండఁగా సూరి సూత్రింపకుండుట వింత. సూత్రింపకున్నను నొకచో నట్టాని నుదాహరించెను. సింగపుఁ గొదమ.' (వ్యా.సం. స.364)

అథర్వణుఁడు షష్ఠీసమాసమునఁ బుంపు లగు నని సూత్రించెనా? సూరియు నట్లే ప్రత్యేకముగ సూత్రింపకయ సాధించెను. వి.వి.లో 'గ్రామానామ్నోఽపి మోః పుస్పౌ తనువచనస్వారస్యముచే షష్ఠీసమాసమున పుంపు లగు నని తలఁపవలసి యున్నట్లు పేర్కొనిరి. (వ్యా.సం.స.362) గంథపుఁజెక్క యిత్యాదిగా గ్రామనామేతరశబ్దములందును నీకార్యము స్పష్టము.కాన గ్రామనామ్నోఽపి యనుదానిచే నిత

కము లగుషష్ఠీసమాసములందును గల దనవలె. అట్టియెడల షష్ఠీసమాసములం దగు నని స్పష్టముగాఁ జెప్పక గ్రామనామములయం దని వేఱుగా నస్పష్టముగాఁ జెప్ప నేల? 'అవిశబ్దస్వారస్యముచే నిది షష్ఠిలో సార్వత్రికము గా దనవచ్చును' (వ్యా.సం.స.364) అయ్యు 'షష్ఠీసమాసేఽపి' యనురీతిగాఁ జెప్పినమాత్ర మీయర్థము సిద్ధింపదా? సూరి సాధించుటంగూర్చి ప్రశ్నింతురు గాక అథర్వణునితోఁ బోలిక చెప్పఁబూనిక యనవసరము.

సింగపుఁగోదమ యని సూరి యుదాహరించుటను వీరును గుర్తించిరి కదా. దానింబట్టి షష్ఠీసమాసమునఁ బుంపులు సూరిసమ్మతమే. అట నుగాగమ మైనది. అది యెట్లు? "సింగపుంగోదమ- ప్రకృతసూత్రములోని సమాసంబులన్ అనుబహువచనస్వారస్యమున శేషషష్ఠీసమాసములందును నీయాగమము వచ్చు ననుటకును నుదాహృతి యగుచున్నది' (వ్యా.సం.స.345) యనిరి. అట షష్ఠీసమాసములం దన కున్నను బహువచనస్వారస్యముచే షష్ఠీసమాసములం దయినది. (అట నుగాగమ మగుటకు ముందు సింగపు అని పుంపులు వచ్చుటకును నట్లే)ఇటఁ గూడ 'కర్మధారయంబులందు' అని బహువచనమునే ప్రయోగించెనే. అట్టిస్వారస్య మిట నుండదా? బాం.సామానాధికరణ్యేషు అని విధించినటుకు బహువచనస్వారస్యముచే షష్ఠీసమాసములం దయినది. అట్లే యిట నేల కాదు?

ఉ.లో 'కర్మధారయంబులందు అనుబహువచనపుమహిమచేత --- షష్ఠీసమాసమందును నీవిధి వర్తిల్లును. "(ఉ.59) అని గుర్తించిరి. ఇట నిట్లు గుర్తించిన వీరు టుగ్విధానస్థలమున మఱల వ్యా.సం.స.లో పుంపులస్థలమునవలె భావించుట సక్రమముగా లేదు.

'షష్ఠీసమాసమందలిపుంప్వాదేశము సార్వత్రికమును నిత్యమును గాదు' (వ్యా.సం.స.364) గావున దానిని బ్రత్యేకముగఁ జెప్పక బహువచనస్వారస్యముచే గుర్తించుట యుచితమ. సం.లోఁ దలఁచినట్లుగా శేషషష్ఠీసమాసములలోఁ బుంపు లగుటను బ్రత్యేకముగా సూత్రించినఁ గర్మధారయములందువలె షష్ఠీసమాసములందును సాధారణముగా రాక తప్పు టెట్లు?

మొత్తముపై ఉ.లో వయులవారివచనముల ననుసరించియె షష్ఠీసమాసములందలిపుంపులను (ఉ.లో వీరివలెనె) ప్రత్యేకముగా సూరి సూత్రింపకుండుట సమంజసమే యనియు నయ్యు నచ్చోటిపుంపులు సూరిలక్షణము సాధించుచునే యున్న దనియు గుర్తింపవచ్చును.

## సరసపువచనములతో :

సూరి సమాసవిభక్తికి లోపము చెప్పి లట్టునకు గా దనెను. కావున నిట సరసములతో వచనములతో నని చెప్పిన లట్టు లోపింపదు గాన సరసములతో వచనములతో నని విశేషణబహువచనమున కేకవచనము చేసి ప్రక్రియ మొన్నుదగు (వ్యా.సం.స.365) ననిరి. కాని యీమార్గము సరి కాదు.(సరసముతో వచనములతో ననురీతివ్యవహారము లక్షణసిద్ధమ మైనను ప్రసిద్ధము గాదు. అది య ట్లుండ(గా) సరసము లై నవచనము లనునర్థమున సరసములు+వచనములు అని యుండ సమాసమున విభక్తి లోపించి 'పు' ఆదేశ మయి సరసపువచన అనుసమాసప్రాతిపదిక పై దృతీయాబహువచనముతో సరసపువచనములతో నని రూప మేర్పడును. (చూ.సమా.)

## శోకార్తపుటోదళులతో :

"శోకార్తపుటొదలులలో ననురీతిని ముగాగమమునకును పుంప్వ లగును. ప్రకృతసూత్రపుజ్ఞాపకమహిమచేత సమాసపూర్వావయవవిభక్తివచనాదులలోపమును, ముగాగమము వచ్చుటయు దానికి పుంపు లాదేశ మగుటయు (ఉత్తరపదస్థవిభక్తి లోపించి సామాసికప్రకృతి యేర్పడుట) సామాన్యశాస్త్రసిద్ధమే సంభవించును." (ఉ. 69వ్యా.సం.స.362)

వీరు సమాసమున నలౌకికవిగ్రహముననే సంస్కృతవిభక్తులకు లోపము వచ్చునని భావించినవా రగుటచే విభక్తివచనములకు ముందు లోప మై పిదప ముగాగమ మగు ననిరి. శోకార్త+ఒదలు (విభక్తి లోపించి) అని కాగా శోకార్తము+ఒదలు (ఇచట 'ము' అగమము?) అనియై శోకార్తపు అని యగును. ముగాగమము విభక్తి పర మగునపుడు కావలెను. ఇట విభక్తి పరముగా లేదు. మరి యెట్లు వచ్చినది? పుంపువిధానముచే వచ్చిన దనవలె. అదియు విశేషమే.

కాని యేతద్భిన్నముగా వీరె మఱియొకచో ని ట్లనిరి. 'శోకార్తములు-ఒడలులు శోకార్తపుటొడలులు మున్నగుచోట్ల సంధి30సూత్రము చెప్పిన వీనిసమాసాదికము జ్ఞాపిత మై తత్సూత్రానుకూలముగా ముగాగమము వచ్చుట దానికి పుంపాదేశము

మున్నగునవి యగుట సంభవించును (ఉ.278) ఇట 'ముగాగమము వచ్చి' యనక 'ముగాగమము నిల్చుట' యనుటచే (లు)విభక్తిమాత్రము లోపించి ముగాగమము లోపింపక నిల్చియుండు నని యర్థ మగును. మఱి యిట సంస్కృతవిభక్తులు లోపించుట యనువీరిమార్గ మనుసరింపఁబడలే దన్నమాట. ఇది సూరిమార్గము. ఇది యుచితము. సంస్కృతవిభక్తి లోపించి ముగాగమ మగు ననుటకంటెఁ దెలుఁగు విభక్తి లోపించి యంతకుముందే వచ్చినముగాగమము నిల్చి దానికి పుంపు లగు ననుట సక్రమము గదా.

సంస్కృతవిభక్తులను లోపింపఁజేయువీరిప్రక్రియావిధానము సరి కావని పైని స్పష్ట మగును. (సమా.25)

## సరసపువచనములు :

'సరసములువచనములు అనుచో విభక్తిలోపము కల్గఁగా సరసమువచనములు అని సిద్ధించెను. ముగాగమము ప్రకృత్యవయవము గాన నయ్యది లోపింప దని సూరితలంపు' (వ్యా.సం.స.1169) అనువదులవారియభిప్రాయము సరి కాదు. మువర్ణకమునకు విధించుకార్యము ముగాగమమునకు రావలసియే యున్నది (తత్స.41) కావుననే చుట్టముయొక్క ఱికె యనుచో నాగమమువర్ణము లోపించుచునేయున్నది గదా. చుట్టఱికము. ఇటఁ గూడ సరసములు+వచనములు అనుచో నుత్తరపదమున లువిభక్తితోపాటు ఆగమమువర్ణముగూడ లోపించి సర(ము) వచన అని సామాసిక ప్రాతిపదిక యేర్పడుచున్నది.ఇట్లే పూర్వపదమునందును లువిభక్తితోపా టాగమము వర్ణమును లోపింపవలసినదే కాని మువర్ణకమునకువిధించినపుంపులు ముగాగమమునకును గావలసియున్నది గావు పుంపు విధానసామర్థ్యము ననుసరించి పూర్వపదమువందలియాగమమువర్ణము లోపింపక దానికి పుంపు లగుచున్న వని గ్రహింపవలెను. సరసపువచన-సరసపువచనములు.

## పుంప్వాభావము :

"ఈపుంపులు నిల్వకుండుటయు నటట మువర్ణకమె నిల్చుటయు నరుదుగఁ గన్పట్టును. వాత్సల్యంబున మత్స్య మైనరూపంబున- మత్స్యపురూప మనలేదు.లోకము సమరము లట్లు. లోకపుసమర మనలేదు. (ఉ.59)

'పుంపులు నిల్వకుండుటయు' ననుటలో 'పుంపులు రాకుండుటయు' నని వదులవారియభిప్రాయ మెన్నఁదగు. పుంపులు వచ్చి లోపించుప్రసంగము లేదుగదా

వఝులవారియభిప్రాయ మెన్నఁదగు. పుంపులు వచ్చి లోపింపు ప్రసంగము లేదుగదా. మువర్ణకము నిల్చి యున్నది గదా. సందేహమునకుఁ దావు లేకుండ స్పష్టముగాఁ జెప్పఁదగు.

పుంపులు రానంతులకు 'మత్స్య మైనరూప' మన్న దుదాహరించుట యసమంజసము. (పుంపు లైన)- మత్స్యపురూప మని కాలే దందు రేమి? మత్స్య మైనరూప మనుచో నడుమ నున్న 'ఐన' అనుశబ్దము 'పుంపులు వచ్చినపిదప నే' మగును? మత్స్య మైనరూప మని చూపవలదా? 'మత్స్యపురూప' మన్నది సమాసము గాని మత్స్యమైనరూప మన్నది సమాసమై కా దనుటలో సందేహము లేదు గదా. నడుమ నున్న ఐన అనుశబ్దమె దీనివ్యస్తతను విరూపించుచున్నది. అందుచేతనె 'పు' ఆదేశము చేసిన మత్స్యపురూప మనుచో 'ఐన' శబ్దము లేదు. (కర్మధారయ) సమాసమై కానపుడు కర్మధారయసమాసమున విధించినపుంపులకు (వ్యస్తతలో) ప్రసక్తి యేమి? సరసపువచనము లనుచోఁ బుంపులు గలవు. సరసపులు వచనములు లేదా 'వచనంపులు సరసములు అని పుంపు లగునా?

కావున వఝులవారు ఉగ్ర పగుబలము ఉగ్రపు ంగుబలములు ఉగ్రపగుబలము ఉగ్రపగుబలముచేత మున్నగురీతిని వచింపరాదు. ఉగ్ర మగుబలముచేత అని ధైర్యదును' (వ్యా.సం స.౩౮౧) అనిరి. సమాసములు గామి పుంపులు ప్రాప్తింపమి నట్లుగా వని తలఁచిన నుచితమే. కాక పుంపులు రావలసియుండ రాలే దని ఉ.లోపలెఁదలఁచిన నది యసంగతము. సమా.74 సూత్రములో 'మువర్ణకవిరహితము గాదా' దని చెప్పుటలో నిది చేయుద్దేశ్య మైన నది యసంగతము.

పైఁగా నట వీరు 'మత్స్య మైనరూపము మత్స్యపురూపము మత్స్యముయొక్కరూపము (వ్యా.సం.స.౩౮౪) అనియుఁ జెప్పిరి. మత్స్యమురూపము అని యున్నచో నిది లక్ష్యము గాఁగలదు.

మొత్తముపై మత్స్య మైనరూప మనునది యిటఁ జూపుట సరి కాదు.

పిదపఁ జూపిన 'లోకము నమరములు' అన్న దిట నుదాహరింపఁదగినదే. కాని యిది లోకముయొక్క నమరములు అనురీతిగా షష్ఠీతత్పురుషము. 'కర్మధారయంబులందు' అనుచోటిబహువచనప్రయోగముచేతఁ గదా యీషష్ఠీసమాసమందు పుంపులు సాధింపఁబడుచున్నది. (ఉ.౬౪) కావున జ్ఞాపకసిద్ధం న సర్వత్ర' (శబ్దశా.320) యనుపరిభాష కనుగుణముగా షష్ఠీసమాసమున పుంపులు సార్వత్రికము గామిఁ (వ్యా.

సం.స.364) గొప్పయెడం బుంవ్వద్భావము సిద్ధించుచున్నది. షష్ఠీసమాసములందలి పుంవద్భావ మిట్లు సమన్వయింపఁదగియున్నది. పర్వతముతోట (హరి.ఉ.6.9.)

సాహసంబుతతి (శల్య.2.114-ఉ.53) సూరియు 'సంజీవకముఠావము' అని పి.చం.లోఁ బ్రయోగించె.

వట్టమేనుఁగు (సిం.1.14)



### తామరపాకు :

'తామరము అనుశబ్దమే లేదు గాన 'తామరపాకు' అనునది వ్యావహారికరూపము. దీని నాధారముగఁ గొని ప్రౌఢవ్యాకర్త పుగాగమమును విధించుట సరి కాదు. నీప్రజతామరయాకు' (ద్రోణ.4.309,ఉ.69) అని వివరించిరి.తామరము అనుశబ్దము లేదు గనుకనే ప్రౌఢవ్యాకర్త పుగాగమమును విధించెను.లేనిచో 'తములపాకు'వలెనె గ్రహింపఁడా? అట్లే తామరంపాకు అనురీతివి లేకుండుటయు స్పష్టమే కదా. వ్యవహారమున నె ట్లేర్పడినను గవిప్రయోగములఁ గాన వచ్చుచుండుటచేఁ బ్రౌఢ.పుగాగమము విధించె ననఁదగు. అట్టిచో నెల్లఁ దామరయాకు అని దిద్దఁజూచుటకంటె నంగీకరించుటయే యుక్తము నీప్రజతామరపాకు అనియె తిక్కనప్రయోగమునను గానవచ్చు (చూ.త్రి.శే.)

### ఔ-నుగాగమము :

'ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' (33) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి. (ఉ.31.సూ)

విశేషము."క్రియా103వసూ.చొప్పున వచ్చువక్రతమౌకారము మీఁదను నీయాగమ మగును. ప్రబలమౌనీశ (ఉ.60) అయినను పీ రిట సూత్రమున నౌకారము మీఁద నీకార్యమును బ్రత్యేకముగాఁ జెప్పకుండుట యుచితముగా నున్నది.అవు+ఈశ (లేదా అగు+ఈశ) అని యుదంతముపైనె యీయాగమమును జేసి పిదపనే 'అవు' నకు వక్రతమము (ఔ) చేయఁగా నీప్రయోగము సాధింపఁబడుచునే యున్నది గదా.

"దీని నపేక్షించుటయుఁ గలదు.కొల్చురగసంఘములు (శాశవత్రమాతృకలలో కొల్చునురగ అనియే యున్నది.) వెడలగ్నిదీప్తులనఁగ "(హంస.5) (ఉ.60)అని

వీరు నుగాగమాభావమును గుర్తించిరి. ఇట్టివి విశేషస్థలములుగా నెన్నఁదగుఁ గావున వీరు సూత్రమున మార్పు చేయకుండు టుచితముగా నున్నది.

పిదప 'ఇదియును జ్ఞాపకసిద్ధ మగుచు మిశ్రమును గ్రాహ్య మగును. మాతుఁ జేయునతిథిపూజలు (ఉ.60) అనిరి. 'ఇదియును' అన నేమి? నుగాగమమా? మిశ్ర సమాసమా? అస్పష్టము. విరుద్ధము. ఈనుగాగమవిధానముచే మిశ్రసమాసములను జ్ఞాపితము చేయుట వీరిలక్ష్యము.

సమాససామాన్యశాస్త్రముచే నాచ్ఛికసమాసములు మాత్రమే సిద్ధించు ననియు మిశ్రములు (సాధ్య) సాంస్కృతికము లెట్లేని జ్ఞాపకసిద్ధములు గావలసినదే యని యు వరుులవారిసిద్ధాంతము. కావున విట మిశ్రసమాసములు జ్ఞాపితము లనిరి. 'రక్షింపునంట' యన్నది మిశ్రము గాదు గదా. నుగాగమ మెట్లు? మిశ్రములే కాక సాధ్యసాంస్కృతికసమాసములను వీరు జ్ఞాపితములు చేసికొనవలె.

కాని యీసూత్రముచే మిశ్రాదులు జ్ఞాపితము లగు ననుట యెట్లు? ఉదంత తద్ధర్మార్థవిశేషణము లాచ్ఛికములు లేవా? వాని కచ్చు పర మగునపుడు నుగాగమము వచ్చి చేయునతఁడు, చేసెడునతఁడు ననురీతి నాచ్ఛికసమాసములయెడ నీవిధి చరితార్థ మయియే యున్నది గదా. మిశ్రాదులు తప్ప గతి లేనప్పుడే యిట నయ్యవి జ్ఞాపితము లగుట సక్రమము. సూత్రమునఁ దత్సమవిశేషణమున కని కాని, తత్సమస్వరము పరమగునపు డని కాని చెప్పఁబడలేదే. (అది యెంతయు ననర్థకము. కాని మిశ్రాది సమాసములు జ్ఞాపితములు గావలె నన్న నట్లు చెప్పినసే యవకాశ ముండును.) తత్సమవిశేషణమున కన్న వర్తిల్లెడునతఁడు ఇత్యాదులు సిద్ధించినను చేయునతిథిపూజలు సాధింపఁబడదు. తత్సమస్వరము పర మగునపు డన్నఁ జేయునతిథిపూజ లన్నది సిద్ధ మగుఁ గాని వర్తిల్లెడునతఁ డన్నది గుదురదు. తత్సమవిశేషణమునకుఁ దత్సమ స్వరము పర మగునపు డన్నచో పైవానితోపాటు చేయునతఁడు ఇత్యాదులును సిద్ధింపవు. ఆ ట్లేమియు ననక సూరి చెప్పినట్లే స్వీకరించిన వరుులవారిమతము ననుస రించి, వర్తిల్లెడునతఁడు, చేయునతిథిపూజ లన్నరెండువిధములగునవే కాక వర్తిల్లెడు నపుడు లిత్యాదులు సిద్ధింపవు. ఇంత యనర్థ మేల కల్గినది? మిశ్రాదిసమాసములు జ్ఞాపితము గావలసినదే యని వరుులవారు సిద్ధాంతముచేసికొనుటచే నని స్పష్టము.

కర్మధారయములందు పుంపులు విధించినచోట నైతము వీ రిట్లే జ్ఞాపితములు చేయుట పైవిధముగనె యసంగత మని గ్రహింపఁదగును.

మొత్తముపై వసులవారు చూపిన(సూరి)లక్షణము ననుసరించి మిశ్ర(సాధ్య) సాంస్కృతికసమాసములు జ్ఞాపిత మవుట యసంభవము. కాన నందలినుగాగమమును వీరిలక్షణము సాధింపఁజాలదు. 'కవిప్రయోగాధీన' మని చెప్పి సాధించుకొనుట యొక్కటి వీరికిఁ దగినమార్గము.

సర్వలక్ష్యసంగ్రాహక మగుచు సూరిమతము సముచితము.

## షష్ఠీసమాసము - నుగాగమము :

'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' (34)ననుసూరిలక్షణమును వీరు "షష్ఠీసమాసమునందు ఉకారమునకు వికల్పముగాను ఋకారమునకు నిత్యముగాను నుగాగమ మగును" (ఉ.32)అని సవరించిరి.

"సూరి ఉకారమునకును నిత్యమె యని సూత్రించుట పైమహాకవిప్రయోగములకు విరుద్ధము" (ఉ.60) సూరి నిత్య మనుటకంటె వీరు వికల్ప మనుటయె కవిప్రయోగవిరుద్ధ మనక తప్పదు.

దీనమట్లు ఇత్యాదిగఁ దిక్కనాదులు నుగాగమమును జేయమి వాస్తవమే. కాని దాని నాధారముగఁ జేసికొని వికల్ప మని నిర్ణయించుచో నెల్లెడల ద్వైరూప్యము నియతము గాదా? నన్నడిగె, నన్నునడిగె, వచ్చిరప్పుడు, వచ్చిరియప్పు డనురీతిగా -రామునియొక్క యానతి రామునానతి, రామానతి యని ద్వివిధరూపములతో నుండుట భాషాలక్షణముగాఁ జెప్ప టొప్పునా?

"కవిబ్రహ్మగారిప్రయోగములను మూలముగాఁ గొని శంభుదాసశ్రీనాథకవితాపితామహాదులును ఈనుగాగమమునుగొన్నియెడల నుపేక్షించుచు వచ్చిరి."(వ్యా.సం.ప.370) అని వీరే నుగాగమము లేకుండుట కొన్నియెడలనే యని గుర్తించియు నిట నెల్లెడల వికల్ప మని సామాన్యముగాఁ జెప్ప టెట్లు గుదురును? వీరియభిప్రాయము మారిన దని కవిప్రయోగములు మాఱవు గదా. వీరివైకల్పికవిధానము కవిప్రయోగములకు విరుద్ధ మని వీరిస్థలాంతరవివరణమే నిరూపించుచున్నది.

'సర్వేషామేవచోద న్తశబ్దానాం కౌ పరే భవేన్నః ప్రాయశః' అని వి.వి. చెప్పఁగా కువర్ణకంబు పరం బగునపుడుఉకారంబునకుఁ బ్రాయికముగనుఋకారమునకు

నిత్యముగాను నగాగమం బగు (ఉ.తత్స.28సూ) నని వీరు స్థలాంతరమునఁ జెప్పిన మార్గమునె యిట ననుసరించినఁ గొంత వఱ కుచిత మైయుండెడిది. అనఁగా వికల్ప మనక ప్రాయిక మనురీతిగా విధించిన నాగమము లేకుండుట కొన్నియెడలనే యగు టయు వచ్చుట ప్రచుర మనియుఁ గవిప్రయోగానుగుణముగ లక్షణ మేర్పడెడిది. కావున వయ్యలవారు వికల్ప మనుట సరి గా దని తెలిసెడి.

సూరియీయాగమము నిత్య మని సూత్రమున నిర్దేశింపలేదు. కావున నాగమ శాస్త్రమనిత్య మ్మనుపరిభాష నాశ్రయించి కొన్నియెడల నుగాగమము లేకుండుటను సాధించుకొనుటలోఁ దప్పు లేదు గదా.

ఇఁక వీరు చిం.మార్గములో షష్ఠికి ద్వితీయాతుల్యతతోడిప్రక్రియను జూపిరి. ఇది సూరిమార్గము కాదు. షష్ఠికి ద్వితీయాతుల్యతలోనియసంగతులు సమా.25సూత్ర మునొద్ద గమనింపఁగలము.

## విధాతృనానతి :

'ఇట షష్ఠీసమాసమున నుక్కు రాఁగా విధాతృ+ను+ఆనతి.విధాతృనానతి' (వ్యా.సం.స.370) వీ రిట్లే విష్ణు+ను+అందును- విష్ణునందును, విధాతృ+ను+ అందును- విధాతృనందును (వ్యా.సం.స.508) మొద లగురీతిగా స్థలాంతరములం దును జూపిరి. ఈరీతివయ్యలవారిప్రక్రియ యుచితముగా లేదు. నుగాగమ మనుచో నకారము నుత్వసహితముగా నాగమము చేయవలసినయవసర మేమి? మఱలనుత్వ సంధిచేయవలసినప్రక్రియాగౌరవమునకుఁ దప్ప.నుగాగమమునందలియుత్వ ముచ్చా రణసౌకర్యమునకై చేర్పఁబడినదిగా గుర్తింపఁదగును. అపుడు పొల్లునకారము మాత్రమె యాగమ మగును. విధాతృన్ ఆనతి విధాతృనానతి.

## సరసపుఁదనము :

'ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు నుగాగమం బగు' (35)ననుసూరిలక్షణమునందలి'పుంపులకు' ననుదళమును దొలఁగించి మిగిలినసూత్ర మట్లె గ్రహించిరి. (ఉ.35సూ) పుంపుల మీఁద నుగాగమము రా దన్నమాట.

సూరి 'పుంపులమీఁద నయితము నుగాగమము విధించెను. కాని యట్టిప్రయో

గములు లేవు (ఉ.61) (వ్యా.సం.స.345,372) అనిరి. సూరికి నదర్థ్వణాభిప్రాయము తెలియలే(వ్యా.సం.స.372)దనుట యసంగతము. అగ్గలపుఁదనము అని సూరి తద్ధిత పరిచ్ఛేదమున నుదాహరింపఁగా వీరు దాని నటఁ గూడఁ దొలఁగించిరి. అది సరి గాదు. తిక్కనాదులు పుంపులపై నిచట నుగాగమమును బ్రయోగించియే యుండిరి.

బెడిదంపుఁదనమున (నిర్వ.4.22) చుట్టపుఁదన మేల రాజసుతులకుఁ గలు గున్ (శ్రీ.2.104) గరువంపుఁదనంబున (ఆను.1.194) చిట్టకంపుఁదనాలకు(రామా. 7.198) బెట్టిదంపుఁదనంబునకున్ (భీష్మ.3.284) నిద్దంపుఁదనంబులు (పాం.3.179) అక్కసపుందనంబు (ఉ.రా.7.331) బెడిదపుఁదనమును (శాం.3.23) మొ॥

కావునఁ బుంపులపై నుగాగమము కవిప్రయుక్తమె యనియు నద్దానిని సూరి విధించి యుదాహరించుట యుక్తమె యనియు వరుసలవా దిది విడిచిపుచ్చుటయె సమంజసము గా దనియు స్పష్టము.

పుంపులపై నుగాగమము లే దన్న వీరిమతమున 'సరసపుతనము' అనురీతి గా నుండునా? పుంపులే రావా?

"సూరి సరసపుఁదనము అని సాధించెనే కాని యట్టియెడల పుంపులనె విధింప లేదు' (ఉ.61) అనిరి. వీరును విధింపలేదు. కావున నిట పుంపులే రా వని వీరి మత మనవచ్చును. పుంపులే లే వని చెప్పవలసియుండ పుంపులపై నుగాగమము లే దనుట విశేషమె. అవుఁ గాక. తనము పరకత్వమున సూరి పుంపులను సాధింప లేదా?

'తెల్లనసము- తద్ధితవృత్తి గాన దీనికి స్వత్వము లేదు. సంధి.26 (ఉ.61) అనిరి. అసలు బాల.లో 26 సూత్ర మిట్టిద యైనను వీరిగ్రంథమున నది 25సూత్రము. వీ రిట్టిసందర్భములలోఁ దమగ్రంథమునందలిసూత్రసంఖ్యనే యిచ్చుచుందురు. ఏ మయిన 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లే'దనుసూత్రముచే స్వత్వము రాదు. సమాసములందు చెప్పినస్వత్వనిషేధము తద్ధితవృత్తియందును బ్రవర్తించు నపుడు కర్మధారయంబు లందుఁ జెప్పినపుంపులు తద్ధితవృత్తిలో వచ్చుట విరుద్ధ మగునా?

అవుఁ గాక. ఈసూత్రమున 'పుంపులకుఁ దనంబు పరం బగునపు' డన్న

సామర్థ్యము ననుసరించి యైనను దనప్రత్యయపరకతలోఁ దద్ధితవృత్తియందు పుంపు లగు నని గ్రహింపవలెను. తనేతరతద్ధితపరకతయందు లేకపోవుటయు గమనార్హము. చుట్టఱికము. మొ॥

పుంపులు రా వని తలఁచినవీరిమతమున నీరూపము లెట్లుండును? చుట్టము+ఱిక అనుచోఁ దద్ధితవృత్తియందు మువర్ణకము లోపించి చుట్టఱికము అని యైనది. (తనపరకత్వముననే సూరిమతముననుం బుంపు లగును.) అదే విధముగా సరసము యొక్క భావము అనునర్థమున సరసము+తన అనుచో మువిభక్తి లోపించి సరసతనము అని యగునా? సరసపుఁదనము అనుదానికిఁ గవిప్రయోగములు లేవన్న వీరు తాము సాధించినసరసతనము అనుదానికిఁ గవిప్రయోగము చూపఁగలరా?

'చుట్టముతనము అనియె యుండ నగు' (వ్యా.సం.న.1266) ననిరి వీరు. ఇట మువర్ణ మేల నిల్చియున్నది. చుట్టముఱిక మనియు నుండునా? చుట్టఱిక మనుచో లోపించినమువర్ణము చుట్టముతన మనుచో నేల లోపింపదు? పుంపు లగుచోఁ దత్సామర్థ్యముచే లోపింపదు. కాని యపుడు పుంపు లగును. కాన మువర్ణ మిట నిలిచి యుండు ననుటకు వీరివివరణము దప్ప లక్షణమున నేమియు నాధారము లేదు.

చుట్టతనము అని కావలసిన దానిని చుట్టముతనము అని చూపిరి. పోనీ దానికైనను బ్రయోగము చూపిరా? ప్రయోగము చూపకయె సూరి సాధించిన సరసపుఁదన మసాధువు తాము చూపిన సరసముతనము సాధు వని నిర్ణయించిన నెట్లు విశ్వసింతుము?

ఇంకఁ బైని జూపిన రీతిని గవిప్రయోగములలో నిట పుంపు లగుటయు వానిపై నుగాగమ మగుటయు గుర్తింపఁదగియుండుటంజేసి సూరి సరసపుఁదన మని చూపు టుచితము. వీరు సాధించిన 'సరసముతనము' ప్రయోగము వెదుకవలె. వీరి లక్షణముచే సాధింపఁబడు 'సరసతనము' ఉండదు.

"ఈసూత్రమందలిగుణవాచకశబ్దముచేత తద్ధితసూత్రమునకు లక్ష్యము లగు నల్లతెల్లమున్నగునవి మాత్రము వాచ్యము లగును గాని పెద్ద-గొప్ప మున్నగునవి వాచ్యములు గావు. ఉదా. పెద్దతనము పెత్తనము" (ఉ.61) ఈయర్థ మవసరమే యని తోఁచుచున్నది. చిన్నందన మిత్యాదులును లేవు గదా. కాని సూత్రమున నట్లు నిర్ద

యుండుటకుఁ దగినయాధారము గానరాదు. తద్ధితసూత్రమున గుణవచనంబు లగు నల్లాదు లనుటచే గుణవచనము లెల్ల గ్రహింపఁబడక నల్ల మొదలగునవి మాత్రమె గ్రహింపఁబడును. కాని యిట నదంతగుణవాచకము' అని సామాన్యముగాఁ జెప్పుటచే నది కొన్నింటి కదంతగుణవాచకములకు వాచకము గాకుండుట యెట్లు? సూరి యుదాహరణములందును దెల్లందనమును జూపెను కాని నల్లాదులలో మొదటి దగు'నల్ల'శబ్దమును గూడ నిటఁ జూపలేదు. ఒకవేళ నల్లందన మని చూపినను నల్లాదుల కని నిశ్చయించి చెప్పలేదు. ఇఁకఁ బెద్దతన మిత్యాదులలో నదంతగుణవాచకములపై నుగాగమము రాకుండుటను సాధించుటకు సూరిమతమున నింకే దేనిమార్గము గల దేమో పరిశీలింపవలసియున్నది.

## ప్రాఁతాదులు :

'సమాసంబున ప్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' (38)ననుసూరి,లక్షణము నట్ల గ్రహించిరి. (ఉ.34సూ)

సూరి ప్రాఁతాదులు, (క్రొత్తశబ్దము ప్రాఁతాదులలోనిదే) అన్యములు అని విభాగింపఁగా వీ రన్యములను గూడఁ బ్రాఁతాదులలోనె చేర్చిరి. దీని గూర్చి "సూరి మీఁగడ అనుదానిని బ్రాఁతాదులలోఁ జేర్చి పంచొమ్మిది మున్నగువాని నన్యములలోఁ జేర్చుట సరి కాదు. (ఉ.62) అనిరి. మీఁగడ ప్రాఁతాదులలోనిది గాదు 'మీఁదు' శబ్దము ప్రాఁతాదులలోనిది. ఇట్లె 'పది' యన్యము. పదిప్రభృతులును బ్రాఁతాదుల లోని వనువీరియభిప్రాయ ముచితము గాదు. ప్రాఁత+ఇల్లు, ప్రాయిల్లు, ప్రాఁత+ కెంపు ప్రాఁగెం పనురీతిగాఁ బ్రాఁతాదుల కీకార్యములు సాధారణములు కాని ప్రాఁతాది భిన్నముల కొయాశబ్దములు పర మగునపుడు మాత్రమె యగును. వీరు మీఁదుశబ్దమును బ్రస్తావించిరి. దాన నేమి విశేషము.మీఁజేతులన్ (హరి.పూ.5-171) మీఁగాళ్లు మొ॥పది+ఎనిమిది పదునెనిమిది, పది+దినములు పదినములు అనురీతిగాఁ గావు. పదిశబ్దమునకు 'తొమ్మిది' యనునది పర మగునపుడు మాత్రమె యీకార్యము లవును. ఇట్టిభేద ముండఁగా వీనిని బ్రాఁతాదులలో జేర్చుట లక్ష్యానుగుణము గాదు గదా. కార్యసిద్ధిలోఁ గలభేదము ననుసరించి పదిప్రభృతులను బ్రాఁతాదులకు భిన్నములుగాఁ జెప్పినసూరి మత మెంతయు సమంజసము.

అది వారును దెలియకపోలేదు. సం.లో పది మొద లగుశబ్దములకుఁ బ్రాఁతాదులధర్మములు ప్రాయికముగ నుండక యొకొక్కచోట మాత్రమె యగపడుటచేతను

--- ప్రాంతాదులలోఁ జేర్పక (వ్యా.సం.స.374) యన్యములుగాఁ జెప్పుటలోనియౌచిత్యమును గుర్తించియు నిట నేల కలిపి యన్యములను గూడఁ బ్రాంతాదులలోఁ జేర్చిరో తెలియదు. ఇందలియౌచిత్యమును, దమపూర్వాభిప్రాయమునందలియనౌచిత్యమును వీరి వివరింపరైరి. వీ రిట్లు కొన్నియెడల స్పష్టముగా నిరూపింపవలెనని, సూరిలక్షణమును విస్తరించి చెప్పుచునె కొన్నియెడల నిట్లు సంక్షేపించుచుందురు.

## మీఁదుప్రభృతులు :

'మీఁదుప్రభృతులయందు నిట లోపంబు నిత్యంబు' అనుసూరివివరణమున మీఁదుప్రభృతు లనఁగా సూరి యంతకుముం దుదాహరించిన మీఁదు, కెంపు, చెన్ను అనుక్రమము ననుసరించి యవియె యగు నని సూరియుద్దేశ్యము (వ్యా.సం.స.380) గావచ్చును. కెంపుమెఱుఁగులు అని సూరియె నీ.చం.లోఁ బ్రయోగించెను. కాక యీ యవి వ్యస్తము లని చెప్పనవు. కెంపుపుప్పొడు లనుచో నందువలననె నుగాగమమును రాలే దని గుర్తింపవచ్చును. ఇట్లె కెంపువాతెఱసొంపు మొ॥ సమస్తమయ్యు నిత్యార్థము రాలే దని చెప్పక తప్పనిప్రయోగము కల దేమో యిప్పటి కట్టిది గానరాదు.

'సమాసంబునం బ్రాంతాదుల' ననుచో 'సమాసంబున' అనుదాని కాచ్ఛికసమానాధికరణసమాస' (వ్యా.సం.స.375)మని యర్థము చేయుట యెట్లో తెలియకున్నది. సూరి చూపినలక్ష్యములనుబట్టి యి ట్లర్థ మెవ్వరైనఁ జేయకపోదురా యనియే యేమో ప్రౌఢ. ముంగోప మిత్యాదులకై ప్రత్యేకలక్షణము చేసె. లక్షణమునుబట్టి లక్ష్యములను గ్రహింపవలసియుండఁగా నుదాహరణమునకై చూపినవానింబట్టుకొని లక్షణమునభిప్రాయమును సంకుచితము చేయుట యసమంజసము గదా. సంధి25 సూత్రమున 'సమాసంబుల' నని సాధారణముగనె చెప్పి సూరి ఉన్నంతంపుంగొడుగు చూపెనె. (వ్యా.సం.స.345) ఇట 'సమాసంబున' నని యేకవచనాంతమె ప్రయోగించి యుండవచ్చు నంతమాత్రమున మిశ్రాదిసమాసము లేల గ్రహింపఁబడవు? అవి సమాసశబ్దవాచ్యములు గావా?

భారతాదుల లేకున్నఁ దర్వాత నున్నవానిని (లక్షణముచే గ్రహింప నవకాశ ముండఁగా) నేల గ్రహింపరాదు? (ప్రాసమునుల చూడని చక్కనియిక్క (పాం.2.162)క్రొమ్మేఘములు (భీమ.5.69)క్రొంబులకలు మొ॥(ఇట్లె కెంధూళి పెంధూళి)

## నుగాగమము :



లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునప్పుడు నుగాగమం బగు (౮౭) క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు (౮౮) అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి '(౮౯) ననుసూరిలక్షణములు మూఁడింటిని గలిపి మూఁడంశములుగా నొకేసూత్రముగాఁ జెప్పిరి.(ఉ.౮౫)

అందు మొదటి యంశము. 'అట్టిలుప్తశేషమునకుఁ బరుషసరళములు పరమగునప్పుడు కొన్నియెడల నుగాగమము మాత్ర మగును.' ఈలక్షణమున 'అట్టి' యను విశేషణము స్పష్టతకుఁ గాఁబోలును. అది సూత్రమున ననవసరము. ఇట్లే నుగాగమము మాత్ర మనుచో 'మాత్ర'శబ్దమును. అది లేనిమాత్రమున నుగాగమేతర కార్యము వచ్చుప్రసక్తి యే మున్నది. కావున నదియు ననవసరమె.

నుగాగమము 'కొన్నిట' నగు ననిరి. వీరు చెప్పినప్రాంతాదులలో సూరి చెప్పినయన్యములును జేరినవి కావున (సూరి) ప్రాంతాదిభిన్నములకును నుగాగమము రావలసివచ్చుటచేఁ 'గొన్నిట' నని చెప్పుకొనవలసినయవసర మేర్పడినది వీరికి. సూరి(౮౮)సూత్రమున నాయవసరము లేదు. సూరిలక్షణము ననుసరించి యీనుగాగమము ప్రాంతాదుల కగు నని స్పష్టము. వీరు 'కొన్నిట' ననుట నాయంశ మస్పష్టమైనది. ఆ'కొన్ని'శబ్దము లేని యెడఁగా సూరిలక్షణము నాశ్రయించి సూరి పేర్కొన్నప్రాంతాదుల కని గ్రహింపవలయును. అన్యములను గూడఁ బ్రాంతాదులలోఁ జేర్చుటవలన వరుసవారిలక్షణమున నేర్పడిన దీయనర్థము.

ఇఁక ముఖ్యమైనమార్పు సూరి పరుషములు పర మగునప్పుడు మాత్రమె చెప్పఁగా వీరు సరళములు పర మగునపుడు నగు ననిరి. '(సరళే పరుషే చైవ' యనువి.వి.వచన మిందుకుఁ గారణము గావచ్చును గూడ. కాని యది బాలసంధి.25 సూత్రార్థమును గూడఁ జెప్పునది) దీనికి వీరు చూపినయుదాహృతి 'పెందూళి' యనున దొక్కటే. కెందూళి, కెంజడ యనువానిని వీరు దమయీసూత్రములోనిరెండవ యంశమున కుదాహరించుకొనిరి. (ఉ.౮౩)ఈఒక్కదానికై లేదా కెందూళి, కెంజడ లన్నవి కలుపుకొన్నను నీరెండుమూఁడింటికై సరళపరకత్వమున సాధారణముగా నుగాగమును జెప్పుట లక్ష్యానుగుణ మగునా? గరుసప్పున్మరువు అనుఁగున్వెలఁది

అను రీతిస్థలముల ననుసరించి ఉ.సంధి.24సూత్రమున స్థిరములు పర మైనను నుగాగమము వచ్చు నని చెప్పిరా? రత్నపున్నొమ్ములు (ఉ.దా.78)ఇమ్మొంకప్రాయం పున్నరల్ (రామా.4.88) చాగపున్మొదవును (యమా.2.124) కప్రపున్వంపులు మీఱ (ఆము.1.76) సున్నపున్రంగుబరంగు (ఆము.5-4)విబ్బరపున్వంగడమో (మను-3.59) ఒయ్యారపున్లీల(మను.2.69) (పూమ్బోతోహాల్యధర్వణాచార్యపూతే? అప్ప.చిం.)మున్నగు రీతిగ నున్నదానికంటె నిది ప్రచురమా?

సరళపరకత్వమునను నరుదుగ నుక్కు గానంబడు నని సూత్రింపక కెంజడలు అనుదాహరించి వింతగ సూరి చూపుట సరి కాదు (ఉ.83) సరళపరకత్వమున నరుదని వీరే పేర్కొనిరే. మఱి వీరు క్వాచిత్కములుగాఁ జెప్పక పరుషపరకత్వమున వలెనె సాధారణముగఁ జెప్పుట విరుద్ధ మని వీరే నిరూపించుకొనిరి. 'గరువపు మ్మరువు' వేఱుగాఁ జేర్కొనుటలో లేనివింత (వీరు నీగ్రంథమున నట్లు చెప్పిరి.) కెంజడ లని చూపుటలో నేం యున్నదో వారే వివరింపవలె.

కెంధూళి :

వర్గచతుర్థము పర మైన వీరిలక్షణము ననుసరించియు నుగాగమము రానేర దని కాఁబోలును వీ రది సరి కా దనిరి.

ధరకెందూళు లనుచోఁ గెం దూళు లనియే ప్రయోగించి యుండు నని (వ్యా.సం.స.378) యూహించుచు వజ్ఝులవారు 'ధూళిశబ్దము లేఖకప్రమాదమునఁ బడిన దని తలంపకయు, నధర్వణుఁడు సరళపరకత్వమునందును నీద్రుతాగమమున్న విధించుటను జూచి కొనకయు -వింతగ వ్రాసె' (వ్యా.సం.స.378) ననిరి. లేఖక ప్రమాద మగుటను వఝులవారివలె సూరి గుర్తింపకుండుటలో వింత లేదు. అట్లు గుర్తించిన నాతనివ్యాకరణ మింకొకతీరుగ నుండెడి దేమో. కవి యేమి ప్రయోగించెనో యెట్లు నిర్ణయింతుము. ప్రాసలోఁ జేయలేదు. (చేసిన నది స్వవర్గజప్రాస మన్న మాటాడలేము) యతి కెట్లున్నను బాధ లేదు. కాని 'ధర' యనుప్రారంభమును బట్టి కెందూళు లని చతుర్థాక్షరమె యన్న దని చెప్పుట యుచితమే.

పెందూళి యెసఁగ నందంద (మార్కం.6.107) కెందూళి యున్(విరా.5.60) వీనింబట్టి 'దూళి' శబ్దపరకత్వమునను బిందుస్థితి గ్రహింపవలసినదే. కాని కెంధూళి

పెల్లగసి (కవిక.2.83)పెంధూళి (వి.పు.2.162, ఉ.6.86) పెంధూళితో నెగసి (హరి:పు.2.26) పెంధూళి లెగసి (హరి.ఉ.6.135) (రం.రా.లో కెంధూళి పెక్కు చోట్లఁ గానవచ్చు) కెందూళి నడవఁగా (సిం.6.96) మున్నగుస్థలములం దెల్లముద్రణ సంస్కర్తలు కవిప్రయోగమును దిద్దివేసి రనుటకంటె నట్లు గ్రహించుటయే న్యాయ్యము కదా. చెన్నగు మోము పొరిఁబర్వ పెంధూళి గ్రుంగి (ద్రోణ.2.239) అనుచో పెంధూళి యని పెక్కుప్రతులం దున్నట్లును కెంధూళి యని కొన్నింట నున్నట్లును భారతసంశోధితముద్రణము స్పష్టము చేయుచున్నది.

అన లిది యేల యంగీకరింపరాదు? 'కెంధూళి' యని యున్న నది లేఖక ప్రమాదమే యని యేల నిర్ణయింపవలె? అథర్వణుఁడు సరళే పరుషే చైవ యని మాత్రమె చెప్పె నని కావలె.

అథర్వణుఁడు సరళపరకతలో నుగాగమమును విధించె నని సూరి చూచుకొనలే దనుట మిక్కిలియసంగతము. 'సరళే పరుషే చైవ' యని సరళముతోనె విధానము నారంభించెనే యథర్వణుఁడు. చూచుకొనక పోవుట కదియే మేని గూఢముగాఁ జెప్పఁబడినదా? అట వికారాచ్చాపి కేచన యనఁగా బుంప్వాదేశవికారము మీఁద (కవిశి.318) నని యెంచిన నీలాపత్తేశేషముపైఁ బరుషపరకత్వమున నుగాగమమును సూరి యెట్లు చెప్పెను. లక్ష్యానుగుణముగ సూరి యుద్దేశ్యపూర్వకముగనె పరుషపరకతయం దని చెప్పె నని గుర్తింపఁదగియుండఁగా నథర్వణునియభిప్రాయము సూరి తెలిసికొనలేకపోయె నని నిందించుట యన్యాయ్యము గదా.

సరళపరకత్వమున నుగాగమమును జెప్పి వరులవా రేమి సాధించిరి. పెందూళి, కెంజడలు. మఱల కెంధూళి యసాధ్య మగుట నది లేఖకప్రమాద మనవలసివచ్చె. ఇట్లు చెప్పలే దనియా సూరిని నిందించుట.

ధూళి, దూళి, జడ యనునొండు రెండుశబ్దములు పర మైనపుడే సరళము లైనఁ బర మగునపు డీకార్య మగుట. సూరివలె వానిని విశేషస్థలములుగా గుర్తించుట లెస్స.

నిజమునకు కెంపు+ధూళి, కెంపు+జడలు అనుచో నుగాగమ మయిన దనియుఁ జెప్పుటకంటెఁ బ్రాఁతాదిసూత్రమునందలి బహుళశబ్దముచే (తొలియచ్చుమీఁదివర్ణములు గాక) తుదియక్షరము (పు) లోపించిన దన్నను విష్టరూపములు సిద్ధించును. ఇఁకఁ బెందూళి యన్న దొక్కటే మిగులు నవ్వుడు.

## పెద్ద - పెను :

"బాలవ్యాకరణపక్షమున శబ్దావయవనకారము ద్రుతము గావించెపి పెనుశబ్దమును ప్రాతాదులలోఁ జేర్పనిచో- పెందూళి సిద్ధింపనేర" దనియు 'పెనుంగదుపుల్ అను ప్రయోగము చొప్పున శ్రీసమపెనుశబ్దము నంగీకరింపవలసియున్న' దనియు (వ్యా.సం.ప.379) వజ్ఝలవారు పేర్కొనిరి. శ్రీసమపు మనుటకు 'పెను' అనునది స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుట లేదు. సూరి సూత్రాంధ్రములో 'పెద్దన్యపెనుః' అని హల్పరకతలో పెద్దశబ్దమునకు పెను అనునాదేశము చేసెను. (పెన్నరదము. చూ.త్రి.శే.) ఆపద్ధతి ననుసరించిన పెద్ద+దూళి పెందూళి యైన దనవలెను.

పుంజీభవించిమించిన, పెంజీఁకటి (రామా.7.43)పెందెరువునందెదరున్నా,యందలిప్రేమమును (భాగ.10.పూ.134) నందిని మెలికించు పెందోలు హోంబట్టుకెవడి (సిం.12.94)పెంబోఁ తద్దావరియు,పుంబదహతుల (ఆము.6.244) పెన్ఖండితనంబునన్ (పా.2.194) అనున దొకవిశేషము. పెంజడల్ (ఉ.రా.167) మొదలగుప్రయోగములనుబట్టి పెద్ద శబ్ద(లేదా పెనుపుశబ్దము?) మిటఁ బ్రస్తావింపఁదగినదే 'పెను' ఆదేశ మగుసందర్భములలో పెనుంగదుపు, పెనుఁబాము మొ॥పెద్దపాము? ప్రాతాది సంధికార్యములప్రసక్తి కొన్నియెడల లే దని గుర్తింపవలసియున్నది. కావునఁ బెద్ద శబ్దము సన్యములలోఁ జేర్చు టుచిత మేమో పరిశీలింపఁదగును.

మొత్తముపైఁ బరుషపరకత్వమున మాత్రము నుగాగమమును జెప్పి,కెందూళి కెంజడ అనురీతివానిని విశేషస్థలములుగా గుర్తించినసూరిమత మె సమంజస మనియు వరుమంవారిసవరణలు సరి గావనియుఁ దేలినది.

## ముగాగమద్విత్వములు :

ఇఁక వీసూత్రమందలిరెండవయంశము 'కొన్నిటఁ బరుషములు పర మగునపుడు పై రీతిని నుగాగమము గాని యుత్తరపదాదిద్విత్వము గాని యుభయము గాని వైకల్పికముగ నగును' (ఉ.63)

శ్రోత్రశబ్దమున కాద్యక్షరశేషమునకు సూరి చేసినవిధానము(98)ను దృష్టియందుంచుకొని వీ రిట్లు చెప్పియుండవచ్చును. వీరిలక్షణముఁ బరామర్శింతేము.

పరులవా రిటఁ బరుషపరకస్థితినిగూర్చి మాత్రమె లక్షణమునఁ జేర్కొని యున్నను వివరణమునందు 'కెంపు+దూళి- కెందూళి, కెంపు+జడ- కెంజడ' అని సరళపరకత్వమునందలిసుగాగమమును గూడ నుదాహరించిరి. కాఁగా నీలక్షణమునను సరళపరకస్థితి నైనఁ జేర్కొనవలె. లేదా వీని నిట నుదాహరించుట మానుకోవలె. లేనిచో నీయవి లక్షణవిరుద్ధము లగుచున్నవి గదా. కాని క్రొక్కారు క్రొగ్గండి అనునవి యిట నుదాహరించుటచే సుగాగమము గాని ద్విత్వము గాని వచ్చుట, పరుషసరళములు రెండింటిపరకత్వమున నని తెలియవలె. కావున మొదటి యంశమునవలె నిటఁ గూడఁ బరుషముతోపాటు సరళములను గూడఁ బ్రస్తావింప వలసియున్నది. అట్టియెడలఁ బరుషసరళములపరకత్వము పూర్వాంశమునఁ జేర్కొనఁ బడియే యున్నది. గావున నిచోటఁ బ్రత్యేకముగాఁ జేర్కొనవలసినయవసరమే లేదు. సరళస్థిరపరకతలో ద్విత్వము ప్రసిద్ధమై యుండ దానిని వీరు లక్షణమున జేర్కొననే లేదు.

'ఉత్తరపదాదిద్విత్వము' అనుటకంటె మీఁదిహల్లునకు ద్విత్వ మగు ననుట యొప్పు.

కొన్నింటికి సుగాగమ మొక్కటియు (కెందామర, కెంజడ) కొన్నింట మీఁది హల్లునకు ద్విత్వము మాత్రమును, (క్రొక్కారు, క్రొగ్గండి) యగుచుండ కొన్నిట నుభయము నగు ననిరి. దాని కేవి లక్ష్యములు. పూఁదెనె, పుప్పొడి, (ఉ.63) అనునవి కావలె. ఇక్కడ నుభయ మైన దని చెప్పుట యెట్లు? అనఁగాఁ బ్రాఁతాదులలోనిశబ్దమున కొకశబ్దము పర మైనపుడు సుగాగమమును, (నదే దానికి) వే ఱొక శబ్దము పర మైన మీఁదిహల్లునకు ద్విత్వము నగు ననవలె. 'తేనె'శబ్దము పర మగుచో సుగాగమము 'పొడి'శబ్దము పర మగునపు డందు ద్విత్వము.

కాని యట్టియెడల నీస్థలము లన్నియు నుభయములే కావలయును. ఉదాహరణమునకు 'కొన్నిట సుగాగమ మగుట' యనుదానికి 'కెందామర' చూపిరి. కాని కమ్మనిచిగురాకుకెమ్మోవి (అని.2.86) కొమ్మలేఁజిగురాకు కెమ్మోవి (విక్ర.3.48) కెమ్మోవి తావికే క్రమ్ము తుమ్మెద (నృ.2.85) ననురీతిగా నిట వే ఱొకశబ్దము పర మైనపుడు ద్విత్వమును గలదు.

కొన్నియెడల ద్విత్వ మగుటకు క్రొక్కారు, క్రొగ్గండి యుదాహరించి రనవలె. కాని యిట మాత్రము క్రొంజీఁకటి, క్రొంబొగ అని సుగాగమ మయినతావుల వీరే యుదాహరించిరే. క్రొత్తశబ్దమునకు మాత్ర ముభయము కాలేదా?

వరులవారిట్టఁ బరుషపరకస్థితినిగూర్చి మాత్రమె లక్షణమునఁ జేర్కొని యున్నను వివరణమునందు 'కెంపు+దూఁ- కెందూఁ, కెంపు+జడ- కెంజడ' అని సరళపరకత్వమునందలిసుగాగమమును గూడ నుదాహరించిరి. కాఁగా నీలక్షణమునను సరళపరకస్థితి నైనఁ జేర్కొనవలె. లేదా వీని నిట నుదాహరించుట మానుకోవలె. లేనిచో నీయవి లక్షణవిరుద్ధము లగుచున్నవి గదా. కాని క్రొక్కారు క్రొగ్గండి అనునవి యిట నుదాహరించుటచే సుగాగమము గాని ద్విత్వము గాని; వచ్చుట, పరుషసరళములు రెండింటిపరకత్వమున నని తెలియవలె. కావున మొదటి యంశమునవలె నిటఁ గూడఁ బరుషముతోపాటు సరళములను గూడఁ బ్రస్తావింప వలసియున్నది. అట్టియెడలఁ బరుషసరళములపరకత్వము పూర్వాంశమునఁ జేర్కొనఁ బడియే యున్నది. గావున నిచోటఁ బ్రత్యేకముగాఁ జేర్కొనవలసినయవసరమే లేదు. సరళస్థిరపరకతలో ద్విత్వము ప్రసిద్ధమై యుండ వానిని వీరు లక్షణమున జేర్కొననే లేదు.

'ఉత్తరపదాదిద్విత్వము' అనుటకంటె మీఁదిహల్లునకు ద్విత్వ మగు ననుట యొప్పు.

కొన్నింటికి సుగాగమ మొక్కటియు (కెందామర, కెంజడ) కొన్నింట మీఁది హల్లునకు ద్విత్వము మాత్రమును, (క్రొక్కారు, క్రొగ్గండి) యగుచుండ కొన్నిట నుభయము నగు ననిరి. దాని కేవి లక్ష్యములు. పూఁదెనె, పుప్పొడి, (ఉ.63) అను నవి కావలె. ఇక్కడ నుభయ మైన దని చెప్పుట యెట్లు? అనఁగాఁ బ్రాఁతాదుల లోనిశబ్దమున కొకశబ్దము పర మైనపుడు సుగాగమమును, (నదే దానికి) వే రొక శబ్దము పర మైన మీఁదిహల్లునకు ద్విత్వము నగు ననవలె. 'తేనె' శబ్దము పర మగుచో సుగాగమము 'పొడి' శబ్దము పర మగునపు డందు ద్విత్వము.

కాని యట్టియెడల నీస్థలము లన్నియు నుభయములే కావలయును. ఉదాహరణమునకు 'కొన్నిట సుగాగమ మగుట' యనుదానికి 'కెందామర' చూపిరి. కాని కమ్మనిచిగురాకుకెమ్మోవి (అని.2.86) కొమ్మలేఁజిగురాకు కెమ్మోవి (విక్ర.3.48) కెమ్మోవి తావికే క్రమ్ము తుమ్మెద (నృ.2.85) ననురీతిగా నిట వే ఱొకశబ్దము పర మైనపుడు ద్విత్వమును గలదు.

కొన్నియెడల ద్విత్వ మగుటకు క్రొక్కారు, క్రొగ్గండి యుదాహరించి రన వలె. కాని యిట మాత్రము క్రొంజీఁకటి, క్రొంబొగ అని సుగాగమ మయినతావుల వీరే యుదాహరించిరే. క్రొత్తశబ్దమునకు మాత్ర ముభయము కాలేదా?

(విశా.2.238)ననురీతివానికై వైకల్పిక మనవలసినయవసర మె లేదు. ఉ.సంధి.34 (బాం.38) సూత్రమునందలిబహుళశబ్దముచేఁ దొలియచ్చుమీఁదివర్ణములు లోపింప కుండఁగా లుప్తశేషము గాదు గావున లుప్తశేషమునకు విధించిననుగాగమాదికార్యములు వానికిఁ బ్రాప్తించుటయే యసంభవము గదా.

మెత్తముపై పయిలవా రీరెండవయంశముగాఁ జెప్పిన దంతయు వ్యర్థము నవ ర్థకమును.దీనికి వా రుదాహరించిన కెందామర క్రొంజీఁకటి పూఁదేనె మొద లగునవి యీసూత్రమునందలి మొదటియంశమునకును, (కెమ్మోవి) క్రొగ్గండి, పువ్విడి యను రీతివి మూఁడవయంశమునకును నుదాహరణము లగును.

అట్లు గాక మొదటియంశముచే నాయాశబ్దముల కేశబ్దము పర మైనను నుగాగమము మాత్రమే యగు ననియు, మూఁడవయంశముచే నాయాశబ్దముల కేశబ్దము పర మైనను (పరహల్) ద్విత్వము మాత్రమె యగు ననియుఁ దలఁచి, కొన్నిశబ్దములు పర మైన నుగాగమమును, గొన్ని పర మైనపుడు (పరహల్) ద్విత్వమును రెండుకార్యములను బొందుశబ్దములనుగూర్చి యిటఁ బస్తావించి రన్న నిది కొంత యుచితమ యగును.

అట్టి యెడలను నిట 'నుభయమును' అగు నని చెప్పుట మాత్రము వ్యర్థమే.

(కాని పూఁదేనె పువ్విడి యని పూవుశబ్దము నిటఁ జూపిన వీరు మూఁడవ యంశమున పూవు+విలుకాఁడు పువ్విలుకాడు. అని చూపిరి. మఱల స్థిరపరకస్థితిని వేఱు చేసి రన్నమాట.)

అట్టియెడల వీరునుగాగమము మాత్రమగునవి-(ఇవి ప్రాఁతాదు లనుకొందము.) నుగాగమద్విత్వము లగునవి, (ఇవి క్రొత్తాదు లనుకొందము) ద్విత్వము మాత్రమె యగునవి (అన్యములు?) యని మూఁడువిధములుగాఁ జెప్పిరి. అనఁగా నివి యెల్లఁ బ్రాఁతాదులలో నివి యయ్యును నవాంతరవిభాగము చేసి రన్నమాట. సూరిమతము ప్రాఁతాదులు -అన్యములు మార్చి వీరు సాధించిన దేమి?

సూరి క్రొత్తశబ్ద (38)లక్షణమునుగూర్చి క్రొంజాయ, క్రొత్కాఁడు అనువాని తోపాటుగ పూఁదోట పువ్విడి మున్నగువానిని క్రొత్తాదులలోఁ జేర్పకుండుట సరి కాదు. (ఉ.32) క్రొత్తశబ్దముతోపాటుగ కెంపు పూవు మున్నగువానిని జేర్చి క్రొత్తాదుల కని సూత్రించుట సూరి కర్తమ్ము' (ఉ.63) అనిరి. అయిన వీ రిటఁ గ్రొత్తా

ములకని సూత్రింపకపోయిరా? 'క్రొన్నిట' నని యస్పష్టముగాఁ జెప్పుటకంటె విడి యుచితము గాదా? ఉదాహరణముల తీరునుబట్టి సూత్రాభిప్రాయమును గుర్తింపవలసిన స్థితిని వీరు గల్పించిరి. క్రొత్తాదు లన్న నాబాధ తగ్గెడిది. మఱి వీరిసూత్రమున సూత్రలక్షణ మేది?

'పూవిలుకాఁడు పువ్విలుకాఁడు పువ్విలుతుఁడు పుప్పొడి కెమ్మోవి కెమ్మోము మున్నగుప్రయోగములనుబట్టి పూవు. పువ్వు, కెంపు మున్నగువానియందుఁ గ్రొత్త శబ్దలక్షణముల నెన్నఁదగును' (వ్యా.సం.స374) సం.లోను, ఉ.లోను మున్న గున వవిరి కాని యవి యేవియో తెలియదు. పూవుపువ్వుకెంపు అనుచోఁ బువ్వు శబ్దమును గూడఁ జేర్ప నేల? అనవసరము.అది గుర్తించి ఉ.లో పూవు, కెంపు శబ్ద రెండు మాత్రమె యుచ్చరించుట యుచితముగా నున్నది.

కంపుఁ బూవుశబ్దము క్రొత్తాదులలోని దనుట సరి కాదు.అట్లయిన పువ్విలు కాడు, పువ్విలుతుఁ డనురీతిగా మాత్రమె యగును. పూవిలుకాఁడు,పూవిలుతుఁ డనువిధముగా మీఁదిహల్లునకు ద్విత్వము రాకుండుట యెట్లు? క్రొన్నన క్రొమ్మావి యనుచోఁ గ్రొనన, క్రొమావి యనురూపములు గలవా? తొలియచ్చుమీఁదివర్ణ ములు లోపించినచో మీఁదిహల్లునకు ద్విత్వము రాక తప్పదు. లోపమె రాకున్న పూవువిలుకాఁ డనురీతినె యుండును. వీరిట ఉ.లో ద్విత్వము వికల్పముగాఁ జెప్పిరిః అందలియసంగతులు పైని స్పష్టము. ఇంకను పువ్విలుకాఁ డనునది వీరు తమ సూత్రములో సముఁడవయంశమున నుదాహరించిరి. అట వికల్ప మనలేదు.

పువ్వు+విలుకాఁడు- పువ్విలుకాఁడు అని యగును. (పూవు+విలుకాఁడు) పూవిలుకాఁ డనునది మార్గాంతరమున సాధించికొనవలె. ఇట దానికిఁ బ్రసక్తిలేదు. పువ్వు ప్రాఁతాదులలోనిది కాని 'పూవు'కా దన్న పువ్వు+పొద పుప్పొద, పుంబొద పువ్వు+తోట పుత్తోట లేదా పుందోట యని కావలె. ఇట్లె పుత్తెమ్మ మున్నగునవి రూపము లేర్పడు. 'పూవు'శబ్దమును వీరు ప్రాఁతాదులలోఁ జేర్చిరి. (పువ్వు చేర్ప నక్కర లేదు. చేర్పరాదు.) కానఁ బ్రాఁతాదికార్యముంచే పూవు-విలుకాఁడు-పువ్విలుకాఁ డని సాధించి పూవు+విలుకాఁడు పూవిలుకాఁ డనునది మార్గాంతరమున సాధింతురా?

పువ్విలుకాఁ డనుదానిని సూరి 'నిక్కలాదులు-యథాప్రయోగంబుగ గ్రాహ్యంబు' లనుదాని నుదాహరించె. ఉ.లో వీరు నట్లు చేసిరి. అట్లయెడ వీని విరుసాధింప

నవసర మేమి? (పుప్పొడి) పువ్విలుతుఁ డన్నదియు నిట్లు. అన్యంబుల కిత్వాది సూత్రము సైతము ప్రయోగమూలకమె కావున నది ప్రకృతసూత్రప్రపంచమె' (వ్యా.సం.స.1259) యనుటలో నన్యంబుల కనుసూత్రము స్పష్టతకె గాని ప్రయోజ నము లే దని వీ రెంచిరా యనిపించు. అది తగదు.

ప్రాంతాదిసూత్రమునొద్ద సూరి పూవు+రెమ్మ పూరెమ్మ యని చూపె. కాన నిది ప్రాంతాదులలోనిదె. కావునఁ దొలియచ్చుమీఁదివర్ణములు లోపింప పూరెమ్మ యనుతీరుగా పూవిలుకాఁడు అని యగును. అన్యంబుల కనుదానిచే ద్విత్వ మెట్లగు. అన్యము లనఁ బ్రాంతాదిభిన్నములు గదా. ప్రాంతాదులలోఁ జేర్పఁబడిన పూవు అన్య మగుట యెట్లు? ప్రాంతాదులలోఁ గ్రొత్తశబ్దమునకు మాత్రమె సూరి (పరహల్) ద్విత్వమును జెప్పె. పూఁదోట, పూఁబోఁద, మున్నగువానిబట్టి పూవు ప్రాంతాదుల లోఁ జేర్పక తప్పదు. కావునఁ బ్రాంతాదివిధిచే పూవిలుకాఁడు, (పూవిలుతుఁడు) అను రీతిగా మాత్రమె యగును. ద్విత్వము రావలె నన్న నిక్కులాదిసూత్రము నాశ్రయింప వలసినదే యనుసూరిమతము గమనించిన నన్యంబుల కన్నది నిక్కులాదిసూత్ర ప్రపంచ మనుటను బువ్విలుకాఁ డనునీసూరియుదాహృతి తిరస్కరించుచున్నది.

సూరియభిప్రాయమునకు బాధకముగా నుండునది పుప్పొడి యనున దొక్కటి. ఇదియు నిక్కులాదులలోనే చేర్చి(నుగాగమము రాక) ద్విత్వ మయిన దని గుర్తింపఁ దగును.

పువ్విలుకాఁడు, పువ్విలుతుఁడు పుప్పొడి యనువానికై పూవుశబ్దము క్రొత్త శబ్దమువంటి దన్న 'పూరెమ్మ' విరుద్ధ మగును. పూగుత్తి కెంగేలఁ దాల్చినలీల లేనగవుతో (భాగ.10.పూ.917) అందుకే కాఁబోలుఁ బిదప వీరు "ఇట్టి(క్రొత్త) లక్షణములు చాలవఱకు పూవు కెంపులందును (ఇట మున్నగునవి యనకుంట గమ నార్హము) గన్పట్టుచున్నట్లు (ఉ.వ్యా.సం.స.371) చెప్పిరి. చాలవఱ కనఁగాఁ గ్రొత్త శబ్దలక్షణములతోఁ గొంతభేదము గల్గుటను వారు నంగీకరించిరే కదా. అయ్యు క్రొత్తాదులలోని దనుట (అటనే) యసంగతము.

పూవుశబ్దము 'క్రొత్త'లక్షణము లెల్లఁ గల్గినది గాదు గాన దీనిని 'క్రొత్త' తోఁ గూర్పరాదు.

ఇఁక కెంపుశబ్ద మున్నది. క్రొ(త్త)శబ్దమునకుఁ బరుషపరకతలోఁ గొన్ని యెడల నుగాగమము. కొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వము. క్రొంజెమట క్రొక్కా-

రు. కె(ంపు)శబ్దమునకుఁ బరుషపరకతలో నెల్లయెడల నుగాగమమె. కెందామర. కెంగేలు అనురీతిగనే కాని కెత్తామర యనురీతి నన నుండదు. వీరు నుదాహరింపలేదు.

క్రొ(త్త)శబ్దమునకు మీఁదిసరళస్థిరములకు ద్విత్వమె నియతము. క్రొగ్గండి. కె(ంపు)శబ్దమునకు మీఁదిసరళస్థిరములకు ద్విత్వము లేనేలేదు. కెంజడలు కెందూళి. ఇట నెచ్చట నేని కెజ్జడ లనురీతి గలదా. కెంజిగురాకు కెంజిగి. వీరు నట్టి దుదాహరింపలేదు.

పరుషపరకత్వమున కె(ంపు)శబ్దమునకు నుగాగమము నియత మగుటంజేసియె దీనిని క్రొత్తశబ్దమునకు భిన్నముగాఁ జూపుట యవసరము. కెంగేల నిడి కోపు లాంగులీఘర్మ- (రామా.6.130)

కెమ్మోవి,కెమ్మెఱుఁగులు నని యొందురెండుచోట్ల ద్విత్వము గల్గుట యొక్కటి క్రొత్తశబ్దలక్షణమా? క్రొత్తశబ్దమునెడల నీకార్యములకుఁ గలప్రాచుర్యప్రసిద్ధి దీనికిఁ గలదా?'క్రొత్త'ను బోలినది లేమి క్రొత్తాదు లనునొకగణము నేర్పఱచుట సరి కాదు గావున సూరి క్రొత్తాదు లనక క్రొత్తశబ్దమునకు మాత్ర మట్లు (88సూ) విధించుట యెంతయు లక్ష్యానుగుణ మైయున్నది. కెమ్మోవి యనురీతిరూపములను ద్రాఁతాదిసూత్రమందలిబహుళశబ్దముచే సాధించుకొన్నఁ దప్పులేదు.

మొత్తముపై సూరిలక్షణ [88•సూ] మెంతయు సమంజసము.

## ద్విత్వము :

ఇంక నీసూత్రమున మూఁడవయంశముగా వీరు "కొన్నిటఁ బరవదాదిహల్ ద్విత్వము మాత్ర మగును" అనిరి. కొన్నిటఁ బరుషములు-- అని రెండవయంశమునఁ గొన్నిట నని చెప్పి యిట మఱలఁ 'గొన్నిట' ననుటవలన నిచ్చటికొన్నిశబ్దములు పూర్వోక్తము లగువానికంటె భిన్నము లనియె యర్థ మగుచున్నది. రెండవ యంశమున వీరు క్రొత్తాదులను బ్రస్తావించి రన్న నిచ్చట 'కొన్నిట' క్రొత్తాదిభిన్నము లగువే ఱొకకొన్నిశబ్దములను దెల్పును. కాని వీరు క్రొత్త+ముడి- క్రొమ్ముడి పూవు+విలుకాఁడు పువ్విలుకాఁ డని పూర్వోక్తములను గూడఁ జూపుట విశేషము.

రెండవయంశమునఁ బరుష[సరళ]ములె మాత్రమె పేర్కొని యిట స్థిరపరకత నుద్దేశించి రనవలెను. అనఁగాఁ గ్రొత్తాదులకును, దద్భిన్నము లగుకొన్నిటికిని [సూరి పేర్కొన్నయన్యములు పై క్రిందఁ జేరవచ్చును]స్థిరము పర మగునపుడు పరహల్లునకు ద్విత్వము మాత్రమె యగు నని వీరియభిప్రాయ మనవలె.ఉదాహరణములనుబట్టి సూత్రముయొక్క యర్థము నూహింపవలసినస్థితి వీరిసూత్రరచనలోని వైశిష్ట్య మనఁదగును.

మొదటియంశమునఁ బ్రస్తావింపఁబడువానికంటె భిన్నము లగుశబ్దములు రెండవయంశమున నుండ రెండవయంశమునఁ బ్రస్తావింపఁబడనివానితోపాటు అవి యుఁ బ్రస్తుతము లగుట మూఁడవయంశమునందలివైలక్షణ్యము.సూత్రరచన సరిగా లే దనక తప్పదు.

ఇట స్థిరములకు ద్విత్వ మగుట మాత్రమె యుదాహరింపఁబడినది. సూరి పేర్కొన్నయన్యములకుఁ బరుషసరళములు పర మైన ద్విత్వ మగుట రెండవయంశముచేతను నుగాగమ మగుట మొదటియంశముచేతను గ్రహింపవలె నన్నమాట. తొమ్మిది+పది తొంబది యనురీతిగా వీరు తొమ్మిదిశబ్దమును బ్రాఁతాదులలోఁజూపుట సరి కా దని మొదటనే గుర్తించితిమి.

ఉక్తశేషమునకుఁ బర మైనస్థిరమునకు మాత్రమె ద్విత్వ మగుట యిట నుద్దేశించిన పక్షమువారు పరపదాదిహల్ద్విత్వ మని సామాన్యముగాఁ జెప్పక మీఁదిస్థిరమునకు ద్విత్వ మని చెప్పిన లక్షణము స్పష్టముగా నుండెడిది.

సరళపరకతయందును స్థిరపరకతయందును ద్విత్వ మగుచుండఁగా స్థిరపరక ద్విత్వమును వేఱు చేసి చెప్ప నవసర మేమి?

దీనివలననె రెండవయంశమునందలి[క్రొత్తాదులు?] ఇటఁ గూడ గ్రహింప వలసివచ్చినది.

సూరి చెప్పినకార్యము లెల్ల వీరును జెప్పిరి. సూరిప్రణాళికలోనిస్పష్టత సమగ్రత మాత్రము వీరిలక్షణమున లేవు. సూరిమతమునందలియన్యములను బ్రాఁతాదులలోఁ జేర్చుటవలననే వీరిలక్షణ మస్పష్ట మైనది.

'వందొమ్మిది యున్నగునుదాహృతులందుఁ బ్రాఁతాదిసంధిలక్షణములు గాని క్రొత్తశబ్దసంధిలక్షణములు గాని సరిగా లేకుండుటచే నివి యన్యములుగాఁబేర్కొనఁ

బడినవి (వ్యా.సం.స.388) యని సూరిప్రజ్ఞాశీకలోనిసామంజస్యమును గుర్తించినవి రది తొలఁగించి యన్నింటిని గలగాయప్రసంగముగాఁ జెప్పుట సూరివద్ధతిలోనిసామం జస్యమును భంగపఱచుటకు మాత్రమే యైనది.

కాఁగా సూరిలక్షణములు భాషాలక్షణమునకుఁ బ్రతిబింబము లై నిర్దుష్ట మైన పద్ధతిలో చెప్పఁబడి యవశ్యగ్రాహ్యము లై యున్నవి.

## మూన్నాళ్లు :

ఇట సూరికంటె విశేషముగా 'మూఁడు+నాళ్లుమూన్నాళ్లు, వేఁడి+నీళ్ళు-వేన్నీళ్లు- రెండునెలలు-రెన్నెల్లు మూన్నాళ్లు మున్నగుచోట్ల హ్రస్వముకవిసమ్మతమ్ముకాదు. కాన మున్నాళ్లు అనరాదు (ఉ.84) ఇది సమంజసము గాదు. వీరితనే 'పూవు+పొడి పువ్పొడి, పూవు—విలుకాఁడుపువ్విలుకాఁడు' అని చూపిరి. ఇటు ద్విరుక్తహల్పరకత్వమునవాచ్చికదీర్ఘమునకు హ్రస్వము వచ్చినదే. మూన్నాళ్లు ఇత్యాదులం దేల రాదు? సం.లో 'అవ్యంబులం' కనుసూత్రముచే సిద్ధించు ననుట (వ్యా.సం.స.384) ఇట్లే యసమంజసము (చూ.త్రి.శే.) కవిప్రయోగసమ్మతము గాదు గావున రాదనుట యసంగతము. కవిసమ్మతము గానపుడు కవిసమ్మతి కనుగుణముగా లక్షణము చేయవలెఁ గాని లక్షణము లేకయె కవిప్రయోగముమూలముగా గ్రహించుచో నింక లక్షణగ్రంథ మేల?

హ్రస్వము రావలసియున్నను హ్రస్వము లేక కవులు ప్రయోగించిరి కాన నల్పము లగునిట్టిస్థలములకు వేఱుగా లక్షణ మేల యని కవిప్రయోగముల ననుసరించి గ్రహింపవచ్చును.అట్టిచోట 'సూరి సరళపరకత్వమందును సరుధుగ మకృగానందబడు నని సూత్రింపక' (ఉ.83)పోవుట సమంజసము కాకపోవు టెట్లు? ఇట్లు దని చెప్పుచునే పరుషపరకతయందువలె సరళపరకతయందును సాధారణముగ వీరు చెప్పుట సమంజస మగుట యెట్లు? అట నట్లు విమర్శించినవీరు మూన్నాళ్లు ఇత్యాదులంగూర్చి యట్లె చెప్పుట మాత్రము సమంజస మగుట యెట్లు?

వరుఁడువారు చిక్కాలాదులలో నాలుగునాళ్లు నాన్నాళ్లు అనునది చూపిరి. అట్లే మూఁడు+నాళ్ళు- మూన్నాళ్ళు మొద లగునీయవియు చిక్కాలాదులలోఁ జూపిన హ్రస్వాభావము యథాప్రయోగముగ లక్షణసిద్ధ మగుం. గదా ప్రస్తుతలక్షణము చిక్కాలాదిసూత్రప్రపంచ మనుకొనిరా? అయిన నిత్యాలాదిసంధికార్యములు చెప్పుటెట్లు

యనవసరము. రెండు+నెల్లి రెన్నెల్లి ఇట (నన్నయములోఁ) జూపవచ్చును. ఇట్లే 'వసన్నాఱువిండ్లమాన పసుదూరమ్మున.'


## మిశ్రములు :

"కవిత్రయాదిసమ్మతములు గాకున్నను సీప్రాంతాదిసంధికార్యము లరుదుగ సంస్కృతోత్తరపదకమిశ్రసమాసములందును జూపట్టుచున్నవి.క్రొమ్మేఘము మొ॥" (ఉ.64) సంస్కృతసమోత్తరపదక మనఁదగును.

నెమ్మనము (లక్ష్మీ.3.134) అని యెఱ్ఱనయె యిట్టిప్రయోగము చేసినట్లు ప్రౌఢ. స్పష్టము చేసియుండఁగా నిట్టివి కవిత్రయాదిసమ్మతములు గా వనుట యెట్లు? 'నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లునానములు (శల్య.1.73)నెమ్మనము తెలివొందె (శల్య.2.228) నెమ్మనంబుకలఁకయు( (అను,1-245)నెమ్మనము విలసిల్లన్ (విర్వ 3.48) ఇట్టిచోెడలఁ గవిత్రయప్రయుక్తము గా దనుట యెట్లు? 'మనము'తత్సమమె కదా.

కెందూళి, కెంజడ లను సూరి వింతగాఁ జూపుట సరి గాదన్నవి రీమిశ్రసమాసములను ప్రత్యేకముగాఁ బ్రస్తావించుటలో వింత లే దేమో. మిశ్రసమాసములువీరు జ్ఞాపితము చేసికొనవలసియు నుండుట గమనార్హము. సూరిలక్షణముచే నిది సామాన్యముగనె సిద్ధించును (చూ.త్రి.శే.)

## ఆమ్రేడితపరకకార్యములు :

'ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులందొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకారం బగు' (40)'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు -(41)ననుసూరిలక్షణముల నట్లు గ్రహించిరి. (ఉ. 36,37) సూరి అప్పటికిన్+అప్పటికిన్ అని యుదాహరింపఁగా నది పొరపాటని (ఉ.66) వీరు యథాపూర్వముగా ద్రుతమును స్వరసహితముగాఁ జూపిరి.

విభక్తిలోపపక్షమున అప్పటప్పటికిని అని యగును.అందు బాధ లేదు."విభక్తి లోపాభావపక్షమున 1.వసూత్రముచే నిత్య మగుఉకారపరరూపసంధి వర్తిల్లు" (ఉ.66) ననిరి.అప్పటికిని అనుచో నిత్వ ముత్వస్థానికము గావున నుత్వసంధి యప్పు నని వీరియభిప్రాయము. కాని యది పొరపాటు. సూరిమతమున స్వరపరకత్వమ్మున

(తలుచుగా) ద్రుతము న స్వరలోప మవును గాన 'అచ్చున కామ్రేడితంబు పరంబగు నపు' డను(10)లక్షణమునకు ద్రు.ప్ర.లు లక్ష్యములు గానేరవు. (ఇఁకాదిభిన్నము లగుట) కాని వీరు ద్రుతమును స్వరసహితముగాఁ జూపుటంజేసి ఊరను+ఊరను అనుచో నామ్రేడిత మచ్చునకుఁ బర మవుట సంభవించును గావున సంధి10సూత్రముచేతనె సంధి చేయవలయును గాని 1సూత్రముచేఁ గాదు. 1సూ.చే నగుసంధియు నిత్యమె యగుఁగాక, విశేషవిధి యగుటంజేసి ఆమ్రేడితపరకస్వరసంధి ప్రవర్తింప వలసినదే. ఏమి+ఏమి యనుచో నేమ్యాదివిధి వర్తించుట లేదు గదా. కావున వీరు విభక్తి లోపింపనిచో 1వసూ.చే సంధి వచ్చు ననుట సరి కాదు.

అది య ట్లుండ నిట సూరి అప్పటప్పటికిన్, అప్పటికప్పటికిన్ అని యుదాహరించి యుండఁగా వీ రందలిఅప్పటికప్పటికిన్ అనుదానిని వదిలివేసిరి. అప్పటికి నప్పటికి నని చూపినవీరు1వసూ.చే సంధి యగు ననుట యసలు గుదురదు.కివిభక్తి కుస్థానికము కావునఁ 'బ్రథమేతరవిభక్తి' (ఉ.8) సూత్రముచే సంధి యవు నని గదా వీరు చెప్పవలె.అప్పటికప్పటికిన్ అప్పటికి నప్పటికిన్ అని రెండురూపము లవును. ఇట్లు సూరిచూపినరూపము గూడ వీరు సాధింపఁగల్గుట సంభవించుచున్నది. అట్లుగాక వీరు 1సూత్రముచే నిత్యసంధి యనుట విరుద్ధ మగుటయే కాక సూరి చూపిన రూపము సాధువు గా దనియుఁ జెప్పిన ట్లగుచున్నది. (ఉ.సంధి.8సూత్రము ప్రవర్తించు నని వీరు తలఁచినట్లె లేదు.) కాని వీరు అప్పటి కప్పటికిన్ అనుదానిని నన్నయాథర్వణులు సాధించినట్లును (వ్యా.సం.స.261) స్పష్టము చేసిరి.

ప్రథమేతరవిభక్తివిధిచే సంధిని జేయవలసియున్నను ద్రుతస్వరలోపము చేయమింజేసి యామ్రేడితపరకస్వరసంధియే చేయవలె నది విశేషశాస్త్రము గదా!ఎట్లు చూచిన సంధి1సూత్రమున కిటఁ బ్రసక్తి లేదు కాఁగా నన్నయాదులు సాధువుగాఁ దలఁచిన 'అప్పటికప్పటికిన్' అనురూపము సాధింపకుండిరి.

సూరిమతమున నిట్టిబాధ లేకుండుట వీరు సముచితముగా నిరూపించిరి. (వ్యా.సం.స.380) ఊరన్+ఊరన్ అనుచోఁ బ్రకృతసూత్రముచే విభక్తి లోపించిన ఊరూరన్ అని యగును. లోపాభావపక్షమున 'అత్తునకు' (సంధి.4) అని ప్రాప్తించుటహాళసంధిని బాధించి 'అచ్చునకు' (సంధి.10) అనుసూత్రముచేఁ బ్రాప్తించు ప్రాయికసంధిని బాధించి ఇఁకాదులకుఁ దప్పఁ (సంధి.10) ననుసూత్రముచే సంధి

నిషేధము ప్రాప్తమై ఊరనూరన్ అని యగును. ఈరీతిగా నితరములఁ బ్రక్రియ యూహింపవచ్చును.

### ఇంచుక యించుక :

'ఇంచుకనాఁ డిత్యాదులందు బహుళగ్రహణముచే నంతిమాక్షరలోపంబగు' నని సూరి వివరింపఁగా వీరు 'బహుళగ్రహణముచేత నంతిమాక్షరలోపాదికంబగు' ననిరి. ఎల్లయెడలఁ గాక యించుక నాఁడు మొదలగుకొన్నింటియందే యనుచుసూరి లక్షణము స్పష్టతరమైయున్నది. ఇంచుకనాఁ డిత్యాదులం దనుచున్నను వీరును 'ఇంచించుక నానాఁడు అంతంతట' నని యుదాహరించుటలో సూరియభిప్రాయముతో విరోధింపలేదు. సూరి వివరణమున దురుక్తి లేదు. అయ్యు నూరక వీరు మార్చిరి.

ఇంచుక యించుక యనురూపమును బా.సా.పే. సాధువుగా నెంచఁగా వీరు ఆమ్రేడితసంధిస్థలములలో నత్వేత్వాదిసంధిశాస్త్రములకుఁ బ్రవృత్తి యెట్లు? ఇంచుక యించుక అనెడిసంధ్యభావ మామ్రేడితపరకత్వమున నెట్లు పొసఁగును? (వ్యా.సం. స.392) అనిరి. అత్వేత్వసంధిశాస్త్రములే కాదు. ఉత్వసంధిశాస్త్రమును నామ్రేడితపరకతయందుఁ బ్రవర్తింపదు. అప్పటికిని+అప్పటికిని అనుచో నుత్వసంధి ప్రవర్తించు నని వీరు చెప్పుట సరి గా దని గుర్తించితిమి గదా. కాని యంతమాత్రమున 'ఇంచుకయించుక' అనియుండ దనుట తగదు. సంధి.10.సూత్రములో సూరి తఱచని తఱచుగ ననుటచేఁ గొన్నియెడల వైకల్పికసంధి గల దని వివరించె. అదివీరు నంగీకరింపవలెను. ఇంచుక యించుక గాని యేర్పడ వినవైతి (శృం.2.68).

'లోపాదికంబు' అని వీరు సూరికంటె నధికముగా ఆదిపదమును జేర్చిరి. విశేష మేమి? అంతంతటన్ అనుచో (విభక్తితో నుపవిభక్తికటకారము) లోపించి నను నిది యంతిమాక్షరలోపముకంటె భిన్నము గాదు. పిదప వీరు 'ఒక్కఁడొకండు తుట్టతుదిదాక, హరిహరీ, హరీహరి, బళిబళీ బళీబళీ మొ॥'(ఉ.68) అని చూపిరి. ఒక్కఁడొకం డనుచో విశేష మేమియును లేదు. తుట్టతుది యనుచో నడిమిద్రుత మిచ్చో 'నాది'పదముచే నగున దని యుద్దేశ్య మేమో. తుదితుది యనుచో 'ట'వర్ణ మొకసూత్రముచే సిద్ధింప ద్రుత మిచ్చోటిబహుళపదముచే నైనఁ దనఁదగునా? బళి బళీ ఇత్యాదుల దీర్ఘ మన్యకార్యముగా నిట సాధింపఁబడుట విశేషమే. హరిహరి మొ॥విషయములను ఆలోచింపవలసినదే.

'నాఁడునాఁటికిన్' అనుచో నాఁటికిన్+నాఁటికిన్ అని యుండ విభక్తితోపా టంతిమాక్షరమును లోపింప స్థిరపరకతలో నున్న పోయి(నం.16)నానాఁటికిన్ అని యగు విభక్తిమాత్రము లోపించిన నాఁటినాఁటికిన్.నాఁటినాఁటికి (అని.3.102)నాఁటి నాఁటికిఁ దనయందు నాఁటుకొనఁగ (విక్ర.1.16)

నాఁడునాఁటికి నన్నది విశేషము. (ఆది.3.183,నిం.2.67) ప్రాయిక మగుట మొదటిపదమున నౌపవిభక్తికము రాక విభక్తి నిత్యముగా లోపించిన దనవలె నేమో.

ఇం దంతిమాక్షరలోపము ప్రచుర మై గానవచ్చుట సూరి ప్రస్తావించియుం డును. వెనువెనుకను (నిర్వ.7.128శల్య.1.178,కళా.6.159, భోజ.6.97 అదగదుగు నకు (మొల్ల.అరణ్య.4)మిడుమిడుకంచు (భాగ.8.290)ఒయ్యొయ్యనన్(భోజ.6.77) తొంతొంఁగుకొంఁగుమనుచున్, విలు, విలు విలు మనుచు విలు విలువు విలువుమను చున్ (రాజ.2.72) వెను వెనుకన చన (కేయూ.4.40) విలు విలువుమా (మను.3. 84) రారాపిళ్ళ (మను.4.76)రారాపుచనుడోయి (కాశీ.1.90) మిను మినుకు మనన్ (హర.7.184) విలు విలువు మనుచు (ఉ.హ.5.241) మొ॥

## అందదుకు :

'అందదుకుప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' (42) అనుసూరి లక్షణము నట్ల గ్రహించిరి.

ఇట వీరు తనంతన్, అర్ధమయ్యె మొద లగువాని నీసూత్రవివరణమునఁ జూపిరి. సందర్భము స్పష్టము గాకున్నది. ఉట్టూతలు [కళా.1.76,ఉ.హ.4.216, విక్ర.5.130]తుందుడుకు [ఉ.రా.6.212 శుక.1.448] చిమ్మచీఁకటి నిం.8.45,భీమ. 2.102,భాగ.3.604 విక్ర.5.187]బిట్టుబిగుకళా.7.29. ఉ.రా.7.323]అట్టాకల కాళ.3. 89,కళా.2.27] విఱ్ఱుసిల్గి [కాళ.3.75] పాపదమంచు[కవిక.1.62—పదము—బొమ్మ] మొ॥.

## చేతాదులు-ఇత్వము :

'చేతతోదవలనల కిత్వంబు సమానంబులం దగు' [43]ననుసూరిలక్షణము నట్ల [సమాసములందగు] గ్రహించిరి [ఉ.40] సూరిలక్ష్యములను విమర్శించిరి.

'సీచేతన్ప్రోవు' అనుసూరియుదాహృతి సరి కాదు. అట్టిద్రుతస్వరలోపమున కాధార మేమి? [ఉ.67]ఇది యుచితమ యగు నేమో. సూరిద్రుతస్వరలోప మేల[ఎట్లు]చేసెనో? ప్రయోజనము మృగ్యము. [చూ.ద్రు.]

ఇఁక వీరిప్రక్రియ యింకను విశిష్టము. 'నీచేతను+ప్రోవు' అని చూపి 'చేతను మున్నగువానితుది 'అను' అనుచో ఇ నిల్చు నని యర్థము(ఉ.67)ను వివరించిరి. ఇది యసంగత మగుట యింతకు ముందే గుర్తించితిమి. [చూసంధి.24] ఏకాల్లగు 'ఇ' 'అను'న కాదేశ మనుట సంప్రదాయవిరుద్ధము. నువర్ణమునందలియుత్వమున కయి నీచేతని ప్రోవు అని కావలె. 'సమానంబునయందు ద్రుతంబునకు లోపం బగు' నను [24]సూత్రముచే ద్రుతము లోపింపఁగా చేత, తోడ, వలన అనువానియందలితుది యత్వముస్థానమున ఇత్వ మయి నీచేతిప్రోవు ఇత్యాదిగ నగును. 'వారణావతంబున +వారుకువలయంబునవారు ఇత్యాద్యలుక్సమాసములలో నీసూత్రముచే ద్రుతలోప మగుటను [వ్యా.సం.స.334] వీరు గుర్తించియే యుండిరి. ఇట నట్ల యగును. అత్వమున క్విత్వము చెప్పఁబడుటచే నీద్రుతలోపప్రసక్తి లే [వ్యా.సం.స.334] దని వరుులవారు పేర్కొనుట యసంగతము. అట నత్వమున కిత్వ మన్న వీరిట 'అను' అనుదానికిత్వ మని యెట్లు చెప్పిరో. ముందఱియత్వమున కిత్వ మగుటకును, సామాసికద్రుతలోపమునకును విరోధ మేమియు లేదు గాన సామాసికద్రుతలోప మైనపిద పఁ జేతాదులయత్వమున కిత్వ మగు నని గ్రహింపఁదగును.

## ఎందు-అలిగాగమము :

'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు'(44)ననుసూరిలక్షణమును వీరు "అంద్వింందుల--[ఉ.41సూ] అని యించుక సవరించిరి. సూరి అందు, ఇందు, ఎందు అనుమూఁటికి యలిగాగమమును జూపెను. అంద్వింందుల కనుటవలన నెందున కలిగాగమము లే దని వీరియుద్దేశ్యము స్పష్టమే. 'ఎందున కలిగాగమంబు కొందఱు లే దండ్రు' అని సూరియే యిట్టియభిప్రాయమును బ్రస్తావించెను. 'ఏందలివారు- అనుప్రయోగమె లే' [ఉ.67] దనిరి వీరు. ఎందులవా రనియె కవి వ్యవహార మనిరి. అందు, ఇందు అనువానికి నన్నయాథర్వణు లలి చెప్పుటనుబట్టి గాని [వ్యా. సం.స. 402] నటఁ గూడ నందుల ఇందుల అనియె కవిప్రయుక్తమని యుందురు. ఏందలివా రనుదానికిఁ గవిప్రయోగము వెదుకవలయును.

అంద్వింందుల కలిగాగమమును జెప్పనవీ రీవిషయమును 'అంద్వింందువిభక్తి

సంధి' యని సూచించుట యసమంజసము. 'చింతామణివ్యాఖ్యానమునఁ' వీ రిట్లు చెప్పి యుండురు. వీనిలో ఇందు [సప్తమీ] విభక్తి కాదు ['అలి'కై] 'అంద్వింందునాస్తి సప్తమీ యని చిం. సప్తమిగాఁ జేర్కొన్నది. కాని వీరు దమయూవ్యాకరణమున నట్లు చెప్పలేదు.సూరివలె అందు న అనునవే సప్తమీవిభక్తులుగాఁ జెప్పిరి(ఉ.తత్స. 7సూ) చిం. ఇందు సప్తమి యన్నను నది "ప్రత్యేకప్రకృతియే కాని సప్తమీప్రత్యయము కా దని' (వ్యా.సం.స.396)వీరు చిం.మతమునను నిరూపించిరి.

'అందు' అనునది విభక్తియె. కాని 'స్వతంత్రపదము గూడఁ గందు. -- కాన అందలివారు' (ఉ.68)అని విభక్తి కాని'అందు'నకు నలిగాగమమును జెప్పిరి. విభక్తి కానట్టిదియు నగుఅందునకును, విభక్తియే కాని ఇందునకును అలిగాగమము చెప్పుచు దీనిని 'అంద్వింందువిభక్తిసంధి' యని పేర్కొనుట సమంజసము కాదు గదా.

ఇటఁ గూడ సూరియుదాహరణముల నకారవ్యంజనముతోఁ జూపుట నతి కా దని 'ఆతనిపక్షమున' ద్రుతస్వరలోప మె ట్లనిరి.(ఉ.68) ఎవరిపక్షమునను విట ద్రుతస్వరలోప మె ట్లగును? అట్లు చూపుటలో సూరియభిప్రాయ మవగతము కాకు న్నది. ప్రయోజనమును గానరాదు.

కాని వీరు స్వరసహితముగనె చూపి సూరివలె నలిగాగమ మనుటవలనఁ గొంత యిబ్బంది యేర్పడినది.

అందును+వారు అని యుండఁగా అలిగాగమము వచ్చి అందును+అలి(వారు) అని యగును. ఇట ద్రుతమున స్వర మున్నది గావునను దాని కపదాదిస్వరము పర మగుటచే ఉ.సంధి.12, సూత్రముచే నిత్యసంధి యై అందునలివారు అని యగు.ఇట్లే యిందునలివారు మొ?సూరి సాధించినఅందలివా రన్నది వ్యవహారపంథైననున్నది. (వ్యా.సం.న.404) కాని వీరు సాధించిన అందునలివా రనురీతి వెక్కడ నుండ వని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. 'ద్రుతలోపపూర్వకపరరూపసంధి' ఇఁకాదు లకుఁ గదా వీరు చెప్పినది, (ఉ.సంధి.10) ప్రథమేతరవిభక్తిసంధి వచ్చు నని తలంప రాదు. (వచ్చినను అందునలివా రని యొకపక్షమునఁ గాక తప్పదు.) అపదాదిస్వరపరకవిశేషసంధిశాస్త్రమె యిట వర్తింపవలె.

ఇట సం.లో వీరు సామాసికద్రుతలోపప్రసంగము చేసిరి. (వ్యా.సం.స.400) కావి యిటఁ బ్రస్తావింపలేదు. సం.వ్యాఖ్య ననుసరించి యిట ద్రుతలోప మగు నని గ్రహింపవలె నేమో. (ఇదేపద్ధతిలో చేతాదులయందున్నసమాసమున మాత్ర మేం సామాసికద్రుతలోపము రాదు. అట 'అను' అనుదానికి ఇత్వ మాదేశ మగు నను టేం?)

సూరిమతమున (అందును+వారు) ముందు సామాసికద్రుతలోపమున (అందు+వారు) పిదప నలిగాగమమును [అందు+అలి+వారు] అపదాదిస్వరపరక సంధియు నై అందలివా రని సముచితముగ నేర్పడును.

ఇవి యుత్తరపదలోపసమాసము లని [ఉ.68] వీరిమతము. సూరిమతమున వి ట్లనుట కాధారము లేదు. [చూ.సమా.]

**అదియవులు-అలోపము :**

'అదియవిశబ్దంబులయుత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు' [45] ననుసూరిలక్షణమును 'అది-అవి-అనుశబ్దములు-- నని సవరించి గ్రహించిరి. [ఉ.42 సూ] 'అదియవిశబ్దంబుల అనుసూరిసమాసము ప్రామాదికము.సిద్ధసమాసమునయడా దేశాభావ మెట్లు? సంహితాయకార మెట్లు? [ఉ.68] [వ్యా.సం.స.406] సిద్ధసమాస మయినయడాదేశాభావము దప్పే.అట్లే యడాగమమును. కావి యిది సిద్ధసమాస మన వలసినయవసర మేమి? ఇది సాధ్యమే. అంటయిఁకమఁడుశబ్దములు [చూ.సంధి. 22] అనురీతిగా దీనిని గుర్తింపఁదగును.సాధ్యసమాస మగుచోఁదు సంహితాయకార మవిరుద్ధమె.

వివరణమును గూడ సూరివలెనె గ్రహించి చివరలో ని ట్లనిరి. 'ఉదంతతద్ధ ర్మార్థకవిశేషణములమీఁదనే కాక "ఉదంతనామములమీఁద నైతము" సమాసమున అది అవి అనుశబ్దముల అకారము నిత్యముగా లోపించును. రాజాది. అదుది ఇట్టి యెడల సంధి32సూత్రముచొప్పున నుగాగమము గల్గదు. [ఉ.69][వ్యా.సం.స.407] వీరివివరణము ననుసరించిన నుదంతముపై అత్వ మిట నిత్యముగా లోపించుచున్నది. కావున స్వరపరకత మే లేకుండఁగా నుగాగమమునకుఁ బ్రసక్తి యేది?అత్వము లోపిం పక నుగాగమ మై 'కన్నునది' అనురీతి నుండ దని అహో.అభిప్రాయమును విమ ర్శించుట వీరియుద్దేశ్యము గావచ్చును.

కాని యుదంతనామములపై నియత్వలోపము నిత్య మనువరుఖులవారియభిప్రాయ మసంగతము. తిక్కనయొ 'గట్టిప్రాయమునది పుణ్యమూర్తి యతులబుద్ధి' [అను.2-282] యని ప్రయోగించెను. ఏకులమునదియొ [భీమ.2.112] ఇట నత్వము లోపింపక 'సంధి32' సూత్రముచే నుగాగమ మైనది. కావున 'నదియవిశబ్దేతరస్థలములందే నుక్కవర్తిల్లు' [ఉ.69] ననువీరినిర్ణయము కవిప్రయోగమునకును విరుద్ధమె.

“ఉదంతతద్ధర్మార్థకవిశేషణములమీఁదనె కాక ఉదంతనామములమీఁద నైతము' అని వరుఖులవారివాక్యమున స్పష్టతకై యట్లు చెప్పఁబడిన దని గ్రహింపఁదగును. తద్ధర్మార్థకవిశేషణములు నామములె కదా. “ఉదంతతద్ధర్మార్థకవిశేషణములును స్త్రీసమములె' [ఉ.54] అని వీరు పేర్కొనిరి. కృదంతతచేఁ బ్రాతిపదికత్వము గల్గుటచే నివియు నామముల యగును. ఇట్టియపార్థమున కవకాశము లేకుండ తద్ధర్మార్థక విశేషణేతరము లగునుదంతములపైఁ గూడ ననియో యింక నెట్లో చెప్పినఁ జక్కఁగా నుండెడిది గదా.

ఇంక నిట వరుఖులవారు గొంత పొరపడిరి. 'ఉదంతతద్ధర్మార్థకవిశేషణముల మీఁదనె కాక ఉదంతనామములమీఁద నైతము నిత్యముగా లోపించు' ననుట విరుద్ధము. అస లుదంతతద్ధర్మార్థకవిశేషణములపై లోప మగుచున్నదా? 'ఉదంతములగు తద్ధర్మార్థవిశేషణములమీఁద లోపము లేదు' [ఉ.69] అని సూరి ననుసరించియె వీరును బేర్కొనిరి. మఱి యుదంతర్థతద్ధర్మార్థకవిశేషణములపై లోప మసలే లేకుండఁగా వానితోపా టితరములకు పై నిత్యలోప మగు ననుట గుదురదు గదా.

మొత్తముమీఁద వరుఖులవారిపైవివరణ మయుక్తము.

బా.వి.లకు అది-అని అనువానితో సమాసాభాసము గల్గఁగా [వ్యా.సం.న.1175] నిట నత్వలోప మైనట్లు పేర్కొనిరి. [ఉ.69] విభక్తివివక్షలోఁ దచ్చట్టి మను ప్రయుక్త మైనయీస్థలములను [గర్మధారయాభాసములుగా] నమూపములుగాఁ జెప్పుట సరి కా దనక తప్పదు. ఇట బా.సా.పే. పేర్కొన్నట్లు కృదద్వృత్తియం దీకార్యము వర్తించినట్లు సమన్వయింపఁదగు నేమో పరిశీలింపవలె. బహుళపదము నాశయింపఁదగును.

ఇట బా.సా.పే. 'వృత్తి' యనుటంజేసి వ్యస్తమునఁ బూర్వపదభూతము లగు వీని కైనయత్తులకు లోపము గా దనుట స్పష్టము. సమాస8.సూత్రముచే వీనికి య[?]దియవులు వగము లగుట శంకవించు [పుట.111] అనుటను విమర్శింపుచు

తద్ధర్మార్థకవిశేషణములు పూర్వపదములుగా నుండునపు డుత్తరపదము లగు అది అవి అనువానితో వ్యస్తత యెట్లు సంభవించు (వ్యా.సం.స.406) ననిరి. బా.సా.పే. వ్యస్తస్థలము లనుచో నచ్చోటితద్ధర్మార్థకవిశేషణములను బూర్వపదము లనుట పొరపాటే. కాని సమాస.9సూత్రముచే నది యవులు పరముగాఁ జేరు ననుట నవి వ్యస్తములు. వయులవారు సమస్తము లనుట సరి కాదు. వయులవారే మఱియు సమాస. 9.సూత్రమునఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తమని చెప్పఁబడెను గాన నది సమాస స్థలము గాదు' (వ్యా.సం.స.406) అనిరి. ఆ ట్లయ్యు 'బా.సమాస.9సూత్రము చొప్పునఁ దచ్ఛబ్దము ధాతుజవిశేషణముల కనుప్రయుక్తము ---- విశేషణముల కెల్ల విభక్తివివక్షయందుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. వయిరీతిని అది అవి అను శబ్దము లుత్తరపదము లయి యిల్చునపుడు' (వ్యా.సం.స.407) అనిరి. బా.సా.పే. యిచ్చోటితద్ధర్మార్థకవిశేషణములను బూర్వపదము లనుటవంటిదే వయులవా రిచ్చటి యదియవుల నుత్తరపద మనుటయు. తచ్ఛబ్దానుప్రయోగము గలయీయవి సమస్త ములు గా వని గుర్తించినవీరు పైరీతిని ఉ.లోఁ గర్మధారయాభాసములుగా నెట్లు చెప్పిరి? (ఇందు రెండుపదములే లేవు.) సమాసము లనుట కవకాశ మెక్కడిది?

దానిది కలరూపు వారివ ధమ్మిల్ల- అనుచో నదియవుల సత్వము లోపించిన దని పేర్కొను టుచితమె. వారివ వారివె యైన నని ప్రౌఢవ్యాకర్త (కార.16)అగు ధాతురూపముతో నన్వయమును బేర్కొనెను. (ఉ.70) ఇఁక వయులవారు దివివిభక్తులు'?అనునవి లే వని కారకపరిచ్ఛేదమున గుర్తింపఁగలము. కావున 'దానిది'ఇత్యాదులలో దివివిభక్తి లేమో యని భ్రమించుట కవకాశమె లేదు. అట్టివిభక్తులే లేవు గనుక.

## పద్యాదిపరకకార్యములు :

పద్యాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు' (46) ననుసూరిలక్షణము నట్ల గ్రహించిరి.వీరు 'అవమానపెట్టి' యను తిక్కనప్రయోగమును జూచికొనలేదు కావుననె పెట్టుశబ్దము నుదాహరింపక పట్టు శబ్దము నాముక్తమాల్యదలోనిదాని నుదాహరించె (ఉ.70) ననుట యుక్తము గాదు. తిక్కనప్రయోగమును జూపనంతమాత్రమున సూరి దానిని జూడలే దనఁదగునా? సూరి యుదాహరించినవి మాత్రమె పద్యాదు లని సూరి పేర్కొనెనా? పెట్టు నుదాహరింపనిమాత్రమున నది పద్యాదులలోనిదిగా సూరి తలఁపలే దనలేము గదా.

అహో. సంతోషపెట్టి ఇతి రూపం త్వసఙ్గతమేవ సూత్రపట్టినట్లు- ఇత్యాంధ్రకవితాపితామహః (ఉ.291)అని పేర్కొనెను. అహో.వలె 'సూత్రపట్టి'యుదాహరించెను. కాని సంతోషపెట్టు తిరస్కరింపలేదే.ఒకవేళ దిక్కనప్రయోగమును సూరి చూడక పోవుఁ గాక, వఝలవారు చేసినసిద్ధాంతములకు విరుద్ధముగాఁ గవిప్రయోగము లెన్ని దొరకలేదు. ఉదంతములపై నదియవులయత్తు లోపింప దని వీరు నిర్ణయింపఁగా 'ప్రాయమునది' అనుచోఁ దిక్కనప్రయోగమున 'అది'లో నత్వము లోపింపకుండుట గలదే. సూరి యిట నట్లు (కవిశి.లో నున్నను) పెట్టు పడ్వాదులలో విధిగా దని నిషేధింపలేదే. అముక్తమాల్యదలోని'పట్టు' నుదాహరించుట తప్పా? దాని నేల ప్రస్తావింపవలె?అముక్తమాల్యదాదులయెడను సూరి ప్రామాణికబుద్ధి హర్షింపఁ దగినది కదా.

'కర్తృవాచిమువర్ణకమున కికార్యము లేదని (గజముపడియె) సూరి చెప్పఁగా వీరు ప్రాప్త్యర్థకపడుధాతువే యీసూత్రమునకు విషయము.పతనార్థకము కాదు.గజము పడియె' (ఉ.70), (వ్యా.సం.స.410) అనిరి. ప్రథమాపైకర్తృకమొక్కచ్చిద్దశ్చమహాన్ పతిక్రియార్థేషు' అనుచిం.లక్షణము దృష్టియం దుంచి వీ రిట్లు వివరించి రేమో.కాని సూరిలక్షణమున ధాత్వర్థము జోలికి పోక పడ్వాదు లని నిర్దేశించెను. అందలియౌచిత్యమునుబట్టి వీరును సూరి ననుసరించి యట్లు చెప్పిరి. ఇట నర్థము ప్రసక్తి యేల? సూరివివరణము శబ్దశాస్త్రోచితము గదా.

అవమానపెట్టంగ (ఆశ్ర.1.168) దైవ మవమానపెట్టి. 'దైవముపెట్టె నవమాన' మనవచ్చును గదా. 'దైవము+పెట్టె' ననుచో 'దైవపెట్టె' నని యగునా? పెట్టుధాతువునకును నేయర్థమం దగునో యేయర్థమందుఁ గాదో మఱి యొకవివరణము వీరు చేయవలె. పడ్వాదులలోనివాని కన్నింటికి నట్ల వేర్వేఱువివరణము చేయుదురా? సూరివివరణము ననుసరించి 'దైవము' కర్తృవాచకము గాన నందలిమువర్ణకమున కికార్యము రాదు.

సూరివివరణ మెంతయు సముచితము. సూక్తము. వఝలవారిసవరణమె యవ్యాప్తమయి యనర్థక మగుచున్నది.

పడ్వాదులు ప్రయోగానుసారముగా గుర్తింపవలయును. కష్టపఱచి (ద్రోణ. 4.270) సూత్రపడ (అను.1.134) బాహిరపోవకతేఱి (శల్య.1.377)విరా.2.287)

అంగమునారటపెట్టి (ద్రో.4.209) కన్నుపెట్టి (ప్రాం.3.105) మూలిపుడడ్డపాటు (రామా.3.98) భంగపటిచె (అర.6.315) మోసపుచ్చి. (శాం.5.469) అడ్డకట్టినన్ (సిం.10.26) అడ్డకట్టుచు (కువ.3.7) మొ॥

ఈసూత్రమునందలివిభాషకు వ్యవస్థ చేసి అగ్గము+పడు అగపడు, పదము +పడి- పదంపడి యనుచో అగంపడు పదముపడి యనురీతిరూపములు వారించిరి.అగపడు అనుచో ద్విత్వలోపము విశేషము.పదపడి యనుచోఁ బదపడె ననురీతి రూపములు లేవు. భయపడెను.సూత్రపట్టె ననురీతిగాఈకార్యము శబ్దపల్లవములందలి దగుట గమనింపఁదగును. 'పదపడి' యిట నుదాహరింపఁదగినది కా దేమో యని పించు. పరిశీలింపవలె.

## గ(సడద)వలు :

దీనిలక్ష్యములందు సంధి14సూత్రముచొప్పున వచ్చు'వ'ఆదేశమునకు భారతమున లక్ష్యము గానరాదు. వకారాదేశము వచ్చుట కించలిపూర్ణబిందువిధి ప్రతిఘటిల్లును" (ఉ.70) అడ్డకట్టు మున్నగువానింట గాదేశమును శంకింపవలసినదే. ప్రాచుర్యమునుబట్టి వకారమును బ్రస్తావించియుందురు. సడదల కవకాశము గల దేమో వెదుకవలె. ఆదేశమును గూర్చినవయులవారివివరణము కొంత యస్పష్ట మై యున్నది.

భారతమునందు లే దనఁగా నితరములం దీయాదేశము గలదా? అయిన నది యెందుల కంగీకరింపరాదు? వీరు భారతభాషకు మాత్ర మె లక్షణము చెప్పుట లేదు గదా. (ఆముక్తమాల్యదప్రయోగమును సూరి చూపుటను వింతగాఁ బ్రస్తావించినను వీరును జూపిరి.) కాని పీ రట్టిప్రయోగమును జూపలేదు.కన్నువెట్టవిదొక్కటి(విరం. 2.26) మఱి భారతమునందు లే దన నేలనో.

వాదేశము వచ్చుటకుఁ బూర్ణబిందువిధి ప్రతిఘల్లు ననుట యసంగతము. పూర్ణబిందువిధానముచే వాదేశము రా దన్నమాట. ఏండ్లు కొండ్లిత్యాదులలో దాకు గాదేశమును వారించినపద్ధతి సరిగా లే దని యట గుర్తించితిమి.తీఁగ-తీవ(సం.16) అయిన వాదేశ మైన స్థిరపరకబిందు వుండరాదు గాన లోపించి 'భయపడు' అనియె (మువర్ణకము లోపించినప్పటి) రూపమె యగును గదా.అపుడు పూర్ణబిందువిధానము వ్యర్థము గాదా. యని విచారింప నక్కఱ లేదు. వాదేశము నిత్యము గాదు గదా. బహుళము. (ఉ.సంధి.14) వాదేశము రానిపక్షమున బిందు వుండి భయంపడు అను

రూపమును సాధించుచుఁ బూర్ణబిందువిధానము సార్థకమై యగును. (ఇంకను 'అడ్డ కట్టు' అనుచో గాదేశ మైనను 'అడ్డంగట్టు' అనువిధముగా బిందు వుండుటలో బాధ లేదు. కాని యిట అడ్డంకట్టు అని గల దేమో వెదుకవలె.)

ఇఁక నది య ట్లుండఁగా వసుులవారిమతము నంగీకరించి బిందువిధానము వలన నాదేశము రా దందము. బిందు వొక్కటి కాదు గదా యిట విధింపఁబడినది. లోపము నగును. లోపపక్షమున నాదేశమునకుఁ బ్రతిఘటన మే మున్నది? నంత నందు పడి రని లోపపూర్ణ బిందువులు రానున్న నాదేశ మగుచున్నది.

లోపపూర్ణ బిందువు లగునపు డీయాదేశ మెచ్చటను (భారతేతరస్థలములం దును) లే దనియే చెప్పఁదగును. స్థానివద్భావప్రసంగముతో నహో.దీనింగూర్చి విస్తరించెను. ఆదేశమును వారించుటకు వసుులవారు మార్గాంతరము ద్రొక్కుట యుచితమె. కాని యామార్గమె సరిగా లేదు.

'లెప్పగా' ఇత్యాదులలో లక్ష్యానుగుణముగా నాదేశము నిత్య మని సూరి చెప్పినట్లే యిచట మువర్ణకమునకు లోపపూర్ణబిందువు లగుసందర్భమున నీయాదేశ మున కప్రవృత్తి" సంధి.14సూత్రమునందలిబహుళపదముచే సాధించుకొనుట యుచితము.

మధ్యమ 'ము' లోపము :

'మధ్యమపురుషమువర్ణకంబునకు హలంతపానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు (47) 'వ్యతిరేకమధ్యమమువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు' (48) ననుసూరిసూత్రములు రెంటిని గలిపి వసుులవారు 'ప్రార్థనాద్యర్థకమధ్యమమువర్ణకంబున కంతటను లోపము విభాష నగు (ఉ.44) నని సూత్రించిరి. 'ప్రార్థనాద్యర్థక' విశేషణమును వీ రధికముగాఁ గూర్చిరి. సం.లో సూరిసూత్రమును వ్యాఖ్యానించుచు'స్వరపరకత్వమునఁ బ్రార్థనాద్యర్థకమువర్ణకము నిత్యముగా-(వ్యా.సం.స.413) అని పేర్కొనిరి. కాఁగా వీరు చేర్చిన ప్రార్థనాద్యర్థకవిశేషణము సూరిమధ్యమమువర్ణక మనుదానికి వివరణమె. కాని యందు విశేషము లేదు.ఇంకను 'నాది'శబ్దముతో నున్నవీరివివరణ మస్పష్ట మైయుండఁగా 'మధ్యమమువర్ణక'మను సూరిసూత్రము స్పష్ట మైయున్నది. ఏమొకయర్థమం దేని మధ్యమపురుషమువర్ణకము లోపింపకుండుట (నిత్యముగా) లేదు గదా.

మధ్యమమువర్ణకంబున కనుటయే యసందిగ్ధతతో స్పష్టతతోను నుచిత మై యుండును.

స్వార్థమందు హలవసానపరకతలోను వ్యతిరేకమున నెల్లయెడల ననఁగా నచ్చరకతలోను లోపించు నవియు- ననఁగా స్వార్థమునందలిమధ్యమమువర్ణకము స్వరపరకతలో లోపింప దని సూరి స్పష్టతకై రెండుసూత్రములలోఁ జేర్కొనెను. వీరు స్వార్థమునను నచ్చరకతలో మువర్ణకము లోపించు నని తలఁచుటచేతనె సూరి రెండుసూత్రముల నేకము చేసి 'అంతట' అని చేర్చి రనవచ్చును. 'అంతట' అను దళము లేకున్నను నిమిత్తము పేర్కొనఁబడమింజేసి అజ్ఝలవసానపరకతలో (ననఁగా నంతట) నిలోపము సిద్ధించుచునే యుండును. కావున వీరిసూత్రమున 'నంతట' నను దళము వ్యర్థము.

సూరి వ్యతిరేకప్రార్థనమందు మాత్రమె స్వరపరకత్వమున మధ్యమ ములోపము సూత్రించెను. కేవలప్రార్థనమందును మహాకవులు ములోపమును స్వరపరకత్వమందును బ్రయోగించిరి. కాన బాల.సంధి.47,48 సూత్రములు నిర్మూలములు, తిక్కయజ్వయే స్వరపరకత్వమందును గేవలప్రార్థమున ములోపమును బ్రయోగించెను" (పు.71)

బాల. సంధి47,48సూత్రములు రెండును నిర్మూలము లనఁగా నవి తొలఁగింపవలెనా? మఱి మువర్ణకలోపమును జెప్పుశాస్త్ర మేది? ఎల్లయెడల మువర్ణకము లోపించుట కల్గఁగా నద్దాని నసలే చెప్పరా దనుట యెట్లుచితమో యర్థము గాదు. ఇఁక స్వార్థమందలిమువర్ణక మచ్చరకతలో లోపింప దనుటకు "విభాషా తు పద స్త్యైకే --- న ప్రాణే తు కదాపి చ' యనుఅథర్వణలక్షణము మూల మనఁదగి యుండఁగా నిది 'నిర్మూల' మనుట యెట్లు. సమూలక మైనను బ్రయోగానుగుణము గామి గ్రాహ్యము గా దనుట కొంతవఱ కేని దగెడిది గదా. సూరిసూత్రములు నిర్మూల మన్న వీ రట సూరి చూపినయుదాహృతు లెత్తి వ్రాసికొనిరే. అంతవఱ కయిన సూరిలక్షణము సమూలముగా లేదా?

సూరికంటె వీరు విశేషముగాఁ జెప్పినది స్వార్థమందలిమువర్ణమున కచ్చరకతలోవిలోపము. దానిని బ్రౌఢవ్యాకర్తయుఁ (సంధి.18)జెప్పెను. (పు.71)

### చూయెవ్వత :

దీనికిఁ దిక్కనప్రయోగమె కల దనిరి. దానిసంగతి చూతము. అది—నినుఁ గూర్చెదఁ జూయెవ్వత నైతి నేమి? (భీష్మ.3.325) (ఉ.71)చుమ్ము + ఎవ్వత చూయెవ్వత అని యైన దని వీరివిశ్చయము. "తిక్కయజ్వ తనవిశాలభారతభాగమున మ వెచ్చటను నిట్టిములోపమును బ్రయోగింపలేదు" (వ్యా.సం.స.414) అని వీరే స్పష్టము చేసిరి. (నన్నయ. ఎఱ్ఱన ప్రయోగింపలేదు. క్వార్థకేకారసందివలెభారతేతరగ్రంథములం దవియుఁ జెప్పక సాధారణముగాఁ జెప్పుట కేవలము సూరిలక్షణమును దిరస్కరించుటకే యనవలె.) కాని యిదియు ములోపస్థలము గా దని వారి మాటలలోనె గుర్తింపవ వీ లుండుట విశేషము. 'ఏతివాన్తో హ్రస్వదీర్ఘో ద్విత్వమూ ద న్తతా క్వచిత్' అనువి.వి.లక్షణముతో "ఈయర్థద్వయప్రవర్తితప్రక్రియనుబట్టి 'చూ' అనుదానిదీర్ఘ ము ముపర్ణకలోపమూలము గా దవియు చూ అనునది ప్రత్యేకముగాఁ బై రీతిని సాధింప నగు ననియు నిట్లు వెనుక నుదాహరించిన భారతప్రయోగమున (చూ యెవ్వత ననుచిదియే) ముపర్ణకలోపము లే దనియు సమర్థించుట కవకాశము గోచరించుచున్నది (వ్యా.సం.స.1419) యనిరి. 'చూ' యనురూపము ప్రత్యేకముగా సాధింపఁబడఁగా 'చూయెవ్వత' నన్నచో నది ప్రయుక్త మైన దనుటలో 'సమర్థించుట' యే మున్నది?

కాని యక్కడనె వీ రది తిరస్కరించిరి. అందలియనౌచిత్యముల తద్గ్రంథవిమర్శనమున స్పష్ట మగును. మొత్తముపై 'చూ' యనునది చుమ్ము చూవె ఇత్యాదులవలెఁ బ్రత్యేకశబ్దము కావున నిట ములోపప్రసక్తి లేదు. తత్ప్రభావముతో ను బాల.లోను ముపర్ణము లోపించినస్థలముగాఁ జెప్పిరి.

తిక్కన తనభారతభాగము వింక నెచ్చటను నిట్టిములోపమును బ్రయోగింపమి చేతను 'చూ' అనుశబ్దము ప్రత్యేకముగా నుండుటచేతను దిక్కన యిట ములోపము చేసె ననుట నిర్మూలము.

సూరిపక్షమున నె ట్లనవచ్చు? సూరి 'చూ'శబ్దమును బ్రస్తావింపలేదు. ఇది బాల.లో ననుక్తము. ములోపముచే నేర్పడినది గాక చూ యన్నది ప్రత్యేకశబ్ద మగుట గుర్తింపవలెను.

చూ యెవ్వతె- యనుచో 'చను' గూర్చెద ననుట 'చుమ్ము' ఏకవచనాంత మనియు మువర్ణము లోపించిన దనియు నందురు గాక, "మీ రిపుడు నీయెఱుక మఱచెదరు సూ పోయివత్తు (ప్రభా.3.84 సూ.వి.) అనుచో మీరిరువు రనుదాని ననుసరించి బహువచనముతో 'చుండు' అని యుండవలదా? 'పోయి' యనుచో హల్లు పర మైనను దుగ్లోప మెట్లు? ప్రత్యేకముగాఁ 'జూ'శబ్దము నంగీకరింపక తప్పదు. వీరేచూచు ప్రార్థనార్థకసంక్షేపరూపము లగు చుమ్ము-చుము (చూడుము) చుండు-చుఁడు (చూడుఁడు) (ఉ.374) అని స్పష్టము చేసిరి. మీ రిరువురు చుమ్ము అని ప్రయుక్తమవుట యెట్లు? 'ఉదన్తతా' క్వచిత్ అనుచో 'మధ్యమార్థేప్రార్థనే యనునది సముచితముగా సమన్వయించునే ము,మ్ము. డుఙ్ అను ప్రార్థనార్థకమధ్యమపురుషప్రత్యయముల విధానముతో బాధ లేకుండఁగనే ములోపముతోఁ గాక"(వ్యా.సం.స.1419) చూ యనురూపము ప్రత్యేకముగా గుర్తింపఁదగియున్నది.

కాఁగా షష్ఠిములోపమును దిక్కన ప్రయోగింపలే దనుట స్పష్టము. ప్రౌఢ. చూపినప్రయోగము లిటుఁ బ్రదర్శించిరి వీరు. వీనింగూర్చి త్రి.శే.లో విచారింపఁబడినది.

'వెఱచియుం డింతియు' యనుబసవ.ప్రయోగము శ్రీకంటిలింగంబు దాకన్న సూచి (ఉ.83) యనుదానివంటి దన్నఁ దప్పు లేదు.

కావుకొ వనువారి (వ్యా.సం.స.415) యనురీతి నొండునెం డాధునికప్రయోగములు గలవు. దానిని వీ రిట నేల యుదాహరింపలేదో. ఇవి విశేషస్థలములుగా గుర్తింపఁదగును. స్త్రీవాచకతత్సమాకారములకుసంధి లేదనిసూరియాధునికప్రయోగము లందఱి నెలఁ తిచ్చెను గం గనుకొనె యనురీతివానిని బ్రస్తావించినట్లే యిట్టివానిని విశేషస్థలములుగాఁ జెప్పుటయె యుచితము. ప్రాచీనకావ్యములనుండియుఁ బ్రసిద్ధమైయున్న హలవసానపరకములోపముతో నాధునికము లయి యరుదుగాఁ గానవచ్చు నిట్టిస్థలములకు సమానప్రాధాన్యము నిచ్చుట భాషాసామాన్యలక్షణమున కనుగుణము గానేరదు.

సూరిలక్షణము సూక్తమని గుర్తింపఁదగును.

"అ.ఆ.ఇ మున్నగునేకస్వరశబ్దయోగమున ములోపము గల్గదు. చూడుమీ. రక్షింపుమ. "(ఉ.71)స్వరపరకత్వమునఁ దాము ములోపమును సాధారణముగఁ జెప్ప

కొనుటచే వీటఁ బ్రాప్తించుచున్న దని వీ రిట్లు వివరింరేమో. సూరిమతమున నిట్టి ప్రసక్తి లేదు."ఈమువర్ణకమే కాక ముందటిధాతూకారము లోపించుటయుఁ గలదు. భానుసమాన విన్' (ఉ.71)ఇది యిటఁ జెప్పవలసిన దగునా యని సందేహము. వినుము (శ్రవణ) అనుచో హల్పరకత్వమున మువర్ణకము లోపింపఁగా 'విను' అని యగును. ఇపుడు 'పదాంతంబు లయి యసంయుక్తంబు లయినసులురులయుత్వంబు నకు లోపంబు బహుళంబుగా నగు' (ప్రక్రి.16) ననుసూత్రముచే నుత్త్వలోప మయి 'విన్' అని యవును. వరుబడా రీయభిప్రాయముతోనె యిట నుదాహరించియున్న నది యుచితమే.

## ముడుఙ్లోపము :

'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుఙ్లకు లోపంబు విభాష నగు' (49) ననుసూరిలక్షణము నట్లు గ్రహించిరి. (ఉ.42) స్వరపరకత్వమున ముఙ్లోపమునకుఁ బ్రయోగము గన్పట్టలేదు ('ఉండుండుఁడు'వంటిప్రయోగము లేదు) (ఉ. 72) ఓడ కోడకుం డనుచు (రం.రా.355,371పుట)

ముడుఙ్లు లోపించునపుడుతన్నిమిత్తకహ్రస్వము దీర్ఘమె యగును. కొమ్ము+కొమ్ము- కోకొమ్ము- కొండు+కొండు+కొండు-కోకొండు (ప్రౌఢ.సంధి.26,ఉ. 72) ప్రౌఢ.లక్షణము సమగ్రముగాని దాని నట్లు చూపక యిట్లు పేర్కొనుటలోఁ దప్పు లేదు (చూ.త్రి.శే.) కాని సూత్రముగాఁ జెప్పిన బాగుండెడి దనిపించు.

ప్వార్థమునం దున్నమధ్యమపురుషమువర్ణకమునకు నచ్చరకతలో లోపము లేదు.ఆమ్రేడితస్వరపరకత్వమున లోపించును గాన సూరి విశేషదృష్టితో ఉండుండు మనుదాని విట నుదాహరించెను. సూత్రమున ములోపమును గూడఁ జెప్పెను. కాని వీరు మువర్ణకమున కెల్ల యెడల వైకల్పికలోపము చెప్పియున్నారు.కావునఁ బ్రస్తుత సూత్రమున 'అమువర్ణమును గ్రహింపఁ బని లేదు. 'ఆమ్రేడితంబు పరం బగు నపుడు మధ్యమడుఙ్లనకును లోపంబు విభాష నగు' నని సూత్రమే ముఙ్లోప మొండ విధింపఁజాలును.

## విసర్గలోపము :

'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' (50)ననుసూరిలక్షణమును వీరు

"అనుకరణంబున అనుధాతుపరకత్వమున విసర్గము లోపించును" అని ఉ.46సూత్రమునఁ బూర్వార్థముగాఁ జెప్పిరి.

'ఇతి ఇత్థం ప్రభృతిసంస్కృతశబ్దఘటితసమాసములతోఁ గూడ ననుకరణము చేయఁబడు' నని భావించిరి (ఉ.73) గావున నిట అనుధాతుపరకత్వమున అని సూరికంటె నధికముగాఁ జెప్ప రనవచ్చును.

ఇతిప్రభృతిసంస్కృతశబ్దములతో ననుకరించునపు డట్టియితిప్రభృతులు సిద్ధసమాసగతము లై యుండును. -జయజయఇతిధ్వనయః జయజయధ్వనయః- (వ్యా. సం.స.426) ఇవి సిద్ధసమాసము లనుట నిందుఁ దెలుఁగుసంధికార్యములప్రసక్తియే మున్నది? కావున దానిని వారించుటకై 'అనుధాతుపరకత్వమున' అని చెప్ప నవసరము లేదు. 'జయజయధ్వని'యన్నది మొత్తము దెలుఁగునఁ బ్రకృతిగా నిల్చును. ఇట సంధికార్యము లెటఁ జేయుదురు? ఉ.లో. నిది చూపలేదు. సంస్కృతశబ్దముతో ననుకరించినందులకు "-కుధియామిత్థంవదత్కిన్నరం బర్హిరాగ్రణి-అనుదాని నుదాహరించిరి. ఇట ఇత్థమ్ అనుదానితో ననుకరింపఁబడిన దనరాదు. ఇచ్చటి ఇత్థమ్ అన్నది 'ఇద్దౌద్ధత్యమగాల్లయం హి' యనువట కున్న భాగమును(కిన్నరులపలుకులను)మాత్రమే యనుకరించి చెప్పునది. కాని యంతకు ముం దున్న సంస్కృతభాగమునంతటిని గ్రహింపదు. అర్థిరాగ్రణిగెల్పుటుత్సవమునందు- నభంబంతయున్, 'అద్ధావాగ్విబుధమ్ అహోవచనకవ్యాహారమ్, అహోవచస్సిద్ధమ్. అః కృతతాం గతః కలిరితి శ్రీసూక్తివిద్యాధరమ్, ఇద్ధౌద్ధత్యమగాల్లయం హి కుధియామిత్థం వదత్కిన్నరమ్- అయ్యెన్ —అని పద్యాన్వయము స్పష్టమే. ఇతి శ్రీసూక్తివిద్యాధర మ్మనుచో ఇతిశబ్ద మెట్లు విద్యాధరోక్తులను మాత్రమె యనుకరించినదో ఇట ఇత్థమ్శబ్దము నట్లు కిన్నరోక్తులను మాత్రమె యనుకరించును. ఇట ఇతి, ఇత్థం అనుసంస్కృతములతో ననుకరణమున్నమాట నిజమే యైనను నాయనుకరణము సంస్కృతముననే జరిగినది. సంస్కృతవాక్యము తెలుఁగులోని కనుకరింపఁబడుట లేదు. అనుకరణవిరహితసంస్కృతవాక్యప్రయోగమున కిది యుదాహరణ మగును. ఇటఁ గిన్నర బర్హిరాగ్రణి యనుచో 'కిన్నరంబు' అని తత్సమముగాఁ బ్రయుక్త మగుట విరుద్ధమె. సం.లో కిన్నరమ్బర్హిరాగ్రణి యని యున్నది. అనుకరణము లేకయె ద్విరుక్తి యవుటయు విలక్షణమే. నమో నారాయణాయేతినిస్వనములు, కృష్ణకృష్ణేతిధ్వనులు వంటి భాగ.స్థలములవలె విశిష్టములు.

సంస్కృతవాక్యమును దెలుఁగులోని కనుకరించునపుడు ఇతి, ఇత్థమ్ అను సంస్కృతశబ్దముల నుపయోగించుట యసంభవము. స్వస్తి చ తే స్త్వితిసూక్తి మున్నుగా (హం.1.33) అనురీతివి సహజములుగాఁ దోఁచవు. ఇట్టియర్థము సంకీర్ణత్వం వికృత్యాద్యానుకృత్యా' యను వి.వి.వచనము పేర్కొనుచున్న దనుట యసంగత మని తద్గ్రంథపరామర్శనమున గుర్తింపఁగలము.

కాఁగా వీరు సూత్రమున 'వనుధాతుపరకత్వమున' నని చెప్పుట యనవసర మని గుర్తింపఁదగును.

'(అను)ధాతుపరకత్వమున' ననుట అనుధాతుజము లయినరూపము లెల్ల గ్రహించుట యుద్దేశ్యము గాఁబోలును.

"అనుధాతురూపము లట అట్టిశబ్దపూర్వకములును గల వవిరి" (ఉ.73)అట్టి యెడల ననుధాతుజరూపము గాక యట్టిశబ్దమే పర మగుట జరుగును.

అట్టిశబ్దపూర్వక మనుటయు సమంజసము గాదు. నమో యట్టను, నమో యట్టి యను అనురీతిప్రయోగములును గానరావు. 'గతానుగతికోలోకోయటం చుండుటల్' మున్నగునవి యుద్దేశించినచో 'అటుశబ్దపూర్వక మని చెప్పుట యుచితము.

'అనుకరణ మనఁగా భాషాంతరములలోనిపదవాక్యములను యథాస్థితముగా వేఱొకభాషలో నిల్పుట యని యర్థము' (ఉ.72) ఇది యీసందర్భమునుబట్టి స్థూలముగాఁ జేయఁబడినవివరణ మనఁదగు. స్వభాషాపదవాక్యములు నయిత మనుకరింపఁబడవచ్చును గదా. వాఁడు రా నని చెప్పెను వడవడ వడఁకెన్ మొ॥ధ్వన్యనుకరణములు నిట్లు. భాషా యే దైనను యథాతథముగా గ్రహించి పేర్కొనుటయె యనుకరణము. ఇట సంస్కృతభాషలోని(పద)వాక్యానుకరణమున నగుకార్యములు పేర్కొనఁబడుచున్నవి.

ఇం కొకవిశేష మిట్లు నొడివిరి. 'అనుకృతసంస్కృతవాక్యముయొక్క (ఇట యొక్క లోపింపదేదు ఉ.కా.ర.16) యాద్యంతాక్షరము లిరుప్రక్కల నుండుతెల్గు పదములతోఁ దెలుఁగుసంధికార్యముల నందును. అ ట్లగుటచేత నీయనుకరణసంధి సూత్రములచేత 'అను'శబ్దముతో సంధులను నడపవలెను. తక్కినయనుకృత

సంస్కృతవాక్యమధ్యమున సంస్కృతసంధులె వర్తిల్లును. ఉదా: శ్రీవాణీగిరిజాశ్చి రాయ.... శ్రేయసే యని స్తుతియించి (ఆది.1.1,2 ఉ.73)ఈవివరణ మూరక స్పష్టతకై చెప్పఁబడియుండ నపు. సంస్కృతవాక్యమధ్యమునఁ దెలుఁగుసంధికార్య ములయూహకే యవకాశము లేదు గాన నట సంస్కృతసంధులే కావలె. అట్లగుట తెలుఁగులోనివిశేషము గాదు. అట్లే తెలుఁగున సంస్కృతసంధికార్యములయూహయే యసంగతము గావునఁ దెలుఁగుసంధులే కావలె. అట్లగుట విశేషము కాదు. అట్లే సంస్కృతశ్లోకములయత్యాదినియమము లాభాష కనుగుణ మగుటసహజము.(ఉ.73) తెలుఁగునియమము లుంట చమత్కారావహము. (కవిశి.253)

దీనికిఁ జూపినలక్ష్యమె సరిగాఁ దోఁపదు. శ్రేయసే- యని యనుచోఁ దెలుఁగు సంధికార్య మగు యడాగమ మయిన దని వీరియుద్దేశ్య మనవలె. కాని యిట శ్రేయసే యనుదానితో సంస్కృతపద్యము ముగిసినది. 'అని' అనునది తరువాత వచనమునందలిది. ఈరెండింటికి నడుమ సంధికార్య (సంహితాయకార) మేమి? గద్యపద్యాంతములందు వాక్యమధ్యమైనను నుత్తరపద్యాదివర్ణముతో సంధి చేయరాదు. అవ్వసంబునొచ్చునప్పుడు- అతి రుచిరాగతుం డయిన- (ఉ.76) అని వీరు స్పష్టముగాఁ జెప్పియున్నారు. దానిని ననుసరించి ప్రస్తుతస్థలమున (దెలుఁగే యైన) సంధికార్య మగుట యెట్లు? వరుసలవారు యడాగమముతో 'యని' యని ప్రారంభించి చూపుట సరి గా దని స్పష్టము. ఇం తేల. వీరే సం.లో విదేస్థలము యడాగమరహితముగా అని స్తుతియించి యనియే చూపిరి.(వ్యా.స.419)అనుకృతిని సంస్కృతవాక్యాదివర్ణముతోఁ దెలుఁగుసంధిని వీరిటఁ జూపలేదు. 'అతఁ డమ్ముజా జాయ నమ యని పల్కె' (వ్యా.సం.స.423) నని వీరు సం.లోఁ జూపినయుదా హృతి యిటఁ జూపఁదగియున్నది. లక్ష్యములే దొరుకనట్లు వీ రిట నీదాని నేల తెచ్చి పెట్టిరో.

## నమశ్శబ్దము-ఓత్వము :

'అనుకృతిసినమశ్శబ్దముతుదియత్తున కోత్వము విభాష నగు' (51)ననుసూరిలక్ష ణమునుదమపూర్వసూత్రమునందే కలిపి"అకారపూర్వకవిసర్గము ఓకారము విభాష నగు' (ఉ.46) నని యుత్తరార్థముగాఁ జెప్పిరి. దీనివలన సిద్ధించినప్రయోజన మేమో. (ఒత్వము నిత్యమును గాదు గదా.)

సూరి నమశ్శబ్దమునందుమాత్రమె యోత్వమును జెప్పఁగా వీరెల్లయెడల సాధారణముగఁ జెప్పిరి. సూరిలోఁతిచో సహితము గల దనుటనుబట్టి వీ రిట్లు చెప్పి రేమో. 'సూరి మఱికొన్నట నీయోత్వము వచ్చు ననఁ నేల? ఓత్వ మంతటను వైకల్పికముగ నగు ననుట లెస్స. జీవస్థాయ నమోయనంగ (ఉ.హరి.2.130) రుద్రోయన్నయట్లు సూరయోయన- బసవ. మొ॥(ఉ.72).ఇం దుత్తరహరివంశప్రయోగము. బాల. సిద్ధమే. బసవ.ప్రయోగములనుబట్టి సామాన్యముగా జెప్పచో 'క్రేకంటి లింగంబు' అని వీరె గుర్తించినప్రయోగమునుబట్టి ఉత్తశేషమునకుఁ బరుషములు పర మగునపుడు నుగాగమము వికల్ప మనవలసినది.

లక్షణములక్ష్యానుగుణ మైయుండవలెను గావునసే నమశ్శబ్దమునందు మాత్రమే యిట్టికార్యము ప్రచురమై ప్రసిద్ధ మగుటంజేసి యట్లు లక్షణము చేసెను. వి.వి: నమశ్శబ్దమునకుమాత్రమె చెప్పుటయు నిట్టిదే యనవచ్చును. కాని యితరస్థలములనొకానొకచోఁ గానఁబడుట నుపేక్షింపక సూరి దానిని విశేషస్థలముగఁ బ్రస్తావించెను. లాఁతిచో సహితము ప్రసిద్ధ మైయున్న సూరి సూత్రమునందే యవకాశమును గల్పించెడివాఁ డనుటలో విరోధము లేదు గదా. లక్ష్యానుగుణ మగు సూరి లక్షణవిధానము వఝలవారు మార్చుట సరి గాదు. పైఁగా నెల్లెడల సాధారణముగా వికల్ప మని వఝలవారు నిర్ణయించుట యెంతమాత్రమును గుదురదు.

నమశ్శబ్దేతరస్థలముల నీయోత్వము చిక్కులియరుదు 'ఓలిఁ బురుషసింహో యని యుగ్గడించుచోటఁ దాసింహ ఇవ పురుషో యనంగ (భం.4.104) ఇట్టి వరుదగుటఁ దద్వ్యాఖ్యాతయు స్పష్టము చేసెను.(తత్త్వ.380)రాజానుమతో ధర్మో నా జను లనుకొంద్రు (అహ.1.67)

సూరి యత్తున కోత్వము విధింపఁగా వీరు 'అకారపూర్వకవిసర్గము ఓకార 'మగు' ననిరి. సం.లో 'నమశ్శబ్దమకారముమీఁది హ్రస్వాకారమునకు విధించుటచేత దానితోడి విసర్గమునకును నోత్వాదేశము గల్గు ననునర్థము లభించుచున్నది. తుభ్యం నమః+అనె తుభ్యం నమ్+అనె- తుభ్యం నమో యనె' (వ్యా.సం.వ.428) ననిరి. ఈయంశము సూరిసూత్రమున నస్పష్ట మైయున్న దని కాఁబోలును దమప్రస్తుత సూత్రమున అకారపూర్వకవిసర్గమునకు వచ్చు నని స్పష్టముగా విధించిరి అత్తునకు మాత్రమె యోత్వము వచ్చు నన్న మీఁదివిసర్గ మున్నే యుండవలసివచ్చు నని తలఁచిరా యని సందేహము గల్గుచున్నది. అందుకే విసర్గకుఁ గూడఁ గలిపి యోత్వ

మగు నని సం.లో వ్యాఖ్యానించి ఉ.లో నట్లు సూత్రించి రనవలె. కాని యోత్వము రానప్పు డేమి యగును. తుభ్యం నమః- అనె నని యుండఁగా 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' నని లోప మగును గదా. అది యోత్వ మగుటకు ముందే రాఁగా తుభ్యం నమ+అనె నని యుండఁగా ప్రస్తుతసూత్రముచే నత్వమున కోత్త్వమై నమో యనె నని యగును. ఓత్వము రానిపక్షమున నమ+అనె- నమ యనె- సూరిప్రక్రియ యి ట్లుచిత మై యుండఁగా విసర్గ నిలిచి యవరూప మేర్పడు నేమో యని విచారింప నక్కఱ లేదు.

ఇంక సూరి 'అత్తునకు' అని చెప్పఁగా వీరు 'అకారపూర్వక' మనిరి. సూరినింత వలెనమశ్శబ్దమునందు మాత్ర మె చెప్పిన బాధ యుండెడిది గాదేమో. కాని వీరు సాధారణముగ నెల్లయెడలఁ జెప్పుటచే 'అకార' శబ్దముచే దీర్ఘ మగు 'ఆ' కారమును గ్రహింపఁబడును. కావున అన్నముఖా పై దేవా యనుచు (జై.4.41) విప్రా యనుచు (భాగ.4.413) మున్నగుస్థలములలో దేవాః+అనుచు, విప్రాః+అనుచు అని యుండఁగా అకారపూర్వకవిసర్గమున కోత్వ మైదేవో యనును విప్రో యనుచు నని కావలె. అవి కలవా? వీరు సుదాహరింపలేదే. (ఇట నేకవచనాంతములు బహువచనాంతములు నోత్వముచే నొకేరూపమున నుండు.)

వీరు తప్పక 'అత్తునకు' అని తపరకరణము నిలిపికొనవలసినది. సూరింత్షణము విర్దుష్టము కాఁగా వీరు దపసూత్రమున నూహింపకయె యనర్థములు తెచ్చి పెట్టిరి.

పిదప వీరు 'అనుకరణరహితపదాదిశబ్దములు అనుశీర్షిక నుంచి- "సదా సర్వత్ర జయ మున్నగుపదములును, నమశ్శివాయ అనురీతివింతప్రయోగములును గల' (ఉ.78) వనిరి. 'పదాదిశబ్దము లన నేమి? పదములు మొదల గుశబ్దములు. నమశ్శివాయ' మున్నగునవి వింత 'శబ్దములా'? "వినానుకరణం కేచిదాద్యశబ్దం ప్రయుజ్యతే' యని యథర్వణుఁడు చెప్పఁగా వీరు 'సంస్కృతవిభక్త్యంతములు (తద్ఘటిత వాక్యశ్లోకములును దెలుఁగున-(వ్యా.సం.స.418)అని ప్రారంభించి చేసినవివరణము ననుసరించి- పదములు మొదలగుశబ్దములు అనువిచ్చుటివివరణము కుదురునా? శబ్దము లన వాక్యము లని యర్థమా?

కాని ప్రౌఢవ్యాకర్త "సంస్కృతవాక్యము సైతము విరనుకృతికముగాఁ బ్రయోగింపఁబడుట గల దని పయి నుదాహరించినరీతిని సూత్రించెను. అట్టివి సాధా

రణవాక్యము లనరాదు. '(వ్యా.సం.స.426) అని యిట్టివివింతప్రయోగ ము లవిని. ఉన్నవానిని వింతగాఁ బేర్కొనుటయు' సాధారణసంస్కృతవాక్యములు నిరనుకృతి కముగాఁ బ్రయోగింపఁబడుట కావలా దనియు (వ్యా.సం.స.426)చెప్పుటయే వింత. ఆముక్తమాల్యదలోని పైపద్యమున (అర్థావాగ్విబుధమ్ మొ॥)ననుకరణము లేకుండుట గుర్తించితిమి. ఇట్టివి పెక్కులు గలవు. 'మీకమృతమస్తు ప్రొద్దు పోయెను జాందు (భీమ.2.138) భీమ.2-211.సంస్కృతసీసము పిదప ననుకరణము లేదు. భీమ.4 22,23-24) నమస్తేనమః- సృష్టికి (హర.3.12-13) వైకుంఠనగరాయ చ- ఇట్లు తొడఁగి (నృ.3.11) స్వస్తినమస్తసంవత్సముపేత- తనయకు (క్రేయూ.4.191) విజయోఽస్తు భూపాల విను మొక్కబుద్ధి(హరి.ద్వి.2.608)మొ॥ సంస్కృతపద్యము ముగిసిన వెంటఁ బెక్కుచోట్లఁ దెలుఁగున ననుకరణము లేదు. దీనికి వీరు వివరణ మునే కాని విధానము చేయలేదు. ప్రౌఢ.లక్షణము ననుసరించి పదవాక్యములె గ్రహింపవలె.

ఇఁక నియమి వాక్యములు గాక పదాదిశబ్దము లనుటలో నాదిశబ్దము లేయవి? సందర్భము వింతగాఁ గన్పట్టవచ్చును గాక. సంస్కృతవాక్య మట ననుకరణరహితముగాఁ బ్రయోగింపఁబడినది కదా. అయిన నేయేసందర్భములలో సంస్కృతాంశ్రములు గలుపవచ్చునో చెప్పవలసినది.

నదా మొద లగునవ్యయములకుఁ బ్రత్యేకముగాఁ దెలుఁగుతోఁ గలిపి ప్రయోగించునవకాశము చెప్పఁదగు నేమో. వి.వి. వీనిప్రాచుర్యమునుబట్టి యట్లు చెప్పి యుండును. (అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా)

## దాసో౽హ మనె :

**అనుకరణంబునం** దుదిహల్లునకు ద్విర్వచనం బగు '(52) ననుసూరిలక్షణము నట్ల గ్రహించిరి. దీనికి దాసో౽హమ్మనె' నని వీ రుదాహరించుట సరి గాదని పైసూత్రమున గమనింతము.

'అనుకరణంబునం దహమాదులమకారంబునకు ద్విరుక్తి విభాష నగు' (53) ననుసూరిలక్షణమును మార్చి అనుకరణంబునందు తదాద్యులమకారంబునకు ద్విత్వము విభాష నగు (ఉ.48)నని చూపిరి. సూరి అహమాదులకు ద్విత్వము పైక

